- మానవుడు మొదట సగుణోపాసననే ఆశ్రయించాలి. క్రమముగా మనస్సు ఏకాగ్రత పొందినాక నిర్గుణోపాసనలోనికి వెళ్ళాలి. క్రమమైన పద్ధతి ఇదే.
- మన వివాహ వ్యవస్థలో ఏడడుగులతో బంధం ప్రారంభమవుతుంది. జీలకర్ర, బెల్లం, తాళిధారణ, తలంబ్రాలతో బాటు ఏడడుగులది ముఖ్యమైనది. ఏడడుగులు వేసి మనం మంచి స్నేహితులుగా వుందాము. ఒకరినొకరు వదలకుండా కలసి వుండి మన ఉభయ ములము చేయవలసిన పనులు జాగ్రత్తగా ఆలోచించి, మసలు కొంటూ ఒకరి నుండి మరొకరు జ్ఞానాన్ని పొందుతూ, బంధు మిత్ర సంఘాన్ని ప్రేమిస్తూ అన్యోన్య జీవితం గడపాలి. (వివాహకాండ వేదాలు)
- మనం దేవునికి సహజంగా షోడశోపచార పూజలు చేస్తాం. షోడశం అంటే 16. ఇది పూర్ణ సంఖ్య. చంద్రుడు పూర్తిగా ప్రకాశించునపుడు 16 కళలు కలిగివుంటాడు. భగవంతుడు వేరు నేను వేరు అనే భావనతో పూజలు ప్రారంభించి, చివరకు ఆ దేవుడు నాలోనే వున్నాడు అనే భావనకు భక్తుడు వస్తాడు. విగ్రహరూపంలో వున్న దేవుని అర్చించి, చివరకు నిరాకారుడైన దివ్యశక్తిని భక్తుడు భావన చేయడమే ఈ షోడశోపచారపూజ. అవి 1) ఆవాహనం 2) ఆసనం 3) పాద్యం 4) అర్ఘ్యం, 5) ఆచమనం, 6) స్నానం, 7) వస్త్రం, 8) ఉపవీతం, 9) గంధం, 10) పుష్పం, 11) ధూపం, 12) దీపం, 13) నైవేద్యం, 14) తాంబూలం, 15) ప్రదక్షిణం 16) నమస్కారం
- రాత్రి పడుకునేముందు వేడిపాలు త్రాగుట. తెల్లవారి లేచినపుడు మంచినీరు త్రాగుట. అదియు రాగి చెంబులో నీరు అత్యంత ఆరోగ్య కరము (ప్రాచీన శాస్త్రాలు).
- శరీరానికి ముసలితనం వచ్చునుగాని, ఆశకు మాత్రం ముసలితనం లేదు (జనక మహారాజు)



- శ్రీకృష్ణునికి అష్టభార్యలున్నారని 16 వేలమంది గోపికాస్త్రీలు వున్నారని భాగవతం చెపుతుంది. ప్రతి మనిషికి 16వేల నాడులు కలిగివుంటాడు 1) ఆకాశము 2) అగ్ని 3) వాయువు 4) నీరు, 5) భూమి, 6) మనస్సు, 7) చిత్తము, 8) అహంకారము. ఈ ఎనిమిదింటిని ఆధీనములో వుంచుకొని రమించేదే ఆత్మ. ఆ ఆత్మే శ్రీకృష్ణుడు. మానవునికి నేను శరీరమనే భావనే వుంటుంది. ఆత్మ జ్ఞానముండదు. ఆ శరీరాన్ని అందులోని 16వేల నాడులను అదుపాజ్ఞలో వుంచుకున్న వాడు గనుకనే శ్రీకృష్ణుని జగద్గురువు అన్నారు. మహా తపస్వినులైన గోపికలు భక్తి విరహాన్ని పొంది కృష్ణునిలో ఐక్యమైనారు. (భాగవత అంతరార్థం).
- సంపద ఊట బావిలాంటిది. తనకు కలిగిన సంపదను సద్వినియోగ పరుస్తువుంటే అనగా దాన, ధర్మాలు, సత్కర్మలు, పుణ్యకార్యాలలో పాల్గొనుట లాంటివిచేస్తుంటే ఆ సంపద పెరుగుతూ వుంటుందే గాని తరగదు.
- సమస్త ప్రజలకు వందనీయుడైన సన్యాసి కూడా తల్లికి విధిగా నమస్కరించాలి.
- సువర్ణదానంచేత అపమృత్యుదోషం పోతుంది. అంతేకాదు మరణించి స్వర్గాదిలోకములకు పోవునపుడు, దాతకు ముందుగా దీపమువలె దారి చూపుతూ వుంటుంది. (తైత్తిరీయశ్రుతి)
- సముద్రములో కురిసిన వర్షం. కడుపు నిండిన వానికి పెట్టిన భోజనం, ధనవంతుడికి చేసిన దానం వ్యర్థమైనవి.
- సజ్జనుడు (సాధు సత్పురుషుడు) ఎక్కడ వుంటే ఆ ప్రాంతాని కంతటికి అలంకారంగా వుంటాడు. అక్కడ నుండి వెళ్లిపోయాడా పెద్ద వెలితి ఏర్పడుతుంది. దానిని పూర్తి చేయటం మహా కష్టమైన పని.

- సాధువనగా :- బుద్ధిని జాగ్రత్తగా వుంచుకున్నవాడు. మెత్తని స్వభావము కలవాడు. శరీరం మీద ఆపేక్షలేనివాడు. మనస్సులో ఏ వికారము లేనివాడు, ధైర్యం, దయా, ప్రాపంచిక విషయాలపై మనస్సునందు తలపకుండుట, సజ్జన సాంగత్యం, అవకాశము వున్నప్పుడల్లా మంచి, మంచి ప్రసంగాలు చెప్పడం. ఇవి సాధు లక్షణాలు (కబీరు)
- సత్పురుషుడనగా :- ఆశ, మాయ, మోసం, కపటం, మోహం, అభిమానం, సంతోషం, దుఃఖం వదిలినవాడు (కబీరు)
- సర్వతీర్థ ఫలములు, సమస్త యజ్ఞఫలములు, ఎవరికి కలుగును యనగా సర్వేంద్రియములు జయించినవానికి, అహంకారము లేని వానికి, సహాయము చేసి, తిరిగి ఏమీ అపేక్షించనివారికి, మితముగా భుజించేవారికి, ఉన్న దానితో తృప్తిపడేవారికి, ఆడంబరం లేనివారికి, నిత్యము సంతోషముతో నుండువారికి, సత్యాన్నే చెప్పేవారికి, కోపం లేనివారికి, మంచి ప్రవర్తనగలవారికి, ధర్మాన్ని ఆచరించే వారికి, సర్వ తీర్థఫలములు, సర్వయజ్ఞ ఫలములు కలుగును. (భీష్మునితో పులస్త్య మహర్షి)
- సమాజాన్ని ప్రేమించు, గౌరవించు. మంచి పనులు చేయ డానికి తగిన శక్తి సామర్థ్యములు కలగాలని భగవంతుని ప్రార్థించు. (ఋగ్వేదం)
- సన్యాసికి మమకారం, ఈర్ష్యా వుండకూడదు. సర్వావస్థల లోనూ అతడు సమభావుడై వుండాలి. (శ్రీరామ కృష్ణ పరమహంస)
- షోడశ మహాదానములు :- 1) కపిలగోవు 2) బంగారము 3) రత్నం 5) ఆధ్యాత్మిక గ్రంథము 6) నువ్వులు 7) కన్య 8) గుర్రము 9) శయ్య (మంచము) 10) బట్టలు 11) భూమి 12) ధాన్యము 13) పాలు 14) పాదరక్షలు 15) గొడుగు 16) గృహం.
- క్షణకాలమైనా సజ్జన సాంగత్యం చేస్తే సంసార సముద్రాన్నే



దాటగలుగుతాం సజ్జన సాంగత్యము వల్ల సద్వాసలు వస్తాయి.
- తేజస్కాముడైన పురుషుడు భార్యతో కలసి భుజించరాదు. ఆమె భోజనము చేస్తుండగా తుమ్ముతుండగా, ఆవులిస్తూ వుండగా, అస్త వ్యస్తవస్త్రముతో కూర్చొనివుండగా చూడరాదు. (మను మహర్షి)
- తన కొరకు వేచియున్నవారు నూరుగురుని విడిచియైనా సమయ మైతే భోజనము చేయాలి. అట్లే వేయిమందిని వదిలి, వెళ్ళి స్నానము చేయాలి. లక్షమందిని వదలి వెళ్ళి దానము చేయాలి. కోటిమందిని వదలిపెట్టియైనా ఈశ్వర ధ్యానము చేయాలి. (భగవద్ధ్యానము)
- అన్నదానము విశేషమైనదే కాని దానికంటే విద్యాదానము గొప్పది. అన్నము వలన ఆకలి తీరి క్షణికమైన తృప్తి కలుగును. కాని విద్య వలన అజ్ఞానము నశించి జీవితాంతము సుఖ సంతోషములు లభిస్తాయి.
- సంపదలన్నిటిలోనికి విద్యా సంపద గొప్పది. ఇతర సంపద లన్నిటినీ విద్య వలన సాధించవచ్చు. విద్య పంచిన కొలదీ వృద్ధి పొందుతుంది, గాని తరగదు. విద్య దొంగలపాలు కానేకాదు.
- ఆహారము కొరకు పాపము లేని పనిని చేయడం ధర్మం. ప్రాణం నిలిచి తన అనుష్ఠానం చేసుకోవడానికి ఎంత ఆహారము అవసరమో అంతే తీసుకోవాలి. ప్రాణం నిలుపు కోవడానికి కారణం తత్త్వ జ్ఞాన సంపాదన కోసం, తత్త్వజ్ఞానం ఎందుకు సంపాదించాలంటే మరుజన్మ లేని మోక్షం కొరకు.
- మనము తీసుకునే ఆహారము తోటివారికి లేదా కనీసం నోరులేని జీవులకైనా పెట్టి, ఆ తరువాత మనము తింటే ఏలాంటి పాపము అంటదు.
- సాత్విక ఆహారము తీసుకోవడం వల్ల మనస్సు పరిశుద్ధమవు

తుంది. జ్ఞానశక్తి పెరుగుతుంది. దానితో మానవునికి సర్వ బంధాల నుండి విముక్తి కలిగి మోక్ష మార్గములోనికి తీసుకుని వెళ్తుతుంది.

- వాక్ నియమము, ద్రవ్యమును కూడబెట్టకుండుట, లౌకిక పదార్థములను ఆశింపకుండుట, కోరికలను వదలుట, నిత్యము ఏకాంత వాసము చేయుట, ఇవి అన్నియు యోగమునకు ప్రథమ ద్వారములు.
- ఆత్మయే బ్రహ్మ, ఆత్మయే విష్ణువు, అదియే యింద్రుడు, అదియే శివుడు, ఈ సమస్త విశ్వము ఆత్మయే. ఆత్మకన్న భిన్నమైనది ఏదియును లేదు.
- ఆనందం తనకు వెలుపలవున్నదనుకునే అలవాటు కొద్దీ, మనస్సు బాహ్యవిషయాలపై పరుగిడుతూ వుంటుంది. ఆనంద మిచ్చేవి బాహ్య విషయాలు కావనే జ్ఞానం కలిగితే మనస్సు అలా పరుగులు పెట్టదు. అదే వైరాగ్యం. సంపూర్ణ వైరాగ్యం కలిగినప్పుడే మనస్సు నిలకడ చెందుతుంది.
- సత్సంగమనగా సద్వస్తువుతో కలసి వుండడం. సద్వస్తువు నిజానికి ఒక ఆత్మయే. కాని అది తెలుసుకోలేనంత కాలం తెలిసికొన్న సత్పురుషులతో కలసి వుండడమే సత్సంగమవు తుంది. ఆ సత్సంగం అంతర్ముఖానికి దారితీసి ఆత్మ సాక్షాత్కా రాన్ని కలిగిస్తుంది.
- ఓంకారము అను అక్షరమే సగుణబ్రహ్మ. అతడు అక్షరుడు. అనగా శాశ్వతముగా వుండువాడు. ఈ అక్షరుడే నిర్గుణ పరబ్రహ్మ. ఈ ఓంకార అక్షరుని తెలుసుకొనిన మనుష్యుడు తాను కోరుకొనిన వస్తువును సునాయాసముగా పొందగలడు.
- పాలతో కలిసిన పాలు, నూనెలో కలసిన నూనె, నీటితో కలసిన నీరు ఏకమైపోవు విధమున, ఆత్మజ్ఞానమును పొందిన మనుజుడు తన ఆత్మయందు మనస్సు లీనమైన



పుడు ఆత్మ స్వరూపుడే యగును.

- అహంకారం వల్ల మనిషి సత్యవస్తువగు ఆత్మ స్వరూపమును తెలుసు కొనలేడు. అహంకార రహితుడైనప్పుడే ఆత్మ స్వరూప దేవుని తెలుసు కొనగలడు. అహంకారం ఎవరికి నశిస్తుందో వారే దైవ స్వరూపుడు.
- కుమారుని 5 సంవత్సరముల వరకు ప్రేమగా పెంచాలి. 15 సం.లు వచ్చు వరకు క్రమశిక్షణలో ఉంచాలి. 16 సంవత్సర ములు వచ్చాక స్నేహితునివలె హితవు చెప్పుతూ వుండాలి.
- అప్పులు చేసిన తండ్రి, వ్యభిచారిణియైన తల్లి, రూపవతియగు భార్య, చదవుకొనని కుమారుడు, వీరు గృహస్థునికి శత్రువులు.
- ధైర్యము, ఓర్పు, మనోనిగ్రహము, తనదికాని వస్తువునందు ఆశ లేకుండుట శుచిత్వము, ఇంద్రియ నిగ్రహము, బుద్ధి, విద్య, సత్యము, క్రోధరాహిత్యము (కోపములేకుండుట) ఇవి ధర్మమునకు లక్షణములు.
- తల్లి, తండ్రి, భార్య, పుత్రులు జ్ఞాతులు వీరెవ్వరును పరలోకము నకు పోవునపుడు సహాయపడలేరు. నీవు చేసుకున్న ధర్మమొక్కటే నిన్ను వెంబడించును.
- యోగ్యుడైనవాడు తన అవసరమునకు నిన్ను యాచించి నపుడు అతని యింటికి వెళ్లి దానమిచ్చుట ఉత్తమ పక్షము. అటువంటి ఉత్తముని నీ గృహమునకు ఆహ్వానించి, దానమొసగుట మధ్యమము. తనంతట తానే వచ్చి తనను యాచించిన వానికి దానమిచ్చుట అధమము. తను సేవ చేయించుకొని దానమిచ్చుట అధమాధమము (నిష్ఫలము).
- శ్రోత్రీయుడు అనగా :- సదాచారము, వినయము, విద్య, కీర్తి, అతిథి పూజనము, దానము, ధర్మము, దయ, జ్ఞానము ఈ తొమ్మిదిగలవాడే శ్రోత్రీయుడు.
- మానవ ప్రయత్నానికి దైవము కూడా అనుకూలించినపుడే

సత్ఫలితాలను పొందగలుగుతారు.

- జీవితం, యౌవనం, ధనం భార్యాబిడ్డలు ఏదీ ఎవరూ శాశ్వతం కాదు. మనిషి చేసే మంచి పనులు, ధర్మకార్యాలు, దైవకార్యాలు, వాటివలన సంపాదించుకునే సత్కీర్తి, ఆరెండే శాశ్వతమైనవి. ఇవే మనిషిని పుణ్యలోకాలకు తీసుకొని వెళ్తాయి.
- ప్రపంచానికి హితము కోరువాడు ఇతరుల దోషాలను చూడడు. ఈర్ష్యలేనివాడు ఇహపరలోకములలో పూజ్యుడే.
- ఎవరు సమస్త జీవులను ప్రేమించుదురో వారిని సర్వాత్మ యగు భగవానుడు వారిని ప్రేమించును. (మహేశ్వరుడు)
- నిన్ను ద్వేషించిన వారిని ప్రేమించుము. రాగద్వేషములను వీడుము. ఇతరుల మనస్సును నొప్పింపకుము. (యమధర్మరాజు)
- ఆహారశుద్ధిచే అంతఃకరణ శుద్ధి కలుగును. అంతఃకరణ శుద్ధివలన నిశ్చల స్మృతి కలుగును. ఈ స్మృతివలన అజ్ఞానము నశించి ఆత్మ జ్ఞానము కలుగును. (సనత్కుమారుడు)
- సమస్త పాపములు నశించినపుడే బుద్ధి వికాసమగును. నేను నాది అనేది బంధకారణము.
- ఎవడు ధనవంతుడైవుండి కూడా దానము చేయడో, ఎవడు దరిద్రుడై వుండి, కష్టములను సహించక భయపడునో, వీరిద్దరూ లోక నాశకులే.
- గోవు, బ్రాహ్మణుడు, వేదము, పతివ్రత, సత్యవాది, లోభము లేనివాడు, దానశీలుడు అను ఈ ఏడుగురి వల్లనే భూమండ లము నిలిచియున్నది.
- ఎన్ని ఆపదలు వచ్చినను భయపడక, సమస్త పాపములను నశింప జేయు భగవధ్యానము చేయుము. (శ్రీసనత్సుజాత ముని)
- సత్యము చెప్పుము. కాని ఇతరుల రహస్యములను వెల్లడించ



కుము (మహర్షి యాజ్ఞవల్క్యుడు)

- శత్రు, మిత్ర బేధముండరాదు. రాగద్వేషములే నీ జన్మకు కారణ ములు. కావున సమస్త కోరికలను వదలుము. (మహర్షి అత్రి)
- కామమును వదిలిపెట్టుము లేనిచో అది నిన్ను దుఃఖముల పాలు చేయును. (మహర్షి విశ్వామిత్రుడు)
- ఎవడు ప్రతిగ్రహము (ఇతరులు యిచ్చిన దానిని) స్వీకరించడో, వున్న దానితో సంతృప్తిపొందునో వాడు ముక్తిని పొందును. (మహర్షి అగస్త్యుడు)
- మనస్సుకు శాంతియుండిన, శరీరము కూడా ఆరోగ్యముగా నుండును. మనోవ్యాధికి కారణము, మమకారము, మోహములే. (మహర్షి శౌనకుడు)
- నిన్ను నీవెట్లు ప్రేమించుకొందువో ఇతరులను కూడా అంట్లే ప్రేమించుము. ఇతరులను ద్వేషించితివా అదే ద్వేషము నిన్ను చేరి దుఃఖపెట్టును (మహర్షి పరాశరుడు)
- ప్రపంచములో ఏ వస్తువులోను సుఖదుఃఖములు లేవు. నీ మనస్సులోని కారణములే సుఖదుఃఖములుగా భాసించు చుండును. (మహర్షి పరాశరుడు)
- సంతోషముగా దానము చేయుము. ఫలితమును కోరకుము. పగలు నిద్రించకుము. ఇతరులకు అనుకూల ముగ ప్రవర్తించుము. (మహర్షి జైమిని)
- ఇతరులను నిందించకుము. ఇతరులలోని దోషములను చూడకుము. ఏ జీవికిని ఎలాంటి హానిచేయకుము. (మహర్షిజైమిని)
- క్రోధము, అసూయ, ఈర్ష్యలేనివాడు శాంతిని పొందును. (వైశంపా యనుడు)
- ఇతరులను ఆశ్రయించక స్వతః కష్టించి సంపాదించిన

గంజియైనను అతిధులకు పెట్టి శేషమును తినువాడే శ్రేష్టుడు. పరద్రవ్యము మహా పాపము. (మహర్షి బకుడు)

- దేవుని భక్తికన్నా ముక్తి దొరకదు. అందుకని భగవంతుని శరణు వేడుము. (మహర్షి శాండిల్యుడు).
- సకల భూతములను తనవలె చూచుకొనువాడే భగవంతునికి ప్రియుడు (పతంజలి మహర్షి)
- స్వధర్మమును ఆచరింపుము. అధర్మమును విడువుము. దైవవశమున లంభించిన దానితో సంతోషింపుము. ఆత్మధర్మమును మోక్షము నందు ధర్మాసక్తుడవుగా వుండును. మితము, శుద్ధముగా వున్న ఆహారమును భుజింపుము. (మహర్షి కపిలుడు)
- అన్ని ప్రాణులను నీ ప్రాణతుల్యముగ చూడుము. నేను అందరికంటే గొప్పవాడనని అహంకారపడకుము. అందరికి దాసుడనని తలంచుము. (మహర్షి మర్కండేయుడు)
- శాంతము, సమదర్శనము, సమస్త జీవుల హితము, ప్రేమ, సదా భగవన్నామము చేయువాడే నిజమైన భక్తుడు. (మహర్షి వాల్మీకి)
- సమస్త ధర్మములను వివేకముచే విచారించి, వేదోక్త మార్గమును అనుసరించుచున్నందున సమస్త జీవుల హితమును కోరువాడే నిజమైన మానవుడు (మహర్షి భృగువు)
- ప్రతిగ్రహించకుము (ఎవరి దగ్గరనుంచి ఏది తీసుకొనకుము) ఎవరిని ఏదియు కోరకుము. ఇచ్చినా తీసుకొనకుము. ప్రారబ్ద వశమున దొరికిన దానితోనే సంతోషపడుము. (మహర్షి పులస్త్యుడు)
- సమస్త జీవులలో ఈశ్వరుడుగలడని భావించి, ప్రేమించి సేవింపుము. ఇదే నిజమైన పూజగా తలచుము. (మహర్షి



పులస్త్యుడు)

- ఈ మనుష్య శరీరము మళ్లీ దొరకుట దుర్లభము. ఈ శరీరముండ గనే భవసాగరమును దాటివేయుము. లేనియెడల మరుజన్మలో ఏయే నీచయోనులందు జన్మించ వలసి వచ్చునో, ఏ గతి పొందు దువో ఎవరికెరుక. (రాజర్షి కట్వాంగ మహరాజు)
- మొదట నీవు ఆచరించి తదుపరి యితరులకు చెప్పుము. వినిన దానిని తెలుసుకొనిన దానిని ఆచరించకపోవుట వలన సత్ఫలితములను పొందలేకపోవుటకు కారణము (సూతుడు)
- గడచిన దానికై విచారించక, రాబోవుదానికై ఊహించక ఏ కోరికలు లేక నిశ్చలుడవై భగవంతుని ధ్యానించుము. (మహాఋషులు)
- ఏ జీవికిని హాని చేయకుము. దుఃఖితుల బాధలను బాపుటకు, వారికి ప్రేమతో సేవచేయుము. న్యాయశీలుడవు కమ్ము. (దేవేంద్రనాధఠాగూర్
- నిరాడంబరమైన జీవితమును గడుపుము. నీకై అధికముగా ఖర్చు పెట్టకుము. ఋణబాధితుడవు కాకుము. (దేవేంద్రనాధ ఠాగూర్)
- ప్రతిరోజు శారీరక కష్టమును చేయుచు, ఆరోగ్యవంతుడవుగా వుండుము. ఇతరుల సొత్తును తినకుము. కష్టించే తినుము. (భగవాన్ సత్యానంద మహర్షి)
- మనస్సుతో భగవంతుని స్మరణచేయుము. చేతులతో లోకసేవ చేయుచు అమూల్యమైన కాలమును వ్యర్థముగా గడపకూడదు (సత్యానంద మహర్షి)
- సూర్యునకు ఉదయముతో కూడా అస్తమయమును నియమితమై నట్లు ప్రతివానికి పుట్టుకతో కూడా చావు అనేది నియమము. (దశరధ మహారాజు)

- సమస్తమైన వాసనలను వదలి మౌనముగా నుండుటయే శ్రేష్టమైన పరమపదము. కావున సంకల్ప శూన్యుడవు కమ్ము. (దశరధమహారాజు)
- ఏ జీవియైనను నీ శరణుజొచ్చినేని, దానిని తప్పక రక్షింపుము. తుదకు నీ ప్రాణమునైనా యిచ్చి దానిని రక్షించుటే నీ కర్తవ్యము (శిబిచక్రవర్తి)
- ఎవడు తన హృదయమందున్న పరమాత్మను (ఆత్మను) గానలేక, అన్యదేవతల ఆశ్రయించునో వాడు మూఢుడు. (జనక చక్రవర్తి)
- మనస్సును అంతర్ముఖముచేసి బ్రహ్మమువైపునకు త్రిప్పినేని, అప్పుడే ఆశలు తెగిపోవును. (జనక చక్రవర్తి)
- మానవుడు సత్యవ్రతమును పాటించక, ఎన్ని యజ్ఞములు, దానములు, పుణ్యకర్మలు చేసినను అవియన్నియు నిష్ఫలములే. (హరిశ్చంద్రుని భార్య)
- హింసకు ఆరుగురు భాగస్వాములు గలరు. చంపినవాడు పురికొల్పిన వాడు సహాయము చేసినవాడు, తిన్నవాడు, వండినవాడు, వడ్డించే వాడు వీరందరూ హింసాపరులే. హింసాపరులు ఎన్ని ధర్మములు చేసినను వ్యర్ధమే. పాపము తప్పదు. (రుక్మాంగదుని భార్య)
- సమస్త సంకల్పములు ఏ స్థలమునందు పుట్టుచున్నవో దేనిచేత ప్రత్యేకముగా ఎరుగబడుచున్నవో అట్టి జ్ఞానమే నీ స్వరూపము. అదియే కర్మసాక్షి (చూడాల)
- తమ తమ రక్షణము ప్రతిజీవి చేసుకొనును. కాని ఇతర జీవుల రక్షణకు ఎవరు తమ ప్రాణమును అర్పింతురో వారే ధర్మాత్ములు. దయలేని పుణ్యము వ్యర్థమే. కావున యితర జీవులను రక్షించుటయే ధర్మము (విక్రమాధిత్యుడు)
- బీదలకు దానము చేయుము. నీవిలాస భోగముల కొరకై



ఖర్చు పెట్టకుము. లేనివారికిచ్చుటయే ధర్మము. (ప్రతాప శివాజీ)
- నేను దానము చేయుచున్నాను. అందరికి జీవనోపాధి కల్పించు చున్నానుయని అహంకారపడకుము. నిన్ను నీవు కాపాడుకొనలేవు. దానికై ఎందరి సహాయమో కావలెను గదా. అందరిని కాపాడువాడు ఆ ఈశ్వరుడేయని మరువకుము. అహంకారపడకుము. (శివాజీ మహారాజ్)
- ఎవడు మితముగాను, సత్యముగాను, మృదువుగాను, సందర్భాను సారముగా మాట్లాడునో అట్టివాడు నిజముగా మౌనియే. (శ్రీరామ చంద్రమూర్తి)
- క్రోధమును జయించి స్వల్ప ఆహారమును స్వీకరించుచు ఇంద్రియ నిగ్రహముకలిగి, మనస్సును ధ్యానమందుంచుము. ఏకాంతములో మౌనముగా వుండుము. (భగవాన్ దత్తాత్రేయులవారు)
- ఎవరికైనా ఒక బహుమతి యిచ్చినచో, దానిని వారు నిరాకరించినచో అది ఎవరికి చెందును? తిరిగి యిచ్చిన వారికే కదా. అట్లే యితరులు నిన్ను నిందించినను, వారి నిందను నీవు స్వీకరించనిచో తిరిగి వారికే చెందును. (బుద్ధ భగవానుడు)
- మొదట నీవు వాక్కును స్వాధీనమొనర్చుకొనుము. నీకు కీర్తి, అపకీర్తులను ధర్మా ధర్మములను, పాప పుణ్యములను, సుఖ దుఃఖములను కలిగించునది వాక్కుయే. కాబట్టి వాక్కును అదుపులో వుంచుకొనుము. (బుద్ధ భగవాన్)
- ఎవని వాక్కు మృదుమధురముగా నుండునో వాని తపస్సు సఫల మగును. కావున రాత్రి, పగలు నీవు వచించెడు ప్రతిమాట, ఆచి, తూచి మాట్లాడుము. నీ వాక్యమందెట్టి కాఠిన్య భావావేశమున్నను, హత్యాదోషముతో సమాన

మగును. (బుద్ధ భగవానుడు)

- క్రోధము క్షమాగుణము వల్లను, గర్వము వినయమువల్లను, మోసము సరళ భావమువల్లను, ఆశ తృప్తివల్లను జయించ బడును
- భజన చేయువానికి అధిక సంభాషణ, అధికమైన ఆహారము, అధికమైన నిద్ర వుండరాదు. సత్సంగము చేయుచుండ వలయును. ఏకాంతవాసము ముఖ్యమైనది. కాని మనస్సు వశము కానిదే ఏకాంత వాసము కష్టము.
- ఎవనిలో సత్యము, ప్రేమ, దయ, ఆత్మశక్తి మొదలగునవి ఉండవో వాడు ఎంత గొప్పవాడైనను (విద్వాంసుడైనను) వ్యర్థమే.
- నాలుకకు వృధాగా మాట్లాడే అలవాటు చేయక జాగ్రత్త వహించుము. అధికముగా మాట్లాడేవారు. అధికముగా అసత్యము చెప్పుదురు. కావున వ్యర్థ సంభాషణ చేయకుము.
- ఇతరుల మనస్సును నొప్పించినచో, ఇతరులు నీ మనస్సును నొప్పింతురు. నీవేమి చేయుదువో ఇతరుల వల్ల అదే నీకు ప్రాప్తిం చును. అది తప్పదు. (మహాత్మ త్రైలింగస్వామి)
- విషయవాసనలు జయించక ఎన్ని పూజలు, తపస్సులు చేసినను వ్యర్థమే. ఇతరులకు నీవేమి ఉపదేశము చేయు దువో మొదట నీవు దానిని ఆచరింపుము.
- సంతృప్తియే సుఖమునకు మార్గము. నీకు ఉన్నదానితోనే తృప్తిపడుము. పాప భీతియు, పరమార్థ చింతన కలవాడవు కమ్ము.
- తాను చేసిన తప్పులను ఇతరులకు చెప్పి పశ్చాత్తాపపడి మళ్లీ ఆ తప్పులను చేయరాదు. (మహాత్మాగాంధీ)
- ప్రతివాడు ఎదుట వాని దుర్గుణాలను లెక్కించక తన తప్పులనే తాను చూచుకొనునో పాపములు వుండనేరవు. (మహాత్మాగాంధి)



- చెడుచూడకుము, చెడు వినకుము, చెడు చెప్పకుము వీటిని ఆచరించితివేని బాగుపడెదవు. (మహాత్మాగాంధి)
- నిష్కామ కర్మచే అంతఃకరణశుద్ధియు, ఉపాసనచే చిత్త ఏకాగ్రతయు జ్ఞానముచే మోక్షము కలుగును. (శ్రీ ఆదిశంకరాచార్యుల వారు)
- ఆత్మజ్ఞానము కలిగిన తరువాత కూడా నిత్య అనుష్టాన, ధ్యానాది సాధనలు చేయుచుండుటయే శ్రేష్టము. (శ్రీరామా నుజాచార్యులు)
- భగవంతుడు నీ కొరకై ఇచ్చిన సంపదలను తనవని తలంచుచు వాటిని భోగించువారే దొంగలు. (శ్రీరామా నుజాచార్యులవారు)
- ఉపదేశము పొందనివాడును, ఉపదేశము పొంది ఆచరిం చని వాడును, ఉపదేశమందు సంశయబుద్ధి గలవాడును చెడుదురు. (శ్రీరామానుజాచార్యులవారు)
- వ్యర్థమైన నశించే సంసారకూపములోబడి నీ యొక్క అమూల్య సమయమును నష్టపరచకుము. (శ్రీరామానుజాచార్యులు)
- సుఖసమయములో భగవంతుని మరువకుడు. దుఃఖ సమయ ములో నిందించకుడు. (శ్రీరామానుజాచార్యులవారు)
- మనకు భగవంతుడు సమర్పించిన దేహేంద్రియములను పరోపకార మునకే దేవుడు ప్రసాదించినాడు. కావున ప్రజాసేవ చేయడు.
- ఎంతోకాలము అవివేకము వలన వ్యర్థపరచితిని. ఇప్పుడైనా మేలు కొనుము. ఎందుకనగా మృత్యువు నిన్ను కబళించు టకు సిద్ధముగా వున్నది. కావున ఆలసింపకు, ఆత్మ విచారణ చేయుము.
- నీవు తెలుసుకున్న దానిని మొదట నీవు ఆచరించి, ఇతరు లకు ప్రేమ పూర్వకముగా బోధించుచుండుము.
- ఇతరులపై ఆధారపడి జీవించరాదు. కష్టపడి నీలో శక్తి

పున్నంత వరకు ఏదో ఒక పనిచేసి (ఆరోగ్యమున్నంతవరకు) పాటుపడవలెను.

- యాచించుట ఎంతహీనమో, లోభి అగుటయు అంత హీనమే? కనుక త్యాగివికమ్ము. సమస్త కోరికలను విడిచి మోక్షమార్గమును అనుసరింపుము. (కబీరు)
- మానవుడు ఏయే దుఃఖములను అనుభవించుచుండునో అవి యన్నియు తను చేసిన దుష్కర్మము వలననే వచ్చినవి. ఏది చేసినా అదే తిరిగి ప్రాప్తించును. నీ దుఃఖములకు యితరులు కారకులని వారిని ద్వేషించి ధూషించుట మంచిది కాదు.
- భూతదయలేని తపము, విరక్తిలేని త్యాగము, సత్యము చెప్పని వాక్యము పరోపకారము లేని ప్రయాస, దురాశచే సంపాదించిన ద్రవ్యము వ్యర్థములు. (కబీరు)
- ఇతరులను నిందించుట, పరులపై దోషారోపణము కల్పించుట పాపము (కబీరు)
- వైరమునకు మూలము కటువచనము, ప్రేమకు మూలము హిత మధుర వచనము. దుఃఖమునకు మూలము అక్రమముగా సంపా దించిన ధనము. (తులసీదాస్)
- నిన్ను నీవు పొగడుకొనకుము. ఇతరులు పొగిడినను సంతోషించక అయ్యా నాలో చాలా దుర్గుణములున్నవి. నన్ను పొగడ వద్దని వేడుకొనుము.
- ఎవరైనా ఇతరుల గురించి చెడు మాట్లాడినచో దానిని వినకుము, ఇతరులను గూర్చి నీవు చెడు చెప్పకు. (డా. అనిబిసెంట్)
- నిన్ను ఎవరైనా అవమానించినా, తిట్టినా, ప్రతిక్రియ చేయక, వారికి మేలు చేయుము. నీ జీవితములో ఎన్ని కష్టము లొచ్చినా వాటిని సుఖముగా అనుభవింపుము.



- ప్రతి జీవిని ప్రేమించి, క్షమించుట మానవుని యొక్క ముఖ్య కర్తవ్యము.
- ప్రాపంచిక విషయములను విడిచి, భగవంతుని ప్రేమించుము. సత్సంగము చాలా మంచిది. సాధు సజ్జనుల సాంగత్యము చేయుము.
- గురువు యొక్క ఆజ్ఞను జవదాటక ప్రవర్తించువాడే నిజమైన భక్తుడు. ప్రేమానురాగముచే భక్తి కుదురుతుంది.
- మోక్షమునకు ఆటంకములు జిహ్వేంద్రియము, ఉపస్థ ఈ రెండిటిని అదుపులో ఉంచినచో మోక్ష ద్వారము తెరువబడును. (బాలయోగిని)
- ధనకాంక్ష లోభము, కీర్తి ప్రతిష్ఠలయందు కాంక్ష ఈ మూడు నీకు శత్రువులు. కావున వీటిని త్యజింపుము. భగవంతుడిచ్చిన దానితో తృప్తిపడుము.
- ఇతరుల అన్నమును తినకుము. నీవు కష్టపడి సంపాదించియే తినుము. ఇతరుల అన్నమును తిని, నీవు ఏ పుణ్య కార్యము చేసినను, ఆ పుణ్య కార్యము యొక్క సగము ఫలము అన్నదాతకు చెందును. ఇది తప్పదు. (శ్రీమాతలి)
- పుణ్యకార్యములకు ఆలస్యము చేయరాదు. రేపు ఏమగునో ఎవరి కెరుక. రేపటి వరకు జీవించియుందుమని గర్వించుట పాపమే. (భీముడు)
- భుజించు ఆహారమును భగవంతునికి నివేదన చేయక ఎవడు భుజించునో వాడు పాపాత్ముడేయగును.
- మహాత్ములయొక్క ఉపదేశానుసారము ఆచరించుటే మహాత్ముల సేవ. లేనిచో బాహ్య సేవ ఎంత చేసినను వ్యర్థమే. (భక్తగోవర్థనదాస్)
- ఐశ్వర్యము అనిత్యము. అది నీకు సమకూరెనేని, దానిని మంచి పనులకు వినయోగించుట ఆలసింపకుము. (శ్రీ

తిరువళ్లువరు)

- సంసార సాగరమును దాటుటకు సజ్జనసేవ సత్సంగమే ముఖ్య సాధనము.
- ఏది నీ నుండి తొలగిపోవునో దానిని గురించి చింతించుట వ్యర్థము. పోవునది నిలువదు. (శ్రీ జ్ఞానదేవుడు)
- జపముచే కర్మదోములును, సత్సంగముచే సంగ దోషము లను, దానముచే పాపదోషములును నివృత్తి యగును. (భక్తసూర్‌దాస్)
- ఇతరుల లోపములను తలంచక, నీలో వున్న లోపములను దిద్దు కొనుము. నీ లోపములను ఇతరులు చూసినచో వారిని ద్వేషించక వారు నీకు ఉపకారులుగా నెంచి ప్రేమించుము. (చైతన్య ప్రభువు)
- సంసారములో రెండు రకముల మనుష్యులుందురు. 1) చేట స్వభావముగలవారు 2) జల్లెడ స్వభావముగలవారు. చేట మంచి గింజలను వుంచుకొని చెత్త చెదారమును క్రింద పడవేయును. అట్లే మంచివారు మంచి గుణములను స్వీకరించి, చెడు గుణములను వదలుదురు. జల్లెడ స్వభావముగలవారు జల్లెడ మంచి గింజలను క్రిందపడవేసి చెడ్డగింజలు, రాళ్ళు, మట్టి మొదలగు వాటిని వుంచు కొనును. అట్లే చెడ్డ గుణములుగలవారు మంచిని విడిచి చెడును స్వీకరింతురు. (శ్రీరామకృష్ణ పరమహంస)
- నీకు భక్తికావలెననిన ఒక సంవత్సరముగాని లేక ఆరు మాసములు గాని, సత్సంగము, ఏకాంతవాసము చేయుము. (శ్రీరామకృష్ణ పరమహంస)
- ఎవనికి జ్ఞానము, తత్త్వ విచారణము కలుగునో వానికి నమ్రత, దయ కలుగును. అతడే భక్తుడనదగును.
- నీవు జీవించియుండువరకు ఎవరిని ద్వేషించకుము.



అందరిని ప్రేమించుము, సేవించుము. మృదుమధురముగా మాట్లాడుము. మానవుడు మృతినొందిననూ మాట మాత్రముండిపోవును.

- దుఃఖములను సహించుడు. ఇతరులు తిట్టినను, అవమానించిననూ వాటిని మీరు గ్రహించకుడు. ఆ తిట్లు మొదలగునవి తిరిగి అవి ఎవరివో వానినే చేరును. దీనికై చింతించక వారి గుణ స్వభావమని తలంచి, వారిని ప్రేమించుము.
- ఆనందము కావలసియుండిన అహంకారమును విడువ వలయును. పుణ్యము కావలసి యుండిన కోపమును దరిచేరనీయరాదు. ముక్తిని పొందవలయునన్న సమస్త బంధములు త్రెంచివేయవలెను (శ్రీసాధుమాత)
- అన్ని భాషలలో మిత భాషమంచిది. యోగములలోకెల్ల సమరసయోగము మంచిది. దానములలో కెల్ల నిదానము మంచిది. (సాధుమాత)
- మాటలు తగ్గించుకొనినగాని మనస్సు నిలువదు. మనస్సును స్వాధీన మందుంచుకొనుటయే మాయను త్యజించుట. (శ్రీసాధుమాత)
- గాదెలో ఎలుకలుండిన ధాన్యమును పొల్లుచేయును. అట్లే హృదయములో అహంకారముండిన ఆనందమును గుల్లచేయును. (సాధుమాత)
- గర్వముతో చేయు ధర్మము, కోపముతో చేయు సేవయు, ప్రేమలేని చోట చేయు భోజనము వ్యర్థములే. (సాధుమాత)
- ఏది నీకు ప్రాప్తించినదో, అది నీ మేలు కొరకే, భగవంతుని దయచే నీ కొరకై ప్రసాదించెనని తలంచుము.
- లోపల భగవస్మరణ, బయట స్వధర్మాచరణ, చేతితో సేవా కార్యక్రమము, మనసునందు విరక్తి భావముండవలెను.
- ఎప్పుడును అసత్యము పలుకకుము. ఇతరులను నిందించ

కుము. శపథము చేయకుము. నీ సంస్కారమును పాడు చేసుకొనకుము. (బోలానందగిరిస్వామి)

- నిరంతరము సాధు సాంగత్యము చేయుచు, మితముగ ప్రియముగ మాట్లాడుము. (తత్త్వానంద సరస్వతి)
- లోకములోగల అన్ని వస్తువులకంటే కాలమొక్కటియే మిక్కిలి అమూల్యమైనది. కాలమును వృధాపుచ్చక, కోరికలను, ఆశలను విడిచి, ఈశ్వ రుని ధ్యానించుము. నేడే మనది. రేపు మనది కాదు. (శ్రీ ఓంకార స్వామి).
- నీవు ఎవరినైనను వ్రేలుపెట్టి చూపించినచో మిగతా నీ మూడువ్రేళ్ళు నీవైపు చూచుచుండును. ఎందుకనగా ఇతరులలో ఒక దోషముండి న నీలో మూడు దోషము లున్నవని చూపుచున్నవి. కావున ముందు నిన్ను నీవు దోషరహితునిగా చేసుకొమ్ము. ఇతరుల దోషములను చూడకుము. (స్వామి అభేదానంద)
- ధ్యానములో మనస్సు నిలువకపోయినచో మనస్సుయింకను విషయ భోగాసక్తి ఉన్నదని తలంచుము.
- ఇతరులతో సేవచేయించుకొనుట మహాపాపము. దీనిచే పూర్వజన్మలో చేసిన పుణ్యము తరిగిపోవును (శ్రీ మలయాళ స్వామి)
- కష్టములు మానవులకు నీతి ధర్మములు బోధించుచున్నవి. కావున అవి దేవుని యొక్క అనుగ్రహములుగా దలంచుము. (శ్రీమలయాళ స్వామి)
- మనస్సు కామ, క్రోధములచే బాధపడు సమయములో మౌనము వహించాలి. తక్షణమే చన్నీటితో ముఖము, చేతులు కడగవలెను. లేదా చన్నీటితో స్నానము చేయవలెను. తప్పక శాంతి కలుగును (స్వామి కేశవతీర్థ)
- కష్టములు మన దోషములను పోగొట్టుటకే వచ్చును. వాటికి



భయపడకుము. ఈశ్వరుడు మన మంచికొరకే అలా చేయుచుండును.

- వాక్కును నీ వశములో వుంచుకొనుము. అవసరము లేనిదే మాట్లాడకుము. మౌనమే శ్రేష్ఠము.
- భగవంతుని వైపునకు నీవు ఒకఅడుగు వేసినచో, ఆయన నీవైపు రెండు అడుగులు వేయును.
- భగవంతుని చేరుటకు మార్గములు. 1) మహాత్ముల సాంగత్యము 2) సత్యము 3) సంతృప్తి 4) ఇంద్రియ నిగ్రహము.
- మనము పాపపు పనులను రహస్యముగా చేస్తాము. కాని మన చేతలనేకాక, ఆలోచనలను కూడా ఆ సర్వేశ్వరుడు గమనిస్తూ వుంటాడని మనం గ్రహించినపుడే ముక్తి లభిస్తుంది (మహాత్మాగాంధి)
- జయాపజయాలు మన చేతుల్లో లేవు. మనం చేయవల సింది చేస్తే చాలు. మనం పని చెయ్యడం ముఖ్యం. ఫలితం సర్వేశ్వరుని అభీష్ట ప్రకారం జరుగుతుంది. (మహాత్మాగాంధి)
- ఏ భగవంతుని కొరకు ప్రపంచమంతా నీవు అన్వేషిస్తూ వున్నావో ఆ భగవంతుడు నీ హృదయములోనే ఉండి ప్రకాశిస్తూ వున్నాడు (స్వామి వివేకానంద)
- పాలలో వెన్న వుంటుంది. కాని పాలను కాచి తోడువేసి చిలికితే గాని వెన్నరాదు. అలాగే దైవాన్ని తెలుసుకోవడానికి సాధన, పూజ, జపము, ధ్యానములు అవసరమైయున్నవి. (స్వామి శివానంద)
- నీ దగ్గరికి ఏ ప్రాణి వచ్చినా ఉదారంగా ఆదరించు. ఆకలిగొన్న వారికి అన్నం, వస్త్రాలు లేనివారికి వస్త్రాలు యివ్వు. భగవంతుడు సంతోషిస్తాడు (శ్రీ షిర్డి సాయిబాబా)
- ఇది కావాలి, అది కావాలి అనే కోరికలను విడిచిపెట్టి

అన్నింటిలోను అందరిలోనూ వున్నదైవం మీద నీ మనస్సు నిలుపు. ఈ విధముగా నిలిపిన యెడల గమ్యం చేరతారు. (శ్రీ షిర్డీ సాయిబాబా)

- మానవుడెంతవరకు అహంకారబద్ధుడై యుండునో, అంతవరకూ సత్వదార్ధమైన ఆత్మానుభవము కలుగదు. (శ్రీ సత్యసాయి బాబా)
- మానవులకు అన్నియు తెలియునుగాని తనను గురించి తానెవరో తెలుసుకోలేకున్నాడు. (శ్రీ సత్యసాయిబాబా)
- నాలుకను వశమందుంచుకొన్న లోకమే వాని వశము కాగలదు.
- ఆహార దోషముచే సర్వదా చిత్తమునకు కల్మషము కలుగును. కల్మష చిత్తముగలవానికి, ధర్మ రహస్యమైన జ్ఞానముద యించదు. (శ్రీ సత్యసాయిబాబా)
- ఎక్కడ భగవన్నామ సంకీర్తనము కోలాహల ధ్వని జయ జయా రావాలతో గర్జితమాడుచుండునో ఆ స్థలమే వైకుంఠము. (శ్రీ సత్యసాయిబాబా)
- యజ్ఞయాగాదులు, పూజలకంటె సమాజసేవ మంచిది. ఆత్మ బోధకంటే ఆకలిగా వున్నవారికి అన్నం పెట్టడం ప్రధానంగా వుండాలి. ప్రార్థన చేసే పెదవులకంటే సహాయం చేసే చేతులే పవిత్రం. కృతజ్ఞత లేకపోతే పాప పరిహారముండదు. (శ్రీ సత్యసాయిబాబా)
- విద్యలేనివారు పశుప్రాయులని కొందరు చెప్పుదురు. కాని



విద్య యుండియు జ్ఞానములేనివారు, పశువులకన్నా తక్కువే. (శ్రీ యలయాళ స్వామి)

- నిన్ను యితరులు తిట్టినను, నిందించినను మంచిదే కాని నీవు మాత్రము వారికి అపకారము చేయకుము. వారిని ప్రేమింపుము. నీ మనస్సులోనైనను వారియందు ద్వేషబుద్ధి రానీయకుము. (శ్రీ స్వామి రామతీర్థ)
- సిగ్గు, ద్వేషం, భయం అనే ఈ మూడు గుణాలు వున్నంత వరకూ ఎవరూ భగవంతుని దర్శించలేరు. (శ్రీరామకృష్ణ పరమహంస)
- ఆనందమనేది మన సహజ స్వరూపం. వచ్చిపోయేది అహం కారము. సుఖదుఃఖాలు కూడా ఈ అహంకారానివే. మన నిజస్వరూపమును మరసిపోవడంచేతనే దుఃఖాన్ని అనుభ విస్తున్నాము. (శ్రీ రమణమహర్షి)
- ద్రవ్యము, పేరుప్రతిష్టలు, పాండిత్యము ఇవయన్నియు నిష్ప్రయోజనములు. ప్రేమ ఒక్కటియే ఫలప్రదము. దేవుడు ప్రేమ స్వరూపుడు.

## సద్గురు మెహెర్‌బాబా వారి సందేశములు

- నేను బోధించుటకు రాలేదు, మేల్కొలుపుటకే వచ్చాను
- వ్యాకులపడకుము, ఆనందముగా వుండుము.
- నన్ను ప్రేమించు, నీకు సహాయం చేస్తాను.
- ఇతరులను ఆనందింపజేయుటలోనే నిజమైన ఆనందమున్నది
- నేను, నీవు కలసి ఇద్దరము కాదు ఒక్కటే.
- నేను సనాతన పురుషుడను, మీరందరు కూడా అంతే. అయితే నేను మేల్కొన్నాను. మీరింకా మీ స్వప్నాలలోనే వున్నారు.
- ద్వేషానికి సరియైన విరుగుడు ప్రేమ. నీవు ఎవరినైనా ద్వేషించాలని అనిపించినప్పుడు ఆ వ్యక్తి కూడా నీ ఆత్మయొక్క వేరొకరూపమని జ్ఞాపకము చేసుకోవడానికి ప్రయత్నించు.
- జీవితలక్ష్యం, భగవంతుని ప్రేమించడం, జీవితగమ్యం భగవంతునిలో ఐక్యం కావడం.
- కామయుతమైన పనులు చేయకుండా, ఎవరిని పరోక్షంగా విమర్శించకుండా భౌతికమైన వస్తువుల సంపాదననుకాని, అధికారాన్ని గాని ఆశించకుండా గౌరవాన్ని ఆశించకుండా, పొగడ్తలకు పొంగిపోక, నిందలకు కృంగిపోక, ఎవరికి దేనికి భయపడకుండా కేవలము భగవంతుని మాత్రమే ఆధారముగా భావిస్తూ, భగవత్ ప్రేమికులయెడల, భగవదవతరణ యెడల విశ్వాసాన్ని కలిగివుంటూ, భౌతికమైన లబ్ధినిగాని, ఆధ్యాత్మిక ప్రతి ఫలాన్ని కాని ఆశించకుండా, సత్యాన్ని విడిచి పెట్టకుండా, కష్టాలకు చలించకుండా, ధైర్యంతోను, హృదయపూర్వకంగా, ఆనందముతోను, కష్టాలను స్వీకరిస్తూ, కులమతాలకు, మత సంబంధమైన కర్మకాండలకు ప్రాధాన్యత నీయకుండా జీవితము గడుపుతారో అట్టివారు ఈ నవజీవ



నాన్ని సజీవంగా నిలుపుతారు.

- భగవంతుడు సర్వత్రావుండి, సర్వమూ చేస్తున్నాడు (జీవాత్మగా)
- భగవంతుడు మనలోనేవుండి సర్వము తెలుసుకుంటున్నాడు (సూత్రాత్మగా)
- భగవంతుడు మనకు వెలుపలవుండి సర్వమూ చూస్తున్నాడు (ప్రత్యగాత్మగా)
- భగవంతుడు మనకు అతీతంగా వుండి సర్వమూ అయి వున్నాడు (పరమాత్మగా)

**సప్త సత్యములు :**

- **నిజ ఉనికి** (Real Existance) : సత్య (నిజ) ఉనికి కలిగినది ఈ సృష్టిలో ఏమున్నది? ప్రపంచం, దానిలోని వస్తువులు నిరంతరం మారుతూనే ఉంటాయి. కాని మారనివాడు దేవుడు మాత్రమే. మన విశ్వాసం, ప్రేమ నిత్యము మారుతున్న వాటిపై కాక ప్రతి జీవాత్మలోనున్న ఏకైకమైన మారని భగవంతు నిపై ఉండాలి. అట్టి భగవంతుడే నిజమైన అస్తిత్వం (ఉనికి) కలవాడని సాధకుడు దృఢమైన భావం కలిగి ఉండాలి.
- **నిజమైన ప్రేమ** (Real Love) : శాశ్వతుడు, నిజ ఉనికి కలిగిన భగవంతుని ప్రేమించుటయే నిజమైన ప్రేమ. నిరంతరం మారుచుండే ప్రపంచాన్ని ప్రేమించే వ్యక్తి దేవుణ్ణి ఎలా ప్రేమించగలడు? ముఖ్యంగా మనం దేవునిచేత ప్రేమించబడడం చేతనే ఆయన్ని ఆరాధించి ప్రేమించగలుగుచున్నాము. ఆయన తన ప్రేమ కానుకను ప్రసాదించకపోతే ఆయన్ని ప్రేమించడం కాని, ఆయనలో ఐక్యం కావడంకాని అసాధ్యం.
- **నిజమైన త్యాగము** (Real Sacrifice) : అసత్యమైన వస్తువులు ఎన్ని అయినా త్యాగం చేయవచ్చును. కాని తనకు అవసరం లేనిది ఇతరులకివ్వడం త్యాగం కాదు. తనకు అవసరమైనది

ఇష్టమైనదానిలో కొంతభాగం ఇతరులకివ్వాలి. ఇది కూడా ఉన్నతమైన త్యాగం కాదు. తన ఉనికికి ఆధారమైన అరిషడ్వర్గాలను జీవిత అలవాట్లను త్యాగం చేయాలి. గయ, కాశీవెళ్లి గంగలో ఇష్టంలేని వస్తువు వదిలిరావడం త్యాగం కాదు. మనలో ఉన్న ఒక గుణాన్ని విసర్జించే నిమిత్తం మహాత్ములు దాన్ని నియమించేవారు. ముఖ్యంగా అసత్యమైన, కృత్రిమమైన 'అహం'ను బలిచేయాలి. అప్పుడే సత్యానుభవం వస్తుంది. దివ్య ప్రేమ పొందడానికి తనువు, మనస్సు, పదవి, ప్రాణంతో సహా సమస్తమూ కూడా త్యాగం చేయాలి. అదే నిజమైన త్యాగము.

- **నిజమైన సన్యాసము** (Real Renunciation) : భౌతికవేషం మార్చి తిరగడం సన్యాసం కాదు. సన్యాసమంటే విడిచిపెట్టడము. ఏమిటి విడవాలి? జీవితాన్ని నడిపించే స్వభావాన్ని, మరు జన్మకు కారణభూతమౌతున్న సంస్కారాన్ని విసర్జించాలి. భోగ భాగ్యాలయెడల, జిహ్వ చాపల్యం యెడల కోరికలు విడుదల చేసికోవాలి. అంతరిక సన్యాసమంటే ఇదే. వైరాగ్య మనేది వివేకయుతంగా ఉండాలి.

- **నిజమైన జ్ఞానం** (Real Knowledge) : లౌకిక జ్ఞానం నిజమైన జ్ఞానం కాదు. ఆత్మ సంబంధమైనదే నిజమైన జ్ఞానం. సర్వే సర్వత్రా ఏ దివ్యజ్ఞానం ఇమిడియున్నదో దాని అనుభవం పొందాలి. దేవుడు మంచివారిలోనూ, చెడ్డవారిలోనూ, పుణ్యాత్ములు, పాపాత్ములలోను నివసించి ఉన్నాడని అనుభవంగా తెలుసుకొనుటయే నిజమైన జ్ఞానం. నీ పరిస్థితులను బట్టి ప్రతిఫలం కొరకు ఆశించకుండా, అందరకూ సమంగా సాయపడమని, ఏదైనా ఒక తగాదా ఎదురైనప్పుడు ద్వేషం గాని, శత్రుభావంగాని లేకుండా ఆచరించమని అందరి యెడల సోదరభావం వహించి, వారు సుఖపడునట్లు ప్రయత్నించమని, అపకారులకు కీడు చేయకుండా మెలగవలెనని నిన్ను ఆ జ్ఞానం కోరుచున్నది.



- **నిజమైన నిగ్రహం** (Real Control) : యధార్థమైన జ్ఞానం నిజమైన నిగ్రహం ద్వారా సాధించబడుతుంది. భౌతిక సంబంధమైన నిగ్రహం అంత ప్రధానమైనది కాదు. సమత్వ సంబంధమైన నిగ్రహం కావాలి. సత్యం ప్రకటించవలసి వచ్చినప్పుడు స్వ, పర, బేధం లేకుండా ప్రకటించగలగాలి. ఆచరణలో చూపించాలి. మీ పిల్లవానికి ఎంత ప్రాధాన్యత ఇస్తారో ఇతరులకు కూడా అంత ప్రాధాన్యతను ఇవ్వాలి. అదే నిజమైన నిగ్రహం, బంధనను కల్పించే వాటినుండి నిగ్రహించుకోవాలి. అప్పుడే కోర్కెలు లేని, సౌశీల్యంతో కూడిన పరమార్థ జీవితం జీవించ గలడు. నిన్ను ఒక వ్యక్తి అపార్థం చేసుకొని నిందించినపుడు నీవు ఉదాశీనంగా ఉండగలిగినప్పుడే నిజమైన నిగ్రహం, బలము కలిగిఉన్నట్లు తెలియబడుతుంది.

- **నిజమైన సర్వార్పణ** (Real Surrender) : పై ఆరింటిలోను ప్రావీణ్యత సంపాదించినప్పుడే నిజంగా భగవంతునకు అర్పణకాగలడు. ఈ సప్త సత్యాలద్వారా పూర్తిగా అజ్ఞానాన్ని అధిగమించి సర్వార్పణ భావంతో ఆధ్యాత్మిక మార్గములో ప్రవేశిస్తాడు. ఇలా ప్రవేశించిన వ్యక్తి సర్వార్పణభావంతో ఎట్టి హానికర పరిస్థితుల యందైనను కలతచెందక భగవదేచ్ఛకు సర్వము వదలి ప్రశాంతంగా ఉంటాడు. సప్త సత్యాలయందు దృఢత్వంగల వ్యక్తి భౌతిక పరిధిని అధిగమించి, సద్గురు సహాయం ద్వారా దైవీమార్గంలో సురక్షితంగా పయ్నునిస్తాడు.

వీని అనంతరం సప్త చైతన్య భూమికలను మోహెర్‌బాబా వివరించియున్నారు. జ్ఞాన భూమికలయందలి 7వ.ది అయిన "తుర్యగ"ను అధిగమించి బాబా వివరించిన మొదటి చైతన్య భూమికలోని ప్రవేశింపవలసియున్నది. ఇప్పటి వరకు ఈ చైతన్య భూమికలు మానవాళికి వ్యక్తీకరింపబడి ఉండలేదు. భగవంతుని చేరడానికి మతాలు, సాంప్రదా యాలు వివరించే మార్గాలన్నీ ఈ మొదటి చైతన్యభూమిక ద్వారం

వద్ద విడిచిపెడతాయి. దేవుని చేరుటకు ఏ మార్గం గుండా పయనించేవారికైనా, ఈ చైతన్య భూమికయే కూడలి అవుతుంది. ఈ మొదటి చైతన్య భూమికలో ప్రవేశించుటయే నిజమైన ఆధ్యాత్మిక మార్గములో అడుగుపెట్టుట అగును. ఇదే బాబా వివరించిన ప్రేమ మార్గము. దీనిలో ప్రేమ ద్వారానే పురోగమించాలి. యుగయుగాలుగా ఈ చైతన్య భూమికలను సద్గురువులు అధిగమించి, తిరిగి వారి కార్యక్రమము నిమిత్తం ఉపయోగించుకొనేవారు. మరియు ఆధ్యాత్మిక అధికార పీఠానికి సంబంధించిన 7000 మంది మాత్రమే ఈ భూమికలలో పయనిస్తూ వుంటారు. మెహెర్‌బాబా వీని వివరణను కూలంకషంగా వివరించి, వాటిని అనుభవించే అవకాశాన్ని మానవాళికి ఒక గొప్ప కానుకగా ఈ అవతార యుగంలో ప్రసాదించియున్నారు.

జై బాబా!

ఇవి శ్రీ సద్గురు మెహర్‌బాబా వారి సందేశములు

---

- అసూయ, అత్యాశ, కోపము, పరుషమైన మాట, ఈ నాలుగు వదిలి పెట్టిన వాడెవడో వాడే సజ్జనుడు.
- మంచిమాటలకు ప్రపంచములో అందరూ సంతోషిస్తారు. కాబట్టి ప్రతి ఒక్కరూ మధురంగా మాట్లాడం నేర్చుకోవాలి. దానివల్ల మీకు నష్టము లేదు.
- ఎంత సంపాదించినా, ఎన్ని పదవులు అలంకరించినా, తృప్తి కలగనిదే మానవుడు సుఖానుభూతిని పొందలేడు.
- ధర్మరాజు మహాభారతంలో సత్యమే నాకు తల్లి. వివేకమే తండ్రి. ధర్మమే తోబుట్టువు. దయయే చెలికాడు శాంతియే భార్య. ఓర్పే కొడుకు, ఈ ఆరుగురు నాకు బంధువులు.
- భీముడు : ప్రాణం వదలిపెట్టి అయినా మర్యాదను కాపాడుకోవాలి. ప్రాణం నిత్యం కాదు. కాని మర్యాద చంద్రుడు. నక్షత్రములు వున్నంతకాలము వుండగలదు.
- అర్జునుడు : బ్రాహ్మణుడు విందుకు, గోవులు లేత పచ్చికతో, స్త్రీలు భర్తరాకకు సంతోషింతురు. కృష్ణా నాకు యుద్ధమే సంతోషము కలిగించును.
- నకులుడు : ఇతరుల భార్యలను తన తల్లివలెను, ఇతరుల వస్తువులను ధనమును మట్టిపెళ్లలవలెను, సర్వప్రాణులను తన దేహమువలెను చూచువాడే అన్నీ తెలిసిన బ్రహ్మజ్ఞాని.
- సహదేవుడు :- శరీరములు శాశ్వతము కాదు. సంపదయూ స్థిరము కాదు. మృత్యువు చావు ఎల్లప్పుడూ సమీపములోనే వున్నది. కావున ధర్మప్రకారము నడచి పుణ్యమును సంపాదించుకొనవలయును.
- శ్రీకృష్ణుడు :- కరువుకాలములో అన్నదానము చేయువానికి, పైరుపంటలు ఫలించి, దేశకాలములు బాగుగా వుండిన సమయములో ధనము దానము చేయువానికి, యుద్ధమునందు ధైర్యముతో నిలిచి, పోరాడువానికి, అప్పులేనివానికి, ఈ నలుగురకు నేను భక్తితో నమస్కారము చేయుదును. వీరికంటె లోకములో ధన్యులు లేరు.
- కర్ణుడు :- శ్రీకృష్ణా సంపాదించిన ధనమును దిక్కులేని బీదలకిచ్చుట, శాస్త్ర సమ్మతముగ్గా-వివాహము చేసుకొనిన భార్యకే తన యౌవనమును అంకితము చేయడము (అనగా యితర స్త్రీని కోరకుండుట) తన యజమాని కోసం (పోషించువాని) తన ప్రాణములను అర్పించుట ఇవే మంచివని నానిశ్చయము.
- మన్ను ఒక్కటే అయినను కడవలు, ముంతలు, మూకుండ్లు, ప్రమిదెలు, బానలు మొదలైన భిన్నరూపములుగ కనబడును. బంగారము ఒక్కటే అయినను కమ్మలు, కడియములు,

ఒడ్డాణము, ఉంగరములు మొదలగు వివిధ రూపములుగ కనబడును. పాలు ఒక్కటే అయినను నల్లది, ఎర్రది, తెల్లని మొదలగు వివిధ రంగులు గల ఆవులుండును. ఇట్లే ఆత్మ ఒక్కటేఅయినను శరీరములు వేరు వేరు విధములుగ కనబడుచున్నవి.

- దానబుద్ధిగలవాడు బీదవాడగుట, ధనవంతుడు పిసినిగొట్టు వాడగుట, పాపాత్ముడే దీర్ఘాయుస్సుగలవాడగుట, పుణ్యాత్ముడు అల్పాయుస్సుగలిగి త్వరలోనే మరణించుట, హీనబుద్ధి గలవాడు అధిపతియగుట మంచివాడు సేవకుడగుట ఈ ఆరుగురు కలియుగములో ప్రబలమైవుండును.
- భార్యయెడబాటు, లోకనింద, అప్పు మిగిలివుండుట, దుష్టుల సేవ, బీదతనముగ నుండుట, ఇష్టమైనవారి (మిత్రుల) రాక ఈ అయిదున్ను దేహాన్ని నిప్పులేకనే కాల్చివేయును.
- తన ఆయుస్సు (వయస్సు) ధనము, కుటుంబక్షోభలు, మంత్ర ము, ఔషధము, స్త్రీ సంగమము, చేసినదానము, మానము (మర్యాద) అవమానము అను ఈ తొమ్మది బుద్ధిమంతులగు వారు ఇతరులకు తెలుపక దాచిపెట్టి రహస్యంగా వుంచాలి.
- ఇతరులను ఆడిపోసుకొనువాడు, పనిపాటలు లేక వూరకే తిరుగువాడు, ఎక్కువ కోపముగలవాడు, నీచుడు, ఈ నలుగురు కర్మచండాలురు.
- తల్లిదండ్రులు :- కుమారుని అయిదేండ్లువచ్చువరకు రాజువలె చూడవలెను. పది సంవత్సరముల వరకు సేవకునివలె ఎంచి వాని నుండి పనులు చేయించుకొనవలయును, పదునారవ సంవత్సరము వచ్చిన తరువాత మిత్రునివలె చూడవలెను.
- దాసీ సంభోగం మానమర్యాదలను నశింపజేయును. వేశ్యా సంగమం ధనము మొదలగు వానిని పోగొట్టును. విధవా సంయోగం ఆయుస్సును నశింపజేయును. పరస్త్రీ సంభోగం సకలమును నాశనముగావించును.



- రాత్రియందు కాంతిని కలిగించువాడు చంద్రుడు. పగటి యందు లోకమునకు ప్రకాశము యిచ్చువాడు సూర్యుడు. మూడు లోకములందును వెలుగును వ్యాపింపజేయునది ధర్మము. కులమంతయు వెలుగునట్లు కీర్తిని వ్యాపింప జేయువాడు మంచి గుణములుగల కుమారుడు. కావున సద్గుణములగల కొడుకు వంశమునకు కీర్తి తెచ్చును.
- తన మేలుకోరువాడే బంధువు. చేరదీసి పోషించువాడే తండ్రి. విశ్వాసముతో మంచిచెడ్డలయందు తోడుపడువాడే మిత్రుడు. సుఖమును కలిగించునట్టిదియే భార్య. మంచి మాటలచే మానసిక శ్రమలను భోగొట్టుచు గృహకృత్యము లను లోటు కాకుండా జరుపుచు తగిన ఉపచారములచే మనస్సునకు సంతసమును వృద్ధిచేయునదే భార్య.
- హోమాదులైన అగ్ని కార్యములు జరుగు చోటికి పోవునప్పుడు మరల యింటికి వచ్చునప్పుడు పుణ్యతీర్థము, గర్భవతులు, ముదుసలులు, బాలురు, గురువు, దైవము. వీరి వద్దకు పోవునపుడు వట్టి చేతులతో పోరాదు. ఫలములు మొదలగునవి ఏమయిన తీసుకొనిపోవలెను.
- దరిద్రునకు యిచ్చేదానం, పూజలేక నిలిచిపోయిన లింగము నకు చేయు పూజ, దిక్కులేని శవమునకు చేయు సంస్కారం అనేవి అశ్వమేధ యాగం చేసిన దానితో సమాన మగు ఫలమును కలిగించునుయని పెద్దలు చెబుతారు.
- భక్తిలేక చేసిన దానకార్యములు, నాయకుడు లేనట్టి సైన్యము, దక్షిణ లేని యజ్ఞము నిరుపయోగములు.
- లోకములో జీవనం స్థిరమైనది కాదు. వయస్సు స్థిరమైనది కాదు. ధనం కూడా శాశ్వతమైనది కాదు. భార్యా పుత్రులు మొదలగువారు శాశ్వతం కాదు. తాను చేసిన ధర్మం, కీర్తి (అనగా చేసిన మంచిపనుల వలన కలుగు ప్రఖ్యాతి) ఎల్లప్పుడూ వుండను.

- ఎవడు భగవన్నామ స్మరణలేక క్షణకాలమైననూ వ్యర్థముగా గడపడో అతడే ధన్యుడు. అతడే సుకృతవంతుడు. అతడే సంపూర్ణ వైరాగ్య భాగ్య సంపన్నుడని చెప్పబడును.
- ఎంతవరకు పరమేశ్వరుని యొక్క అనుగ్రహము కలుగలేదో అంతవరకు సద్గురువుగాని సత్ శాస్త్రముగాని మానవునికి లభింపవు.
- నరకమునందు శిక్షింపబడుచున్న జీవునితో యమధర్మరాజు ఓ జీవుడా నీవు భగవంతుని అర్చించావా. సంకటములను భోగొట్టు కేశవుని కీర్తించావా పుణ్యకర్మలు చేశావా? ఇవి ఏమియు చేయలేదు. అందుకే నీకు దుర్గతి కలిగింది. కనుక ఇక ముందు జాగ్రత్త అని మందలించాడట.
- ఏడు కోట్ల మహామంత్రములకు ఓంకారము శిరస్సువంటిది. ఓంకారము లేని మంత్రము ప్రాణములేని శరీరము వంటిదని చెప్పబడినది. కావున తాను జపించు ప్రతి మంత్రమునకు ఓంకారము మొదట జేర్చుకొని జపించవలెను.
- జపము గృహములో చేసిన వందరెట్లు ఫలితము, గోశాలలో చేసిన లక్షరెట్లు ఫలితము, దేవాలయములో చేసిన కోటిరెట్లు పుణ్యము, శివుని సన్నిధిలో చేసిన అనంతమగు పుణ్యము లభించును.
- వేదములలో చెప్పబడిన యజ్ఞములన్నింటిలో జపయజ్ఞము శ్రేష్టము. దానికంటే ఉపాంశుజపము వందరెట్లు శ్రేష్టము. ఉపాంశుజపమునకంటె మానసిక జపము పదివందల రెట్లు ఫలితము. (అనగా శ్రేష్టము)
- సర్వమానవులు జననమరణము అను తిరుగలిచే చూర్ణము చేయబడుచున్నారు. కాని వారిలో భగవద్భక్తుడు మాత్రమే దుఃఖవిముక్తుడై సదా ఆనంద స్వరూపుడైవుండును.
- హే ప్రభో ప్రపంచమున మానవులకు పుత్రులయందును,



మనుమల యందును వారి పోషణయందును, ధనము, ధాన్యము, భోగము, లాభములయందును, ఎల్లప్పుడు ఏ చింతనకలదో, ఆ చింతనయే శ్రీకృష్ణ పరమాత్మ పాదార విందములయందు ఒక్క క్షణమైన యున్నచో, వారికి భయం కరమగు యమలోకముతో పనిలేదు, వానికి భయమెక్కడిది.

- మనుష్యుడుగా జన్మించుట, మోక్షమునందు కోరిక గలుగుట, గురువులను ఆశ్రయించుట అను ఈ మూడు దుర్లభము లైనటువంటివి. ఇవి దైవానుగ్రహముగలవారికి మాత్రమే లభ్యమగును.
- బ్రహ్మదేవుడు పూర్వము వృక్షములను, సర్పములను, పశు వులను, పక్షులను, మత్స్యములను మొదలగు వాటిని సృష్టించి వాటిచే సంతుష్టిని పొందక, చివరికి బ్రహ్మవలోకము చేరు టకు శక్తియుతులగు మానవులను సృష్టించి సంతోషము పొందెను. కావున మానవుడు భగవంతుని తెలుసుకొనక యున్నచో, ఇతర ప్రాణులవలె మానవజన్మ కూడ నిరర్థక మైనదే యగును.
- లోకమునందు చందనము చల్లదనము గలది. చందనము కంటె చంద్రుడు చల్లదనము గలవాడు. చందన చంద్రుల కంటె సాధుసాంగత్యము మిగుల చల్లదనము గలదైయున్నది.
- గుణవంతుల సాంగత్యము చేయుటవలన నీచుడైనను గౌరవమునే పొందును. దారములు కూడా పుష్పముల సాంగత్యముచే భగవంతుని శిరస్సునందు ధరింపబడు చున్నవి గదా!
- లోకమునందు వెతికిచూడగా మూడు సారవంతమైన వస్తువులు కలవు. 1) భగవంతునియందు భక్తి గలిగి యుండుట 2) సజ్జనుల యొక్క సహవాసము చేయుట 3) పరుల హితమును గూర్చి చింతించుటయని తెలియవలెను.

- మహాత్ముల యొక్క సాంగత్యము ద్వారా మహాత్ముడుగా మారును. ఏలయనగా పాలలో జలము కలియుట వలన, జలము గూడా పాలవలె మూల్యవంతమగుచున్నది.
- మానవులు భవసాగరమును దాటుటకు 1) సంతోషముగా నుండుట, 2) సాధువుల సాంగత్యము చేయుట 3) ఆత్మానాత్మ విచారణ కలిగియుండుట 4) అంతరేంద్రియములను నిగ్రహించుట అను ఈ నాలుగు ఉపాయములని తెలియవలెను.
- ఓ మానవుడా! దుర్జన సాంగత్యమును విడిచిపెట్టుము. సజ్జన సాంగత్యమును అవలంభింపుము. రాత్రింబవళ్ళు పుణ్య కార్యములనే చేయుము. నిత్య, అనిత్యములను ఎల్లప్పుడు స్మరించుచుండుము.
- సాధువులు చిత్తమునందు ఏదియుండునో అదియే వాక్కు ద్వారా చెప్పుదురు. వాక్కుద్వారా ఏది చెప్పుదురో అదియే క్రియద్వారా చేయుచుందురు. మనోవాక్కాయములద్వారా మహాత్ములు ఏకరూపముగానే ప్రవర్తించుచుందురు. మంచివారి సన్నిధానమున వుండుటవలన మూర్ఖుడు కూడా మంచివాడిగా మారగలడు.
- సాధువు ఎవరి గృహములో భోజనము చేయునో వారి యింటిలో స్వయముగా భగవంతుడే భోజనము చేసినట్లగును. ఎవరి యింటిలో భగవంతుడు భోజనము చేయునో వారియింటిలో ముల్లోకములు భుజించినట్లే యగును. కావున గృహస్థుడు సాధువుకు ఒక్కసారైన భోజనము పెట్టవలెను.
- ఏ యే గృహములు మహాత్ములయొక్క పాదములు కడగబడినవో ఆ గృహములయందు వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత పఠింపబడి ప్రతిధ్వనించునో, ఏ గృహముల యందు స్వాహా, స్వాహాకారములచే యజ్ఞములు హోమ



ములు చేయబడినవో ఆ గృహములే ఆనందమయములై విలసిల్లును.

- ఏ మానవుడు కోటి బ్రాహ్మణులకు భోజనము పెట్టినచో ఎట్టి ఫలము పొందునో అట్టి ఫలమును, ఒక్క బ్రహ్మజ్ఞానికి, ఒక్క జ్ఞాన సాధువునకు భోజనము పెట్టినచో అంత ఫలమును పొందగలడు.
- దుర్జనునితో స్నేహము చేయకూడదు. శత్రుత్వం కూడా పనికిరాదు. ఏలయనగా అగ్నివేడిగా వున్నప్పుడు తాకితే కాలుతుంది. చల్లబడిన తరువాత ముట్టుకుంటే చేతికి మసి అంటుకుంటుంది. అగ్నిని తాకినను, బొగ్గును తాకినను కష్టనష్టములే కలిగినట్లు, దుర్జనునితో స్నేహముగాని, వైరముగాని కష్టనష్టములు కలిగించును. కావున జాగరూకతతో మెలగవలెను.
- గురువును దర్శించుట చేతను, స్పర్శ సంభాషణాదులచేతను, ఆత్మ తత్త్వ జ్ఞానమును పొంది, సర్వపాపములనుండి విముక్తుడగును.
- నీవు ఆయువు వున్నంతకాలము గురువుని, ఈశ్వరుని, వేదాంతమును మనస్సుచే, కర్మచే, వాక్కుచే త్రికరణ శుద్ధిగా వందనమాచరించవలెను. ఇది శృతియొక్క నిశ్చయమై యున్నది.
- మొదట గురువు చెప్పిన కార్యము చేయవలెను. రెండవది దైవకార్యమును చేయవలెను. మూడవది అతిథి సత్కార్యాది కార్యమును చేయవలెను. నాలుగవది తనకు సంబంధించిన కార్యమును చేయవలెను.
- దైవమునందు, గురువుయందును, వేదాది శాస్త్రముల యందును పరిపూర్ణ విశ్వాసము గలిగియుండి, ఆ ప్రకారము ఆచరించినచో శీఘ్రముగా నీవు భవసాగరమును దాటి కైవల్యమును తీరమునకు చేరగలవు.

- కులము, ధనము, బలము, శాస్త్రము, బంధువులు, సోదరులు మొదలగునవి ఎన్నివున్నను మరణకాలమున ఉపయోగ పడవు. అప్పుడు భవసాగరమును దాటించువాడు గురు దేవుడు ఒక్కడు మాత్రమేనని తెలిసికొనవలెను.
- మంత్రముయందును తదధిష్ఠాన దేవతయందును, మంత్ర మునుపదేశించిన గురువుయందును భక్తి గలిగియుండుట ఆత్మజ్ఞాన మార్గమున ప్రథమ సాధనమని చెప్పబడును.
- సద్గురువుయొక్క కరుణలేకుండా విషయత్యాగము పొంద బడదు. ఆత్మదర్శనము కలుగదు. సమాధిస్థితి సిద్ధింపదు. కావున గురుదేవునకు కరుణ గలుగుటనట్లు ప్రవర్తించవలెను.
- గురువు యొక్క అనుగ్రహము లేకుండా కోటి ఆచారములు (ధర్మములు) ఆచరించినను పర్వత సమానముగా సువర్ణము దానము చేసినను, ఆత్మతత్త్వమును తెలసు కొనలేడు. ముక్తిని పొందలేడు. కావున గురువుని తప్పక ఆశ్రయించ వలెనని శాస్త్రములు ఆదేశించినవి. గురువే మానవులకు పరమాత్మతత్త్వమును తెలుపువాడు.
- జన్మచే అంధుడైనవాడు లోకము యొక్క రూపములను ఎటుల తెలుసుకొనలేడో, అటులనే గురూపదేశము లేకుండా ఆత్మతత్త్వజ్ఞానమును తెలిసికొనలేడు.
- ఎవనిచే భగవంతుడు ఆరాధింపబడలేదో, ఎవనికి గురు దేవుని అనుగ్రహం కలుగలేదో, ఎవని యొక్క మనస్సు వశము కాలేదో అట్టివానికి శాంతి లభించదు. ఎవడు భగవంతుని ఆరాధించి, గురువు యొక్క అనుగ్రహము పొంది, మనస్సుని జయించి వశమొనర్చుకొనునో వానికి మాత్రమే శాంతి లభించును.
- భక్తిప్రపత్తులచే గురువుని ఆరాధించి వారి సుశ్రూషణ లొనర్చుచు, గురుదేవులు ప్రసన్నముగా నున్నప్పుడు తాను తెలుసుకోవలసిన ఆత్మజ్ఞానము మొదలగువాటిని వినయ



ముతో ప్రశ్నించి తెలుసుకొనవలెను.

- ఓ మానవుడా! తనువు మనస్సు, ధనము, ప్రాణములతో గూడా పరోపకారమే చేయవలయును. ఏలయనగా నూరు యజ్ఞములు చేసినను పరోపకారమునకు సమానమగు పుణ్యము కలుగదు.
- సూర్యుడు, చంద్రుడు, మేఘములు, వృక్షములు, నదులు, గోవులు, సజ్జనులు మొదలగువాటిని భగవంతుడు పరోప కారము చేయుటకొరకై సృష్టించెను.
- ఎదురేగి దానము చేయుట ఉత్తమము. పిలిచిదానము చేయుట మధ్యమము. అడిగిన పిమ్మట దానము చేయుట అధమము. సేవ చేయించుకొని దానము చేయుట నిష్ఫలము అని ఎరుగవలెను.
- మానవుడు గోవును దానము చేయుటచే సూర్యవర్ణముగల దివ్యరత్నములచే విరాజమానమగు విమానము ద్వారా సనాతనమగు బ్రహ్మలోకమును పొందును.
- స్వర్గమునకు, మోక్షమునకు ధనమే ద్వారమగుచున్నది. కావున ధనవంతుడు దీనులకు, అంధులకు, బీదలకు, విక లాంగులకు, అనాధలకు ధనమును యిచ్చుచుండవలెను.
- ఓ మానవుడా! దానముచే హస్తము పవిత్రమగును. రామ నామస్మరణచే వాక్కు పవిత్రమగును. తీర్థయాత్రలచే పాదములు పవిత్రములగును. బ్రహ్మవిద్యచే మనస్సు పవిత్ర మగును. కావున లోభమును విడిచి, పైన చెప్పిన పుణ్య కర్మలను చేయుము.
- దైవమందిరమునకు, గురువుచెంతకు, యజ్ఞము జరుగు స్థలమునకు, పుణ్యక్షేత్రమునకు, గర్భిణీ స్త్రీ చెంతకు, వృద్ధుల దగ్గరకు, బాలకులు గల స్థలమునకు వెళ్ళునపుడు వట్టి చేతులతో పోకూడదు. ఫల, పుష్పములను తీసుకొనివెళ్ళవలెను.

- పాపమునకు ఫలము దుఃఖము, పుణ్యమునకు ఫలము సుఖము, ధ్యానమునకు ఫలము మనోస్థిరత్వము, జ్ఞానమునకు ఫలము మోక్షముయని తెలుసుకొనవలెను.
- మానవుడు పాపకర్మను నవ్వుచూ చేయుచున్నాడు. కాని ఆ కర్మఫలమును ఏడ్చుచూ అనుభవించుచున్నాడు. దుఃఖమునిచ్చువాడుగాని, సుఖమునిచ్చువాడు గాని తన కర్మ ఫలము తప్ప మరియొకడు లేడు.
- వైరాగ్యము మోక్షము నిచ్చును. కోరిక బంధమునిచ్చును. ఇది సర్వశాస్త్రములయొక్క నిశ్చయము. ఇక నీకు బంధము కావలయునో, మోక్షము కావలెనో విచారించి యిష్టమైన దానిని అవలంభింపుము.
- ముసలితనము పెద్దపులివలె కూర్చొని బెదిరించుచున్నది. రోగములు శత్రువులవలె దేహమును చెడగొట్టుచున్నవి. రంధ్రము పడినకుండలోని జలమువలె దినదినము ఆయువు తరిగిపోవుచున్నది. అయినను జనులు అధర్మకార్యములనే చేయుచున్నారుగదా.
- శాస్త్రములు అనంతములు, తెలుసుకొనవలసినది చాలా యున్నది. ఆయుష్కాలము అల్పము. విఘ్నములు అనేకములు గలవు. కావున నీటిని వేరుచేసి, పాలను గ్రోలు హంసవలె ఏది సారభూతమో దానినే ఉపాసింపుము.
- జీవునకు జన్మము వలన దుఃఖము. భార్య అనుకూలముగ లేని యెడల దుఃఖము, వార్ధక్యముచే దుఃఖము మాటి మాటికి కలుగుచుండును. అందువలన ఆత్మజ్ఞానమును పొందుటకై మేలుకొనుడు.
- ఆశలచే, కర్మలచే వివిధములగు బహుచింతలచే జనులు బంధింపబడుచున్నారు. ఆయుష్షు క్షీణించుచున్నదని వారెరుగుటలేదు. అందువలన జాగరూకులై మేలుకొని యుండుడు.



- అజ్ఞానముచే బాల్యము గతించెను. వనితాది భోగములచే యౌవ్వనము గతించెను. దారాపుత్రాది చింతనలచే వార్ధక్యము గతించెను. ఇక మానవుడు ఏమి సాధించగలడు.
- ప్రపంచమున ప్రతిదినము ప్రాణులు యమలోకమునకు వెళ్ళుచునే యున్నారు. ఇక మిగిలిన ప్రాణులు ఇదంతయు చూసియు కూడా మేము మాత్రము స్థిరముగా నుండగలమని విశ్వసించుచున్నారు. లోకమున దీనికంటె ఆశ్చర్యకరమగు విషయము మరియొకటి ఏమి కావలయును.
- బ్రహ్మదేవునిచే త్రిప్పబడుచున్న ఈ సంసార చక్రమునందు కాంతాకనకము అనునవి రెండు కలవు. ఆ రెండిటియందు ఎవడు ఆసక్తుడుకాడో ఆ నరుడు నారాయణుడగును.
- వాహనములు, ధనము, అశ్వములు, ఏనుగులు, రాజ్యము గలిగియున్నను ఏమి ప్రయోజనము? పుత్రులు, భార్య, మిత్రులు, పశువులు, గృహము మొదలగునవి ఎన్నివున్నను ఏమి లాభము? ఇవియన్నియు క్షణభంగురములని తెలిసికొని మనసులో కూడా వాటి విషయమైన చింతనలను దూరముగా విడిచిపెట్టి ఆత్మోద్ధరణకై గురువు చెప్పిన విధానముగా ఆ పరమేశ్వరుని సేవింపుము.
- ఓ పరమేశ్వరా ప్రతిదినము ఆయుస్సు నశించుచున్నది. క్షణ క్షణము యౌవనము గతించుచున్నది. పోయిన దినములు తిరిగి రాలేవు. కాలుడు (యముడు) జగత్తును భక్షించుచున్నాడు. ధన సంపదలు నీటి తరంగమువలె చపలములు. జీవితము మెరుపువలె చంచలమైనది. అందువలన మిమ్ము శరణుబొందుచున్నాను. దయతో నన్ను రక్షింపుడు.
- పరాక్రమశాలియగు సింహము బోనును భేదించి బయట పడినట్లు, వేలాది వేల జనులలో ఒకానొక ధీరుడు మాత్రమే భార్య, పుత్ర, గృహ, విత్త, సంసారాది వాసనలుయను వలను భేదించి బయటపడును.

- గడచిన రాత్రియే వచ్చుచున్నది. మరల గడచిన దినమే వచ్చుచున్నది. తినిన దానినే తింటూ అనుభవించిన భోగములనే మరల మరల అనుభవిస్తూ, చేసిన వ్యవహారములనే చేస్తూ అహో, సంసార మోహముచే మోసపుచ్చబడి మనము సిగ్గు నొందకున్నాము గదా.
- మానవుడు మరణించినపుడు భార్య, పుత్ర, గృహ, ధన, పశు, క్షేత్ర, ధాన్యాది సంపదలు గాని, వివిధములగు ఆభరణములు గాని, వస్త్రములుగాని, నానారకములగు విద్యలుగాని రక్షింపవు. ఇవియన్నియు వ్యర్థమే. మరణసమయమున, ఆ పరమేశ్వరుడొక్కడే సహాయము చేయును. కావున ఇహ సంపదలపై విరాగమునొంది ఆ పరమేశ్వరుని భజించవలెను.
- ఎవనిచే కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను ఈ అరిషడ్వర్గమును జయింపబడలేదో అట్టివానికి ఏ మాత్రము శాంతి లభించదు. వాటిని జయించినవాడు తప్పక శాంతిని పొందగలడు.
- తీవ్ర మోక్షేచ్ఛగలవాడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి విషయములనెడి విషమునుండి తన బుద్ధిని మరల్చుకొనడో అట్టివానికి శాంతి లభించదు.
- ధ్యానము చేయునపుడు హస్త పాదములను సంయమించి, జ్ఞానేంద్రియములను నిగ్రహించి, నాసికాగ్రమున దృష్టిని నిలిపి, మనస్సును సర్వవిషయములనుండి మరలించి, ఓంకారముచింతించుచు, యోగధారణగల వాడైన క్రమముగా ఆత్మ సాక్షాత్కారము పొందును.
- అబద్ధపు సాక్ష్యము చెప్పువారును, జివ్హా, ఉపస్థా మొదలగు యింద్రియములను నిగ్రహించనివారును, జారులును, చోరులును, చెడుకర్మలు చేయువారును, వీరందరు రాక్షసాంశముచే జన్మించినవారని తెలుసుకొనవలెను.



- ఎవరు సాధువువలె వేషభాషలు గలిగియుండి, సాధనలు చేయకుండ విడిచిపెట్టినవారందరును రాక్షసాంశజులని ఎరుగుము.
- కామాది విషయసుఖములందు కోరిక అనుభవించిన కొలది పెరుగునేకాని తరగదు. అగ్నిలో నేయివేసిన కొలది అగ్నిజ్వాలలు పెరుగునేగాని తగ్గవు కదా.
- ఓ మనస్సా క్షేమధామమగు హరినామమును క్షణక్షణము స్మరింపుము. ఏలయనగా ముక్కుద్వారా బయటకు వెళ్లిన శ్వాస (గాలి) మరల లోనికి రాగలదను విశ్వాసము ఎక్కడిది.
- శరీరము ఆరోగ్యముగా ఉన్నప్పుడే రోగములు రాకపూర్వమే, వృద్ధాప్యము దాపురించకముందే, ఇంద్రియములు శక్తివంతములుగా వున్నపుడే, ఆయుష్షు క్షీణించకపూర్వమే, ఆత్మశ్రేయస్కరములగు ఆధ్యాత్మిక సాధనలను మిగుల ప్రయత్నముచే చేయవలయును. అటులగాక వార్ధక్యము వచ్చిన పిదప రోగములచే బాధపడుచు సాధనలు సలుపుటకు ప్రయత్నించినచో ఇల్లు కాలుచుండగా బావి త్రవ్వుటకు ప్రయత్నించినవానివలెనే యుండును.
- ఫలమునకు పుష్పమే కారణము. ఫలము కాగానే పుష్పము తనంతటనదియే తొలగిపోవును. అటులనే జ్ఞానమునకు కారణము నిష్కామకర్మ. జ్ఞానము కలుగగనే కర్మ తనకు తానే తొలగిపోవును.
- ఓంకారమునకు మించిన మంత్రములేదు. ఆత్మకంటే శ్రేష్ఠమగు దేవుడు లేడు. ఆత్మపూజకు సమమగు పూజలేదు. తృప్తికి మించిన సుఖము లేదు.
- ఆత్మా, నాత్మ వివేకము చేతనే సంసార బంధము మాయమై తొలగిపోవును. అదిలేక కోటి జన్మలకైనను బంధము తొలగదు.

- ఊకచే బంధింపబడినపుడు వడ్లనియు, ఊకతొలగిపోగానే బియ్యమనియు చెప్పబడును. అటులనే కర్మలచే బంధింపబడినపుడు జీవుడనియు, ఆ కర్మలు నశించగనే సదాశివుడనియు చెప్పబడును.
- ఉపాధ్యాయుడు ఎల్లపుడు ఈ పాఠశాలనాదే అని చెప్పుచు కూడా మనస్సునందు మాత్రము ఇది నాది కాదు. ప్రభుత్వముది అను నిశ్చయ భావము కలిగియుండును. అదే విధముగా మానవుడు కూడా భార్యా, పుత్ర, గృహ, విత్తాదు లను నాది, నా వారు అని చెప్పుచున్నప్పటికిని, మనస్సునందు మాత్రము ఏదియు నాదికాదు, ఎవరును నావారు కారు. ఇదియంతయు భగవంతుని మాయా విలాసవైభవమని నిశ్చయము గలిగియుండవలెను.
- మనస్సులో విషయ చింతనలు లేకుండా యుండడమే ధ్యానము. కామక్రోదాది మనో మాలిన్యములను తొలగించడమే స్నానము. ఇంద్రియములను నిగ్రహించడమే శుచిత్వముయని తెలుసుకొనవలెను.
- దృష్టిని జ్ఞానమయముగా జేసి జగత్తంతయు బ్రహ్మమయముగా చూడవలెను. అట్టి దృష్టియే పరమశ్రేష్టము.
- ఆ పరమాత్మయే నేనుయని చింతించుటయే ధ్యానము మరియు నేను ధ్యానము చేయుచున్నాను అను భావనను మరచుటయే సమాధియనబడుచున్నది.
- హృదయమునందు కోరికలు కలిగియుండడమే సంసారమనియు, ఆ కోరికలు ఏ మాత్రము లేక యుండుటయే మోక్షమని మహాత్ములచే చెప్పబడినది.
- నిర్విషయమగు మనస్సు మోక్షము కలిగించుచున్నందున ముముక్షువగువాడు ఎల్లప్పడు మనస్సును, నిర్విషయముగా వుండునట్లు ప్రయత్నము చేయుచుండ వలయును.



- బ్రహ్మజ్ఞానముగలవాడు శరీరమును కాశీలో విడిచినను, చండాలుని యింటియందు విడిచినను మోక్షమునే పొందును. ఏలయనగా అతడు జ్ఞానమును పొందినపుడే ముక్తుడయ్యేను.
- బ్రహ్మజ్ఞానియగువాడు ఆరోగ్యముగా వుండిగాని, అనారోగ్యముగా వుండిగాని ప్రపంచములో తిరుగుచుకాని, కూర్చొనియుండిగాని, మూర్ఛనొందిగాని ప్రాణమును ఏవిధముగా వదలినను మోక్షమునే పొందును.
- బ్రహ్మచర్యము పాటించుటచే ఆయుస్సు, తేజస్సు, బలము, జ్ఞాన సంపద గొప్పయశస్సు, పుణ్యము, భగవదనుగ్రహము మొదలగునవి కలుగును.
- అతిఆశ మిక్కిలి దుఃఖమును కలిగించును. నిరాశ సుఖమును కలిగించును. అందువలన సాధువులందరు నిరాశనే ఆశ్రయించుచున్నారు. ఎవడు జ్ఞానమను ఖడ్గముచే ఆశను తెగనరకునో వాడే పరమ పదమును పొంది ధన్యుగడును.
- శూద్రుడు సుగుణవంతుడై సదాచార శీల సంపన్నుడైన యెడల బ్రాహ్మణుడని చెప్పబడును. జన్మవలన బ్రహ్మణుడుగా జన్మించినప్పటికిని, సదాచారము లేనివాడైనచో శూద్రుని కంటే తక్కువ వాడేయగును.
- సూర్యుని నుండి ఆరోగ్యమును,, అగ్నిహోత్రుని నుండి ధన సంపదలను, మహేశ్వరుని నుండి ఆత్మజ్ఞానమును, జనార్ధనుని నుండి మోక్షమును కోరుకొనవలెను.
- హంస తెల్లగానేయుండును. కొంగ కూడా తెల్లగానే యుండును. వీటికి రంగుయందు ఏ మాత్రము బేధము లేదు. కాని పాలను నీరును విభాగము చేయునపుడు హంస ఏదియో, కొంగ ఏదియో వెంటనే తెలియును.
- కాకి నల్లగనే యుండును, కోకిలకూడా నల్లగనే యుండును.

ఈపిక కాకములకు రంగుయందు భేదము కనబడదు. కాని వసంతకాలమురాగానే కోకిల ఏదియో, కాకి యేదియో స్పష్టముగా తెలియును.

- అసూయ, ద్వేషము, మాత్సర్యములను వదలి, నీకు ప్రాప్తమైన దానితో తృప్తిపొంది, లోకోపకారమైన పనులు చేయడమే ఉత్తమ మానవ లక్షణం.
- ఉన్నతమైన మనస్సుకలవాడు ఎప్పుడు ఒకరిని అవమానించడు. ఎన్ని అవమానాలు వచ్చినా సహిస్తాడు.
- ఆశలతోనే జీవితము గడిపేవారు, ఉపవాసాలతో మరణిస్తారు.
- పురుషులకు అన్ని సంపదల కంటే మించిన సంపద మంచి భార్య, చక్కటి ఆరోగ్యం.
- ముక్తికి ద్వారం మహాత్ములసేవ.
- మహాత్ముల సందర్శనం, వారి సాంగత్యాలే మనశ్శాంతికి మూలం.
- సత్సంగము ఈశ్వరానుగ్రహము వలన లభిస్తుంది. దుస్సంగము నుండి తప్పించుకొనుట నీ ప్రయత్నం.
- ఎవరైనా నిన్ను నిందించినచో దానిని నీవు సహించు తద్వారా నీ పాపము నిందించినవానికి చెందుతుంది. నిన్ను నిందించిన వాని పుణ్యము అనాయాసంగా నీకు లభిస్తుంది.
- మూర్ఖుడైన శిష్యునకు ఉపదేశించడము వల్ల, చెడ్డస్త్రీని కాపాడడం వలన, శత్రువులతో కలసి వ్యవహరించడము వలన పండితుడు పతితుడౌతాడు.
- చెడ్డ భార్య, కుత్సితుడైన మిత్రుడు, ఎదురు సమాధానము చెప్పే సేవకుడు సర్పం ప్రవేశించిన యిల్లు. ఇవియన్నియు మృత్యుదాయకాలే.
- కాములకు కామినియే అమృతం. లోభులకు ధనమే అమృతము. సన్యాసులకు త్యాగమే అమృతము.



- ఆహారం కొరకు నిందితం కాని కర్మచేయవలె. బ్రతికివుండే దాని కొరకు ఆహారం సేవించవలెను. తత్త్వజ్ఞానం సంపాదించుట కొరకు బ్రతికి వుండవలె. పునర్జన్మ పొందకుండుటకై తత్త్వజ్ఞాని కావడానికి కృషిచేయవలెను.
- రాత్రి పూట చంద్రుడు వెలుగు, పగలు సూర్యుడే దీపం. ముల్లోకాలకు ధర్మమే దీపం. సుపుత్రుడు కులానికే దీపం.
- ఈ మనిషి జన్మ మోక్షానికి ద్వారము. మాటి మాటికి రమ్మంటే రాదు. వచ్చినపుడే సార్థకం చేసుకోవాలి. జీవితము యొక్క విలువ భోగములో కాదు, యోగముతో గడపాలి.
- పచ్చికుండ దేనికీ పనికి రాదు. కాలిన తరువాతనే అది పనికివస్తుంది. ఈ మాంసమయ శరీరము బంధమును కలిగిస్తుంది. మంత్రమయ శరీరము బంధమును వదిలిస్తుంది.
- ధనంపోతే తిరిగి సంపాదించుకొనవచ్చును. ఆరోగ్యముపోతే నయము చేయించుకొనవచ్చును. పోయిన కాలము తిరిగిరాదు. కాలం అమూల్యమైన ధనం. దానిని పాదుపుగా వాడుకొనండి.
- పరోపకారం చేయగలిగినవాడే సాధువు. కాలము యొక్క విలువను గ్రహించలేనివాడు అంతిమదశలో తీవ్రముగా పశ్చాత్తాపము పడతాడు.
- ఆధ్యాత్మిక గ్రంధాలను పఠించుట, ఆధ్యాత్మిక చింతన, దైవభక్తి గల వారితో మైత్రిచేసుకో, సత్సంగములో తప్పక పాల్గొనాలి. ఇవి దైవ సన్నిధికి మార్గము చూపుతాయి.
- పశువుగడ్డి తినగానే పాలు యివ్వదు. అలాగే పాపపునులకు ఫలం వెంటనే కనబడదు. కొంతకాలము తరువాత ఆపాప ఫలం అనుభవింపక తప్పదు.
- జీవితం స్థిరమైనది కాదు. యౌవ్వనం కూడా ఎల్లకాల ముండదు. భార్యా బిడ్డలు కలకాలం వుండరు. లోకంలో

స్థిరమైనవి రెండే రెండు. ఒకటి తను చేసిన ధర్మం, రెండవది కీర్తి.

- మనిషి ముసలివాడై చావుకు సిద్ధముగా వున్నా, అతని ఆశమాత్రం చావదు. దుఃఖమునకు కారణము ఆశ.
- ఇతరుల సహాయముతో ఎల్లకాలం జీవించుటకంటే, మనం మనకాళ్లపై నిలుచుని చనిపోవడం మంచిది.
- అహంకారం, మమకారం అంతరించినపుడే పరిపూర్ణ శాంతి లభిస్తుంది.
- పరస్త్రీని తల్లిగాను, పరధనాన్ని మట్టిపెళ్లలా, సకల ప్రాణులు ఆత్మ సమానంగా చూసేవాడే సత్యాన్ని తెలుసుకుంటాడు.
- శరీరమునకు వ్యాయామం ఎలాంటిదో మనసుకు ఆత్మ విద్య అలాంటిదే. బాహ్యవిద్యతోపాటు, ఆత్మవిద్య కూడా వుండాలి. అదేనిన్ని గమ్యమును చేర్చగలదు.
- ప్రేమలేనిమాట పెదవిపైనే వుంటుంది. తప్పుచేయడం మానవ లక్షణం. క్షమించడం దైవ లక్షణం.
- శీలములేని మనిషి చిల్లులకుండ వంటివాడు. శీలమే శిరి. సదాచారమే సంపద. జ్ఞానమే ఐశ్వర్యము.
- పురాణ పఠనం చేసినా, ఉత్తమ వంశములో జన్మించినా ప్రయోజనం లేదు. మనిషికి అన్నిటికి మించినది శీలం.
- నదిని దాటిన తరువాత నావతో పనిలేనట్లు తన పనికి సహాయపడిన వారిని సామాన్యులు మరచిపోతూ వుంటారు.
- భోగములు మబ్బులోన మెరయు మెరపువలె అతి చంచల మైనది. జీవితము గాలిచే రెపరెపలాడుతూ, తామరాకుమీద నీటిబిందువలె నిలుచునది కాదు. పడుచుదనపు కోరికలు స్థిరములు కావు. ఈ విషయమును గ్రహించి, మనస్సును దైవమార్గములో జపము, ధ్యానమున మనసును దైవ చింతనామార్గములో నడపడము మంచిది.



- ముసలితనము ఆవరించకముందే ఇంద్రియముల పటుత్వము తగ్గక ముందే ఆయుష్షు క్షీణించకముందే, ఈ శరీరము ఆరోగ్యముగా వున్నపుడే వివేకవంతుడు మోక్షప్రాప్తికై మహా ప్రయత్నము కావింప వలెను. సర్వము ఉడిగిన తరువాత మోక్షమునకై ప్రయత్నించుట, ఇల్లు తగులబడిపోవు చుండగా చల్లార్చుటకై నూయి త్రవ్వుట మొదలిడినట్లు వుండును.
- భోజనము చేయునపుడు ఎక్కువగా మాట్లాడరాదు. ఎవరిని నిందించరాదు. భుజించిన పిమ్మట నూరు అడుగులు నడుచుట ఉత్తమము. అందువలన తినిన ఆహారము బాగుగా జీర్ణమగును. ఆయుర్ధాయము వృద్ధియగును.
- తల్లిదండ్రులను గౌరవించలేని కుమారుడు, వారి ఆశీస్సులను పొంద జాలడు. కాని వారిని గౌరవిస్తూ వారి సేవలు చేస్తూ విధేయుడై వుండువాడే తన పిల్లల నుంచి కూడా అలాంటి గౌరవం పొంద గలుగుతాడు.
- నిగ్రహం కొరకే విగ్రహారాధన.
- ఆగ్రహముతో పలికిన పలుకులు వాడిగల కత్తులకంటే తీవ్రమైనవి.
- మీ మనస్సులో ఉత్సాహం, గురుభక్తి, భగవంతునియందు విశ్వాసం ఎంతవరకు నెలకొనివుంటాయో అంతవరకు మిమ్మల్ని ఏదీ అణచి వేయలేదు.
- తప్పు చేయడం మానవ సహజం. కాని ఆ తప్పును సరిదిద్దు కోకపోతే ముప్పు తప్పదు.
- పరదూషణ, చాడీలు చెప్పడం, కొందరికది కాలక్షేపంగా వుంటుంది. దాని ఫలితం తనకున్న పుణ్యం కాస్తపోవడమే గాక అవతలివారి పాపంలో పాలుపంచుకోవడమే.
- స్వార్థాన్ని వదులు, కోపాన్ని అణగద్రొక్కు, నీకు తెలిసిన మంచి విషయములు పదిమందికి పంచిపెట్టు. పంచిన కొద్దీ

పెరిగేది మంచితనమొక్కటే.

- సజ్జనులు తాము కష్టము ననుభవిస్తూ ఇతరులకు సుఖాన్ని కలుగ జేస్తారు.
- ఇతరుల గురించి బాధపడినా ప్రయోజనము లేదు. నీ గురించి నీవు బాధపడు. నీవెక్కడ కూర్చున్నా నడుస్తున్నా నీ ఆయుష్షు గడిచి పోతూనే వుంటుంది. సత్వరమే ఈ సత్యాన్ని తెలుసుకో.
- నీవు ఎవరికైనా మాట యిచ్చినచో దానిని పూర్తిచేయుము.
- ఎంత అపవిత్రుడైనను భగవంతుని నామమును ఉచ్చరించి నంత మాత్రమునవాడు బాహ్యాభ్యంతరముల యందు పవిత్రుడగును.
- ఇతరుల డబ్బును కాజేయడం, పరకాంతల పొందు కోరడం, స్నేహితులను అవమానించడం, ఈ మూడు దోషాలు ఎవరినైనా నాశనం చేస్తాయి.
- మహాత్ములు ఇతరుల దోషాలను వెదకరు. హీనులకు ఇతరుల దోషాలను వెదకడమే ముఖ్య వ్యాపారం.
- లోకంలో ఎక్కువ కష్టమైనవి రెండు. 1) పేరు ప్రతిష్ఠలు 2) సంపాదించుకోవడం, 2) సంపాదించుకున్న వాటిని నిలబెట్టుకోవడం.
- కోపం తెచ్చుకోవద్దు. ప్రమాణాలు చేయవద్దు. ఎన్నడూ నిష్ఠూరంగా మాట్లాడవద్దు. కోపం వలన పుణ్యము తరుగును.
- ప్రతి మనిషి ఇతరులను ప్రేమిస్తూ, తాను యితరులచేత ప్రేమించ బడడమే ప్రేమ. డబ్బుకు అందుబాటులో లేనిది, డబ్బుతో పొందలేనిది ప్రేమ ఒక్కటే.
- అధిక ఆశ మానవాళికి ఎంతోచేటును కలిగిస్తుంది. దుఃఖాన్ని చేకూర్చుతుంది.
- మృదువుగా మాట్లాడం నేర్చుకో. అప్పుడు పరమపావనమైన



ఆత్మశాంతి దివ్యప్రేమను అనుభవించి, ఆనందించగలవు.

- కోపం, ఉద్రేకం, మనసులో ఆందోళన పెచ్చు పెరిగిపోతే మాట్లాడ కుండా మౌనంగా ఒక పూట పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి.
- మతం అంటే మానవుని మనస్సుకు శాంతినిచ్చే మార్గం.
- దానబుద్ధి, సత్యవాక్కు, అహింస, ప్రియమైన వాక్కు, వీటిని అభ్యసింప దగిన సద్గుణాలు.
- శరణు జొచ్చిన వారిని రక్షించుట కంటే పుణ్యకార్యం వేరొకటి లేదు.
- అతిథులను ఆదరించుట కంటే గృహస్థులకు వేరే ధర్మము లేదు.
- నీవు చేసిన కర్మఫలం, ఎప్పటికైనా నీకే తిరిగి వచ్చును.
- సత్యము భగవంతుని స్వరూపము. సత్య స్వరూపుడే భగవంతుడు. సత్య సంధత కలిగినవారికే భగవంతుడు దర్శనమిస్తాడు. అసత్యము కంటే పాపము లేదు.
- దైవీ స్థితి నీవు పొందాలనుకుంటే ఎన్ని కష్టములు వచ్చినా కూడా శాంతమును, ఆనందముతో నుండవలెను.
- వెయ్యియజ్ఞాలు చేసినప్పటికి, క్రోధముండిన యెడల ఫలితం దక్కదు. క్రోధానికి లొంగనివారే ప్రపంచములో గొప్పవారు. ఎదుట వారికి ఆగ్రహం కలిగినా, వారు పరుషంగా మాట్లాడినా, మౌనంగా వుండేవారే ధర్మాత్ములు.
- మానవుడు అరికట్టవలసిన వేగములు :- వాక్కు యొక్క వేగము, మనస్సు యొక్క వేగము, క్రోధము యొక్క వేగము, వాక్కు యొక్క వేగము, ఉదరము యొక్క వేగము, జననేంద్రియములయొక్క వేగము, అను ఈ ఆరువేగాలను అరికట్టగలిగినవాడు అన్ని లోకాలను జయించినవాడగును.

◆ నీవు యితరులకు చేసిన ఉపకారం, యితరులు నీకు చేసిన అపకారం మరచిపోవాలి. మృత్యువుని దేవుని గుర్తుంచుకోవాలి.

◆ ఆశయే అన్ని అనర్థాలకు కారణము. ఆశయే దుఃఖానికి కారణం, తృప్తియే ఆనందమునకు మూలము. జీవహింస మహాపాపము. అహింసయే పరమధర్మము.

◆ మంచివారి స్నేహము మనోమాలిన్యమును పోగొట్టును. సర్వబంధములను తొలగించును. బంధము తొలగిన భ్రాంతులు తొలగును. భ్రమతొలగిన బ్రహ్మదర్శనమగును.

◆ సద్గురుబోధ, సత్సాంగత్యము, భగవన్నామ జపము, ధ్యానము, నాలుగు నిన్ను దైవ సన్నిధికి చేర్చగలవు.

◆ చవిటినేలయందు వర్షించిన జలము, మూర్ఖునకు చేసిన ఉపదేశము, అయోగ్యునకు చేసిన దానము వెంటనే నశించును.

◆ మాటదుడుకుతనాన్ని, మనసులోని ఆవేశాన్ని, జిహ్వ చాపల్యాన్ని తిండిపోతుతనాన్ని, గుహ్యేంద్రియ వేగాన్ని నిగ్రహించిన ధీరుడు, ఈ లోకాన్నంతా జయించగలడు.

◆ నీవు మాట్లాడే మాట (ఆచి, తూచి) జాగ్రత్తగా మాట్లాడుము. అవసర మున్నప్పుడే మృదువుగా, మితముగా, నెమ్మదిగా మాట్లాడుము. మిగతా సమయము మౌనముగా వుండుము. మౌనమొక రహస్య శక్తియై యున్నది.

◆ నిత్యము ఆహారాన్ని స్వీకరించునట్లు, సత్సాంగత్యమును ప్రతి రోజూ చేస్తూ వుండాలి (అనుసరిస్తూ వుండాలి)

◆ నీ ఆదాయములో అయిదవభాగం దానము చేయి. నీ సంపాదనలో ఏమేమి పాపము కలిసి వుంటుందో? ధనమంతా పవిత్రముగా వుండదు.

◆ శిష్టాచారం, భూతదయ, మృదుభాషణ, ధర్మనిరతి కలవారు దైవాను గ్రహానికి పాత్రులవుతారు.



◆ నోరులేని మృగాలపట్ల సానుభూతి. దయ చూపడం మనిషిగల మహోదాత్త సుగుణాలలో ఒకటి.

◆ ఆహారశుద్ధి, వస్త్రశుద్ధి, నివాసశుద్ధి, సంసర్గశుద్ధి, వాక్శుద్ధి, క్రియాశుద్ధి, ధ్యానశుద్ధి, సంకల్పశుద్ధి అను ఈ ఎనిమిది శుద్ధులు ఆత్మశుద్ధికి కారణములు.

◆ సదాచారము కల్గిన బ్రాహ్మణులు, సచ్ఛీలము కలిగిన సతీమణులు, వీరి ఆధారముతోనే ఈ భూమి నిలిచియున్నది.

◆ ఎంత దరిద్రములోవున్నా తనకు ఉన్నదానిలో కాదనకుండా దానం చేయడం గొప్ప విషయం.

◆ నీ దగ్గర సంపద వున్నయెడల ఆశ్రితులకు, సాధువులకు, అతిధులకు, అన్నదానమునకును, సత్కార్యములను, తీర్థయాత్రలకు, మహాత్ముల సేవకు, తల్లిదండ్రుల సేవకు వినియోగించు. మిగిలిన భాగము నీ వారసులకును, నీకు వృద్ధాప్యముపైబడిన తరువాత దానిని ఉపయోగించుకో

◆ ఎక్కువగా తెలిసినవారు తక్కువగా మాట్లాడుతారు.

◆ డబ్బు ఖర్చుచేస్తే మందులు దొరుకుతాయి. ఆరోగ్యము దొరుకుతుందా? ధనం ఖర్చుపెట్టి పుస్తకాలు కొనవచ్చు. కాని జ్ఞానం కావాలంటే కష్టపడి చదివేతీరాలి.

◆ మూర్ఖుడైన శిష్యునకు ఉపదేశము చేయడంవల్ల చెడ్డస్త్రీని కాపాడుటం వల్ల శత్రువులతో కలిసి వ్యవహరించడం వలన పండితుడు పతితుడౌతాడు.

◆ సజ్జన సాంగత్యము బుద్ధిలో వున్న మలినాన్ని పోగొడుతుంది. సత్యం పలికిస్తుంది. గౌరవం కలిగిస్తుంది. పాపాన్ని హరిస్తుంది. మనస్సును నిర్మలముగా వుంచుతుంది. అందుచే సజ్జన సాంగత్యము వదలకండి.

◆ పెద్దలతోను, మహాత్ములతోను పూజ్యభావము కలిగి వుండాలి. దీనులను చూసి వారికి సహాయము చేయవలెనను బుద్ధి

పుట్టాలి. మంచిపనులు చేయువారిని చూసి మనము కూడా మంచి పనులకు సహాయపడాలి. దుర్మార్గులకు దూరముగా వుండాలి. ఇవి మోక్షమార్గమునకు ముఖ్య సాధనములు.

- దుష్టులతో స్నేహము చేయరాదు. వైరమూ వుండకూడదు. బొగ్గు ముట్టుకుంటే దానికి నిప్పు ఉన్నట్లయిన చేయి కాలుతుంది. అది చల్లారిన చేతికి మసి అంటుకుంటుంది.
- వేయి తప్పులు చేసినవాడైనా, ఆధ్యాత్మిక రంగములో ప్రవేశించిన పైకి వస్తాడేమోగాని స్వార్థపరుడు మాత్రం పైకిరాలేడు.
- కల్లుసారాయి, బ్రాందిలాంటి మద్యపానం సేవిస్తే అవిలోనికి పోయి నీలో వున్న వివేకాన్ని (తెలివిని) బయటకు నెట్టివేస్తాయి.
- మద్యపానం మొదట్లో ఆనందాన్ని, ఉత్తేజాన్ని ఇస్తుంది. తరువాత అలవాటుగా, గ్రహపాటుగా మారుతుంది. వ్యసనమై కూర్చుంటుంది. తరువాత తనకు బానిసగా చేసుకొంటుంది. ఇతరులకు హాని కలిగిస్తుంది.
- విద్య చెప్పిన గురువు ఎదుట, మహాపండితులు, జ్ఞానులు, కన్నతండ్రి, గౌరవించదగు పెద్దల ఎదుట వినయముగా వుండాలి.
- ఇతరుల సొమ్మును దొంగిలించడం, పరభార్యను అపహరించడం స్నేహితులను మోసము చేయడము అనే దోషాలు మానవుని ధర్మాన్ని ఆయుష్షును, కీర్తిని నాశనం చేస్తాయి.
- కుటుంబములోని వృద్ధులను, ఆపదలోవున్నవారిని, దరిద్ర బాధతో వున్న మిత్రులను, సంతానము లేకుండా భర్తను కోల్పోయిన సోదరిని ఆదరించి పోషించాలి.
- మిత్రద్రోహము చేసినవాడు, గురువుని గౌరవించనివాడు, తన తెలివి తేటలతో శాస్త్రాలకు వేరు అర్థములు, విపరీతార్థములు చెప్పువాడు పాతకుడు.



- నిత్యము ప్రాతఃకాల స్నానము వలన బలం, రూపం, కాంతి, మృదు స్వభావం, చక్కని కంఠస్వరం సిద్ధిస్తాయి.
- దానము తీసుకొనడములో వ్యక్తి బంధనములో పడిపోతాడు.
- ఆహారం కొరకు నిందితం కాని కర్మచేయాలి. బ్రతికి వుండే దాని కొరకు ఆహారం స్వీకరించాలి. తత్త్వజ్ఞానం సంపాదించుట కొరకు బ్రతికి వుండాలి. పునర్జన్మ పొందకుండుట కొరకు, తత్త్వజ్ఞానివి కావడానికి కృషిచేయాలి.
- కృషిచేస్తే కరువు వుండదు. జపం చేస్తే పాపం వుండదు. మౌనం వహిస్తే విరోధముండదు. జాగ్రత్తపడితే జడుపు వుండదు.
- విద్యను మించిన సంపదలేదు. అపకీర్తిని మించిన చావు లేదు.
- అడుగున సూదిబెజ్జమంత చిల్లువున్నా కుండలో నీరంతా కారిపోతుంది. అలాగే సాధకుడిలో ఏ మాత్రము లోపమున్నా అతని సాధన యావత్తు బూడిదలో పోసిన పన్నీరులాగా అవుతుంది.
- దీపానికి చమురు ఆధారమైనట్లు, జ్ఞానజ్యోతికి దైవభక్తి ఆధారం.
- దారి తప్పి నడిస్తే దేహానికి ఎంత నష్టమో, నీతి తప్పి నడిస్తే మాన వత్వానికి అంత ప్రమాదం.
- క్రోధము దుఃఖాన్ని కలిగిస్తుంది. ఆశలేనివాడే సుఖవంతుడు.
- మానవుని కీర్తికి ఆశ్రయం దానం. లోకానికి ఆధారం సజ్జనులు.
- మతధర్మాలను గురించి చెప్పడం సులభం. వాటిని ఆచరణలో పెట్టడం కష్టం.
- అహంకారం మబ్బువంటిది. అది భగవంతుని దర్శనమవకుండా అడ్డు తగులుతుంది. అహంకారం నశించి మనస్సు పరతత్త్వమందు లయించినపుడే ముక్తి లభిస్తుంది.

- పులిలాంటి దుష్ట జంతువులలో కూడా దేవుడున్నాడు. కాని వాటి దగ్గరకు మనం వెళ్లకూడదు. అలాగే దుర్మార్గులలో కూడా దేవుడున్నాడు. కాని వారి సాంగత్యం పనికిరాదు.
- సముద్రములోని ముత్యాలు ఒకసారి మునిగితే లభ్యంకావు. వాటికై మళ్లీ మళ్లీ ప్రయత్నించాలి. అలాగే భగవంతుని సాక్షాత్కారానికై పదే పదే ప్రయత్నించాలి.
- దుఃఖం వల్ల ధైర్యం, తెలివి, విద్య అన్నీ నశిస్తాయి. దుఃఖంలాంటి శత్రువు మరియొకటిలేదు.
- ధర్మాచరణమే మానవుడు కడతేరుటకు ఏకైక మార్గమని యెరుంగ వలయును. ధర్మమును ఉల్లంఘించి, ఎవరును దైవమును చేరలేరు.
- అంత్యకాలమందు జీవుని రక్షించునదేదియో ముందుగనే యోచన చేసి దాని విషయమై తగు జాగ్రత్తలు తీసుకొన వలయును.
- అపజయం వచ్చిందని నిరాశపడకు, అపజయం విజయానికి సోపానం లాంటిది.
- ఎన్నడును ఎవరిని నొప్పింపకుము. కోపమును, ప్రేమ, క్షమ, దయచే నిగ్రహింపుము.
- నీలో మంచిని ప్రపంచానికి పంచు. అప్పుడు ప్రపంచము లోని మంచి అంతా నీకే లభిస్తుంది.
- శీలం లేని మానవుడు (సంస్కారం) లేని మానవుడు జీవించివున్నా మృతప్రాయుడే.
- గర్వం, అహంకారం ఈ రెండిటి వల్లనే మానవుడు గుడ్డివాడు అవుతాడు.
- ఏదైనా యివ్వగలిగితే నీవు పొందగలుగుతావు.
- క్షమాగుణం ఎక్కడ వుంటుందో అక్కడే ప్రశాంతత వుంటుంది.



- జీవితం విలువైనది. కాలం విలువైనది. కాబట్టి జీవితాన్ని కాలాన్ని వృధాచేయకు.
- బాధపడేవారి పట్ల కరుణజూపు. దుష్టుల యెడల ప్రేమ, దయ ప్రదర్శించాలి. నిన్ను హింసించే వారిని క్షమించు.
- సజ్జన సాంగత్యము వల్లనే సమస్త సుఖాలు చేకూరుతాయి. దుర్జన సాంగత్యం వల్లనే అన్ని అనర్థాలు కలుగుతాయి.
- విద్య దాచి వుంచిన ధనం లాంటిది. కీర్తి సుఖాన్ని తెచ్చిపెడుతుంది. విద్య పంచితే తరిగేది కాదు. విద్య ఏ దేశములో వున్నా బంధువులా సహాయపడుతుంది. విద్యలేనివాడు పశుప్రాయుడే.
- చెట్టు తొర్రలో పుట్టిన నిప్పు, ఆ చెట్టు ఒక్కదాన్నే కాల్చివేస్తుంది. కాని వంశములో పుట్టిన చెడ్డవాడు, ఆ వంశమంతటినీ నాశనం చేస్తాడు.
- సోమరిగా, అజ్ఞానిగా నూరేండ్ల బ్రతకడం కన్నా కార్యశీలిగా, జ్ఞానిగా ఒక్క రోజు బ్రతకడం మేలు.
- అప్పుడే పిండిన పాలు వెంటనే పెరుగు అవదు. అలాగే పాపపు పనులు చేసేవాడు వెంటనే ఆ ఫలాలను అనుభవించడు. కొంతకాలము పడుతుంది.
- ఇంటి కప్పు గట్టిగా వుంటే ఇంట్లో వర్షపు చుక్కలు పడవు. నీలోచిత్తం దృఢముగా వుంటే చెడు ఆలోచనలు ప్రవేశింపవు.
- ఆపత్కాలములో ధైర్యం, సంపదలు ఉన్నప్పుడు ఓర్పు, పండిత సభలో మాట్లాడే నేర్పు, కీర్తి కాంక్ష సచ్ఛాస్త్ర పఠనం, ఇవి మహాత్ముల సహజ గుణాలు.
- ఇంద్రియాలను జయించకుండా కాషాయ బట్టలు కట్టిన వాడు మోసకారి.
- దైవభక్తి, గురుభక్తి వున్నవారికి సమస్త విషయాలూ స్పష్టముగా తెలుస్తాయి.

- వేషభాషల్లో శుచిగా వున్నంతమాత్రాన ప్రయోజనం లేదు. అంతఃశుద్ధి కావాలి. హృదయం నిర్మలం కావాలి.
- కూరల్లో నానుతూ వున్న గరిటె, వాటి రుచిని గ్రహించలేదు. అలాగే దుష్టుడు ఎల్లప్పుడూ బుద్ధిమంతుల మధ్య తిరుగుతూ వున్నా వారి గుణములను గ్రహించలేడు.
- సత్ప్రవర్తనతో తండ్రిని సంతోషపెట్టువాడే కుమారుడు. భర్త హితాన్ని కోరేదే భార్య. ధనం వున్నప్పుడు ధనం లేనప్పుడు సమానముగా స్నేహము చేయు స్నేహితుడు.
- పూలరాశిలో నుంచి మంచి పూలను ఏరి మాలగ్రుచ్చు తాము. అలాగే లోకంలో వున్న మంచి విషయాలనే గ్రహిస్తాడు ఉత్తముడు.
- పాపకార్యములనుండి మళ్ళించండి, మంచి పనులు చేయడానికి పురికొల్పడం, రహస్యాలు దాచివుంచడం, ఆపదలో విడిచిపెట్టకుండా వెంట వుండడం, ఇవన్నీ నిజమైన మిత్రుడి లక్షణాలు.
- ముఖం ముడతలు పడినా, తలనెరసినా, అవయవాలన్నీ పట్టుతప్పినా మనిషికి ఆశమాత్రం బలీయంగా విడిచిపెట్ట కుండా వుంటుంది.
- ఆపదలో వున్నప్పుడు నిజమైన మిత్రుడెవడో తెలుస్తుంది. దరిద్రములో వున్నపుడు భార్యగుణం ఎలాంటిదో తెలుస్తుంది. ఆస్తి పంపకములో సోదరుల గుణం బయటపడుతుంది.
- సత్యమే మాటకు ప్రాణం, సైనికులే కోటకు ప్రాణం, స్త్రీకి మానమే (శీలమే) ప్రాణం.
- దానము చేయు అవకాశము కలుగుట మన భాగ్యము. అట్లు తెలుసుకొనుట వలననే పురోభివృద్ధి చెందగలము.
- ఓటికుండలో నీళ్ళు నిలువవు. అలాగే ఎప్పుడూ అబద్ధాలాడే వారి యింట లక్ష్మీ నిలువదు.



- సంధ్యవేళ నిద్రించడం దరిద్రానికి చిహ్నం.
- ఎంత మేలు చేసేవారైనా పనివాళ్ళకు చనువు యిచ్చి సంచరించడం తగదు.
- ధనమునకు దానం వాక్కునకు సత్యం, దేహానికి పరోపకారం సార్ధకమైనవి.
- ప్రతి మానవుడు ప్రతిరోజూ ఒక మంచి పని అయినా చేయాలి. మంచి పనియనగా సద్గ్రంథపఠన, మంచిమాట చెప్పాలి లేక వినాలి. మంచి పాట పాడుకోవాలి. మంచి కార్యక్రమములో పాల్గొనాలి. మంచినే చేయాలి ఈ విధముగా చేసిన యెడల అతనికి అంతా మంచే జరుగుతుంది.
- దూర ప్రాంతములకు వెళ్ళేటప్పుడు మంచి గ్రంథము (పుస్తకము) వంటిది మరొకటి లేదు.
- ప్రతివ్యక్తి ఇతరులకు బోధించే ముందు తాను ఆచరించి చూపాలి. తనను తాను ఉద్ధరించుకొనగలిగినవాడే ఇతరులను ఉద్ధరించ గలుగుతాడు.
- కోపం చాలా చెడ్డది. ఎన్ని అనుష్టానాలు చేసినా, కోపిష్టుడి చర్యలన్నియు కళాయి లేని పాత్రలో వండిన పులుసు చెడిపోయి నట్లుగా వ్యర్థమవుతాయి.
- భార్య వియోగం, అపవాదు, ఋణశేషం, చెడ్డవాని వద్ద కొలువు, దరిద్రకాలములో వచ్చిన బంధువులు, నిప్పులేకుండా శరీరాన్ని కాల్చివేస్తాయి.
- అన్నిటికన్నా పెద్దది ఆకాశం. అన్నిటికన్నా వేగంగా పోయేది మనస్సు. అన్నిటికన్నా శ్రేష్టమైనది శీలం. అన్నింటికన్నా సులభ మైనది ఇతరులకు చెప్పడం. అన్నికన్నా గొప్పది తన్ను తాను తెలుసుకోవడం.
- ఆహారము కొరకు శరీరము ఏ విధముగా తపనపడుతుందో దైవ ప్రార్థన కొరకు మనస్సు ఆ విధముగా తపనపడాలి.

- మనుష్యుడు జన్మతః చెడ్డవాడు కాదు. ఎట్టి సాంగత్యము చేస్తాడో, అట్టివాడే అవుతాడు. సత్సాంగత్యములో జీవితం సంస్కరింపబడుతుంది. దుస్సాంగత్యములో మానవుడు చెడిపోతాడు.
- సత్సాంగత్యము ఈశ్వరానుగ్రహము వలన లభిస్తుంది. దుస్సాంగత్యము నుండి తప్పించుకొనుట నీ ప్రయత్నము.
- గృహస్థుడు పదకొండు నెలలు గృహములో గడిపి ఒక నెల తపస్సు కొరకు ఏదో ఒక పవిత్ర స్థలములో నివశించవలె. ఆ సమయములో ఎట్టి లౌకిక వ్యాసంగం పెట్టుకోరాదు. చేసే ప్రతిపని, గడిపే ప్రతిక్షణం, భగవంతుని సేవకే వినియోగించాలి.
- కడుపులో కుట్ర పెట్టుకుని పిలిచి రప్పించుకొని అవమానం చేసేవాడు శాశ్వత నరకానికి పోతాడు.
- నీ శత్రువుల నుండి తప్పించుకొనవచ్చును. కాని నీవు చేసిన పాప కార్యమునుండి నీవు తప్పించుకొనలేవు. అది జీవిత మంతా నిన్ను వెంబడిస్తూనే వుంటుంది.
- విద్య అనేది మనిషి నుండి వేరు చేయలేని సంపద వంటిది.
- దైవభావముతో నీ పడకనుండి మేల్కొనుము. తదుపరి తల్లిదండ్రులను, గురువులను, దైవమును పూజింపవలెను. మంచి పనులతో వారిని సంతోషపెట్టవలెను.
- పాము విషము తలకెక్కిన వారికి వేప ఆకు కూడా తీయగా వుండును. అటులనే విషయ వాసనలలో లీనమైనవారికి దోషములు పాపములు, మహాప్రీతిగా, మంచి తృప్తిని కలిగించును.
- జీవహింస చేయకుండుట, సత్యము చెప్పుట, శక్తి కొలది దానము చేయుట అనునవి ఉత్తమ గృహస్థ ధర్మములు.
- వయస్సు, ధనము, గృహకల్లోలము, మంత్రము ఔషధము, సంగమము, దానము, మానము, అవమానము, వీటిని



ఎవరితోను చెప్పరాదు.

- శాంతముతో సమానమైన తపస్సు లేదు. సంతోషము కంటే సుఖము లేదు. తృష్ణ (ఆశను) మించిన వ్యాధి లేదు. దయను మించిన ధర్మం లేదు లోకంలో.
- కాయకష్టం వల్ల ఒళ్ళు గట్టిపడినట్లే, కష్టాలవల్ల మనస్సు గట్టిపడుతుంది. రాజు అయినా రైతు అయినా ఇంట్లో సుఖశాంతులు వున్నపుడే సంతోషముగా వుండగలుగుతారు.
- శక్తిని, సంపదను, నీకు భగవంతుడు యిచ్చిన సమయమును, వివేకముతో ఉపయోగించుకొనేవాడే దేవజాతికి చెందినవా డౌతాడు.
- అకలిదప్పులను సహించడం తపస్వి యొక్క లక్షణం.
- నిందను మోపేవారిపై క్రోధం వుండకూడదు. అది ఈశ్వరుడు పంపిన సుభ సూచికముగా గుర్తించు.
- సత్పురుషులు లభించినపుడు వారితో లౌకిక ప్రసంగాలు చేయవద్దు.
- పరాన్నము భుజించువారు తగిన బ్రహ్మ నిష్ఠ గలిగి యుండ నిచో తమ పుణ్యమును గోల్పోవుదురు. అపుడు వారికి కోపతాపములు వృద్ధియగును. కఠిన వాక్కులు పలుకుదురు. ద్వేషము పెరుగును. ఇట్టి లక్షణములు గల్గుచుండిన పుణ్యము క్షయించుచున్నదని తెలుసుకొని తీవ్రముగా ధ్యానము చేయవలయును.
- కొద్ది జ్ఞానము గలవారు, మంచి విరక్తిగలవారును, బ్రహ్మనిష్ఠగలవారి సహవాసము చేసిన వారి జ్ఞానము మిక్కిలి ప్రకాశించును. అట్లుగాక విషయాసక్తులగు వారి మధ్య వుండిన ఇదివరకు వుండిన జ్ఞానము కూడా లోపించును.
- ప్రతిరోజు నూరుచుండిన కత్తి ఎట్లు నిరంతరము మంచి వాడిగలిగి యుండునో, ఆలాగున గురువు దగ్గర వుండి సదా

గురుసేవ, గురు బోధ కలిగియుండిన బహు తీక్షణమైన జాగ్రత్త కలిగియుండును.

- ఇతరుల వస్తువులను నీవు తీసుకొనినచో నీ పుణ్యంపోయి వారి పాపము నిన్ను చేరును. కాని అత్యవసర పరిస్థితులలో దైవభావముతో తీసుకొనవచ్చును. అదియు నీకు జరుగు బాటు లేనప్పుడును, దానిని ఒక మంచి కార్యమునకు ఉపయోగించుట కొరకు తీసుకొనవచ్చును దానివల్ల నీకు పాపమంటదు. దానిని నీ స్వార్థము కొరకు తీసుకొంటివా, కామక్రోదాధులు అధికమై మనస్సు చలించుటయు జరుగును.
- ఎంతకెంతకు మనస్సు దైవముపై తీవ్రనిష్ఠ, ఏకాగ్రత కలిగియుండునో అంతకంతకు, దైవప్రాప్తిలోగల విఘ్నము లన్నియు తొలగుటయేగాక, దైవప్రాప్తి శీఘ్రముగా కలుగును.
- ఎన్ని పనులున్నప్పటికి ఎన్ని ప్రతి బంధకములు ఉన్నప్పటికిని, భగవ ధ్యానము చేసిన పిదపయే భుజించవలెనను దృఢ నియమము గలిగి యుండవలెను. అప్పుడు మాత్రమే ప్రకృతివారికి దారినిచ్చును.
- ప్రతిదినము నియమము తప్పక ధ్యానము చేయుచుండిన కొంత కాలమునకు అప్రయత్నముగానే మనస్సు దైవస్థితి లోనికి తీసుకొని వెళ్ళుచుండును.
- నీచులు విఘ్నాలు వస్తాయన్న భయముతో పనికి పూనుకోరు. మధ్యములు పని ప్రారంభించి, విఘ్నాలు ఎదురైతే వదిలేస్తారు. ధీరులు ఎన్ని ఆటంకాలు కలిగినా, మొదలు పెట్టిన పని పూర్తిఅయ్యే వరకు వదలనే వదలరు.
- విద్యలేనివారు పశుప్రాయులని కొందరు చెప్పుదురు. కాని విద్యయుండియు జ్ఞానము లేనివారు పశువులకన్నా తక్కువే యని మరువకుడు.
- ఈశ్వరుడు వారి వారి ప్రారబ్ధాలననుసరించి ఆడిస్తూ



వుంటాడు. ఎవరెంత ప్రయత్నించినా జరగరానిది జరగనే జరగదు. ఎవరెంత నిరోధించినా జరుగవలసినది జరిగియే తీరును.

- కట్టెలో పుట్టిన నిప్పు ఆ కట్టెనే కాల్చినట్లు, మూర్ఖుని ఆశ వానిని చంపును.
- జీవితము యొక్క విలువ భోగముతో కాదు యోగముతో.
- బుద్ధిమంతుడు మంచిచావును కాదు కోరవలసినది. మంచి బ్రతుకును కోరవలె. సాధారణ జనులు మంచిచావుకు గొప్పతన మిస్తారు. వివేకి అయినవాడు మంచి బ్రతుకుకు మర్యాదనిస్తాడు.
- మనిషి జన్మము మాటి మాటికి రమ్మంటేరాదు. ఇది మోక్షానికి ద్వారము లాంటిది. ఈ జన్మ వచ్చినపుడే దీనిని సార్థకము చేసుకోవాలి.
- ఈ మనిషి జన్మలోనే జ్ఞాననేత్రమును సంపాదించుకోవాలి. తక్కిన జన్మలు అజ్ఞానముతో కూడుకున్న జన్మలు.
- దుర్లభమగు ఈ మానవజన్మను పొందియు, ఈ జన్మముననే భగవంతుని తెలుసుకొనుటకు ప్రయత్నింపని వాని జీవితము నిరర్థకము.
- తాను గొప్పవాడినైపోయానన్న అహంకారం ప్రారంభమైన క్షణం. మానవుని పతనానికి ప్రారంభోత్సవ ముహూర్తం.
- తల్లి, తండ్రి, భార్య, బిడ్డలు మొదలగు వారి యందుండు మమకారమే మాయ. సర్వజీవులయెడల సమానమైన ప్రేమయే దయ.
- రాతిముక్కలో నీరు ఇంకజాలని రీతిని, ధర్మబోధలు సంసార బద్ధుని మనస్సునకెక్కజాలవు. అతనియందు ఎట్టిమార్పును కలుగదు.
- ద్రోహము చేయకుండుట, దానము చేయుట సత్యము

పలుకుట, ఈ మూడు మానవమాత్రునికి వ్రతములలో ఉత్తమ వ్రతములు.

- వాగ్దోషము అన్ని దోషాలకు మూలము. నోరు మంచిదైతే వూరు మంచిదనే లోకోక్తి మరువద్దు.
- తల్లి, తండ్రి గురువు, అతిథి, సూర్యుడు. వీరు ప్రత్యక్ష దేవతలు, వీరిని సేవించి తరించు.
- మతాలన్నీ భగవంతుని చేరుకునే వేర్వేరు మార్గాలు.
- కర్మల ఫలితం నుండి తప్పించుకోవడం అసాధ్యం. కనుక సత్కర్మలే చేస్తూ వుండాలి.
- మనతో హృదయము విప్పి మాట్లాడని వ్యక్తి దగ్గర మనం హృదయం విప్పి మాట్లాడకుండా జాగ్రత్తపడాలి.
- సజ్జన సాంగత్యం బుద్ధి యొక్క దోషాలను పోగొడుతుంది. సత్యం పలికిస్తుంది. గౌరవం కలిగిస్తుంది. పాపాన్ని హరిస్తుంది. మనస్సును నిర్మలముగా వుంచుతుంది. కీర్తిని నలుదిక్కులా విస్తరింపజేస్తుంది. ఇది మానవులకు సకల విధాలా మేలు చేకూర్చుతుంది.
- దానము చేయక, తాను అనుభవించక వుండే లోభివాని ధనము మూడవ దారిలో నడుస్తుంది.
- దయలేకుండా ప్రవర్తించడం, కారణము లేకుండా కలహించడం, పరుల ధనాన్ని పరస్త్రీలనూ కాంక్షించడం, సజ్జనులన్నా బంధువులన్నా సహించకపోవడం, ఇవి దుర్జనులకు సహజ స్వభావాలు.
- వాడు చదువుకొన్నవాడైనా సరే దుర్జనుణ్ణి దూరముగానే వుంచాలి. తలపై రత్నమువున్నా పాము భయంకరమైనదే గదా.
- రహస్యంగా దానము చేయడం ఇంటికి వచ్చిన వాళ్లను ప్రీతితో ఆదరించడం, తాను చేసిన మేలును చెప్పుకోక పోవడం, ఇతరులు తనకు చేసిన మేలును చెప్పుకోవడం,



ఈ వ్రతము సజ్జనులకు సహజ సిద్ధమే. కాని ఒకరు బోధించగా అలవడినది కాదు.

- మంచి నడవడికతో తండ్రిని, సంతసింపచేసేవాడే నిజమైన పుత్రుడు. భర్తయొక్క హితము కోరేదే నిజమైన భార్య ఆపత్కాలములోనూ సుఖసమయములోనూ సమానమైన ప్రేమను చూపేవాడే నిజమైన మిత్రుడు. ఈ ముగ్గురూ లోకంలో పుణ్యం చేసిన వారికే లభిస్తారు.
- జ్ఞానం మానవుని సంపదలన్నిటిలోనికి గొప్పది. అది అమూల్యమైనది. జీవితాంతం తోడుగా, నీడగా వుంటూ, శ్రేయస్కరమైన సన్మార్గాన్ని చూపించే ప్రాణమిత్రుని వంటిది.
- న్యాయముగా సంపాదించిన ధనముతో నిజముగా అవసరమున్న వారికి సహాయము చేయడము మంచిది. ధనాన్ని దుబారాగా ఖర్చు పెట్టడం మంచివారికి కూడని పనులు.
- మన మేలును కోరే సేవకుల పట్ల క్రోధం లేకుండా వ్యవహరిస్తే, వారు మనలను మరింత బాగా సేవిస్తారు.
- ఇతరుల సంపదలను, విద్యాయోగ్యతలను కీర్తి ప్రతిష్టలను, బలాన్ని చూచి ఓర్వలేనివారు రోగ పీడితులవలె బాధపడుతూ వుంటారు.
- వినేవారి మనస్సుకు ఇంపుగా, హితంగా ప్రియంగా మాట్లాడాలి. అలా మాట్లాడడం చేతగాకపోతే మౌనమే మంచిది. మాటలనుబట్టి ఇతరులతో స్నేహవైరం కలుగుతూ వుంటాయి. మన సంభాషణ మంచిగా వుండాలి.
- మాటలవల్ల చెడిన పని చక్కబడటము కష్టం. శరీరములో గ్రుచ్చు కొన్న బాణాన్ని, ఏదోరీతిగా బయటకు తీయవచ్చు. కాని మనసులో గ్రుచ్చుకొన్న మాటలను తీయడం అసాధ్యం.
- మహాపురుషులయొక్క హస్తస్పర్శ, శిరస్సునకు తగిలిందంటే మానసిక వికారాలు ఉపశమిస్తాయి.

- జపాన్ని, ధ్యానాన్ని నియమముతో తప్పకుండా చేయి. ఏ దేవుని జపం చేస్తూ వుంటావో, ఆ దేవుని రూపాన్ని ధ్యానం చేయి.
- పెద్దల పట్ల వినయం, చిన్నలపట్ల దయ, సమానుల పట్ల మైత్రి, సర్వప్రాణుల యెడల సమానవత్వం కలవారి విషయములో భగవంతుడు సదా ప్రసన్నమై వుంటాడు.
- జపంతో పూర్వజన్మలోని పాపాలు నశిస్తాయి. జప ఫలితం నీకు అనుభవములోకి రాకపోతే వెనుకటి పాపశేషం ఇంకా వుందని గుర్తించు.
- గంధపు చెక్క తాను అరిగిపోతున్నప్పటికిని, ఇతరులకు ఆనందం కలిగిస్తుంది. ఈగ మానవుని ఆహారము ద్వారా, కడుపులోనికి వెళ్లి వాంతిచేయిస్తుంది. ఇది దుర్జన లక్షణం.
- పడగమీద మణివున్నప్పటికిని పాము భయంకరమైనదే. అలాగే ఒకడు ఎంత విద్యావంతుడైనా దుర్జనుడైన పక్షములో వాడిని దూరముగా నుంచవలసినదే.
- పాలలోని నీటిని విడిచి పాలను గ్రహించే హంసవలె వివేకవంతుడు, ఇతరులు చెప్పే మాటలలో సారముగల మాటలనే గ్రహిస్తాడు.
- అభ్యాసము కన్నా జ్ఞానము, జ్ఞానము కన్నా ధ్యానము, ధ్యానము కన్నా కర్మ ఫలత్యాగము శ్రేష్టము. (భగవద్గీత)
- అందం ఆడవారికి గర్వకారణం. గుణమున్న స్త్రీలు ఆరాధనకు అర్హులు. వినయం కూడా వున్న మహిళలు దేవతాస్వరూపులు.
- అహంకారము ఎక్కువ వున్న వ్యక్తి అందరి ద్వేషానికి పాత్రుడవుతాడు.
- అన్ని సంపదలకన్నా అమూల్యమైనది కాలం. కాలం గడిచిపోతే తిరిగి సంపాదించుకోలేనిది సమయం.
- అధికారం కొరకు స్వేచ్ఛను నష్టపోకు, ధనం కొరకు శీలాన్ని నష్టపోకు.



- అసూయ, అత్యాశ, కోపం, పరుషమైన మాట ఈ నాలుగు వదలిపెట్టిన వాడెవడో వాడే సజ్జనుడు.
- అందినదల్లా స్వాహాచేస్తూ, చేసిన మంచిపనిని మరచిపోతుండడం వలన స్వార్థము వృద్ధిచెందుతుంది.
- అజ్ఞానమే అవివేకానికి మూలం. వివేకం తెచ్చుకుంటే ఆత్మజ్ఞానం కలుగుతుంది.
- అలగ్జాండర్ చనిపోతూ తన రెండు చేతులూ పైకి కనిపించేలా కట్టి తన శవాన్ని తీసుకొని వెళ్లమన్నాడు. ఎందుకని అడిగితే ఇంత గొప్ప చక్రవర్తి చచ్చాక వట్టి చేతుల తోనే స్మశానికి వెళ్లాడని ప్రజలు తెలుసు కోవాలని అన్నాడు.
- అధికారం బాధ్యతలను పెంచుతుంది. బాధ్యత వలన బంధనాలు పెరుగుతాయి. బంధనాల వలన మనస్సుకు శాంతి వుండదు. మనస్సుకేకాదు శరీరానికి విశ్రాంతి వుండదు. విషవలయంలో చిక్కు కోకుండానే వుండాలి. అంతేకాదు అధికారం వస్తూ గర్వాన్ని, అహంకారాన్ని తోడు చేసుకొని వస్తుంది. దానితో ఆ మనిషిలోని మానవత్వం మాయమవుతుంది. తరువాత గౌరవం పోతుంది.
- ఆనందం అనేది ఎక్కడి నుండో మనస్సులోకి రాదు. మనస్సులోనే పుట్టి వికసించి బయటకు వస్తుంది. అది మన చేతుల్లోనే వుంది.
- ఆత్మ తత్త్వమెరిగినవారికి లౌకికమైన సుఖదుఃఖాలు గడ్డిపరకలతో సమానము.
- ఆత్మజ్ఞానము కలిగినవాడు మానావ, మానాలను భరిస్తారు, రాగద్వేషాలను జయించుతారు.
- ఆరోగ్యము కొరకు సూర్యభగవానుని, శ్రేయస్సు కోసం అగ్నిదేవున్ని, ఐశ్వర్యం కోసం శివుణ్ణి, మోక్షం కోసం విష్ణువును ఏకాగ్రతతో ఆరాధించాలి.

- ఇతరుల కష్టనష్టాలలో నీకు తోచిన సహాయము నీవు చేస్తే నీకు సమాజ సహకారం వుంటుంది. అటు దేవుని సహాయము పొందగలవు.
- లోకమున వైరము ఎప్పటికిని వైరమువలన జయింపబడదు. ఆ వైరమును ప్రేమ వలననే జయింపవలయును.
- ఈ రోజున మాటలలో మనస్సును తూట్లు పొడిచేవాడు, రేపు మనిషినే హత్య చేయగలడు.
- ఈ జన్మలో తాను అనుభవిస్తున్న సుఖదుఃఖాలు, పూర్వజన్మ కర్మఫలితాలని, ఈశ్వరుని అభీష్టానసారమే వాటిని తాను అనుభ విస్తున్నానని తెలుసుకోవడమే వివేకం.
- ఈశ్వరుని నుంచి లాభాన్ని ఆశించేవాడు ఆయన సేవకుడు కాదు. వ్యాపారి మాత్రమే.
- ఈ కలికాలములో అందరి మనస్సులను రంజింపజేయునది పర్వతముల వంటి పాపములను నశింపజేసేది, చిత్తమందలి భోగవాస నలను పోగొట్టేది కేవలము భగవన్నామ స్మరణమే.
- ఎంత గొప్పవారైనను పర్వతమునెట్లు పడవేయలేరో, అట్లే నిందాప నిందలు జ్ఞానిని, పండితుని అనగా మంచివారి మనస్సును కలవర పెట్టజాలవు.
- ఎంత చదివి విజ్ఞానముతో తలపండిపోయినా మంచి హృదయము లేకపోతే ఆ పాండిత్యం నిష్ప్రయోజనమే.
- కట్టెలు కాలే కొద్ది మంటలు లేచినట్లే, నీలో జ్ఞానము పెరిగే కొద్దీ, పాపపు పనులు వెనుకబడతవి.
- శ్రీకృష్ణ పరమాత్మ ఉపదేశించిన కర్మ, భక్తి, జ్ఞాన, ప్రేమ యోగములు అనుభవములో పొందకపోతే గీతాపారాయణ ఫలమేమున్నది.
- కుటుంబములో అందరూ సుఖంగా వుంటేనే ఇల్లాలు సుఖపడుతుంది. ఏ ఒక్కరూ బాధపడినా ఆమె తల్లడిల్లిపోతుంది.



- అనేక గ్రంథములలోని సారము ఒక్కటే, బ్రహ్మ సత్యము, జగత్తు మిధ్య, జీవుడు బ్రహ్మమే, అన్యము కాదు. (శ్రీ ఆది శంకరా చార్యులవారు)
- క్రోధము నీ దేహమును కుదురుగ ఉండనీయదు. దేహాన్ని వశము చేసుకో చెడు పనులు చేయకుండా చూడు. మంచి పనులకే ఈ దేహాన్ని ఉపయోగించు.
- గురువు యొక్క అనుగ్రహం పొందని సాధకుడు ఎన్ని సాధనలు చేసినా వ్యర్థం. అతడికి బ్రహ్మజ్ఞానం సిద్ధింపదు. (సమర్థరామదాసు)
- గురువు వద్ద తీసుకునే నామమును మంత్రమని, తీసుకునే పద్ధతిని దీక్షయనియు, ధ్యానాన్ని సాధనయని అంటారు. దీనినే యోగమని, జపమని అంటారు. (మురళీకృష్ణ)
- మనశ్శాంతిలేనివాడు ఎన్నిటికిని జ్ఞాన పరిపూర్ణుడు కాజాలడు.
- చిమ్నీగ్లాసును శుభ్రము చేయనిదే లోపలి కాంతి బయటకు రాదు. ఆ విధముగానే భగవద్భక్తి, స్తోత్రములు, జపము, ధ్యానాదులచే మన హృదయాన్ని శుభ్రపరచనిదే జ్ఞానదీపం వెలగదు.
- చిరిగిపోయిన చొక్కాతోనైనా వుండుగాని మంచి గ్రంథము దొరికితే మాత్రం కొనకుండా వుండకు.
- చేసే ప్రతికర్మ (పని) శ్రద్ధాభక్తులతో చేయడమే భక్తియోగం. ముక్తికి అది కూడా సోపానం.
- చెట్టు తనను పెంచినవానికి నీడను, పండ్లను, పుష్పములను యిస్తుంది. అట్లే జ్ఞానియైనవాడు మిత్ర, శత్రువును సమభావ ముతో చూస్తాడు.
- చేయకుండా చేశానని చెప్పేవాడధముడు. కొద్దిగాచేసి కొండంత చేశానని చెప్పేవాడు గర్వపోతు. ఎంతయోచేసి కొంచెముగా చేశానని చెప్పేవాడు సజ్జనుడు.

- చీకటిలోనే నక్షత్రాలు కనిపిస్తాయి. అలాగే విచారములోనే సత్యాలు కనబడతాయి.
- చెడును ఎత్తిచూపడం కాదు దాని స్థానంలో మంచిని ప్రతిష్ఠించడమే నిజమైన సంస్కరణ.
- జ్ఞానికి ఈ లోక వ్యవహారమంతా స్వప్నములాగే కనిపిస్తుంది. ఆత్మ మాత్రమే యదార్థమైన దానిగా కనిపిస్తుంది.
- జీవితములో మంచి భార్య దొరకడం ఒక వరం. భార్య చెడ్డది కావడం ఒక శాపం.
- జ్ఞానానికంతటికి వేదము, వేదసారమైన ఉపనిషత్తులు భగవద్గీత మూలం. ఇంటికి భార్యయేమూలం. ధాన్యానికి కృషిమూలం, జగుత్తనకు ధనమే మూలం.
- జ్ఞానమార్గములో ప్రయాణము సాగించు సాధకుడు ఏ సాధనాల మీద ఆధారపడడు. శ్రవణ, మనన, నిధి ద్యాసముల ద్వారానే ఆత్మ జ్ఞానం పొందుతాడు.
- తెలియనిది అడిగితే తెలిసి చెప్పనివాడు సత్యాన్ని చెప్పనివాడు ఘోర నరకానికి పోతాడు.
- తన హృదయములో వున్న భక్తిని వెల్లడిచేయడానికి, విగ్రహారాధన పూజలు అవసరం.
- ధ్యానం ద్వారా శ్వాస స్వాధీనములోనికి వస్తుంది. ప్రాణం మనస్సులో లయమవుతుంది. సంకల్ప వికల్పాలు నశిస్తాయి, శాంతి లభిస్తుంది.
- నిజము పలుకుము. కోపమునకు గురికాకుము. అడిగిన వారికి నీకు తోచినంత యివ్వు. ఈ మూడు ధర్మములు పాటించెదవేని దేవతా సందర్శనము నీకు కలుగును.
- విగ్రహారాధన నిగ్రహం కొరకే.
- నేను గొప్పవాణ్ణి. నేను, నాది అనే వృత్తులు మనస్సును ఆశ్రయించుకొని వుంటాయి. అట్టి అహంకారమే మనస్సు.



మనస్సును స్వాధీనము చేసుకోవడమే హఠయోగం. (శ్రీ రమణ మహర్షి)
- నిత్యానిత్య వస్తువివేకం. వైరాగ్యం మొదలైన సాత్విక గుణాలు అలవరచుకొంటే మనస్సు పరిశుద్ధమై కోరికలనుండి విముక్తి చెందుతుంది. (శ్రీ ఆదిశంకరాచార్యులవారు)
- నదుల నిండా నీరు వుంటుంది. కాని ఆ నీరు నదులు త్రాగవు. చెట్లు నిండా పండ్లు వుంటాయి. కాని ఆ పండ్లు చెట్లు తినవు. మేఘాలు వర్షించిన పంటలు పండుతాయి. కాని ఆ పంటలు మేఘాలు తినవు. అలాగే, లోకంలో ధర్మాత్ములైన వారు తాము సంపాదించినది, తాము అనుభవించక పుణ్య కార్యములో పాల్గొనక దేహ బంధువులకు వదిలేసి పోతారు (సుభాషితములు).
- సోమరితనం ఏమిటి అంటే అన్నీ తెలుసుకుని కూడా ఆచరించకపోవడమే. (మురళీకృష్ణ)
- నిజానికి చెట్టుకన్నా లోకంలో దాత ఎవ్వరూ లేరు. దాతలకే దాత. ఎండ, వాన, గాలిని అది అనుభవించి, దాని ఆశ్రయం కోరినవారికి నీడనిస్తుంది. ఇంకా పండ్లు, ఆకులు, పుష్పములు ఇస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఇతరుల కోసం తన సర్వస్వాన్ని అర్పిస్తుంది. ఈ లోకములో మంచివారు పుణ్యాత్ములు చేసే పని ఇదే. (సుభాషితాలు)
- పాపభీతి లేకుండా ఎవరైతే పాపకార్యములను నవ్వుతూ చేస్తారు. వారు ఆ పాప ఫలితాన్ని ఏడుస్తూ అనుభవిస్తారు.
- పరస్త్రీలను తల్లిగా చాచుటయే జగన్మాత ఆరాధన.
- ప్రపంచములో సాంమ్రాజ్యపతి లగాయితు, పూటకూటికి గతిలేని బిచ్చగాని వరకూ అందరూ ఏదో అశాంతితో అలమటించేవారే. ఐహిక భోగాలేవి శాంతినివ్వజాలవు. (కుసుమ హరనాథ్)
- ప్రతి నిత్యము ఎందరో ఈ ప్రపంచమును తమ బంధుమిత్ర,

సిరిసంపదలను వదలి వెళ్ళుచున్నారో గమనింపుడు. నీవు కూడా అదే రీతిగా బంధుమిత్ర సంపదలన్నీ వదలివెళ్లేరోజు వస్తుందని గుర్తించుకొనుము.

- ప్రాణులను హింసచేయకుండా మాంసము రాదు. ప్రాణి హింస నరక హేతువు. కాబట్టి మాంస భక్షణ విడువవలెను.
- భక్తితో సాధించలేనిదంటూ ఏదీ వుండదు. మృగమైన గజేంద్రుడు. పక్షియై నజటాయువు, ధృవుడు, మార్కండేయుడు, విభీషణుడు, ప్రహ్లాదుడు, గోపికలు, శబరి, గుహుడు, నందుడు తరించారు.
- భగవన్నామం చేసే పెదవుల కంటే పరోపకారం చేసే చెయ్యి గొప్పది.
- మానవుడై పుట్టుట కష్టం. ఎంతో పుణ్యవశానగాని అది జరగదు. లోకంలో మంచిజీవనం గడపడం అంతకంటే కష్టం. సత్యాన్ని, ధర్మాన్ని ఆచరించడం అంతకంటే కష్టం. జ్ఞానికావడం అన్నిటికంటే కష్టం.
- మూర్ఖుడు ఎప్పుడూ తనను ఆకాశానికి ఎత్తివేసే మరో మూర్ఖుని కొరకు వెతుకుతూ వుంటాడు.
- మన సనాతన ధర్మములో కర్మాచరణకు అంతిమ గమ్యం భగవంతుని చేరుకోవడమే.
- మోక్షానికి జ్ఞానం తాళం చెవిలాంటిది. నిరంతర ధ్యానసాధనతో మనసులో ప్రశాంతత ఏర్పడుతుంది. ఇంద్రియ కల్లోలాలు ఆగుతాయి. హృదయములో శాంతి గూడుకట్టు కుంటుంది.
- మగువకు వ్యభిచారము మచ్చ. దాతకు లోభితనము కళంకము. అధర్మాచరణము ఇహపరములరెంటికి దూష్యము.
- మధురంగా, ఆకర్షణీయంగా మాట్లాడండి. వాక్శుద్ధి వుంటే వాక్కు సిద్ధి కలుగుతుంది. మనోశుద్ధి వుంటే సంకల్ప సిద్ధి వుంటుంది. హృదయములో ప్రేమవుంటే అందరూ నీకు



వశులవుతారు. దీనినే వశీకరణ అంటారు.

- యజ్ఞయాగాదులవలన దానం చేత ప్రార్థన వలన మనుష్యుడు పవిత్రుడవుతాడు.
- యజ్ఞము నాలుగు విధాలుగా వుంటుంది. మొదటిది ద్రవ్యయజ్ఞం, రెండవది తపోయజ్ఞం, మూడవది యోగయజ్ఞం, నాలుగవది జ్ఞానయజ్ఞం, సమాజ శ్రేయస్సు కొరకు ధనముతో చేయునది ద్రవ్యయజ్ఞం, కర్తవ్యాన్ని తపస్సుగా భావించి, ఆచరిస్తే తపో యజ్ఞం. అష్టాంగయోగ సాధన ద్వారా చేసేది యోగయజ్ఞం. వీటియన్నిటికంటే గొప్పది జ్ఞానయజ్ఞం.
- రైతు శ్రమించడము వలననే అన్నం లభిస్తుంది. నడిస్తేనే గమ్యం చేరతాము. విద్యాదానం వల్ల జ్ఞానివికాగలుగుతాం. ఒకరికి పెట్టినప్పుడే దాత అనిపించుకుంటాడు.
- రజోగుణం నుంచి కామం క్రోధం పుడతాయి. అవి మనిషికి శత్రువులు. మనిషిచేత పాపం చేయిస్తాయి.
- రాముని పితృభక్తి ఏకపత్నీ వ్రతం. భరతుని భోగ విరాగం. లక్ష్మణుని భాతృప్రేమ. సితాదేవి పాతివ్రత్యం. హనుమంతుని రామసేవ. వీటిని మనము ఆచరణలోనికి తెచ్చుకోకపోతే రామాయణం ఎన్నిసార్లు చదివినా ప్రయోజనమేమిటి. (కుసుమ హరనాథ్)
- వివేకవంతుడు తాను తెలుసుకొన్న విషయాలను గురించి గర్వించడు. పెద్దలు చెప్పిన విషయాలను శ్రద్ధతో విని, సాధన ద్వారా బ్రహ్మజ్ఞానాన్ని సంపాదించుకునేందుకు కృషిచేస్తాడు. (భారతీ తీర్థస్వామి)
- విశ్వాసమున్నచోటే ప్రేమ వుంటుంది. ప్రేమ ఉన్న చోటే శాంతి ఉంటుంది. శాంతి ఉన్న చోటే దేవుడుంటాడు.
- సాలెపురుగు తన చుట్టూ గూడు అల్లుకుని అదే ప్రపంచముగా జీవిస్తు న్నట్లు జీవి కూడా తన చుట్టూ సంసారమనే గూడు అల్లుకొని అదే లోకంగా బ్రతుకుతూ వుంటాడు

(శంకరాచార్యులవారు).

- స్త్రీని బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యములో కొడుకు తప్పనిసరిగా కనిపెట్టుకొని చూస్తుండాలని, ఆమెను ఒంటరిగా వుంచ వద్దని మను మహర్షి చెప్పాడు.
- సత్సాంగత్యమువలన సంసార విషయాలమీద రోతజనిస్తుంది. ప్రాపంచిక భోగాలంటే మోజు తగ్గుతుంది. క్రమంగా శాశ్వతానంద ప్రధాతయైన భగవానుని మీద చిత్తం లగ్నమవుతుంది. అప్పుడే జీవి సంసారములో వుండి కూడా బాధా విముక్తుడవుతాడు. (కుసుమ హరనాథ్)
- స్వలాభం కోసం చేసే కర్మవలన ఆధ్యాత్మికతకు దూరమవుతాం. ప్రతి ఫలాపేక్ష లేకుండా ఈశ్వరార్పణ బుద్ధితో, లోక క్షేమం కోరి, కర్మలు ఆచరిస్తే ముక్తి సాధ్యమవుతుంది.
- సచ్ఛీలముతోబాటు వినయము కూడా అవసరము. అహంకారము మనిషి పతనానికి దారితీస్తుంది. ఎంత చదువున్నా, సంపద వున్నా, విద్య, అధికారము వున్నా వినయము లేకపోతే అవి శోభింపవు.
- సంస్కారములేని చదువు, వాసనలేని పూవువంటిది. (గాంధీ)
- హైందవ ధర్మం ఒక వటవృక్షం వంటిదైతే, మిగిలిన మతాలన్నీ దాని శాఖలు వంటివి. హైందవధర్మం సనాతనం.
- ఆత్మవంచన, పరనింద చేసేవాడు తన పతనాన్ని తానే కోరి తెచ్చుకున్నట్లే.
- అన్నింటికంటే భక్తి సులభమైనది. నామి, నామం రెండూ ఒక్కటే తేడా లేదు.
- అప్పులపాలగుట, యాచించుట, వృద్ధాప్యము, వ్యభిచారము, దొంగ తనము, దరిద్రుడగుట, రోగము, ఒకరిపై ఆధారపడి బ్రతుకుట ఇవి అష్టకష్టములు.
- ఆత్మజ్ఞానం, సత్పురుషుల సాంగత్యము వల్లను, సద్గురు బోధ



వల్లను లభిస్తుంది.

- అన్ని జీవరాశులపట్ల ప్రేమ కనికారం చూపే మతమే భగవంతుని సంతోషింపజేయును. (వల్లభాచార్య)
- ఆకలితో వున్నవారికి అన్నము పెట్టుము. బీదలకు గుడ్డలిమ్ము (సాయిబాబా)
- అందరూ పుణ్యఫలమైన సుఖాన్ని ఆశిస్తారే గాని, పుణ్యకార్యాచరణం చేయుటకు ప్రయత్నించరు. పాపఫలమైన దుఃఖాన్ని నిరంతరం పూనికతో చేస్తూ వుంటారు.
- ఆయు, రారోగ్యం, ఐశ్వర్యములు కోరువారు మాంసమును తినరాదు. (మహాభారతము)
- అంతర్యములో భగవంతుని చూచేందుకే కళ్ళు మూసుకుంటాము. (శ్రీ సుందర చైతన్యస్వామి)
- అగ్ని వస్తువులను దహించినట్లు, ధ్యానం పాపాలను హరిస్తుంది.
- అపవాదు ఎక్కువకాలం నిలబడదు. నిజం నిలకడ మీద తెలుస్తుంది.
- ఆస్తులు, అంతస్తులు, బాంధవ్యాలు ఉంచుకొనవచ్చు. త్రెంచుకోవచ్చు. కాని భగవంతుని బంధం విడిపోతే జీవించడం కష్టం.
- అన్ని ధర్మాలను వదలిపెట్టి, నన్ను శరణువేడితే, ఆ పాపాల నుంచి, దుఃఖాలనుంచి విముక్తుణ్ణి చేస్తాను. నిష్కామకర్మకు సిద్ధపడు, నా మీద విశ్వాసముంచు. (భగవద్గీత)
- ఇంటి వద్ద నున్నప్పుడు మంచి చేయలేనివాడు, వేయిమైళ్ళు వెళ్ళి దేవుని పూజచేసినా వ్యర్థమే.
- ఇంద్రియాలను నీ వశంలో వుంచుకో, అంతేగాని వాటికి వశుడవు కావద్దు. ఇహపర సుఖాల గురించి కోర్కెలను, మనసునందు తొలగించుకో, సుఖదుఃఖాలకు అతీతంగా సంతుష్టిగా వుండు. (భగవద్గీత)

- ఉత్సాహము, సాహసము, ధైర్యం, తెలివి, శక్తి, పరాక్రమం అనే ఆరు గుణాలు ఎక్కడ వుంటాయో అక్కడ భగవంతుడుంటాడు. (సుభాషితము)
- ఎల్లప్పుడూ దైవచింతనయందే కాలము గడుపుచుందువేని, నీ ప్రాపంచిక క్షేమమును భగవంతుడే చూస్తాడు. (రామకృష్ణ పరమహంస)
- కష్టాలను చిరునవ్వుతో ఆనందముతో అనుభవించడములోనే నిజమైన ఆనందం అనుభూతి వుంది. అది భగవంతుని పరీక్షయని భావించు.
- సత్కర్మల ద్వారా మృత్యురూపమైన సంసారాన్ని దాటి, జ్ఞానం అమృతత్వాన్ని పొందు. (ఈశావాశ్యోపనిషత్తు)
- కామక్రోదాదులవల్ల వివేకం నశిస్తుంది. వివేకహీనులకు వినాశనం తప్పదు. అందువలన వాటిని అరికట్టేందుకు స్వధర్మానుష్టానంతో, ఈశ్వరార్పిత చిత్తంతో ధీరులై ఎదుర్కొని తరించాలి. అప్పుడే హృద యానికి శాంతి.
- కోపం మనిషిని రాక్షసుణ్ణి చేస్తుంది.
- కొందరు విద్యావంతులైనా, మరొకరికి తమ విద్య చెప్పక, ధనవంతులై కూడా దానధర్మములు చేయక, సమర్థులై వుండికూడా సహాయ పడని వారి జీవితం వ్యర్థం.
- కాషాయ వస్త్రాలు ధరించి ఆడంబరంగా సంచరించే మూఢులు పరమాత్మ తత్త్వం తెలుసుకోలేరు. కూటికోసం కోటి వేషాలు వేయడం వంటిదే. (శ్రీ శంకరాచార్యులవారు)
- కార్యదీక్షాపరుని లక్ష్మీదేవి స్వయముగా చేయూతనిస్తుంది. సోమరిని దరిద్ర దేవత, తన వశం చేసుకుంటుంది. (వేదం)
- గాలిలేని చోట పెట్టిన దీపం నిశ్చలంగా వున్నట్లు నీ మనస్సు కూడా నిశ్చలంగా వుండాలి. సమస్యలకు పరిష్కారం అప్పుడే దొరుకుతుంది. నన్నే నమ్ముకుని నీ కార్యక్రమములు చేయి.



చిత్త చాంచల్యం వుండదు. (భగవద్గీత)

- చావును కోరుట. ఆత్మహత్యయనగా ఈ జన్మలో తాను చేయవలసిన పనుల నుండి తప్పించుకునే ప్రయత్నమది. అది సాధ్యము కాదు వచ్చే జన్మలో అవే పరిస్థితులేర్పడి, అవి, ఇవి అన్నీ కలపి మొత్తము అనుభవించాలి. (పతంజలి మహర్షి)
- జ్ఞానమొక్కటే శాశ్వతమైనది. దైవారాధన వలన జ్ఞానం కలుగుతుంది. యజ్ఞయాగాదులు, సామాన్యులకు కష్టం, కనుక ఆలయ సందర్శనం, దైవారాధనలద్వారా ఆ ఫలితాలు పొందవచ్చు.
- జీవితములో అదిలేదని, ఇది లేదని ఏడ్చేవారేకాని, భగవంతుడు కనబడలేదని ఏడ్చేవాడు. కోటికి ఒక్కడు కూడా లేడు. దేవుని కొరకు విలపించేవారికే భగవంతుడు కనబడతాడు. (శ్రీరామ కృష్ణ పరమహంస)
- జంబూద్వీపములోని భారతదేశం కర్మభూమి. శ్రేష్టమైనది. మిగతా దేశాలు భోగభూములు. ఆచార నియమాలు లేవు. (విష్ణు పురాణము)
- జీవలోకంలో జీవుడిగా వున్నది భగవదంశమే. ఆలాంటి జీవుడు ఎలాగైనా మళ్ళీ భగత్సన్నిధికే చేరుకోవాలి. అదే అతని గమ్యం. అందుకు కావలసిన సాధన సంపత్తిని సమకూర్చుకోవడానికి అతను త్రికరణ శుద్ధిగా పాడుపడాలి. (వివేక చూడామణి)
- జ్ఞానం లేని భక్తివల్ల ప్రయోజనము లేదు. శ్రీకృష్ణుడు సాక్షాత్ చైతన్య స్వరూపుడు. గోపికల వస్త్రాలను అపహరిస్తే అది దేహాభిమానం లేకుండా చేయడంగానే భావించారు గోపికలు. అందుకే అవమానంగా భావించలేదు. అలా భావించి వుంటేవారు తప్పక జారిణులు అయి వుండేవారు. అందుకే అఖిలదేహాలలో వుండే చైతన్యమే భగవంతుడని

గ్రహించారు గోపికలు. (స్వామి సుందర చైతన్యానంద)

- తమ ఐశ్వర్యము, అధికారము, పేరు ప్రతిష్టలు, ఉన్నత పదవులు చెప్పుకొని గర్వించకు. యివన్నీ మూన్నాళ్ల ముచ్చట్లే. చచ్చిన వెనుక యిందులో ఏ ఒక్కటీ వెంట వచ్చేది లేదు. (శ్రీరామకృష్ణ పరమహంస)
- దుర్లభమగు మానవజన్మ దొరికినను, దానిని బ్రహ్మ సాక్షాత్కారము కొరకై వినియోగింపని వాని పుట్టుక వ్యర్థము. (శ్రీరామ కృష్ణ పరమహంస)
- దేవుని కనుగొనుటకు ఎట్టి భక్తి కావలయునో తెలియునా భగవంతుని కొరకు అహోరాత్రములు పరితపించిపోవలెను. (శ్రీరామకృష్ణ పరమహంస)
- దివ్యత్వాన్ని పొందగోరే సాధకుడు స్వయంకృషితో తనలోని అజ్ఞానాన్ని తొలగించుకోవాలి (శ్రీ శంకరాచార్యులవారు)
- ద్వేషరహితుడు, మైత్రి, కారుణ్యం వున్నవాడు, మమకార, అహంకారము లను వదలిపెట్టినవాడు, సమచిత్తుడు, ఓరిమికలవాడు, నిత్య సంతుష్టుడు, స్థిర బుద్ధితో నాకు అర్పితమైనవాడు నాకు యిష్టమైన వాడు అని భగవద్వాక్యము. (భగవద్గీత)
- దుఃఖం కలిగినపుడు ఉద్వేగం చెందనివాడు, సుఖాలు, రాజ్యాది భోగాలు ప్రాప్తించినా వాటిపైన ఆసక్తి చూపనివాడు, రాగద్వేషాలకు వశులు కానివాడు, భయక్రోధాలకు లోనుకాని వాడు. ఈ రీతిగా ఎవని మనస్సు నిర్వికారంగా వుంటుందో అతడేముని. అతడే స్థితప్రజ్ఞుడు. (భగవద్గీత)
- దుర్లభమైన మానవజన్మ పొంది కూడా మోక్షాని కొరకై ప్రయత్నించని వాడు ఆత్మఘాతకుడే. ఆత్మజ్ఞానం సంపాదించ కుండా ఎవరికిని ముక్తి లభించదు. ఈ ఆత్మజ్ఞానాన్ని, సద్గురువుని ఆశ్రయించినట్లైన ఆయన అనుగ్రహముతోనే



సంపాదించాలి. (వేదాంత శాస్త్రం)

- నీట మునిగినవాడు ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి యగునట్లు, భగవంతుని కొరకు తీవ్రముగ ఆరాటపడినగాని అతడు సాక్షాత్కరింపడు. (శ్రీరామ కృష్ణ పరమహంస)
- నేను స్వేచ్ఛను సాధించుకుంటాను. ఆ స్వేచ్ఛను పదిమందికి పంచుతాను.
- నీవు భగవంతునకేది సమర్పించినను, అది వేయింతలుగా నీకు తిరిగి వచ్చును. కావున నీవు ఏ కర్మచేసినను చివరకు ఆ కర్మ ఫలమును భగదర్పితము చేయుము. (శ్రీరామకృష్ణ పరమహంస)
- నీలో వున్న శక్తిని నీవు తెలుసుకున్నప్పుడే గమ్యం చేరగలవు. ముందు నీ గురించి నీవు పరిశోధన చేయి. (శ్రీరామకృష్ణ పరమహం)
- నీవెన్నడూ ఒంటరివాడవు కాదు. అందుకు నీ నీడే నీకు సాక్షి మృత్యువు అంతే, నీ వెక్కడున్నా దాని సమయములో అది కబళించి వేస్తుంది. అలాగే నీ పాపపుణ్యాలు, మనస్సుతో చేసినా, శరీరముతో చేసినా, ఆఖరుకు చూపులతో చేసినా సరే వాటి ఫలితం అనుభవింపక తప్పదు. (మురళీకృష్ణ)
- నేను భగవంతుని శరణాలను ఆశ్రయించుతాను. నాకు యిక ఎవరివల్లా భయము లేదు. నా క్షేమం భగవంతుడే చూసు కుంటాడు. (సూరదాసు)
- నీతి, న్యాయం, ధర్మం, సత్యం మనిషి హృదయములో వుండాలి. అవి బలంగా వుంటే, ఆ వ్యక్తి మంచివాడవుతాడు. అవి బలహీనంగా వుంటే అతడు దుష్టుడు సంఘద్రోహి అవుతాడు. (మురళీకృష్ణ)
- ఏది తెలుసుకుంటే సర్వం తెలుస్తుందో ఆ పరమసత్య స్వరూపాన్ని తెలియజెప్పేదే ఆధ్యాత్మిక శాస్త్రమని తెలుసు కొనడానికి

ముందువున్న సాధన భక్తి.

- నీచులు చెప్పిన పనిచేయకుండా వూరకే మాట్లాడతారు. గొప్పవారు మాటలు చెప్పరు. పనులు చేసి చూపెడతారు. నీచునికి, గొప్పవానికి గల తేడా యిదే. (సుభాషితములు)
- ప్రతిప్రాణి జీవితం జనన మరణముల మధ్య సతమతమవుతూ వుంటుంది. జననము-మరణము ఇది కర్మశేషము, శేషము వున్నంత వరకు తప్పదు. ఎవరు ఎన్ని వేషాలు వేసినా ఈ రెండు తప్పవు.
- ప్రేమ అనే రెండక్షరాలు మధురాతి మధురమైన పలుకు. సృష్టికే మూలమైన మాట. ఈచరాచర ప్రపంచం నడిచేది ఈ రెండక్షరాలతోనే, ప్రేమే భక్తిగా మారుతుంది. ఈ ప్రేమ అనేది అమృత స్వరూపం.
- ప్రతి జీవి కర్మ బద్ధుడు. పూర్వజన్మ సంస్కారము వల్ల కలిగిన వారి కర్మలను మార్చగల శక్తి దేవతలకు కూడా లేదు. (భాగవతం)
- పవిత్రమైన నదికి తీర్థమని పేరు. గంగాది మహానదులన్నీ అట్టి పవిత్ర తీర్థాలే. సత్పురుషుడు కూడా ఒక తీర్థమే. ఆయన దర్శనమే మహా పుణ్యఫలం. అయితే ఇక్కడ గమనించ వలసిన ఒక విశేషముంది. తీర్థస్నానం వల్ల కలిగే ఫలం ఆముష్మికం. అది యెప్పుడో లభిస్తుంది. కాని మహాపురుష డనే తీర్థంతో సాంగత్యము చేస్తే సత్ఫలం కలుగుతుంది. ఏమిటా ఫలం అంటే? సత్సాంగత్యం. దీనివలన సర్వ సందేహ ములు నివృత్తి అయి దైవసన్నిధికి దారి దొరుకుతుంది.
- పరమ భాగవతోత్తములు తిరిగే తీర్థాలు పవిత్రమవుతాయి. కపిల మహర్షి తిరుపతిలో తిరిగిన తీర్థం కపిల తీర్థమయింది. నారదుడు గానము చేసిన తీర్థం, నారదతీర్థమయింది. అలాగే ఎన్నో (నారద భక్తి సూత్రములు)



- బాలుడు ఆకలిని, ఇతర బాధలను మరచి ఆటలలో ఎలా ఆనందిస్తాడో జ్ఞాని అహంకార, మమకారములు లేనివాడై అలాగే ఆనందిస్తాడు. ( శంకరాచార్యులవారు)
- బ్రహ్మప్రాప్తికి బ్రహ్మవిద్య పరమసాధనం. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్ర ములు భగవద్గీత, ఈ ప్రస్థానత్రయం బ్రహ్మవిద్యనే ప్రతిపాదిస్తుంది. అన్ని విద్యలలో ఆధ్యాత్మిక విద్య అగ్రగణ్యమైనది. (భగవద్గీత)
- భక్తుడు తన పతనానికి కారణములైన ధనాపేక్ష, స్త్రీ సాంగత్యం, నాస్తికత శత్రువుల గురించి ఆలోచించరాదు. (నారద భక్తి సూత్రాలు)
- మనిషిలోని కామమే (కోరికలు) పాపం చేయిస్తుంది. ఈ కామము వలన జ్ఞానం కప్పబడిపోతుంది. కామ, మోహాలను విడిచిపెడితేనే జ్ఞానం జాగృతమవుతుంది. (భగవద్గీత)
- మనస్సు వాక్కు, కర్మ ఒకటిగా వ్యవహరించేవారు మహాత్ములు. ఇవి మూడూ భిన్నంగా వుండేవారు (దురాత్మలు) అజ్ఞానులు.
- మనము చేసే ప్రతి పనీ ధర్మం కనిపెడుతూనే వుంటుంది. ఇక ఉదయ, సాయంసంధ్యలు, పగలు, రాత్రి, సూర్యుడు, చంద్రుడు అవన్నీ వుండనే వున్నాయి. ఇన్నిటి ఎదుట చేసేపని, కప్పిపుచ్చుకోవడమంటే ఆత్మవంచన. (మహాభారతం)
- మనలోని అసంతృప్తి, అత్యాశలే మన మనస్సును గూర్చి, బుద్ధిని గడ్డితినిపించి హింసకు ప్రేరేపిస్తవి.
- రామనామం అనే ధనం ఎవరివద్ద వుంటుందో వారే ధనవంతులు. మిగిలినవారు కాదు. (కబీరు)
- లాభం పొందడానికి అసలైన మార్గం అత్యాశ వదులు కోవడమే.
- లోకములో అగ్నికంటే అహంకారాగ్ని మహాచెడ్డది. అగ్ని మంచి కార్యాలకు, చెడు కార్యాలకు ఉపయోగపడుతుంది.

అహంకారాగ్ని వినాశనానికే ఉపయోగపడుతుంది. ఇది వ్యక్తిని, కుటుంబాన్ని, సంఘాన్ని కలుషితం చేస్తుంది. అగ్ని తన సమీపములోని వాటినే నాశనం చేస్తే అహంకారాగ్ని దూరముగావున్న వారికి కూడా తాపం కలిగిస్తుంది.

- లోకములో ఎందరెందరో పురుషులు ఎన్నెన్నో పుణ్యములు చేసి, ఏయే సుఖముల అనుభవించుచున్నారో ఆ సుఖము న్నిటిని బ్రహ్మైక్య సాక్షాత్కారవంతుడగు జ్ఞాని, బ్రహ్మానందమును అనుభవించుచున్నాడు. ఇది శాశ్వతానం దము. బ్రహ్మానం దము సముద్రము వంటిది. (తైత్తరీయోపనిషత్)
- విరగబూసిన చెట్టునుండి వెలువడే పరిమళం ఎంతయో దూరం వ్యాపించి ఆనందింపజేస్తూ వుంటుంది. ఆ విధంగానే పుణ్యాత్ములు చేసే పుణ్యకర్మల యొక్క ప్రభావం ఎంతో దూరం వ్యాపించి, లోకానికి క్షేమం కలిగిస్తూ వుంటుంది. అంటే పుణ్యకర్మ ప్రభావంచేత ప్రజల హృదయాలు పవిత్రములవు తాయి. లోకం శాంతి మయమవుతుంది.
- వెయ్యి యజ్ఞయాగాలు ఒక్క పక్కా, ఇంకొక ప్రక్క సత్యవాక్యం వేసి తూస్తే సత్యం వైపే మొగ్గుచూపుతుంది. ధర్మాలన్నిటిలోనికి సత్యమే తలమానికం. (మహాభారతం)
- శాస్త్రములో చెప్పినట్లు చేయు కర్మలు పుణ్యము. శాస్త్ర నిషిధ ములైన కర్మలు పాపము. శరీరముతో, నోటితో, మనస్సుతో చేసే కర్మలు మూడు రకములు. శరీరంతో చేసే పాపము వలన మానవులుగా అంత్యజాతులుగా పుడతారు. నోటితో చేసే పాపంవలన పక్షి, మృగాలుగా, మనస్సుతో చేసే పాపం వలన అజ్ఞానిగా ఆటవికులుగా జన్మలు వస్తవి. (వివేక చూడామణి)
- శాస్త్రాలు, ఉపనిషత్తులు మనిషిని దైవత్వానికి తీసుకొని వెళ్లే సోపానాలు.



- సూర్యచంద్రులు ప్రకాశాన్ని నేనే. భూమిలోని సుగంధాన్ని, అగ్నిలోని ఉష్ణశక్తిని సర్వజీవరాసులలోని జీవశక్తిని నేనే. భూత, భవిషత్, వర్త మానకాలాలలోని సర్వజీవరాశులను నేనెరుగుదును. సర్వజగత్పత్తిని, జగన్మాతను నేనే, సర్వజన పోషకుడను, సంహారకుడును నేనే. మనిషిలోని చైతన్యాన్ని నేనే. ఆది మధ్యాంతములు అన్నీ నేనే. నేను కానిదేదీ లేదు అర్జునా. (భగవద్గీత)
- సాధకుడు విషయలోలత్వంలో పడితే భగవంతుని పొందు సాధ్యం కాదు. ఇంద్రియదోషాలు అనేక జన్మల వాసనలు భక్తికి అడ్డం వస్తాయి. అయినా సాధకుడు పట్టుదలతో ఏ పని చేసినా భగవంతుని యందు నమ్మకముతో ప్రేమతో వుండాలి.
- సృష్టిని భగవంతుడు రాత్రింబవళ్ళు క్రమము తప్పకుండా నడపగలుగు చున్నాడు. ఋతువులను వరుసతప్పకుండా, నవగ్రహాలను నిర్ణీత మార్గములో, సముద్రమును చెలియకట్ట దాటకుండా నిలుపు చున్నాడు. కాని మానవుడు తన మానవ ధర్మమును వీడి, క్రమ బద్ధముగా జీవించలేకపోతున్నాడు. (మహాభారతం)
- సర్పము నోటిలో వున్న కప్ప దోమల కోసం చూచినట్లు, కాలసర్పము నోటిలో వున్నా లోకములో అశాశ్వతములగు భోగములను కోరు చుండును. (ఆదిశంకరాచార్యులు)
- సత్యము తల్లి, జ్ఞానము తండ్రి, ధర్మముతోడబుట్టినవాడు. దయ స్నేహితుడు, శాంతి భార్య, క్షమ కుమారుడు. ఈ ఆరుగురు నాకిష్టమైన బంధువులు. (ధర్మరాజు, మహాభారతం)
- సత్పురుషుడు కావడానికి, మనలోని మూడు కారణాలు మన ఆధీనములో వుండాలి. మనస్సు, వాక్కు, శరీరం. ఈ మూడింటి మధ్య ఏకత్వం కుదిరినప్పుడే సత్పురుషుడుగా తయారు కాగలుగుతాడు.

- స్వతసిద్ధంగా లభించినదానితో తృప్తిపడు. ఆయాచిత సంపాదనకు ఆశపడకు.
- స్తంభమునకు కట్టిన పశువులు స్తంభమును విడిచి ఎట్లు వెళ్లలేవో విషయ వాంఛలు గలవారు వాటిని విడనాడలేక వాటియందే ఆశ కలవారై శ్రేయోమార్గమునుండి బ్రష్టులగుచున్నారు. (శంకరాచార్యులవారు)
- సమస్తమైన అమంగళములు తడిబట్టను ఆశ్రయించుకొని వుంటాయి. తడిగుడ్డ కట్టుకునిగాని, పైనవేసుకుని గాని శుభ కర్మలు చేయకూడదు. అంతేకాదు తలుపులపైన తడిబట్ట వుంచకూడదు. అలా చేసిన తిరిగి స్నానం చేసినగాని శుద్ధుడుకాడు. తడిగుడ్డ కట్టుకుని పనులు చేసేవాడు దిగంబరులతో సమానము. (ధర్మశాస్త్రం)
- సంసారమనే రోగానికి మందు వేసేవాడే (వైద్యుడే) సద్గురువు. (తులసీదాసు)
- సజ్జనుడి గుణాలు పరిమళంగా అన్ని దిశలకు వ్యాపిస్తాయి.
- క్షమాగుణమే నిజమైన సన్యాసి స్వభావం. (శ్రీరామకృష్ణ పరమహంస)
- ఆకలి తీరుటకే అన్నము. దేవుడిచ్చిన దానితో తృప్తిపడు. ఇతరుల దయా దాక్షిణ్యాలకు లోబడకు. ప్రశాంతముగా జీవించు. (శ్రుతి)
- ఈ ప్రపంచములో సాధారణంగా సత్పురుషులే ఎక్కువ బాధలు అనుభవిస్తారు.
- ఉపనిషత్తుల అంతరార్థమును గురించి నిరంతరం మననం చేయుము. బ్రహ్మమును గూర్చి ఆలోచింపుము. అనవసర ప్రసంగాలు చేయకు. శ్రుతులు చెప్పినట్లు నడుచుకో. నేనే పరబ్రహ్మమనే భావము తోనే వుండుము. గర్వాన్ని విడిచి పెట్టుము. దేహమేనేనని భావము తొలగించు. (శ్రుతి)
- ఎన్నడును ఏ ప్రాణిని ప్రాణము తీయనివానిని మాంసము



భుజించని వానిని, సర్వజీవులు చేతులెత్తి పూజించును. (త్రిరువళ్లువర్)
- ఎంతటి తపఃశాలి అయినా సదాచారము లేనిచో వ్యర్థ జీవుడే అవుతాడు. (రామాయణం)
- జ్ఞానమనగా శాస్త్రార్థ జ్ఞానము. విజ్ఞానమనగా దానిని అనుభవము లోనికి తెచ్చుకొనుట. జ్ఞానమునకు అనుభవమే ప్రధానము. అనుభవ సిద్ధమగు జ్ఞానమే ప్రమాణము. (భగవద్గీత)
- సద్గురుదేవుల సాంగత్యము వారి ప్రబోధము వినుట, నిత్యము మంచివారితో మాట్లాడుట. వేదాన్ని వినడం, భగవద్గీత పారాయణ చేయడం, యజ్ఞాన్ని చూడడం, పురాణ కథలు వినడం, చదవడం. మంచిమనసు కలిగి వుండడం, భగవన్నామస్మరణ, దాన, ధర్మాలు చేయడం వలన మనుజులకు గ్రహపీడలు కలుగవు. (ధర్మశాస్త్రం)
- దేవాలయమునందు, నదీతీరములందు, తీర్థస్థలములయందు, శుభ కార్యములయందు, ప్రయాణములయందు, యజ్ఞశాలయందు ఒకరి నొకరు తాకినను దోషము లేదు. (ధర్మశాస్త్రం)
- ధర్మాన్ని అనుసరించకపోవడం, ధర్మాన్ని ద్వేషించడం మానవుని పతనానికి కారణం. (బుద్ధుడు)
- ధూప, దీప పాత్రలు, గంధం పాత్రలు, బెల్లం ముక్క, నీటి పాత్రలు, కొబ్బరి చిప్పలు, కొబ్బరి కాయలు, ఇంకా యితర పూజా ద్రవ్యములు దేవుని పీఠంపై పెట్టి పూజలు చేయకూడదు. (ధర్మశాస్త్రం)
- నవనాగరికత పేరుతో నేటి మన సమాజం సనాతన ధర్మానికి, ప్రాచీన సాంప్రదాయానికి తిలోదకాలిచ్చి వేదాలు, పుణాణాలు, ఇతిహాసాల పట్ల నిర్లక్ష్యభావం కలిగి వుండటం వల్లనే నేడు

మన హైందవ ధర్మము అనర్థాలను ఎదుర్కొం టుంది. నాలుగు వేదాల సంపుటియే మానవ జీవితం. వేదసమ్మతం కానిది సృష్టిలో లేదు.

- ప్రాణులన్నిటిమీద దయగలిగి వుండటం. అబద్ధం ఆడకుండా వుండడం. ఇదే ఉత్తమమైన ధర్మం. సుగతిమార్గం కోరేవారు ధర్మంగా నడవాలి.
- పరభార్యను వాంఛించినవాడు గ్రద్ధ జన్మ ఎత్తుతాడు.
- ప్రాణిహింసచేయువాడు అబద్ధములాడువాడు, దొంగ సొత్తును కొనువాడు, పరకాంతను గూడువాడు, సారాయి త్రాగువాడు ఈ లోకములో తన పతనానికి తానే కారకుడవుతాడు. (ధర్మశాస్త్రం)
- మన పుణ్య విశేషమువలన భగవంతుడు ఈ మానవ శరీరమును యిచ్చినాడు. ఈ శరీరము దేవతలకు కూడా దుర్లభము. ఇది సాధనాల నిలయం. మోక్షానికి ద్వారం. (తులసీదాసు)
- మనసు బాహ్యవిషయములందు వ్యాపించియున్నప్పుడు ఏకాగ్రత కలగదు. ఏకాగ్రత లేనిదే తత్త్వాను సంధానము రాదు. కావున ఎప్పుడు మనసు కోరికలయందు విరక్తిచెంది ఏకాగ్రతను పొందియుండునో అప్పుడు ఆత్మానుభవము నందు నిలిచియుండును. అప్పుడే సాధకుడు యోగి అవుతాడు. (భగవద్గీత)
- ఆశను పోగొట్టుకోలేనివాడు, కఠిక నేలమీద పడుకోవడం, తపస్సు చేయడం, మౌనముగా వుండడం, ఉపవాసాలు, పూజలు చేయడం, బూడిద పూసుకొని కాషాయాంబరాలు ధరించడం, ఎన్ని చేసినా కోరికలను నివారించలేవు. పైగా అవన్నీ వ్యర్థం కూడా. డంబాచారాలు గానే మిగులుతవి. (ధర్మశాస్త్రం)



- అశ్రద్ధతో చేసిన పని, మధ్యలో ఆగిన వ్రతము, కలంకయుతమైన బ్రహ్మచర్యము ఫలితాన్నివ్వవు.
- అగ్నియందు చేసిన హోమము సూర్యుని చేరును. సూర్యుని వలననే వర్షము కురియును. వర్షము వలన అన్నము, అన్నము వలన ప్రజలు జీవరాశులు సుఖించును. (మనుధర్మ శాస్త్రం)
- అసూయ, కోపం ఆయువును క్షీణింపజేస్తాయి.
- అబద్దాలు ఆడినందువల్ల నిజం చెప్పి కూడా ఎదుటివారిని నమ్మించ లేని పరిస్థితి తెచ్చుకుంటాం.
- అప్పుడే పిండిన పాలు వెంటనే పెరుగు కానట్లు పాపపు పనుల ఫలము వెంటనే అనుభవములోకిరాదు. నివురు గప్పిన నిప్పువలె అది ఏదో ఒకరోజు దహించి తీరుతుంది. మూర్ఖుని వెన్నంటియే వుంటుంది. (ధర్మశాస్త్రం)
- వినయముగా మాట్లాడుట. చిత్త చాంచల్యానికి గురి కాకుండా చేసుకోవడం, దేహాన్ని పాపకార్యాలకు లొంగ కుండా చూచుకోవడం ఈ మూడు త్రికరణ మార్గాలంటారు. ఈ మార్గములో నడిస్తే ధ్యానం అలవడుతుంది. ధ్యానమే జ్ఞానానికి కారణం. ధ్యానం లేకపోతే జ్ఞానం నిలువదు. జ్ఞానము నిలువకపోతే వాసనాక్షయము కానే కాదు. ముక్తి రానే రాదు. (శాస్త్రసూక్తి)
- ఆయువు తరిగిపోతుంది. యవ్వనం క్షీణిస్తుంది. గతం తిరిగి రాదు. కాలం జగత్తును భక్షిస్తోంది. సంపద నీటిలోని అలల వంటిది. జీవితం మెరుపుతీగ. కావున భగవాన్ రక్షించు, రక్షించు. (సుభాషితం)
- అన్ని వ్రతాలు స్త్రీలకే. పురుషులకున్నది ఒక్కటే వ్రతం. అదే ఏకపత్నీవ్రతం.
- ఇతరులను క్షమించలేనివాడికి తనను క్షమించమని భగవంతుని అడిగే అధికారం వుండదు. (శాస్త్రసూక్తి)

- ఇతరులు తమంతతామే దానమివ్వజూపిన గ్రహింప కుండుట ఉత్తమ లక్షణం. దానం తీసుకున్నందున ఇచ్చిన వారి పాప మును, పుచ్చుకొన్నవాడు భరింపక తప్పదు. ఈ నియమము పాటించువారికి పూర్వజన్మ వృత్తాంతము తెలియును. వీని వలన జన్మరాహిత్యము అందుబాటులోనికి వచ్చును. (తైత్తిరీయ సంహితవేదం)
- ఈ దేహము సుఖదుఃఖములతో కూడినది. చర్మము, మాంసము, కలిగి దుఃఖమునకు నిలయము. భూమి, ఆకాశము, వాయువు, అగ్ని నీరు అను పంచభూతముల వలన గలిగి వాటితోకూడినది. దేహము నశించగానే పంచ ప్రాణములు పంచ భూతములలో కలిసిపోతాయి. (స్కాంద పురాణం) (వశిష్ట మహర్షి)
- ఈ దేహములో ప్రాణమున్నంత వరకూ ఇంటిలోని వారందరూ యోగ క్షేమములు విచారించెదరు. ఈ దేహము నుంచి జీవుడు తొలగినా, భార్య సహితము భయపడెదరు. (భజ గోవిందం, శంకరాచార్యులవారు)
- ఉపవాసం అంటే పేదవాని ఆకలి ఎలాంటిదో తాను స్వయముగా స్వానుభవముతో తెలుసుకునే రోజు. ఒక ఉపవాసం వలన నిగ్రహశక్తి పెరగడంతో పాటు సంపూర్ణ ఆరోగ్యం కలుగుతుంది. ప్రేమ, దయ, త్యాగం వంటి సుగుణాలు, పరలోకచింతన, పశ్చాత్తాపగుణం వస్తుంది. మనిషి మనసు, అంతరాత్మ మేల్కొంటాయి. పాపభీతితో బాటు దైవ ప్రీతి కలుగుతుంది. దైవానికి సన్నిహితులవుతాం. (పురాణ సూక్తి)
- ఋషులు దీర్ఘకాలము సంధ్యనుపాసించిన వారగుటచే దీర్ఘాయు వును, ప్రజ్ఞను, యశస్సును, కీర్తిని, బ్రహ్మవర్చస్సును పొందారు (మనుమహర్షి)
- ఎవరు భగవంతుని ఏ రూపములో అర్చించినను భగవంతుడు సంతుష్టుడగును. ఏ దేవతను ఏ విధముగా ఆరాధించినను,



అది భగవదారాధనమే అవుతుంది. (హిందూధర్మం)
- ఎవనియందు ద్వేషములేనివాడును, అందరియందు స్నేహము, కరుణగలవాడు. నేను, నాదియను భావము లేనివాడు, సుఖదుఃఖాలను సమానముగా చూచువాడు, ఓర్పుగలిగినవాడు మోక్షప్రాప్తికి అర్హుడు. (భగవద్గీత)
- ఏ గృహములో భార్యతో భర్తయు, భర్తతో భార్యయు నిత్యము సంతుష్టులై వుందురో ఆ గృహము నిత్య మంగళకరముగా నుండుట తధ్యము. (మను మహర్షి)
- ఎవరు యిష్టమైనదానిని పొందియు సంతోషింపరో, అప్రియమైన దానిని ద్వేషింపరో, ఇష్టమైనవారు నశించి నపుడు దుఃఖించరో, లేని దానిని కోరరో, శుభా శుభములను వదలునో అట్టివారు నాకు భక్తులు.
- ఏది తప్పో, ఏది ఒప్పో అంతరాత్మ చెబుతూనే వుంటుంది. నాకు తెలియదనడం వంచనే అవుతుంది.
- ఐశ్వర్యాన్ని బట్టి దానం చేయాలి. ఆ దానం కూడా యింతే యిస్తున్నానని సిగ్గుపడుతూ దానం చేయాలి. దానము పుచ్చుకొను వానికి ఏమి కష్టము కలుగునో అని భయముతో దానం చేయాలి. పాత్రత ఎరిగి పరమేశ్వరార్పణ బుద్ధితో దానం చేయాలి. (తైత్తరీయోపనిషత్)
- ఓ మూఢుడా, ధన ఆశను వదలిపెట్టుము, ఓ మందబుద్ధీ మనసు నందు వైరాగ్యమును పూనుము. స్వయంకృషితో సంపాదించిన ధనముతో తృప్తినొంది మనస్సునకు సంతోష మును కలిగించుము. గోవిందుని భజింపుము. (ఆది శంకరాచార్యలు (భజగోవిందం)
- ఒక నెలరోజులు గాయత్రిమంత్రమును వేయిసార్లు చొప్పన జపించినచో పాము కుబుసమునుండి విడివడినట్లుగా ఘోర పాపాల నుండి మానవుడు విముక్తి చెందును. (మనుస్మృతి)

- ఓర్పుచేత పండితుడు శుద్ధులవుతారు. చేయకూడని పనులు చేసిన వారు దానముచేతను, రహస్యముగా పాపములు చేసినవారు జపము చేతను, వేద పురాణాల సారాన్ని ఎరుగనివారు తపస్సు చేతను శుద్ధులగుదురు. (మనుధర్మం)
- కష్టాలు వచ్చినపుడు సహించుకోవాలి. అంతేగాని ఇతరుల సహాయము కోరరాదు. ఆ విధముగా కోరినవాడు భగవంతుని యందు నమ్మకములేనివాడవుతాడు. దుఃఖముల యందు భయము, సుఖములయందు కోరిక ఉండరాదు. (భగవద్గీత)
- కష్టపడి సంపాదించుకొనవలసినది కీర్తి. కష్టపడి నిలిపి ఉంచుకో వలసినది గౌరవం.
- కోపాన్ని విడిచిపెట్టు, అహంకారాన్ని అణుచుకో, అప్పుడు నీవు అన్ని బంధాల నుండి విముక్తుడవుతావు.
- కపటములేని నరుడే నారాయణుని చూడగలడు.
- కార్తీక మాసముతో సమానమైన మాసము లేదు. వేదముతో సమానమైన శాస్త్రము లేదు. ఆరోగ్యముతో సమానమైన ఆనందము లేదు. సూర్యునితో సమానమైన తేజోవంతుడు, రావిచెట్టుతో సమానమైన చెట్టులేదు. (అత్రి మహాముని)
- కాలాన్ని వృధాగా గడపకు. కాలముతోపాటు నీ జీవితము కూడా తరిగిపోతుందని తెలుసుకో. (సాయిరాం)
- కలుషితమైన మనస్సు ఉన్నయెడల విషయాలను ఉన్నది ఉన్నట్లు అర్థం చేసుకోనివ్వదు.
- కృషీవలుడు శ్రమిస్తేనే అన్నం లభిస్తుంది. బాటసారి నడిస్తేనే గమ్యం చేరతాడు. విద్యాదానం వల్లనే జ్ఞానికాగలడు. ఇవ్వడం వల్లనే దాత కాగలడు. (ఋగ్వేదం)
- గంగానది పాపాలను పోగొడుతుంది. చంద్రుడు శరీర తాపం నశింప జేస్తాడు. కల్పవృక్షం దారిద్ర్యం నివారిస్తుంది. సజ్జన



సాంగత్యం ఈ మూడు కార్యాలను సాధించి పెడుతుంది.

- గురువు చూపిన లక్ష్యం మీద అచంచల విశ్వాసముతో మనసు నిలిపి ధ్యానిస్తే జీవుడు శివుడు కాగలుగుతాడు. నరుడు నారాయణుడు కాగలడు.
- చెడ్డపనులు చేయువారు తమ చెడ్డపనుల వలన పొందే ఫలాన్ని చూసుకొని మురిసిపోతూ వుంటారు. ఇదే మంచి దని ఇంకా చెడు మార్గములో నడుస్తూ వుంటారు. కాని ఇదే వారి నాశనానికి కారణ మవుతుందని తెలుసు కోలేరు.
- చేసిన చెడ్డపని మరల చేయకుండా వుండడమే నిజమైన పశ్చాత్తాపం.
- చేసే పనులను బట్టి వ్యక్తి యొక్క గుణగణాలు నిర్ణయించాలి గాని, ధరించే బట్టలను బట్టిగాదు. (వివేకానందస్వామి)
- చెడ్డపనులు చేసి బ్రతికేవారు ఈ జన్మలోనే గాదు, వచ్చే జన్మలో గూడా తమ చెడు ఫలితాన్ని అనుభవించక తప్పదు. చెడ్డ కర్మకు ఫలితము దుఃఖము, మంచి కర్మకు ఫలితము సుఖము కలుగుతాయి.
- చెట్టును నరికినంత మాత్రాన ఆ చెట్టు చావదు. వ్రేళ్ళు మళ్ళీ చిగిరిస్తూ వుంటాయి. ఆ విధముగానే (తృష్ణా) ఆశ కోరిక మిగిలివున్న యెడల మరల అది అభివృద్ధి చెంది, పునర్జన్మ దుఃఖమును తెచ్చుపెట్టును.
- జీవుడు ముందు జన్మలో పొందిన యోగసిద్ధిని, ఈ జన్మలో కూడా అంటుకొని పరిపూర్ణ సిద్ధి కోసం ప్రయత్నిస్తాడు. (భగవద్గీత)
- డబ్బుపెట్టి మనము ఏమి కొనగలము. ఆయుర్ధాయాన్ని కొనగలమా, ఆరోగ్యాన్ని కొనగలమా, బుద్ధిని కొనగలమా, అదృష్టాన్ని కొనగలమా? డబ్బున్నవాళ్ళు, అధికారములో వున్నవారు చావును ఆపగలరా? ఈ డబ్బు గురించి ఇంత

ఆరాటమెందుకు. (సత్యసాయిబాబా)

- తప్పుచేసిన వాడికి ఫలితం వెంటనే కనబడదు. భూమిలో వేసిన విత్తనము పైకి వచ్చి ఫలించుటకు కొంతకాలము పడుతుంది.
- దుర్భిక్ష సమయములో అన్నదానం చేసినవాడికి, తగిన సమయ ములో ధనాన్ని దానం యిచ్చినవాడికి, పోరాటంలో యుద్ధ,లో ధైర్యంతో ముందడుగు వేసేవాడికి, అప్పులు చేయకుండా బ్రతికేవాడికి నేను నమస్కరిస్తున్నాను. (శ్రీకృష్ణుడు మహా భారతంలో)
- దరిద్రముతో సమానమైన దుఃఖమును, పుత్రుడు మరణిం చిన దానితో సమానమైన దుఃఖము, భార్య వియోగ ముతో సమానమైన దుఃఖమును లేవు. (కార్తీక పురాణం)
- ఒకరిని దూషించిడము విసిరిన రాయి వంటిది. అది విసిరిన వారి నెత్తినే పడుతుంది.
- దేహానికి వ్యాయామము ఎంత అవసరమో మనస్సుకు గ్రంథపఠనము అంత అవసరము. (ఋషిప్రోక్తం)
- ధర్మమునందును, భక్తియందును, మోక్షమునందును, కోరిక లేనిచో, మానవుడు తరింపలేడు. కావున యివి వదలదగినవి కావు. ఇతర కోరికలన్నీ బంధహేతువులు. (పతంజలి యోగశాస్త్రం)
- నిర్మల హృదయం, సత్యవాక్కు, నిష్కామ కర్మ, విధి నిర్వహణ అనునవి ఏ మతమైనా చెప్పేది యిదే. (సుభాషితం)
- నిజమైన సాధకుడు కర్షకునిలాగా వుండాలి (రైతులాగ). విత్తనము నాటిన నుండి ఫలసాయం వచ్చేవరకూ అతడు ఎన్నో శ్రమలు పడతాడు. అలాగే సాధకుడు మంచిని పెంచు కుని, దయతో,ప్రేమతో, మంచి ప్రవర్తన అలవాటు చేసుకుని మంచి పండితులతో స్నేహము చేసి జ్ఞానమనే పంటను పండించుకోవాలి. (సత్యసాయిబాబా)



- నాదియనునది ఏదియు మనకు లేదని మనము తెలుసు కున్న మరుక్షణం దేవతలవలె స్వయం ప్రకాశకుల మవు తాము. శాశ్వత సౌఖ్యానందములు పొందుతాము.
- నిజమైన భక్తుడు ఉండవలసిన లక్షణము ఎవరైనా మాటలు ఎత్తి పొడవవచ్చు, కొట్టవచ్చు, భక్తులైనవారు వాటినన్నింటిని సహించుకొన వలసినదే. లేకుంటే భక్తిపోయి మామూలు మనిషే మిగులుతాడు. (శమీక మహర్షి)
- నీ శత్రువులు నీలోనే వున్నారు. నిజానికి వేరే శత్రువులేవరూ లేరు. తప్పుడు త్రోవత్రొక్కే నీ మనస్సు నీకు శత్రువని తెలుసుకో (భాగవతం)
- నీకు భగవంతునికి మధ్య అహంకారమనే తెరవున్నది. దానిని తొలగించుకోవడం నీ ప్రయత్నము వల్ల సాధ్యము కాదు. అందుకు ఈశ్వర కృప చాలా అవసరం. (మెహర్ బాబా)
- పూజలు, సేవలు, యజ్ఞయాగాదులు, చిత్తశుద్ధి, సమదృష్టి, కలగడానికే ఆధ్యాత్మిక సాధనలో అవి సోపానాలు.
- పుట్టేటప్పుడు గోచీ అయినా లేకుండా పుడతారు. పోయే టప్పుడు కనీసం అడ్డసయినా యివ్వకుండా పోతారు.
- పాలు ఎంత స్వచ్ఛంగా వున్నా శుద్ధిచేయని పాత్రలో విరిగి పోతాయి. అదే విధముగా ఎంత గురుభక్తి, దైవభక్తి వున్నా హృదయశుద్ధి, సాధన లేనిచో వారు రాణించరు. (ఫలితాన్ని పొందలేరు)
- పతితుడైన తండ్రిని విసర్జించవచ్చునుగాని, పతితురాలైన తల్లిని పరిత్యజించరాదు. (వసిష్ఠస్మృతి)
- పరుల సొమ్మును, పరవస్తువును ఆశించకూడదు. మనస్సులో కూడా పరుల వస్తువును ఆశించనివానికి ప్రకృతి దేవతయే సమస్త సంపదలు చేకూర్చును.
- ప్రార్థనలో, పూజ, తపస్సో ఏదో ఒక సత్కర్మ చేయగా, చేయగా

కర్మ పరిపాకమై జన్మ జన్మ బంధ రాహిత్యం ఏదో ఒక నాటికి తప్పక సిద్ధిస్తుంది.

- ప్రతి కుటుంబములోని స్త్రీ ఒక గృహహాలక్ష్మి, ఆ వంశ ప్రతిష్ట ఆమె మీదనే ఆధారపడి వుంది. మరి ఆమెకు ప్రత్యేక దైవం భర్తే. వారిద్దరూ గృహస్థజీవితం ఈ సమాజానికి ఒక ఆదర్శం:
- భగవన్నామం కర్మను, వాక్కును, శరీరాన్ని, మనస్సును పవిత్రం చేస్తుంది.
- భర్త గతించిన పిదప ఏ స్త్రీ బ్రహ్మచర్యవ్రతమును పాటించునో, అట్టి స్త్రీ మరణాంతరమున, బ్రహ్మచారులవలె స్వర్గమును చేరును. (పరాశరస్మృతి)
- భర్త భార్యలో ప్రవేశించుచున్నాడు. భార్యనే తల్లిగా జేసుకొను చున్నాడు. తొమ్మిది మాసములు నిండుసరికి, ఆమెయందు క్రొత్తగా పుట్టు చున్నాడు. దీనిని బట్టి భార్య కూడా తల్లివలెనే అమిత ఆదరణీయురాలు (ఇతరేబ్రాహ్మణము)
- భక్తి, జ్ఞానములలో ఏ బేధము లేదు. రెండూ సంసార సాగరాన్ని దాటిస్తాయి. (తులసీదాసు)
- బయట తిరగాలంటే బట్ట కట్టడం ఎంత అవసరమో బ్రతుకు సార్థకం కావాలంటే, మంచి పనికోసం నడుం కట్టడం అంత అవసరం.
- మానవులలో ఉత్తమములుగా ఉన్నవారు పూర్వము దేవతలుగా వుండి వచ్చినారని శివుడు పార్వతితో చెప్పాడు. (భారతం)
- మనిషి పక్షిలాగా ఎగరగలుగుతున్నాడు. చేపలాగ నీటిలో ఈదగలుగు చున్నాడు. కాని మనిషిలాగ ఎందుకు నడవ డము లేదో మానవ ధర్మంగా నడవడము లేదు. అదే ఆశ్చర్యకరము.
- మనము భగవంతుని దృష్టిలో అహింసాపరులమైతే క్రూర



మృగాలు కూడా మనలను బాధించవు.

- మౌనవ్రతం పాటించడం మంచిది. మౌనం ఆధ్యాత్మిక శక్తిని పెంచుతుంది. మనస్సును శాంతిమయం చేస్తుంది. (గాంధి)
- మంచివాడు, నీతిమంతుడు అనే పేరు సంపాదించుకోవడం ఎంత కష్టమో. దానిని కాపాడుకోవడం కూడా అంతే కష్టం. ఏ చిన్న బలహీనత వల్లగాని ఏ పాటి ఏమరపాటువల్లగాని జరిగిన అంత పెద్ద పేరు బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది.
- మాతృసేవచే ఈ లోకమును, పితృసేవచే మధ్యమమగు లోకమును, గురుసేవచే బ్రహ్మలోకమును పొందుతారు. ఈ లోకమును పొందుట యనగా ఈ లోకమునయందలి సుఖభోగములను పొందుట. ఈ ముగ్గురికి సేవచేసిన వారు అన్ని ధర్మాలను చేసిన వారగుదురు. ముగ్గురిని సేవించని వారు (ఆదరించనివారు) ఎన్ని చేసినను చేయనివారగుదురు. (మనుధర్మశాస్త్రం)
- మనస్సులో నిరంతరము శుభమునే తలచుచుండవలెను. శుభాన్ని చూస్తూ శుభవార్తలనే వింటూ, శుభప్రదమైన ఆలోచ నలనే చేస్తుండ వలెను. ఎట్టి పరిస్థితులలోనూ మనస్సును కలత చెందనీయకూడదు. (త్తైత్తిరీయ సంహిత)
- ఈ లోకంలో మానవదేహం దుర్లభం. ఈ దేహం ఎప్పుడు నశిస్తుందో తెలియదు. కనుక ఈ దేహంతో వున్న కొద్ది కాలములోనే ప్రతిక్షణం సత్సంగముతోనే గడపాలి. (భాగవతం)
- వివాహ సమయములోనూ, ప్రాణానికి హాని జరిగేటప్పుడు, మానానికి హాని కలిగే పరిస్థితి ఏర్పడినపుడు, గోవులను, సాధువులను, ఉత్తమ బ్రాహ్మణులను రక్షించవలసి వచ్చినపుడు, అబద్దమాడుటలో తప్పులేదు. (భాగవతం)
- శాంతిని ఎవరూ దానం చేయలేరు. మనకు మనమే సాధన ద్వారా సంపాదించుకోవాలి.

◆ శరణన్నవారిని పరమాత్మ విడిచిపెట్టడు. కృప అనే కోటలో వుంచి వారిని రక్షిస్తాడు. (శ్రీ సూరదాసు)

◆ శరీరం శిథిలం కాకముందే, ఇంద్రియాలన్నీ చక్కగా పని చేస్తున్నప్పుడే మోక్షసాధనకు పూనుకోవాలి. (శంకరా చార్యులవారు)

◆ శాస్త్ర ప్రకారము ఋషిఋణము, పితరుల ఋణము, దేవ ఋణము తీర్చుకొని, పుత్రునియందు గృహభారముంచి మధ్య స్తునివలె నుండవలెను. ఏకాంతముగా కూర్చొని జీవాత్మల, పరమాత్మల గురించి ఆలోచించాలి. ఏకాంతముగా ఆలో చించేవానికే మోక్షము కలుగును. (మనుమహర్షి)

◆ స్త్రీలు చేయు వ్రతాలు భర్త అనుమతితో చేయాలి. భర్త అనుజ్ఞ లేకుండా చేయు వ్రతములు రాక్షసులకు చేరును. (తైతరీయ బ్రాహ్మణము)

◆ స్త్రీలు అంటే గృహాన్ని ప్రకాశింపచేయు దీపములు. వారు సాక్షాత్ లక్ష్మీదేవులు. (మనుస్మృతి)

◆ స్త్రీలు ఏ గృహములో పూజింపబడుచున్నారో (గౌరవింపబడు) అచట దేవతలు నివాసముందురు. స్త్రీలకు ఏ గృహములో ఆదరణ లేదో ఆ యింట చేయు సత్కర్మములన్నియు నిష్ఫల ములు. (మనుస్మృతి)

◆ సత్ బ్రాహ్మణుడు అనే దానికి దయ, బాహ్యాభ్యంతర శుచి, క్షమ, కోపము లేకుండుట. అందరినీ సమానముగా చూచు కొనుట. ఇవే బ్రాహ్మణుని యొక్క లక్షణములు.

◆ సూర్యుడు తులాసంక్రమణ మందుండగా, కార్తీక మాసములో చేసిన స్నానము, దానము, అర్చన మొదలైనవి మంచి మన స్సుతో ఏమి చేసినను అక్షయములగునని, మునీశ్వరులు చెప్పారని వశిష్ట మహర్షి జనక మహారాజు నకు విన్నవిం చెను. (కార్తీక పురాణము)

◆ స్త్రీలు గాని, పురుషులు గాని, ఎవరు కార్తీక సోమవారము



నందు నక్షత్రములను చూచి రాత్రి భోజనము చేయుదురో వారి పాతకములు అగ్నియందుంచబడిన దూదివలె నశించును. వశిష్టుడు (కార్తీక పురాణం)

◆ స్త్రీ పురుషులలో ఒకరు హెచ్చు, ఒకరు తక్కువ అనేది లేదు. స్త్రీ సహకారం లేని పురుషుని జీవితం గౌరవింపబడదు. పురుషుని సహచర్యం లేని స్త్రీ జీవితం గౌరవింపబడదు. ఇద్దరూ కలిసి మంచి సంతానాన్ని కని, సత్య, ధర్మ, ప్రేమలను తమ సంతానానికి అందించాలి. ఆ విధముగా సమాజ అభివృద్ధి చేయాలి. (వేదాలు)

◆ సత్ ప్రవర్తన అలవరచుకున్నవారు నిర్మలమైన హృదయము కలిగి, పాపాలన్నీ పటాపంచలు చేసుకొని ప్రశాంతమైన జీవనము గడుపుతారు. (భాగవతం)

◆ క్షమ, దయ, కరుణ, ఋజువర్తనము, నిత్య సంతృప్తి ఇవే ముక్తికి సులభ మార్గాలు.

◆ అహంకారమనే అగ్ని మండే వస్త్రములాంటిది. అది తగుల బడుతూ మనిషి శరీరాన్ని దహింపజేస్తుంది. (మహమ్మద్)

◆ అన్నంచేత శరీరం అభివృద్ధి ఎలా చెందుతుందో ధ్యానం చేత సూక్ష్మ శరీరం, జ్ఞానవృద్ధి చెందుతుంది. (గీతాచార్యులు)

◆ ఓ శివా సాలెపురుగు ఏ వేదం చదివింది. ఏనుగు ఏ విద్య నేర్చుకుంది. అడవిలో అక్షరం ముక్కరాని కన్నప్ప ఏ మంత్ర ఉపదేశం పొందాడు. అయినా వారికి మోక్షాన్నిచ్చావు. నీ భక్తులకు చదువు, కులం, యోగ్యతలు ఏవీ అక్కర్లేదు. భక్తి వుంటే చాలు. (శ్రీకాళహస్తి మహాత్యం)

◆ కామము లేక కోరికయే మనిషిని కర్మమునకు ప్రేరేపించు చున్నది. ఆ కర్మలే బుద్ధిని పెడద్రోవ పట్టించి, మనిషిని అధోమార్గానికి తీసుకొని వెళుతున్నది. (తైత్తరీయో పనిషత్)

◆ గాలిపడగ ఎంత దూరములోనైనా ఉండనీ దారం నీ చేతిలో

వుంటే నీ స్వాధీనమే అన్నట్లు. అలాగే భగవన్నామాన్ని పట్టుకున్నావా భగవంతుని పట్టుకున్నట్టే. (రామకృష్ణ పరమహంస)

- చీకటిలోనే నక్షత్రాలు కనిపించునట్లు, కష్టాలలోనే కటిక నిజాలు బోధపడతాయి.
- బాల్యంలో చదువు, యవ్వనంలో గృహస్థ జీవితం, వార్ధక్యంలో ముని వృత్తి అవలంభించాలి ప్రతివారు. (కాళిదాసు)
- జ్ఞానం వల్ల అహంకారం నశిస్తుంది. భక్తివల్లను మమకారం నశిస్తుంది.
- తపస్వికంటె, శాస్త్రవేత్తకంటె, కర్మిష్టికంటె, యోగి సర్వేశ్రేష్టుడు. అన్ని యోగాలలో భక్తియోగం సర్వశ్రేష్టం. (భగవద్గీత)
- తలలు బోడిచేసుకొని గడ్డాలు, మీసాలు పెంచుకున్నంత మాత్రాన అతను యోగి అనీ, సన్యాసి అని యెవరూ అనిపించుకోరు. తలపులు (సంకల్పము) బోడి చేసుకుని సత్యము, అహింసలను పాటించినపుడే అతడు సన్యాసి అని యోగియని అనిపించుకుంటాడు.
- ధనము సంపాదించుట దైవయోగము కాదు. సంపాదించినది సద్వినియోగము చేయుట భగవదనుగ్రహము.
- దైవాంశసంభూతమైన మానవుని హృదయం ప్రేమమయం కావాలి. సానుభూతి, దయ, కరుణ, దానం, త్యాగం, ప్రేమ యొక్క సహజ లక్షణాలు. స్వార్థం, అహంకారం, ఆడంబరం వంటి మాలిన్యాన్ని హృదయములో నుంచి పారద్రోలి, తోటి మానవులకు సేవ చేయుట, అది భగవత్ సేవగా భావించిన అదే ఉత్తమమైన మార్గం. సేవ వల్ల కలిగే ఆత్మానందమే ప్రేమామృతం. (సత్యసాయిబాబా)
- ధర్మాలు చెప్పేవారంతా ధర్మబోధకులు కారు. తనకు తెలిసిన ధర్మాన్ని అనుసరించి ఇతరులకు చెప్పేవాడే అసలైన ధర్మబోధకుడు.



- భగవత్ కథలను వినడము వలన, భగవన్నామం స్మరించడము వలన మనిషిలో వుండే తమో, రజో గుణాలు నశిస్తాయి. సాత్విక బుద్ధి వృద్ధి చెందుతుంది. (నారద మహర్షి)
- నువ్వులలో నూనెలాగ, పెరుగులో వెన్నలాగ, భూమిలో నీటిలాగ, కట్టెలో బొగ్గులాగ పరమాత్మయందు బుద్ధి పెట్టుకొని జప ధ్యానములను సత్యము, ఆత్మ నిగ్రహము, ధ్యాన ములను సాధనలుగా జేసుకొని, తదేక నిష్టతో అన్వేషించిన అతడు పరబ్రహ్మము కాగలడు. (శేతాశ్వతరోఉపనిషత్)
- పన్నెండేండ్లు వీర్యమును రక్షించుకున్న వారికి గొప్ప మహిమలు వచ్చును. నూతన నాడి వచ్చును. అదే మేధానాడి. ఆ నాడి బలపడి నపుడు సర్వము ఎరుంగగలడు. (శ్రీ మలయాళ స్వామి)
- మనస్సు కోతి లాంటిది. దీనికి నామమనే కళ్ళెం వేసి, మాటి మాటికి మరల్చుచుండవలెను.
- పుణ్యకర్మలు చేయుటచేత పాపం పోతుంది. ధ్యానం వలన మనస్సు చంచలత్వముండదు. భగవద్విచారణవలన శరీరానికి వున్న బంధుత్వం ఉండదు. పుణ్య కార్యాలచే మరుజన్మమున, ధనము, ధాన్యము సమృద్ధిగా వుంటవి.
- పంచామృత అభిషేకము రోజూ మన దేవాలయములలో, యిండ్లలో జరుగు దేవతార్చనలో ఈ పంచామృతాన్ని తీర్థంగా యిస్తారు. ఇది కేన్సర్‌ను రానీయకుండుటయే గాక, కేన్సర్ రోగులు ఈ తీర్థాన్ని రోజూ సేవించిన కాన్సర్ నయమవుతుంది. అందుకే మన ఋషులు దేవాలయాలలో, దేవతార్చనలో ఇది తప్పనిసరిగా ఆచారం చేసి పెట్టారు. పాలు, పెరుగు, తేనె, కొబ్బరి నీరు, అరటిపండు, పంచదార ఇవి కలిసినదే పంచామృతం. ఈ ఏడింటి కలయిక వలన పొటాషియం ఉత్పత్తి అవుతుంది. అదే కేన్సర్‌కు విరుగుడు. (మురళీకృష్ణ)

- భగవంతుడు బ్రహ్మను సృష్టించి అతనికి వేదాలు యిచ్చాడు. (శ్వేతాశ్వతరోపనిషత్)
- మరణకాలమున బుద్ధి ఏ విధముగా వుండునో మరుజన్మ దానికి తగినట్లుగనే కలుగుచుండును.
- మనము చేసే పాపపుణ్యముల కర్మ ఫలితమును అనుభవించ డానికి కొంత కాలముపడుతుంది. పశువు గడ్డి తినగానే పాలివ్వదు గదా.
- మహాత్ములను చూడగానే వినమ్రతతో నమస్కరించాలి. భక్తితో నమస్కరించిన వారికి ప్రకృతి వశపడును.
- మంత్రము పన్నెండు సంవత్సరములకు ఫలించును. పరమాత్మ యందు ఎన్ని నిమిషములు కలిసియుండునో అవియే లెక్కకు వచ్చును. ఈ లెక్క ప్రకారమే 12 సంవత్సరములు కావలెను. సమయము దొరికి నపుడల్లా ధ్యానము చేస్తుం డండి. పరమాత్మయందు నిలకడ కలిగేవరకు పుణ్యకర్మలు చేస్తూ వుండాలి. (శ్రీ మలయాళస్వామి)
- శుభములు సాధించాలన్నా, సుఖదుఃఖాలను సహించాలనిన, మంచి వారి స్నేహమనేది చాలా ముఖ్యం. మంచి స్నేహితునితో సమానమైన వస్తువు మరొకటి లేదు. (భారతం - శాంతిపర్వం)
- స్వార్జితం తినేవాడు ఉత్తముడు. పిత్రార్జితం తినేవాడు మధ్యముడు. సోదరుల మీద ఆధారపడి తినువాడు అధముడు. ఆడదాని సొమ్ము తిని బ్రతికేవాడు అధమాధ ముడు. (భర్తృహరి సుభాషితం)
- భూమిని త్రవ్వితేనే నీరు వస్తుంది. బద్దలను వంచితేనే ధనస్సు తయారవుతుంది. కొయ్యను చెక్కితేనే బొమ్మ తయారవుతుంది. అదే విధముగా మనోనిగ్రహము ద్వారా, మోక్షమార్గము దొరుకుతుంది.
- అనుకూలవతియైన భార్య, తండ్రియందు పూజ్యభావము



కలిగిన కొడుకు, అత్తమామలను గౌరవముతో చూసే కోడలు, అభిమానించే బంధుమిత్రులు, ధనం హోదావుండి, పరిచారికలుండి, అధికారం వున్నా దైవకృప లేకపోతే, అంటే ఆయుర్దాయము లేకపోతే ఎవ్వరూ అడ్డుపడలేరు. అప్పుడు మనలను రక్షించేది తను చేసుకొన్న ధర్మమే అతనిని కాపాడగలదు. (భగవద్గీత)

- ఆకాశంలో ఎక్కడో లక్షల మైళ్ళ దూరములో వున్న సూర్యుడు భూమి మీద వున్న పద్మాన్ని వికసింపజేసినట్లు, మహాత్ములు వారి మాట ప్రవర్తనతో మనలను వికసింపజేస్తారు.
- అరుణాచలం కొండ శివలింగరూపములో అర్చించబడు చున్నది. బ్రహ్మ విష్ణువులు లింగరూపములో వున్న శివుని ఆది అంతములు కనుగొన లేకపోయినది యిక్కడే. పార్వతికి అర్ధదేహమునిచ్చి అర్ధనారీశ్వరు డైనది యిక్కడే. అందుకే శ్రీచక్రమని, గిరిప్రదక్షణ చేయమని, రమణ మహర్షి అక్కడకు వెళ్లిన వారికి చెపూ వుండేవారు. (మురళీకృష్ణ)
- అబద్దం చెప్పేవారు నిజం చెప్పినా, ఇది మరో క్రొత్త అబద్దం అనుకుంటారే తప్ప అది నిజం అని ఎవరూ నమ్మరు.
- అబద్దాలు చెపూ బ్రతికే కంటే మూగవానిగా వుండటం మంచిది. పితురీలు చెప్పి బ్రతికేకంటే చావడం మంచిది. పరులను మోసగించి బ్రతికేకంటే భిక్షమెత్తుకుని బ్రతుకుట మంచిది.
- ఆత్మహత్య చేసుకునేవారు తమకొచ్చిన కష్టాలనుండి బాధల నుండి విముక్తి కొరకై బలవంతంగా ప్రాణం తీసుకుంటారు. అర్థాంతరంగా ప్రాణం తీసుకున్నంత మాత్రాన తమ కొచ్చిన నష్టకష్టాలు పోవు. మళ్ళీ జన్మలో వడ్డీతో సహా అవియన్నీ అనుభవించవలసిందే. బ్రతికి వుండగానే వాటిని పోగొట్టు కోవాలి. అందుకే బ్రతకాలి. మంచి పనులు చేస్తూ వుండాలి. ఆత్మహత్య మహా పాపం.

- ఆహారం, విశ్రాంతి, రక్షణ కోరుట, సంతాన కాంక్ష, ఈ నాలుగూ పశువులకు మానవులకు సమానమే. అయితే మానవుడు పశువుకంటే ఆధిక్యత పొందేది ధర్మాన్ని ఆచరించ డము వలననే. ధర్మం ఆచరించని మానవునికి, పశువుకి తేడా లేదు. ధర్మాచరణ వల్లనే మానవుడు పశువు కంటే భిన్నుడని వేదం చెప్పింది. ధర్మం వల్లనే అర్ధకామాలు సిద్ధిస్తాయి. ఈ ధర్మవచనాలనే భద్రవచనాలు అంటారు. వీటిని వింటుంటే మనసులోని మాలిన్యాలు పోతాయి. మనస్సు సంస్కారవంతమవుతుంది. మంచి చెడు విచక్షణ, ఆతర్వాత మంచి ఆలోచనలు వస్తవి. మనస్సుకు శాంతి లభిస్తుంది.
- ఆయుష్షు, ధనం, ఇంటిగుట్టు, మంత్రం, ఔషధం, స్త్రీ సంబంధం, దానం, మానం, అవమానం ఈ తొమ్మింటిని గోప్యంగా వుంచాలి.
- ఈ జన్మ నీకు వచ్చిన అవకాశాన్ని సద్వియోగము చేసు కుంటూ, బుద్ధిబలంతో స్వార్ధాన్ని అరికట్టి, తోటి మానవులకు సహాయము చేయి. అందరియందు ఆత్మరూపుడైన భగవం తుడున్నాడు. అందుకే బిచ్చగాళ్లను సహితము దరిద్రనారాయ ణులంటారు. (శ్రీ సత్యసాయిబాబా)
- ఎన్నో క్రిమి, కీటక, పశు, పక్ష్యాదుల జన్మములెత్తి చివరకు మనుష్య జన్మ ఎత్తావు. ఈ వచ్చిన జన్మను సార్ధకము చేసుకుని తిరిగి వెనుక జన్మలకు వెళ్లకు, మనిషిగా జీవించి తరించు.
- ఎటువంటి పాపకార్యం చేసిన వారికైనా నిష్కృతి వుంటుంది. కాని చేసిన మేలు మరచేవానికి నిష్కృతి లేదు.
- ఒకరి కివ్వడం నేర్చుకో, తీసుకోవడం కాదు. ఒకరికి సహాయ పడు. అంతేగాని సహాయం పొందడం కాదు. (రామకృష్ణ



పరమహంస)

- ఓం నమో నారాయణాయ అనే అష్టాక్షరీ మహామంత్రమును, త్రికాలములయందు త్రికరణశుద్ధిగా జపిస్తే త్రిగుణరహిత మవుతుంది. అనగా సత్వరజ స్తమోగుణాలు లేకుండా చేస్తుంది. (నారాయణోపనిషత్)
- ఓ మూఢమతీ ధనాశను విడిచిపెట్టు. మనసులోని ఆశలను, కోరికలను దూరం చేసుకో, మంచి ఆలోచనలు చేయి. నీ కర్మాను సారం లభించిన దానితో తృప్తిపడు. (శంకరా చార్యులవారు)
- ఈ కలియుగానికి అధిపతియైన కలిపురుషుని లక్షణాలివి :- ధర్మం లేకుండుట, అక్రమము, అధర్మ సహవాసము, సంపాదన, అరాచ కులతో స్నేహము, ద్రోహులతో, దుర్జనులతో బంధుత్వము, మోహం, ద్వేషం, కలహం, దుఃఖం కలిగించి ఆనందించడం, కామం, కోపం, పినిసిగొట్టుతనం, ఆశ, పొగరు, ఈర్ష్య వీటితో మానవుని భ్రష్టు పట్టించడమే అతని పని. ఇదే కలిపురుషుని లక్షణాలు (కలిపురాణం)
- కావలసినదానికి మించి ఆహారం ఎక్కువ తినకూడదు. శరీరానికి తగినంత వ్యాయామం లేనందున శరీరంలో బలం తగ్గిపోతుంది. చెడు తిరుగుళ్లు ఆరోగ్యాన్ని పాడుచేస్తవి. అమిత స్త్రీ సుఖం వినాశ హేతువు.
- క్రిందటి జన్మలో చేసిన పాప పుణ్యాలు ఫలితంగా ఈ జన్మలో మన జీవితం నడుస్తుంది. దీనిని ఎవ్వరూ తప్పించలేరు. కాబట్టి ఎప్పుడైనా, ఈ లౌకిక ప్రపంచములోని అనేక విషయాలపై మన మనస్సు మోజు పడకుండా కాపాడమని సరియైన జీవన మార్గాన్ని చూపి, మనశ్శాంతిని ప్రసాదించ వలసినదిగా ఎల్లప్పుడు భగవంతుని ప్రార్థించాలి.
- కోరికలే మనిషిని అశాంతి పాలు చేస్తాయి. అతనికి తెలియ

నంత లోతుగా వ్యాపించి వుంటాయి. ఈ కోరికలను దాటా లంటే భగవంతునే శరణువేడాలి.

- గతజన్మలో చేసిన కర్మల ఫలితమే ఈనాటి జీవితం. గతంలోని పాప పుణ్యాలననుసరించి ఈ జన్మలో సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాము. ఈనాడు చేసే కర్మలు మరు జన్మ ఫలాలకు బీజాలు. (భగవద్గీత)
- గురువు సన్నిధిలో ఎంతటివారైనా వినయముగా నడుచు కున్నప్పుడే గురుబోధ సార్థకమవుతుంది. (శ్రీ మలయాళ స్వామి)
- గోవింద అనే పదం మూడక్షరాలే. గోవిందయనగా గోవులను రక్షించేవాడు. కృష్ణ భగవానుడు. అనగా మనలో పశుప్ర వృత్తులను నిర్మూలించేవాడని గూడార్థం. గోయనగా భూమి. ఈ భూమిమీద జీవరాశులకు ఆధారభూతమైన పరమాత్మకు గోవిందుడని పేరు.
- జ్ఞానచక్షువుతోనే సర్వవ్యాప్తి చైతన్య స్వరూపుడు అయిన ఆత్మను దర్శించగలం. అంధుడు సూర్యుని దర్శించలేనట్లే అజ్ఞాని ఆత్మను చూడలేడు. (శ్రీ శంకరాచార్యులవారు)
- జీవితములో మనం తెలుసుకున్న మంచినంతా ఆచరణలో పెట్టాలి. మనం ఎంత తెలుసుకున్నా ఆచరణలో పెట్టకపోతే తెలుసుకున్న ప్రయోజనం ఏముంది. (శ్రీ సత్యసాయిబాబా)
- జీవితం చాలా వేగవంతమైనది. మన ప్రమేయం లేకుండానే వేగంగా ప్రయాణిస్తున్నాం. దురాశ దుఃఖం అనివార్యమవు తుంది. అందుకని కోరికలు తగ్గించుకుంటే పరిష్కారం దొరుకుతుంది. (శ్రీగణపతి సచ్చిదానందస్వామి)
- జోగెత్తడం అంటే నిరుపేదలు సైతం దైవసన్నిధికి వెళ్లడానికి, మన పూర్వీకులు బిక్షమెత్తుకునిసైనా దైవదర్శనం చేయమని చెప్పినది.
- తామరాకు మీద నీటిబొట్టువలె జీవితం చంచలమైనది.



ప్రపంచ మంతా సోక, మోహాలతో, దుఃఖాలతో నిండివున్నదని తెలుసుకో (శంకరాచార్యులవారు)

- తులసి మొక్క వేర్లులలో సర్వతీర్థాలు, మధ్యభాగంలో సమస్త దేవతలు, చివరి భాగమున నాలుగు వేదాలు వున్నవి.
- తప్పులు అందరూ చేస్తారు. కాని చేసిన తప్పే మళ్లీ చేసేవాడు మూర్ఖుడు మాత్రమే.
- తడిబట్టలకు సర్వ అమంగళాలు ఆశ్రయించుకుని వుంటాయి. సుభ కార్యాలప్పుడు తడిబట్టలు భుజము మీద కూడా వేసుకో కూడదు.
- తనను త్రవ్వినవారిని భూమి మన్నించును. మనలను నిందించే వారిని మనమే మన్నించాలి. అదియే ఉత్తమోత్తమ ధర్మము.
- తిథివల్ల సంపద. వారం వల్ల ఆయుష్షు, నక్షత్రం వల్ల పాప పరిహారం, యోగం వల్ల వ్యాధి నివృత్తి, కరణం వలన కార్యానుకూలత కల్గుతాయన్న నమ్మకంతో పంచాంగ పఠనం కావిస్తూ వుంటాము.
- ద్వేషం కాటువేయడానికి ఎప్పుడో ఎవరినో ఒకరిని వెతు క్కుంటూ వుంటుంది. ఎదుటవారి మీద నిప్పులు కురిపించ డానికి నెపాన్ని సృష్టించుకుంటుంది.
- దైవభావము మన మనస్సుకు పట్టకుండా రెండు దోషాలు మనలను వెంటాడుచున్నవి. 1) తమ తప్పులు కనబడకుండా చేయడము 2) ఎదుట వారి దోషాలను కనిపెట్టే పని. (శ్రీ సత్యసాయిబాబా)
- దాచుకోవడం, దోచుకోవడం, మానవునిలో పెరిగి అది దుర్గుణమై దుఃఖమయమవుతున్నది. మానవునిలోని అశాంతి, దుఃఖము, రోగాలు, పశువులకు లేవు. ఎందుకంటే వాటికి దాచుకునే బుద్ధిలేదు గనుక.

- ఎప్పుడూ ధనాన్ని గురించి ఆలోచించే మనస్సు, దైవాన్ని స్మరించలేదు. ధనాశ దుఃఖానికే హేతువవుతుంది. అందుచే భగవంతుడిచ్చిన దానితో తృప్తిపడు. లేనిదాని కొరకు ఆరాటపడవద్దు. (శ్రీ శంకరా చార్యులవారు)
- దేవుని సృష్టిని ఎవరూ మార్చలేరు. కష్టాలు, సుఖాలు, లాభాలు, నష్టాలు అతను పెట్టినవే. అవి అనుభవించాలే తప్ప తప్పించు కొనుట ఎవరి తరము కాదు.
- దేవుని పట్ల, పండితుని పట్ల, విజ్ఞుల (జ్ఞానులు) పట్ల భయ భక్తులు కలిగి వుండడం విజ్ఞానానికి మొదటి మెట్టు.
- ధనార్జన చేయునపుడు పాపానికి భయపడి ధనార్జన చేయాలి. సంపాదించిన ధనములో, తినే ఆహారములో సాటివారికి, తోటి వారికి భాగం పెట్టకుండా అనుభవించ రాదు. అటులైననే వంశము వృద్ధిచెందుతుంది.
- దర్భలు మొదట బ్రహ్మ, మధ్య విష్ణువు, చివర భాగమున శివుడు వుండడము చేత, దర్భలకాపవిత్రత వచ్చినది. (గౌతమ మహర్షి)
- ప్రమిదగాని, కుండీలోగాని రెండు వత్తులు వేసి దీపం వెలిగించడం శుభసూచకం. ఒకటి జీవాత్మ. రెండవది పరమాత్మ. శవం తల వెనుక శ్రాద్ధకర్మలప్పుడు ఒకే వత్తి వెలిగిస్తారు. అంటే జీవుడు పరమాత్మలో కలసిపోయాడని అర్థం. ఇక దీపారాధనలో నూనె శనికి ప్రతినిధి. దీపం సూర్యునికి ప్రతీక. మనకీ, యింటికీ వుండే దోషాలు నివారణార్థం మనకు వెలుగు (తేజస్సు) కలగాలని, నూనె హరించినట్లే మన కష్టాలు హరించి వెలుగు రావాలని దీపారాధన ప్రధాన ఉద్దేశ్యం.
- ధర్మంవల్లనే సంపద కలుగును. ధర్మం వల్లనే సుఖము, ధర్మం వల్లనే సమస్తము సిద్ధించును. (రామాయణం)



- ద్విజులనగా రెండో జన్మ ఎత్తినవారు. జన్మించినపుడు అందరూ శూద్రులే. ఉపనయనాది సంస్కరణలవలన ద్విజుల వుతారు. ఇదే రెండో జన్మ. గాయత్రీ మంత్రోపదేశమువలన యజ్ఞకర్మల కధికారం వస్తుంది. దీనికితోడు శరీరాన్ని యిచ్చిన తల్లిదండ్రుల సంస్కారము కూడా తోడైతేనే ద్విజుడయ్యేది. గాయత్రీ జపంతోబాటు శాకాహారం మానసిక నిశ్చలత, ఆశ, కోపం, స్వార్థం లేకుండా, సర్వజీవరాశుల క్షేమం కోరుతూ అందులకనుగుణమైన ప్రవర్తన నియమ నిష్ఠలు కలిగినవారే ద్విజులు.
- ధనము, యవ్వనము, పరివారము కలదని భ్రమపడకుము. క్షణములో కాలము వీటన్నిటిని హరించును. ఇదంతామాయ, మిధ్య, అశాశ్వతమని గ్రహించి మెలగుము. (శ్రీ కంకరా చార్యులవారు)
- ధనం ఎంత సంపాదించినా దాన్ని సద్వినియోగం చేయక పోతే ప్రయోజనం లేదు. దైవకార్యాలకు, ధర్మకార్యాలకు కొంతయినా ఖర్చు చేయాలి. దానగుణం సర్వశ్రేష్ఠమైనది. (శ్రీ గణపతి సచ్చిదానందస్వామి)
- నీవు దైవాన్ని ప్రేమిస్తే చాలదు. దైవం నిన్ను ప్రేమించేలాగ నడుచు కోవాలి. ప్రేమ స్వరూపుడైన భగవంతుడు చూచేది తోటి మానవుల పట్ల నీ ప్రవర్తన, సమాజసేవద్వారానే మనిషి దైవానికి దగ్గరవుతాడు. (శ్రీ సత్యసాయి బాబా)
- నువ్వుపూజలో వున్నా, ధ్యానములో వున్నా, జపములోవున్నా వాటిని ప్రక్కనబెట్టి నీ సహాయము కోరి వచ్చినవారికి సేవచేయి. భగవంతుడు సంతోషించి నిన్ను అనుగ్రహిస్తాడు. (శ్రీ సత్యసాయిబాబా)
- మానవులు నవ్వుతూ పాపకర్మలు చేస్తూవుంటారు. ఆ పాప ఫలితం పక్వమైనప్పుడు ఏడుస్తూ అనుభవిస్తూ వుంటారు.

- నీవెవరవు, నేను ఎవరిని, నేను ఎచ్చట నుండి వచ్చితిని, నా తల్లి ఎవరు? నా తండ్రి ఎవరు? ఈ విధముగా ఆలోచించిన గాని, సారహీనమైన ఈ ప్రపంచమును స్వప్నముగా భావించ లేము. అప్పుడు గాని భగవంతుడు గుర్తుకురాడు. కనుక బాగుగా ఆలోచించుము (శ్రీ శంకరాచార్యులవారు)
- నీ భార్య ఏవిధముగా రక్షింపబడాలని నీవు కోరుకుంటావో, పరస్త్రీలను గూడా ఆ విధముగానే నీవు చూడు. ఇతరులు ఏమి మట్లాడితే, ఏంచేస్తే నీకు కష్టము కలుగుతుందో ఆ మాటలు, ఆ పని ఇతరులకు చేయకు (రామాయణం)
- నిన్ను ధూషించి విమర్శించేవారు నీకు హితులు. వారే నీకు గురువులు. నీ తప్పు నీవు గ్రహించి, సంస్కారం పొంది, పవిత్రుడవు కావడానికి వీరు నీకు పరోక్షంగా సహాయపడు తున్నారని గ్రహించు. (శ్రీ గణపతి సచ్చిదానందస్వామి)
- పండ్లు తోముకొనుచు నిలబడి, మాట్లాడుతున్న, నడుస్తూ వున్న పూర్వజన్మలో చేసుకొనిన పుణ్యఫలము నశించును. ఒకే చోట కూర్చొని పండ్లు తోముకొనుట మంచిది. (స్మృతి రత్నాకరము)
- పరిశుద్ధమైన మనశ్శాంతి కావాలంటే (పొందాలంటే) నామ సంకీర్తన చేస్తూవుండు. అప్పుడే మన మనస్సు భగవంతుడి మీద కేంద్రీకృతమై పాపపు పనులకు, చెడు ఆలోచనలకు దూరమవుతాం.
- పేరాశ, ఈర్ష్య వంటి దుష్ట చింతనలు మనసును పీడించి వేస్తాయి. భగవంతునిపై మనసును నిలిపి ధ్యానం చేయి. ఈ దుష్ట ఆలోచనలను దూరం చేసుకో.
- సాధుమాత్ములు, జ్ఞానుల సాంగత్యములో మనశ్శాంతి సంపాదించుకో
- భగవంతుని మీద భారం వేసి, పూర్తిగా శరణాగతి కోరువారికి,



ఇది నేను అనే భావము ఏమీ వుండదు. వారికి దుఃఖము, కష్టము కూడా వుండవు. అంతా ఆ భగవంతునికే వదిలేస్తాడు. అన్నీ ఆయనే చూసు కుంటాడు. (శ్రీ సత్యసాయిబాబా)

- పంచాంగం అంటే అయిదు అంగములు కలది. అవి తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం. తిథివల్ల సంపద, వారంవల్ల ఆయువు, నక్షత్రం వల్ల పాప పరిహారం, యోగం వల్ల వ్యాధి నివృత్తి, కరణం వల్ల కార్యానుకూలత కలుగుతాయన్న నమ్మకముతో పంచాంగ పఠనం చేస్తూ వుంటాము.
- పాపపు ఆలోచనల ఫలితంగా మనస్సు కాలుష్యం చెంది నరాలు ఉద్రేకానికి గురి అవుతవి. రక్తప్రసరణ, ఆటుపోటులకు గురి అవుతుంది. అనుకోని రోగాలువస్తవి. కనుక మంచి ఆలోచనలతోనే కాలం గడపాలి. (రామాయణం)
- పాపకర్మలు చేసేవారు పాపానికి భయపడరు. మంచివారే పాపానికి భయపడతారు. అయితే ఆ పాపము అగ్నికంటే భయంకరముగా కాల్చుకుతింటుందని తరువాత గాని వారికి తెలియదు.
- పాలుశక్తినిస్తుంది. ఆరోగ్యాన్నిస్తుంది, మంచి ఆలోచనలకు పునాదిగా వుంటుంది. కల్లు శరీరాన్ని, మనస్సుని క్షీణింప జేస్తుంది. గౌరవాన్ని నాశనం చేస్తుంది. అయినా పాలు వీధుల వెంట అమ్మకోవలసి వస్తుంది. కల్లు వున్న చోటకే జనం వెళతారు. అశాశ్వతం మీద వున్న మోజు శాశ్వతం మీద లేదు. (కబీరు)
- చెట్టున పండిన పండు ఎలా రాలిపోతుందో, మంచు ఆకుల మీద పడి ఏ విధంగా జారిపోతుందో ప్రాణం కూడా అదే విధంగా మనిషి నుండి పోతుంది.
- పవిత్రమైన గంగాజలంతో కలసిన మురికినీరు కూడా పవిత్రమవు తుంది. మంచివారితో కలిసి తిరిగే చెడ్డవారు కూడా మంచివారవుతారు.

- పశువులు, భార్య, పుత్రులు, ఇల్లు, ఆస్తి ఇవియన్నియు బంధ రూపముగ వచ్చిపడినవే. వాటి ఋణము తీరిపోగానే అవి ఆ వ్యక్తిని వదలిపోతాయి. కనుక ఈ బంధాలగురించి విచారించనక్కరలేదు.
- భగవద్గీతను, విష్ణు సహస్రనామాలను, భగవంతుని రూపమును, సదా మనసునందుంచుకొని ధ్యానించాలి. అందులకు సజ్జన సాంగత్యము, మంచి, మంచి గ్రంధాల పఠనం చాలా అవసరం. (శ్రీ శంకరాచార్యులవారు)
- బ్రహ్మచర్యంవల్ల నాడీ మండలానికి బలం చేకూరుతుంది. శరీర శక్తిని పెంచుతుంది. కంటిచూపును, చెవులతో వినేశక్తిని, జ్ఞాపకశక్తిని వృద్ధి చేస్తుంది. జీర్ణశక్తిని, రక్త ప్రసరణాన్ని పెంచుతుంది. (శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి)
- భగవంతునికి అనేక పేర్లు వుండవచ్చు. అనేక రూపాలు వుండవచ్చు. అయినా దైవం ఒక్కడే. పూవులు అనేకం కాని పూజ ఒక్కటే. మతాలు అనేకం అయినా గమ్యం ఒక్కటే. (శ్రీ గణపతి సచ్చిదానందస్వామి)
- బ్రహ్మచర్యము నవలంభించడము ద్వారా శారీరక, మానసిక, ఆధ్యాత్మిక బలమును సంపాదించి మృత్యువును పారద్రోల వచ్చును. అలాంటివారే మృత్యుంజయులవుతారు. (అధర్వణ వేదం)
- బ్రహ్మీముహూర్తం అంటే తెల్లవారుఝామున 4 గంటల నుండి 51/2 గంటలవరకు ఈ కాలంలో విశ్వం యావత్తూ ఓంకార మంత్రాన్ని జపిస్తూ వుంటుంది. అందుకని ఆ సమయం ఎంతో విలువైనది. (శ్రీ గణపతి సచ్చిదానందస్వామి)
- బ్రహ్మచారి అంటే బ్రహ్మభావనతో ఎల్లప్పుడు గడుపువాడే నిజమైన బ్రహ్మచారి. గృహస్థుడైననూ, ఋతుకాలమునందే ఎల్లప్పుడు గడుపువాడే నిజమైన బ్రహ్మచారి. గృహస్థుడైననూ ఋతుకాలము నందే భార్యను లేక భర్తను కలిసి మిగతా



కాలములో పరబ్రహ్మయందు మనస్సు నిలిపి సంచరించు వారు కూడా బ్రహ్మచారులే. ఈ బ్రహ్మ చర్యము పాటించి నందున బ్రహ్మతేజస్సు, దీర్ఘాయువు, మనస్సు కూడా స్థిర చిత్తముతో వుండి విశేష ప్రజ్ఞతో పుణ్యవంతులై భగవంతునికి సన్నిహితులుగా వుంటారు.

- భార్యాభర్తల మధ్యనుండి, బ్రాహ్మణుల మధ్యనుండి, శివుడు, నంది మధ్యను గురుశిష్యుల మధ్యనుండి, గొర్రెల మధ్యనుండి నడచిన, అంతకుముందు చేసుకున్న పుణ్యఫలితం తగ్గుతుంది. ఒక రకమైన విద్యుత్ వారి మధ్య వుంటుంది.
- బ్రాహ్మణుల శిఖ (పిలక) వుండే స్థానములో బిందు విసరవున్నది. ఇది సహస్రారచక్రంలో భాగం. ఏకాగ్రతకు సంకేతం. చైతన్యకేంద్రం ఆస్థానములో వినబడే నాదం మీద, ధ్యానాన్ని నిలిపి జపం చేస్తారు. (సచ్చిదానంద సరస్వతిస్వామి)
- భగవంతుడు భావప్రియుడు. భక్తిలేని ఆడంబర పూజలకు ఆయన లొంగడు. నిర్మల మనస్సుతో నిండు హృదయముతోనే ఆయనను సేవించాలి. భావశుద్ధి ముఖ్యం. (సత్యసాయిబాబా)
- భగవన్నామ సంకీర్తనం రాగతాళయుక్తమై భక్తి భావముతో జరిగితే వాతావరణ కాలుష్యం పోయి హృదయాన్ని నిర్మలం చేస్తుంది. మన ప్రాచీనులు భజనలు, నామ సంకీర్తనలు అందుకే పెట్టారు.
- మంచి, మంచి గ్రంధాలు చదవినదే మనస్సు విశాలమవదు. గ్రంధానికి మించిన తోడు వేరొకటి లేదు. (ఆధ్యాత్మిక గ్రంధమే చదవాలి)
- మానవ జీవితం సుఖదుఃఖాల మిశ్రమం. ఈ సుఖ దుఃఖాలకు మనస్సే కారణం. బంధుత్వాలు, వారితో రాగద్వేషాలు, ఆశలకు సంబంధించిన ఆలోచనలే. మనశ్శాంతి కావాలంటే నీ మనస్సును అరికట్టడము వలననే లభిస్తుంది. అంతేగాని

బయట ప్రపంచములో లభించదు.

- మన మనస్సు అద్దంలా శుద్ధమైన రోజున దృష్టి అంతర్ముఖమై ఈశ్వర ప్రాప్తి కలుగును. (తులసిదాసు)
- మన దృష్టి ఎప్పుడూ ఇతరులమీదే వుంటుంది. ఇతరుల దోషాలే మనకు కనబడతాయి. మన దోషాలు మనకు కనిపించవు. అందుకు కారణం మన యింద్రియములు బహిర్ముఖమై వుండడమే. (కఠోపనిషత్)
- మానవుల్లో మాధవుణ్ణి చూస్తూ సేవచేయాలి తప్ప మానవులకు సేవ చేసినంత మాత్రాన మాధవసేవ కాదు.
- మనస్సు స్వాధీనము చేసుకున్నవారికి ఒక్కసారి విన్నా చదివినా చాలు అది స్థిరంగా వుండిపోతుంది.
- మన కొచ్చే రకరకాల ఆలోచనల వలన మన మనసు మలిన పడుతుంది. బుద్ధి వక్రిస్తుంది. అందుకు భగవన్నామ స్మరణ చేస్తూవుండాలి. అప్పుడే బుద్ధి సుద్ధమై మనస్సు ఏకాగ్రపరుస్తుంది. భగవదనుగ్రహానికి దగ్గరవుతాము.
- మానవుడు అనేక జన్మలలో చేసిన సత్కార్యాల ఫలితంగా, ఆధ్యాత్మిక చింతనాపరుడుగ, త్యాగపురుషుడుగ జ్ఞానిగా జన్మిస్తాడు.
- మనము చేసే మంచి పనులు, మనలను బ్రహ్మానందం వైపు నడిపిస్తాయి. అనగా భగవంతునివైపు వెళ్లేటట్లు చేస్తుంది. చెడ్డపనులు మనస్సును ప్రాపంచిక విషయాలవైపు తోస్తుంది. అప్పుడు దైవానికి దూరమై ఎక్కువ బాధలు అనుభవిస్తాం.
- ఉత్తములను (మంచివారిని) అవమానిస్తే, అపకారం చేస్తే వారికి కోపం వస్తే ఆ కోపాన్ని భరించే శక్తి ఎవ్వరికీ వుండదు.
- ముర అనే రాక్షసుని సంహరించినందుకు యోగమాయతో నీవు ఏకాదశి అనే పేరుతో పిలువబడతావు. శ్రద్ధతో ఏకాదశి వ్రతాన్ని ఆచరించిన వారు నన్ను పొందుతారు. (విష్ణుమూర్తి)



- మనలోనే దైవగుణం, రాక్షస ప్రవృత్తి ఉన్నవి, ఇంద్రియాలను అదుపులో వుంచుకొని ఆశకు పోకుండా తృప్తిగా బ్రతకడం దైవగుణం. స్వార్థపు పనులతో కోరికలు పెంచుకుని, తృప్తి లేకుండా అత్యాశతో జీవితంచడమే రాక్షస ప్రవృత్తి. (కేనోపనిషత్తు)
- మనబుద్ధి అనేక వాసనలచే (వ్యాపకాలు)తో నిండి యున్నందున మనలో వున్న అత్మను తెలుసుకోలేకపో తున్నాము. బుద్ధిని సూక్ష్మదృష్టితో ఏకాగ్రము చేసినపుడు శ్రవణ, మనన, నిధిధ్యాసములతో ఆత్మ సాక్షాత్కారము కలుగుతుంది. (శ్రుతులు)
- మనిషిని ఆశే అనారోగ్యం పాలు చేస్తుంది. ఈ లోకంలోని సర్వ సంపదలిచ్చిన ఆశమాత్రం తీరదు.
- మనము తృప్తిగా బ్రతకలేకపోవడానికి కారణం, ఉన్నదానితో తృప్తి పొందకుండుట. లేని దానికోసం ఆరాటం.
- మనస్సును ప్రశాంతము, నిర్మలము చేసుకొని నేను ఎవరు అని ప్రశ్నించుకున్నచో దేహము, ఇంద్రియాలు, మనస్సు బుద్ధి, అహంకారము ఇవన్నీ నేను కాదు, వాటికి భిన్నుడను. ఈ సమస్త జగత్తును సృష్టించి నడిపించే పరమాత్మ స్వరూపుడనే నేను. (శ్రుతి, స్మృతులు, బ్రహ్మ సూత్రములు)
- మనిషికి జన్మరావడమే కష్టం. ఆ మనిషికి విద్య రావడం, ఆ విద్య నేర్చుకున్న వాళ్లలో రచనలు చేయగలగడం, ఆ రచనలలో శక్తివంతమైన పదిమందికి పనికి వచ్చేవి) రచనలు చేయగలగడం మరీ కష్టం. (అగ్ని పురాణం)
- మట్టి ఒక్కటే దానితో నిర్మించే కుండలు అనేక రకాలు. బంగారం ఒక్కటే ఆభరణాలు అనేక రకములు. ఆవులెన్ని రంగులైనా పాలు ఒక్కటే. భగవంతుని ఏ రూపముతో కొలిచినా దేవుడు ఒక్కడే. (శ్రీ ఆది శంకరాచార్యులవారు)
- మహాత్ముల చరిత్రలు వారి బోధనలు, భక్తి శ్రద్దలతో చదివే

వారు. మహాత్ముల సమక్షంలో చేసినంత ఫలితం పొందు తారు. (రమణ మహర్షి)

- మానవ జీవితం చంచలమైనది. రెప్పపాటు కాలంలో రాలి పోయే స్వభావం కలది. గాలి వీచగానే పండుటాకు రాలినట్లు మృత్యువు సమీపించగానే జీవితం సమాప్తి చెందు తుంది. అందుచే మంచిగా వుండు. (శ్రీ ఆది శంకరాచార్యులవారు)
- మనకున్నదానిలో పరులను ఆదుకున్నప్పుడు మన కష్టాలలో దేవుడు మనలను ఆదుకుంటాడు. (శ్రీ కుసుమ హరనాథ్)
- మోహం వదిలితేగాని స్వచ్ఛమైన నిర్మలత్వం రాదు. మనస్సు నిర్మలత్వం వల్లనే భక్తి కలుగుతుంది. భక్తిలో స్థిరత్వం పొందితేనేగాని జ్ఞానం కలుగదు. అప్పుడా జ్ఞానం వల్లగాని దైవదర్శనం లభించదు. (తులసీ రామాయణం)
- మంత్రసిద్ధిని పొందడానికి ఓంకారము ఒక సేతువువంటిది. (వ్యాస మహర్షి)
- మంత్రమనగా : మ అనగా మననం చేయడం, త్ర అనగా రక్షించేది. గనుక మంత్రమంటే ఏకాగ్రతతో ఉచ్ఛరించే వ్యక్తిని రక్షించేది యని అర్థం.
- మనసు కోతి వంటిది. కోతి ఒక కొమ్మ మీద నుండి వేరొక కొమ్మ మీదికి దూకుతున్నట్లే మనసు ఒక విషయం మీద నుంచి మరొక విషయం మీదికి పరుగెత్తుతూ వుంటుంది.
- మనిషి భ్రష్టత్వమునకు కారణములు మూడు 1) అబద్దాలు అతి సులువుగా చెప్పడం. 2) పరస్త్రీ వ్యామోహం 3) అకారణ వైరం, మాట్లాడుతూనే పోట్లాడుకోవడం, కొట్టుకోవడం. (రామాయణం)
- రాజహంస ఏవిధముగా నీటిని విడిచిపెట్టి పాలను మాత్రమే గ్రహిస్తుందో, సాధకుడు అదే విధంగా శాస్త్రాలలోని సారాన్ని గ్రహించి మిగిలిన వాటిని విడిచిపెడతాడు. (స్వామి శివానంద)



- రాత్రి, పగలు, ఉదయం, సాయంకాలము, శశిర, వసంత ఋతువులు ఒకదాని వెంట ఒకటి క్రమం తప్పకుండా వచ్చిపోవుచుండును. ఈ విధముగా కాలము క్రీడించు చున్నది. ఆయువు క్షీణించుచున్నది. అయినా నీలో ఆశా పిశాచము వదలుట లేదు. (శ్రీశంకరాచార్యులవారు)
- రాగిపాత్ర నీరు ఎంత శ్రేష్టమైనదంటే అది బి.పి.ని రానీయదు. అజీర్తిని పోగొట్టుతుంది. శరీరాన్ని సమశీతలంగా వుంచు తుంది. (ఆధునిక శాస్త్రవేత్తలు)
- ఒక రోజులో కొద్ది సమయమైనా ఏకాగ్రతతో యిష్ట దైవాన్ని గురించి ధ్యానం చేయండి. ధ్యానం చిత్తశుద్ధికి తోడ్పడు తుంది. మనస్సు నిర్మలమవుతుంది. చీకూచింత వుండవు. ఉన్నా అంతగా కలవరపెట్టవు ధ్యానంలో మనోబలం, ఆత్మబలం పెరుగుతవి. (శ్రీ కంచి స్వామీజీ)
- రథోత్సవం అంటే శరీరమే రథమని, పంచేంద్రియాలే గుర్రా లని, మనసు వాటిని అదుపుచేసే పగ్గమని, ఆత్మ రథాన్ని నడిపేవాడని అర్థం. ఇంద్రియాలను అదుపుచేసే నరుడు నుంచి, నారాయణతత్వం వైపు వెళ్ళగలిగితే శరీరరథం క్షేమంగా వుంటుంది. దేహమే దేవాలయం. ఇంద్రియాలను మనస్సుతో నిగ్రహించి, ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణము చేస్తే చేరుకునే గమ్యమే పరమాత్మ. ఈ భావాన్ని మనకు తెలిపేందుకే రథోత్సవం పేరున ఊరేగింపు చేయడం. (మురళీకృష్ణ)
- తను నేర్చుకున్న విద్యను వాంఛల నిమిత్తము వినియోగించు వాడు అజ్ఞాని. విద్యను లోక క్షేమం కొరకు వినియోగించు వాడు జ్ఞాని. (శ్రీ సత్యసాయిబాబా)
- వ్యభిచారితో సంభాషించుట లోతైన గోతిలో పడుటవంటిది. నీతి, నియమాలులేని వారే అందుకు సిద్ధపడతారు. (సామెతలు)

- వైరాగ్యం అంటే భార్య పిల్లలను విడిచిపెట్టి, కాషాయ బట్టలు కట్టుకుని, రుద్రాక్ష మాలలు వేసుకుని, దేశాటనచేసి అడవులలో వుండటము కాదు. తలక్రిందులుగా తపస్సు చేయడము కాదు. రాగద్వేషాలకు అతీతమైన మానవస్థితిని పొంది జీవించడమే. (శ్రీ సత్యసాయిబాబా)
- శ్రద్ధగా వినేదే శ్రవణం. శ్రవణం అంటే వినడం, మంచి మాటలు వింటుంటే మనస్సు తేలికై, క్రమేపీ భక్తివైపు మళ్ళుతుంది. అప్పుడే సుఖము, శాంతి, ముక్తి కలుగుతాయి.
- సూర్యోదయమునకు ముందు పళ్ళు తోముకొనుట మంచిది. యశో వృద్ధి, దేవతా ప్రీతి కలుగును.
- మహాత్ముల యొక్క సూక్తులు చదవడం, తెలుసుకోవడం వలన మనలో ఈర్ష్య అసూయలు తొలగి రాగద్వేషములు నశించి, మనస్సు నిర్మలమవుతుంది. (మురళీకృష్ణ)
- సాధువులతో, సజ్జనులతో తగాదా పెట్టుకోరాదు. అలాగే కవి పండితుల తోను, దీనులను కొట్టకూడదు, ధూషించరాదు, బిచ్చగాళ్లను ఏడిపించగూడదు. పేదవారిని చులకనగ చూడరాదు. పుణ్యాత్ములను తిట్టగూడదు, మంచి భక్తులను తిరస్కారం చేయగూడదు. గురువులను, పండితులను, పుణ్యాత్ములు, మంచి వారి యొక్క ధనాన్ని దోచుకోరాదు. ఇది చేసేవారికి కీడును కలిగించడమే గాక నరకంలో వారికి చిత్రహింసలు తప్పవు. (నరసింహ శతకము)
- సంకల్ప వికల్పాలు ఉన్నంతకాలము జన్మలు తప్పవు. సంకల్ప వికల్పాలను లేకుండా చేసుకున్నప్పుడే జనన మరణాలను నిలిపివేయవచ్చు. వడ్లగింజపై నున్న పొట్టును తీసి భూమిలో నాటితే మొక్క మొలవదు. పొట్టుతో పెడితేనే మొక్క వస్తుంది. అలాగే జన్మరాహిత్యాన్ని బ్రహ్మ భావముతో తొలగించుకోవాలి. (పిప్పిలమహర్షి)



- సర్వజీవులు ఎవరిలో ఉన్నాయో ఏ పురుషుని వల్ల ఈ సమస్త జగత్తు వ్యాప్తమైందో అట్టి పరమ పురుషుడు అనన్య భక్తివల్లనే పొందదగిన వాడు. (విష్ణు పురాణం)
- సూర్యోదయం అయ్యేటప్పటికి మరో క్రొత్తరోజు వస్తుందని అనుకుంటూ వుంటాము. కాని మన ఆయుర్ధాయములో మరొక రోజు తగ్గిపోతుందని అనుకోము. (ఆదిశంకరాచార్యులవారు)
- స్త్రీలు పాపిటలో కుంకుమ ధరించడము వలన భర్తకు ఎలాంటి ఆపదలు వచ్చినా తట్టుకోవడానికి, వెనుక సీతమ్మ వారు శ్రీరామ చంద్రని క్షేమం కోరి ఎల్లప్పుడూ పెట్టుకునేది. కుంకుమ (ఎరుపు) కార్యతత్పరతకు చిహ్నం. భూత గుణాలకు భయం. పీడలు అంటవు. అగ్నికి చిహ్నమైన యీ కుంకుమ అగ్నిలాగే పవిత్రమైనది. దోషాలు ఉండవు. అందుకే స్త్రీలు నొసట తప్పనిసరిగా కుంకుమ పెట్టుకునేది.
- సంపదను కోరుకునేముందు అది సద్వినియోగము చేసే బుద్ధిని గూడా ప్రసాదించమని భగవంతుని కోరుకోవాలి. (తైత్తరీయసంహిత)
- సమస్త ప్రాణులపట్ల దయగలిగి వుండుట. అందరికి ప్రియం కలిగేటట్లు మాట్లాడటం, సమస్త ప్రాణుల సుఖశాంతుల పట్ల శ్రద్ధ వహించడమే నిజమైన భక్తి. (శివ పురాణం)
- సత్తవర్తనమే మనిషిని కుటుంబాన్ని, వంశాన్ని, కులాన్ని కాపాడుతుంది. చెడు నడక కులగౌరవాన్ని నాశనం చేస్తుంది.
- స్త్రీలను బాధించడం గాని, కొట్టడం గానీ చేయరాదు. ఆమె శ్రేష్టమైన గుణము కలిగినది. శీల సంపద కలిగినది. చంద్రునివలె చల్లని ఆనందము కలిగించునది. అఖండ చరిత్ర కలిగినది. పురుషులకు ఆనందము కలిగించునది. కావున ఆమెను అర్ధ శరీరురాలుగా చూడుము. (యజుర్వేదం)

- సత్యము పలుకుట వలన పాపము హరించును. ఇంకా మానవుని పవిత్రము చేయును. జ్ఞానము కలుగును. శరీరమునకు వచ్చిన దోషములు పోవును. ఈ భూమి సత్యము నాధారము చేసుకుని నిలబడి వున్నది. (అధర్వణ వేదం)
- సూర్యుడు లోకానికి బంధువు. అనురాగమూర్తి, సృష్టి ప్రారంభములో బ్రహ్మ సూర్యుణ్ణి ఆరోగ్యానికి అధిదేవతగా నియమించాడు. (మత్స్యపురాణం)
- సర్వమతాలు మానవులకు మంచిని బోధించడానికే ఉద్భవించాయని, అన్ని మతాలు సమానమేనని అంటూ అల్ప సంఖ్యాకులను సంతుష్టిపరచే విధంలో, అధిక సంఖ్యా కులైన హిందువుల పట్ల ఉపేక్ష వహించడం సహింపరాని విషయం.
- సర్వశాస్త్రాలు చదివినా ఆత్మజ్ఞానాన్ని సంపాదించుకోకపోతే, వారి జీవితము రుచిగల వంటలలో తిరిగే గరిట వంటిదే.
- హిందూ ధర్మం ఎన్నిటికి పతనమవ్వదు. ఈ ధర్మం ఎల్లప్పుడూ సూర్యునివలె ప్రకాశిస్తూనే వుంటుంది.
- అసలు దుఃఖం కలగడానికి కారణం అజ్ఞానం. ముందు ఈ అజ్ఞానంధ కారాన్ని తొలగించుకోవాలి. అందుకు అర్చన, భగవన్నామస్మరణ, ధ్యానం దోహదపడతాయి. (శుకబ్రహ్మ).
- అగ్నికి ఆహుతైనా బ్రతకవచ్చును కాని మహనీయులకు, మంచివారికి హాని తలపెట్టి ఎవరూ క్షేమముగా వుండలేరు. (తిరువళ్ళువార్)
- గోవులు, వేదములు, బ్రాహ్మణులు, పతివ్రతలైన స్త్రీలు, సత్యాన్ని మాట్లాడే స్త్రీ, పురుషులు, ఈర్ష్యలేని మనుషులు, దాతలు ఈ ఏడుగురి ఆధారంతోనే ఈ భూమి నిలిచివున్నది. (అధర్వణ వేదం)
- ఆదిశంకరాచార్యులవారు క్రీ.శ. 788లో జన్మించాడంటారు.



వారు నాలుగు మఠాలు స్థాపించారు. 1) శృంగేరిలో శారదా పీఠం 2) ద్వారకా మఠం 3) పూరీ మఠం, 4) బదరిక మఠం, విశ్వరూపుడు, పద్మపాదుడు, తోటకాచార్యులు పథ ర్వుడు మొదటి గురువులు. కుమార భట్టు కంచిపీఠాధిపతి.

- ఆదిత్య హృదయం పఠిస్తే సమస్తమైన వివాదాలు పోవడమే గాక విజయం చేకూరుతుంది. (ఋషిప్రోక్తం)
- ఈ జగత్తు నిండా ఏది కనబడుచున్నదో ఏది వినబడుచున్నదో అది యంతయు అంతటా నారాయణుడే నిండివున్నాడు. (మంత్ర పుష్పం)
- ఈశ్వరా జ్ఞానానికి అధిపతివైన నీవు కన్నులతో, మనస్సుతో, వాక్కుతో చేతులతో చేయు మా దోషములను దూరము చేయుదువు గాక. (యజుర్వేదం)
- ఓంకార జపము ద్వారా భగవంతుని దర్శించవచ్చు. (ముండకోపనిషత్)
- ఓర్పువలన ఎన్నో సుగుణాలు వచ్చి చేరతావి. పండితులు శుద్ధులవు తారు. చేయరాని పనులు చేసినవారు దానము చేత, రహస్యముగా పాపాలు చేసిన వారు జపంచేత, వేదశాస్త్ర పురాణ గ్రంధాల సారాన్ని తెలియనివారు ధ్యానంచేత పరిశుద్ధులవుతారు. (మనుమహర్షి)
- ఔషధం సేవించకుండా, దానిపేరు అనుకున్నంత మాత్రాన రోగం ఎలా తగ్గదో, బ్రహ్మజ్ఞానాన్ని సాధన ద్వారా స్వయముగా అనుభవిస్తే తప్ప మోక్షం సిద్ధించదు. (శ్రీ శంకరాచార్యుల వారు).
- ఓ మానవా ముసలితనం రానిదే మరణించకు. ఇది వేద పురుషుల ఆజ్ఞ. పాపపు జీవితము, దొంగతనము, అబద్ధాలు చెప్పుట. అప్రమాణాల లాంటి పాపమే వృద్ధాప్యం రాకుండా మరణించడం. (అధర్వణవేదం)
- కార్తీక మాసములో దీపారాధన ఎంత విశిష్టమైనదో, మాఘ

మాసంలో నదీస్నానం అంత శ్రేష్ఠమైనది. మానవుల పాపాలకు ముక్తి నిచ్చేది మాఘమాసం. 12 మాసాలలో మాఘస్నానాలు ప్రసిద్ధ మైనవి. (పురాణ సూక్తి)

- జపం :- 'జ' అంటే జన్మరాహిత్యం. 'ప' అంటే పాపనాశనం అవుతుంది. ఈ జపం మూడు విధాలు : 1) వాచికం. నోటితో వినబడునట్లు చేసేది. 2) ఉపాంశు : కొండనాలుకతో గొనుకుండునట్లు వినబడి వినబడనట్లు చేసేవి. 3) మానసిక జపం : మనసు తోటి చేసేది. ఈ మూడింటిలో మనస్సుతో చేసే జపము ఉత్తమము. (ఆగ్నేయ పురాణము)
- దరిద్రుడికి ఒక లక్షరూపాయలు దొరికితే ఎంత ఆనంద పడతాడో, ఆ మనిషికి మంచివారి స్నేహం దొరికితే అంత ఆనందపడాలి.
- ధనము ఎవరి వద్దా స్థిరముగా, స్థిమితముగా వుండదు. మహా అయితే మూడు తరాలు వుండవచ్చు. అందుకని దానధర్మాలు చేయండి. ఆపదలో వున్నవారిని ఆదుకోండి. అదే మీకు తిరిగి సంపదకు కారణమవుతుంది. మీరు ధర్మ కార్యాలు చేయనియెడల కూడబెట్టినది ఎలా పోవాలో అలాగే పోతుంది. (ఋగ్వేదం)
- ధర్మం అనే పునాది లేకుండా మోక్షమనే లక్ష్యం గురించి ఆలోచించడం వృధా.
- ధనముండి ఇతరులకు సహాయపడనివారు మరుజన్మలో బానిసలై పుడతారు. (అధర్వణవేదం)
- ధర్మాన్ని, న్యాయాన్ని, సత్యాన్ని, అహింసను గొడుగుగా కవచంలా పెట్టుకుని మానవులను బ్రతుకమని మన పూర్వీకులు ఆదేశించారు. (శ్రీ గురుదత్త ఆదేశం)
- దుర్మార్గుడితో స్నేహము పనికిరాదు, విరోధము పనికిరాదు. ఉదాసీనంగా వుండటము నేర్చుకోవాలి. నిప్పును పట్టుకుంటే



కాలుతుంది. పోని చల్లారిన తరువాత పట్టుకుంటే మసి అంటుకుంటుంది. దుర్మార్గుడి పరిచయమూ అంతే.

- దానాలలో అన్నదానం శ్రేష్ఠమైనది. ఇది శరీరానికి శక్తినివ్వడం తోపాటు ప్రాణశక్తిని యిస్తుంది. ఈ అన్నదాన మహిమను వేదాలు ఎంతో ప్రశంసించాయి. (బోధానంద మహర్షి)
- ధనము ఎప్పుడూ చక్రమువలె తిరుగుతూ వుంటుంది. ధనము ఎవరి వద్ద స్థిరముగా వుండదు. ఆధనం నీ నుండి తిరిగిపోయేలోపలే, నీకు తగినంతలో దాన ధర్మములు చేయుము. (ఋగ్వేదం)
- నడవడం వలన హృదయానికి సంబంధించిన జబ్బులు, రక్తపోటు, మధుమేహం (షుగర్) మూత్రపిండాలకు సంబంధించిన జబ్బులు తగ్గుతవి. నడక రక్తనాళాలవృద్ధికి తోడ్పడి, రక్తం శరీరంలో బాగా సరఫరా అయి గుండెకు మేలు జరుగుతుంది. (వి. విద్యానాథ్)
- పరుల సొమ్మును ఆశించనివాడు. ఆవు మాంసమును తినని వాడు (ఏ జీవి మాంసము తిననివాడు), ఇతర స్త్రీలను తన తల్లిగా చూసేవాడు అతడు మానవులలో ఉత్తముడు.
- ప్రతివారు ప్రతిరోజూ ఆత్మ పరిశీలన చేసుకోవాలి. మాటచేత, చూపులతో, చెవులతో, బుద్ధితో, ఈ రోజు చేసిన చెడుపను లేవైనా వున్నవాయని చూచుకోవలెను. ఈ విధముగా ఆత్మ పరిశీలనము చేసుకున్నయెడల జీవితము నిర్మలము, పవిత్రముగా వుండును. (యజుర్వేదం)
- నీవు పోయేటప్పుడు ఈ లోకం లోనివి ఏవీ నీవెంటరావు, సంపాదించినదంతా యిక్కడే వుండిపోతుంది. కట్టుకున్న భార్య వీధి వరకు వచ్చి ఆగిపోతుంది. స్నేహితులు, బంధువులు స్మసానము వరకు వస్తారు. ఈ శరీర సుఖం కోసం బ్రతికినన్ని రోజులు పాడుపడ్డావో, ఆ శరీరం కూడా నీతో రాక చితిలో మండిపోతుంది (కాలిపోతుంది). ఇక నీవు చేసిన మంచి

చెడులే నీతో వెంబడిస్తాయి. గనుక జాగ్రత్తగా మసలుకో. (శ్రీ శంకరాచార్యులవారు)

- భార్యాభర్తలిద్దరూ ఎప్పుడూ సత్యమునే చెప్పుకోవాలి. అందు వలన వారు ఐశ్వర్యవంతులు, దీర్ఘాయుషుమంతులు కాగలుగుతారు. (అధర్వణ వేదం)
- భగవద్భక్తి గొప్ప సంపద. భక్తి అంటే ఆత్మను దైవముగా పూజించు. నీలో వున్న అహంకారాన్ని దైవానికి సమర్పించు. నీ మనస్సును దైవమందు నిలుపుటయే భక్తి.
- భగవంతుని తృప్తిపరచటానికి ఏ బాహ్యపటోటాపములు అక్కరలేదు. పవిత్రమైన జీవితాన్నే భగవంతుడు ప్రేమిస్తాడు. తృప్తి, దయ, అణుకువ, ఔదార్యం ఇవి భక్తికి నిదర్శనాలు. (శ్రీ గణపతి సచ్చిదానందస్వామి)
- భగవంతుని కృప నీవు పొందాలంటే నీ హృదయము పవిత్రముగా వుంచుకో. పవిత్రముగా పరిశుద్ధ హృదయము వున్న చోటకే ఆయన వస్తాడు. మాట, శరీరం, ఆలోచన, అంతఃకరణ పవిత్రముగా వుంచుకుంటేచాలు. (మహాఋషులు)
- మోహం ఆవరించిన మనిషికి యుక్తా యుక్తాలు (మంచి, చెడులు) తెలియవు. తాను చేస్తున్న పాపాల వలన ఏర్పడిన కష్టాలను తెలుసుకోలేడు.
- మనసు, మాట, శరీరము ఈ మూడింటిని నిర్మలముగా వుంచుకోవాలి. వీటినే త్రికరణములంటారు. వీటిని సుద్ధిగా వుంచు కోండి. ఈ మూడు ఏకత్వం వహించాలి. (పతంజలి)
- మానవుడు ప్రతిరోజూ కష్టపడి సంపాదించుకోవాలి. ఆ ధనము పుష్టికరమైనదిగాను, కీర్తిదాయకమైనదిగా వుండాలి. (ఋగ్వేదం)
- మానవుడు తన కర్తవ్యాన్ని నిరంతరం ఆచరించాలని ఏ సమయు మందు ఏ పని చేయాలో ఆ పని చేయకపోతే



దాని దుష్ఫలితాలు చవిచూడవలసి వస్తుందని హెచ్చరిస్తూ వుంటాడు సూర్యుడు. పంచ భూతములు ఆదిత్యరూపమే. (పురాణ సూక్తి)

- మా గృహములు న్యాయముగా సంపాదించిన ధనముతో వుండుగాక మంచి పుత్రికలతో ఇల్లు సుఖశాంతులతో వుండుగాక. అతిధి అభ్యాగతులతో, బంధు మిత్రాదులతో కళకళలాడుచుండుగాక. పాలు, వెన్న సమృద్ధిగా వుండుగాక. మా గృహస్థ జీవితము మూడు పూవులు, ఆరు కాయలుగా వుండుగాక. (అధర్వణ వేదం)
- మంచివారికి, మంచి పనులకే దానం చేయాలి. ముఖ్యముగా పాప కర్మలకు పాపపు పనులకు దానము చేయరాదు. (అధ్వర్వణ వేదం)
- ఓ మానవులారా మృత్యువుకు భయపడక ముందుకు నడవండి. నూరు సంవత్సరములు బ్రతకండి. మంచి జీవితాన్ని అలవర్చుకోండి. ధన ధాన్య సమృద్ధితో మంచి సంతానమును కని, బాహ్యశుద్ధితో బాటు అంతర శుద్ధితో జీవితాలు గడపండి. (ఋగ్వేదం)
- సకల పుణ్య తీర్థాలు తల్లిలో వున్నాయి. సమస్త దేవతలు తండ్రిలో వున్నారు. అందుకే తల్లిదండ్రులను గౌరవించాలి, పూజించాలి. (శాస్త్ర గ్రంథాలు)
- సన్యాసమంటే సమస్త కోరికలను త్యజించి, మనస్సును భగవంతుని యందు లగ్నము చేయడమే. (శ్రీ గురు గీత)
- ఋతుకాలమున భార్యతో కలిసినను బ్రహ్మచారియేయగును. దానములు చేయువాడు పవిత్రుడగును. పగటపూట నిద్రపోనివాడు, నిద్రపోనివాడేయగును. (మహాభారతం అనుశాసిక పర్వం)
- ఎవరైతే భూలోకములో సత్కర్మలు ఆచరిస్తూ వుంటారో

దేవతలను, సాధువులను జ్ఞానులను, బ్రాహ్మణులయందును భక్తి కలిగి వుంటారో, దానధర్మాలు చేస్తూ వుంటారో అటువంటి వారి జోలికి కలీ నీవు వెళ్లకు. (బ్రహ్మదేవుడు కలిపురుషునితో)

- ఎవ్వరైనా గురువు లేకుండా తరించలేరు. గురువు ప్రసన్నుడైతే 33 కోట్ల దేవతలు వశమవుతారు. కావున సాధకులకు ముందు గురుభక్తి, దైవభక్తి అలవరచుకోవాలి. (శ్రీ గురుగీత)
- ఎవని గృహమునుండి అతిథి నిరాశతో తిరిగి వెళ్ళునో ఆ అతిథి వాని పాపాన్ని గృహయజమాని కొసగి, యజమాని పుణ్యాన్ని తాను తీసుకొనివెళతాడు. (అపస్తంభ మహర్షి)
- కలిపురుష లక్షణాలు - అతినిద్ర, కలహస్వభావం, శోకం, పరుల ద్రవ్యమందు ఆశ, పరస్త్రీలయందు వ్యామోహం, కపట సన్యాసం, దర్పాలు పలుకుట, మోసం, అసత్యమాడుట, అధర్మంగా ప్రవర్తించడం. ఇవి కలిపురుషలక్షణాలు. (శ్రీ గురుగీత)
- గుంజకు కట్టిన పశువును విడిపించిన, చెమటతోవున్న మానవుడు స్నానం ద్వారా శరీర శుద్ధియగునో, నేయికరగబెట్టి వడపోసిన తరువాత చెత్తగసిలేక ఎలా స్వచ్ఛమై వుంటుందో, తల్లి తండ్రి, గురువు, దైవం నన్ను పరిశుద్ధుని చేయుగాక. (యజుర్వేదం)
- నీతి, నిజాయితీ, న్యాయం, ధర్మం, అహింస, సత్యం, ఇవి మానవ జీవితానికి భగవంతుడు పెట్టిన గీటురాళ్ళు. వీటిని అనుసరిస్తే మానవ జీవితం మృదుమధురంగా సాగుతుంది. వీటిని ఆచరించని యెడల మానవ జీవితం దుఃఖములతో సమాప్తమవుతుంది.
- కరుణలేకపోవుట, నిష్కారణముగా విరోధము, పరధనమునందు వాంఛ, పరభార్యలయందు వ్యామోహము, సజ్జనులయెడల, బంధువుల యెడల గౌరవభావము లేకుండుట అను



ఈ దుర్గుణ ములు దుర్మార్గులకు సహజములు.

- మధుర వస్తువులను ఇతరులకు పెట్టక తానొక్కడే భుజింపరాదు. అందరూ నిద్రిస్తూ వుండగా తానొక్కడే మేల్కొనియుండరాదు. మార్గమున సహాయములేక ఒంటరిగా ప్రయాణము చేయరాదు.
- వార్ధక్యం అందాన్ని, ఆశ సుఖములన్నిటిని, చెడ్డవారి సేవ స్వాభిమానాన్ని యాచన ఆత్మ గౌరవాన్ని, ఆత్మస్తుతి అన్ని గుణాలను, విచారము బలాన్ని, క్రోధము సంపదలను నశింపజేస్తుంది.
- కామ, క్రోధములు చాలా నీచమైనవి. క్షమయే శ్రేష్ఠమైనది. కోపిష్టి చేసిన దానము, యజ్ఞము, తపస్సు నిష్ఫలములు.
- పుత్రుడు, సేవకుడు, స్నేహితుడు, సోదరుడు, భార్య, ధర్మము, సత్యము అనునవి కోపశీలిని విడిచిపోవును.
- పరధనమును దొంగిలించుట, పరభార్యలకై ప్రాకులాడుట, మంచి స్నేహితులను విడిచిపెట్టుట అను ఈ మూడు దోషములు మానవుని పతనమునకు కారణమగును.
- దుర్భాషలాడుట, కఠినముగా మాట్లాడుట, చాడీలు చెప్పుట, అసత్యమాడుట అను ఈ నాలుగు వాక్కు చేయునట్టి పాపములు. కావున వీటిని విడువవలయును.
- ఆస్తి పోగొట్టుకొన్నా తిరిగి పొందవచ్చు. కాని శీలంపోతే తిరిగి పొందడం అసంభవం.
- గృహాన్ని స్వర్గం చేసుకోవాలంటే చిన్నా పెద్దా అందరితోనూ కలిసి మెలసి వుండాలి.
- ఇంటి గుట్టు బయటచెప్పడం, బయట తగాదాలు యింటికి తేవడం, తమను తామే నాశనం చేసుకున్నట్లు.
- దుష్ట ప్రవర్తనగలవాడు సర్వదా లోకనిందకు గురియై, రోగగ్రస్తుడై దుఃఖములను పొంది నశించును.

- నీ బాధలన్నిటికి కారణము అహంకారము. అహంకారమును నశింపజేసుకొనిన శాశ్వతమైన జ్ఞానమును పొందగలవు.
- సర్వసంపదలకంటే ఆధ్యాత్మిక సంపద అధికమైనది. అది ప్రజలను ఆకర్షించి, వారికి సర్వశ్రేష్టమైన సుఖమును ప్రసాదించును.
- సత్యము తల్లి, జ్ఞానము తండ్రి, ధర్మము సోదరుడు. దయ మిత్రుడు, శాంతి భార్య, ఓరిమి కొడుకు. ఈ ఆరుగురు నాకు బంధువులని ధర్మరాజు చెప్పెను.
- ప్రాణమైనను విడిచి మానమునే రక్షించుకొనవలెను. ప్రాణము నిత్యము గాదు. మానము ఆచంద్రార్కము వుండును.
- పరస్త్రీని తల్లివలెను, పరధనమును మట్టిగెడ్డవలెను, సకల భూతము లను తనవలెను చూచువాడే పండితుడు.
- కరువురోజులలో అన్నము పెట్టువానికి, పండని రోజులలో ధనమిచ్చు వానికి, యుద్ధములో వెనుకకు మరలనివానిని, అప్పులేని వానిని, ఈ నలుగురికి నమస్కారము చేయవలెను.
- కుమారుని అయిదేండ్లవరకు రాజువలెను, పదేండ్ల వరకు నౌకరు వలెను. పదహారేండ్లు రాగానే మిత్రునివలె చూడవలెను.
- ఉత్తమునియందు కోపము క్షణకాలముండును. మధ్యముని యందు రెండుఘడియలు, అధముని యందు ఒక రాత్రి, పగలు, పాపిష్టుని యందు చచ్చువరకు కోపముండును.
- సంపద వచ్చునపుడు కొబ్బరికాయలోనికి నీరు వచ్చినట్లు కనబడ కుండగనే వచ్చును. అది పోవునపుడు ఏనుగు తిన్న వెలగకాయలోని గుజ్జువలెనే కనబడకుండగ పోవును.
- దేహము చేయు పాపములు : హత్య, వ్యభిచారము, దొంగతనము, త్రాగుడు, మాంసభోజనము.
- నాలుక చేయు పాపములు : అబద్ధమాడుట, చాడీలు చెప్పుట, దూషించుట, వ్యర్థముగ సంభాషించుట.



- ప్రతీకారం తీర్చుకోవడం సాహసం కాదు. బాధను ఓర్పుతో భరించడమే నిజమైన సాహసం.
- ఒకసారి మాటయిచ్చి నిలబెట్టుకోలేనివాడిని నమ్మకు. ఒకసారి మోసగించినవాడు మళ్ళీ మోసగిస్తాడు.
- పంచమహాపాపములు : 1) బంగారము దొంగిలించుట 2) సురా పానము (కల్లు త్రాగుట) 3) బ్రహ్మ హత్య 4) గురుపత్నీ గమనము 5) పాపాత్ముని సాంగత్యము.
- ఆపదలలో గొప్ప ఆపదదైవచింతన లేకుండుటయే. సంపదలలో గొప్ప సంపద దైవ సంపత్తియే.
- కామాన్ని జయించినవాడే జ్ఞాని కాగలడు.
- ఎవని హృదయము నిరంతరము శాంతితో నిండి వుంటుందో వాడే ఈ లోకాన్ని ప్రేమించగలడు.
- భగవంతుని భజనలోను, సజ్జన సాంగత్యములోను తప్ప నిజమైన సుఖము ముల్లోకములందెచటను లేదు.
- నిష్కామ భక్తి మనుజుని స్వార్థమునుంచి విడుదల చేసి, జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. కాని సాకారభక్తి మనిషిని బంధించి, స్వార్థమనే అడుగులో దింపేటట్లు చేస్తుంది.
- సత్పురుషునికి, దైవ కార్యక్రమమునకు, ధర్మ కార్యక్రమమునకు, సద్వినియోగము చేసేవానికి దానము చేయాలి.
- ఎదుట మనిషి మీ మనస్సును కష్టపెట్టే మాటలు అంటున్నాడంటే, మీ మనస్సులోని లోపాలను తొలగించుటకు ఈశ్వరుడే మిమ్ములను ఆ మాటలను అనిపించేటట్లు చేస్తున్నాడు యని అనుకోవాలి.
- మంటలను నీళ్లతో ఎలా ఆర్పుతామో అదే విధముగా కోపమనే అగ్నిని వివేకమనే నీటితో ఆర్పమన్నారు.
- వర్షాధారలచే ధూళి అణుగునట్లు, సత్సంగము, సంకీర్తనాదులచే హంకారాదులు అణగును.

◆ నేను నిజము చెప్పుచున్నాను వినుడు. భగవంతుని భజన లోను, సజ్జన సాంగత్యములోను తప్ప నిజమైన సుఖము ముల్లోకములందు ఎచటను లేదు. (కబీరుదాస్)

◆ మోక్షమునకు మూడు మార్గములు కలవు. 1) సాధనా అనుష్ఠానములతో, ఏకాంతస్థలమున సద్గురు సన్నిధిలో విద్య నభ్యసించుట 2) జీవయాత్రకు ధనము లేనిచో, సాధ్యమై నంత వరకు పాపములేని ఒక పని, జీవనోపాయమునకు చేసుకొని, ఉత్తములయిన భార్యాభర్తలతోగూడికొని, లేక ప్రత్యేకముగా గాని శాస్త్ర విచారములతోడ, నిష్ఠా అనుష్ఠాన ముల నభ్యసించుట. 3) సర్వసంగ పరిత్యాగియై వివిక్త స్థలములో (తన ప్రయత్నమునకు విరుద్ధముకాని చోట).

◆ సాధుజనుల లక్షణాలు : సత్పురుషులు గర్వపడరు. ఇతరులను నిష్ఠూరంగా నిందించరు. ఎవరైనా అప్రియముగా మాట్లా డినా దాన్ని విన్నా సహిస్తారు. ఎప్పుడూ కోపగించుకోరు. ఇతరుల దోషాలను ఎంచకుండా వారిలోని గుణాలను మాత్రం ఎంచుతారు. ఇవే సాధు జనుల లక్షణాలు.

◆ మనస్సును వశపరచుకొనుటకు, మోక్షము నొందుటకు త్యాగము కంటే అధిక తరమగు సాధన లేదు.

◆ ముముక్షువు బ్రహ్మమునందు మనస్సు సుస్థిరముగ నెలకొల్పు టకు బ్రహ్మచర్యముకంటే శక్తివంతమగు నది మరొకటి లేదు.

◆ అహంకారమును నశింపజేయుటకు, ఆత్మ విచారణము తప్ప అధికమగునది లేదు.

◆ నామము చెప్పని నోరు, ధ్యానము చేయని మనస్సు, జ్ఞానము లేని బ్రతుకు, వ్యర్థము.

◆ మంచి నడవడికయే ఉత్తమ మానవుడిగా జేయును.

◆ గాఢనిద్రలో నీవున్నావు, జాగ్రత్తులోను వున్నావు. మనస్సు లేచినచో ప్రపంచము లేచును. మనస్సు అణగినచో ప్రపం



చము అణగును. ఈ ప్రకారము అణగునది లేచునది ఆత్మకాదు. ఆత్మలో మనస్సు పుట్టి, పెరిగి లయించుచున్నది. ఆత్మ అన్నింటికి మూలమైనది. మనస్సు క్షణ క్షణము మారు చుండును. అది అశాశ్వతమైనది. నీవో శాశ్వతుడవు. ఈ ప్రపంచమున ఆత్మ తప్ప అన్యమేమియును లేదు. ఆత్మలో నిలకడ కలిగియుండుటే నీవు చేయవలసిన పని. మనస్సును లక్ష్యపెట్టకుము. మనస్సునకు మూలమైన ఆత్మను పట్టుకొని నచో మనస్సు దానంతట నదియే అదృశ్యమైపోవును. (శ్రీ రమణ మహర్షి)

◆ భోజనము చేయుట, నీరు త్రాగుట, కూర్చుండుట మొదలగు నవి మనకు ఎట్లు అవసరమో, అట్లే పూజ, ప్రార్థన, జపము, ధ్యానము కూడా అవసరము. ఇది సంపూర్ణమైన సత్యము. స్వానుభవము. (మహాత్మాగాంధి)

◆ సంశయములు నన్నావరించినపుడు నిరాశ, నిరుత్సాహ ములు జనించినపుడు, నేను భగవద్గీతను తెరిచి చూచె దను. అందులో ఏదో ఒక శ్లోకము నన్ను ఊరడించె డిది. విపత్కర పరిస్థితియందు కూడా నా ముఖముపై చిరునవ్వు తాండవించుచుండును. నా జీవితములో అనేక ఘోర సంఘ టనములను నేను అనుభవించవలసి వచ్చినను అవియే మియు నా మనంబున లవలేశమైనను అశాంతిని కలుగ జేయజాలకపోవుట గీతాప్రబోధము యొక్క సత్ఫలితమే యగును. (మహాత్మాగాంధి)

◆ కల్పవృక్షము, కామధేనువు కోరిన వాటినే యిస్తాయి. కాని సత్పురుషుని సాన్నిధ్యమున కోరనివాటిని కూడా యిస్తుంది.

◆ తీర్థయాత్రలకు తిరుగుటకంటే వ్రతాలు, యజ్ఞాలు, యాగాలు చేయుట కంటే ఒక సత్పురుషుని దర్శిస్తే మీకు ఎక్కువ మేలు జరుగుతుంది.

◆ అవతార పురుషులు ఈ లోకములోనికి కారణనిమిత్తం

వస్తారు. కాని మనం కర్మనిమిత్తం వస్తాము.

- హృదయములో మోహమున్నవాడు ఒంటరిగా ఉండలేడు. మోహమున్న వాడికి, రాగమున్నవాడికి రోగము తప్పదు.
- స్వార్థానికి మించిన పాపము మరొకటి లేదు. స్వార్థపరుడు సమాజ శ్రేయస్సుకు సహకరించలేడు.
- ఆకలిపోగొట్టే అన్నదాతకంటే, అజ్ఞానము పోగొట్టే జ్ఞాన దాత శ్రేష్ఠుడు.
- దుష్టునితో స్నేహము చేస్తే, మీలోనున్న సద్గుణాలు పోయి, దుష్ట వాసనలు అంటుకొని, మిమ్ములను అధోలోకాలకు తీసుకొని పోతాయి.
- సత్పురుషుని సహవాసమువలన మీకు అనేక సద్గుణాలు అలవాటు పడి మిమ్ములను ఉత్తమ లోకాలకు, ఉత్తమ జన్మలకు తీసుకుపోయి జన్మరాహిత్యం చేస్తుంది.
- కోపాగ్నిని చల్లార్చుటకు శాంతముకంటే ఎక్కువ శీతలమగు పానీయము లేదు.
- కామ, క్రోధముల వినాశమొనర్చిన భక్తునికంటే ఎక్కువ సుఖవంతుడు ముల్లోకములలోను లేడు.
- ఇంద్రియములను అణచుటకు తపస్సుకంటె ప్రయోజన కారియగు మందులేదు.
- మనస్సు యొక్క మలినములు తొలగించుటకు జపముకంటే ఎక్కువైనది లేదు.
- ఆహారము కొరకు నింద్యము కాని ఏదైన పనిని చేసికొనవలెను. జీవించుట కొరకు మాత్రమే ఆహారమును తీసుకొనవలెను. దైవతత్వ మును తెలుసుకొనుట కొరకు జీవించవలెను. మరల జన్మ లేకుండుట కొరకు జ్ఞానమును సంపాదించు కొనవలెను.
- తాను భుజించు ఆహారము - సాత్వికాహారము, మితాహారము, న్యాయార్జిత ఆహారము, అదియు దైవార్పిత ఆహారమై వుండవలెను.



- భోజనము చేయునపుడు ఎవరితోను మాట్లాడరాదు. దైవభావముతో భుజించవలెను.
- భోజనమునకు, భోజనమునకు మధ్య ఏమియు తినరాదు. జీవించు టకు తినుము, తినుటకు జీవించకుము.
- జీవునిలో అసత్యమగు అహంకారము తొలగినపుడు, సత్యమగు దైవము శేషించును. ఈ కార్యము సాధించుటయే సమస్త మతముల యొక్క ఆశయము.
- వైరాగ్యమను ప్రమిద, భక్తియను నూనె, చిత్త ఏకాగ్రతయను వత్తె, తత్త్వవిచారణయను అగ్గిపెట్టె కలిగియుండువారికి, జ్ఞానజ్యోతి చక్కగా వెలుగుచుండును.
- క్రోధము, అసూయ మున్నగు దుర్గుణములు కలవారి యొక్క అనుష్ఠానములు కళాయిలేని పాత్రలో వండిన పప్పుపులుసు వలె వ్యర్థములైపోవును.
- భగవంతుడు యిచ్చిన జీవితకాలసమయమును వ్యర్థపరచక, జాగ్రత్తగా ఉపయోగపరచుచుండిన మాత్రమే ఈ జన్మలోనే తరించి, ఆత్మశాంతిని దైవప్రాప్తిని పొందగలము.
- ఎవని నుండి సమస్త భూతకోట్లు ఆవిర్భవించుచున్నవో, ఎవని యందలి అన్నియు స్థితిని పొందుచున్నవో, తుదకు ఎవని యందు లయమొందుచున్నవో అతడే దేవుడు.
- ఉదయము నిద్రలేవగనే దేవుని ప్రార్థన చేయండి. మరల సాయంత్రము పరుండుటకు ముందుగా దైవ ప్రార్థన చేయుము. దైవ భావముతో రోజంతయుగడుపుము, దేవుని పొందుటకిదియే చక్కని మార్గము.
- పవిత్రత, సహనము, పట్టుదల, యివియే జీవిత ప్రధాన సూత్ర ములు.

- అన్నిటికంటే వేగముగా పోవునది మనస్సు. అన్నిటికంటె ఉత్తమమైనది సచ్ఛీలము; అన్నిటికంటె యోగ్యమైనది తన్ను తాను తెలుసుకొనుట అన్నిటి కంటె గొప్పది.
- మానవజన్మ రావటము, సత్పురుషుల సహవాసము దొరుకుట, మోక్షము పొందాలని కోరిక పుట్టుట, మంచి మాటలు వినాలనే అదృష్టము కలుగుట, ఎన్ని జన్మల పుణ్యమో అన్నారు. (శ్రీ ఆదిశంకరాచార్యులవారు)
- దయగల హృదయమే భగవన్నిలయము (శ్రీ మలయాళ స్వామి)
- హృదయం మంచిది కాకపోతే, యితర గుణాలు ఎన్నివున్నా యేం ప్రయోజనం.
- భగవంతుడు ఎవరు అని తెలుసుకోవడానికి, ముందు నిన్ను నీవు తెలుసుకోవడం ముఖ్యం.
- ప్రేమయే దైవము, దైవమే ప్రేమ, ప్రేమయే దైవ స్వరూపము.
- నిందవేయడం, అబద్ధం చెప్పడం కంటే మిక్కిలి ఘోరం.
- సేవకు మించిన సుగుణం మరొకటి లేదు.
- దయ మనిషికి ఒక వరము
- ఆత్మ సాక్షాత్కారానికి, అత్యంత ఉపయుక్తమైనది, మానవజన్మ
- సత్యమేవజయతే, ఏనాటికైన సత్యమే జయిస్తుంది.
- ధర్మోరక్షతి రక్షితః తాను ధర్మము నాచరించినచో, ధర్మమే తనను రక్షించును.
- తృప్తి దుఃఖాన్ని మ్రింగివేస్తుంది.
- నీ బాధకు కారణమేమైనా, నీవు ఇతరులను బాధించరాదు (ఇతరుల మనసుకు బాధ కలిగించరాదు)
- సత్యంవద ధర్మంచర, సత్యమును పలుకుము, ధర్మమును ఆచరింపుము.
- దయకు సమమగు పుణ్యము లేదు.



- భక్తికి సమమగు భూషణము లేదు.
- జ్ఞానమునకు సమమగు సుఖము లేదు
- అజ్ఞానమునకు సమమైన దుఃఖము లేదు.
- అహంకారమునకు సమమైన శత్రువు లేడు
- సోహంకారమునకు సమమైన బంధువు లేడు
- మానవసేవయే మాధవ సేవ
- అన్నిటియందును భగవంతుడున్నాడని, అందరిని అన్ని జీవరాశు లను ప్రేమించుము.
- ఆశగలవాడు ధనవంతుడైనను దరిద్రుడే
- సంతోషము మంచి నుండి కలుగుచున్నది
- దుఃఖమునకు కారణము పాపము
- సుఖమునకు కారణము పుణ్యము
- నీవలెనే నీ తోటి జీవులను ప్రేమించుము.
- మనము చేయు మంచిచెడ్డలు, నీడవలె మనవెంట అంటియుండును.
- ఫలమును గోరక భక్తిశ్రద్ధలతో దేవుని పూజింపుము
- నీటిలో పడవవుండవచ్చునుగాని, పడవలోనికి నీరు రాకూడదు. అట్లే సంసారములో నీ వుండవచ్చును గాని, నీలో సంసార ముండరాదు. (మహర్షి సద్గురు మలయాళస్వామి)
- మహాత్ముల సహవాసముచే, బంధుమిత్రాదుల యందలి ఆశ పోవుచున్నది. ఈ ఆశ నశించినతోడనే జీవన్ముక్తి లభించు చున్నది. (శ్రీ శంకరాచార్యుల వారు)
- విత్తనము ఎంత శ్రేష్ఠమైనను, వర్షము లేనిదే ఫలింపని విధమున, మనుష్యుడు ఎంత బుద్ధిమంతుడైనను భక్తిలేనిదే తరింపజాలడు (శ్రీ మహమ్మదు)
- ఆశ, మాయ, మోహము, అభిమానము, ఈర్ష్య, శోకాలు,

పర నింద ఎవడు వదలివేయునో వాడే సత్పురుషుడు (శ్రీ కబీరు)

- గదిలో దీపము వెలుగుచున్నంతవరకు, చీకటి ప్రవేశింపలే నట్లు హృదయములో జ్ఞానజ్యోతి వెలుగుచున్నంత వరకు అజ్ఞానము దరిజేరదు. (శ్రీ రామ తీర్థ)
- నీవు చెల్లించే మ్రొక్కుబడులు దేవుని సంతోషపెట్టవు, నీ అచ రణ, నిర్మల హృదయమే దేవుని సంతోషపెట్టగలవు (షింటో)
- పుణ్యముచే సుఖము, పాపముచే దుఃఖము, జ్ఞానముచే మోక్షము ఇది దైవ శాసనము
- దైవము కొరకు పరితపించకుండా యెవరును దైవమును పొందలేరు.
- ఆత్మసాక్షాత్కారముచే కలుగు ఆనందము, ప్రపంచములోని ఆనందములన్నింటికంటెను గొప్పది.
- సంసార దుఃఖమను తిరగలియందు పడి జనులందరు నలిగి పోవుచున్నారు. కేవలము భగవద్భక్తుడు ఒకడే, ఆ దుఃఖము నుండి, విడివడి సదా పరమానందమును పొందుచున్నాడు.
- సమస్త దుఃఖములను పోగొట్టునట్టి, భగవన్నామమును, జపించు వారికి ఇక భయమెచట, నా చెంత అగ్ని కూడా చల్లగా వున్నది చూడుము. (ప్రహ్లాదుడు తండ్రితో)
- అపవిత్రత, అవినీతి అను దుర్గుణములను, హృదయము నుండి తొలగించుటయే మోక్షమునకు యేకైక మార్గము.
- నిర్మల హృదయము చేతను, పరిశుద్ధ మనస్సు చేతను, దైవ సాక్షాత్కారము లభ్యము కాగలదు.
- కష్టములు మానవునికి నీతి ధర్మములు బోధించును
- చిత్తైకాగ్రత లేనిదే దేనిని సాధించలేము
- క్షమకు మించిన హితకారియైన గుణము లేదు.



- భగవంతుడు దయామయుడు. అతనిలో నీవు లీనమైపో వలెనన్న నీవు కూడా అట్టి దయను సంపాదించవలెను.
- మానవ జీవితము ఒక అమూల్యమైన ఆస్తి. దైవ సాక్షాత్కార మును సాధించుటకే దానిని వినియోగించుము.
- సద్గుణమే నిజమైన ధనము. సత్ ప్రవర్తనయే నిజమైన సంపద. సదాచారమే నిజమైన సిరి.
- బంధమునకు, మోక్షమునకు మనస్సే కారణము. మనస్సును అరికట్టడానికి ఆధ్యాత్మిక మార్గము తప్ప వేరు మార్గము లేదు.
- దైవమును నిత్యం నిర్మలమైన పవిత్రభావముతో పూజించిన, దైవం సదా మీ సమీపమునందే వుండును.
- జీవితము క్షణికము. మంచిపనులు చెయ్యండి. మంచి తలపులు కలిగి వుండండి. సత్సాంగత్యము చెయ్యండి, సన్మార్గ మున సదా పయనించండి.
- మానవుని హృదయము ఆశతో కూడినదయితే, అది యెప్పుడు పతన మార్గమునే చూపుతుంది.
- దానము చేయునపుడు శ్రద్ధతో చేయవలెను. సంపద ననుస రించి చేయవలెను. ప్రత్యుపకారము కోరక దానము చేయ వలెను (అది మంచి లక్షణము)
- నిద్ర మనస్సుకే గాని, ఆత్మకెలా కాదో, చావు దేహానికే గాని, ఆత్మకు లేదు (ఆత్మ నిత్యము, శాశ్వతము, సనాతనము)
- నీవు నిన్ను ఉద్ధరించుకొన్ననాడే నీవు ప్రబోధకుడవు కాగలవు. గాదెలోని ఎలుకలు ధాన్యాన్ని పాడుచేయునట్లు, మనిషిలోని అహంకారము జ్ఞానాన్ని పాడుచేస్తుంది.
- అద్దమునకు పట్టిన మురికిని తొలగించగనే ప్రతిబింబము గోచరించులాగున, తపోధ్యానాదుల ద్వారా మనో మాలిన్య ములు తొలగించబడగానే ధ్యానస్థితిలో ఆత్మానుభవం కలుగుతుంది.

- అంతా నా మేలుకే వచ్చినదని తలచుచూ కష్టాలను ఓరిమితో అనుభవించుము.
- ఈ ప్రపంచమనే ధర్మశాలయందు, నీవు ఒక బాటసారివలె గడుపుము
- ఈర్ష్యను కూకటి వేళ్లతో సహా పెళ్లగించుము.
- ఎంతటి కష్టము కలిగినను దేవుని నిందించకు
- ఏడ్చుచూ పుట్టినావు గనుక నవ్వుచూ ప్రాణాలు విడుచుట మంచిది
- పాపము వలన పుణ్యము తరిగిపోవును. కావున పాప కార్యము చేయవద్దు.
- కరుణామూర్తులగు తల్లిదండ్రులను, దైవముతో సమానముగా చూడుము.
- కాంతా, కనకములపై వ్యామోహము తగ్గించుకొనుము.
- కాయము అస్థిరముగాన, చేయదగిన ధర్మకార్యములను యిప్పుడే చేయుము.
- బీదలకు, రోగులకు తల్లిదండ్రులకు సేవచేయుము.
- ఎవడు కోపము జనించినపుడు, కుబుసమును పాము వదలునట్లు ఓర్పుతో తొలగించివేయునో అతడే మానవుడని చెప్పబడును.
- అనుభవమునకు మించిన గురువు లేడు.
- దొరికినది చాలు అనుకొనుటయే జీవితములో తృప్తికి యేకైక మార్గము.
- చీకటికంటెను నలుపైనది కల్మష మనస్సు. రాతికంటెను కఠినమైనది కఠోర హృదయము.
- మౌనము, ప్రార్థన, జపము, ధ్యానము వీటివలన హృదయమున శాంతి కలుగును.



- ఆత్మార్పణము, భక్తి, క్రమశిక్షణ, వివేకము, వైరాగ్యము, పట్టుదల అను వీటిని చక్కగా అభ్యసింపుము.
- అహంకారము లేకుండా నిష్కామముగా కర్మనొనర్చుము. కర్మ ఫలములను భగవంతునికి అర్పింపుము.
- శరీరములు అశాశ్వతములు, సంపదలు శాశ్వతములు కావు మృత్యు వెప్పుడును కాచుకొనేయున్నది. కాబట్టి నిరంతరము ధర్మమునే ఆచరించవలెను.
- పవిత్రత, సహనము, పట్టుదల అను ఈ మూడును విజయమునకు ప్రధాన హేతువులు.
- వర్షము లేని కాలములో జీవితమెటువంటిదో, చంద్రుడు లేని రాత్రిలో సంచారమెటువంటిదో రోగముతో కూడిన బ్రతుకు ఎటువంటిదో, శాంతిలేని జీవితము అటువంటిదే (శ్రీ మలయాళ స్వామి)
- మోక్షం పొందడానికి ఎన్నో మార్గాలున్నాయి. యోగం, త్యాగం, తపస్సు, జ్ఞానం, ఇవన్నీ పరమాత్మను పొందటానికి మార్గాలే. వీటిలో దేన్నో ఒక దానిని అవలంభించి మోక్షమును పొందాలి (శ్రీ షిర్డీ సాయిబాబా)
- సుఖమయ జీవితమునకు త్యాగము అవసరము. ప్రేమలేని హృదయము చీకటి కొంప.
- మనస్సును భగవంతునకు సమర్పించుకొనుము. సేవ చేయుము దైవ ధ్యానమొనర్చుము
- ఎవరైతే ఎల్లప్పుడు నా గురించే ఆలోచిస్తూ, నా గురించే మాట్లాడుకుంటూ, నా విషయాలే వింటూ, నా చింతనే కలిగి వుంటారో, ఎవరు నిరంతరం నా నామజపాన్నే చేస్తూ వుంటారో అటువంటివారు నా దివ్యధామానికి తప్పకుండా అవసాన దశలో చేరుతారు (శ్రీ షిర్డీ సాయిబాబా)
- ఓర్పు, దయ, సత్యము, సంతోషము ఋజుత్వము అను ఈ

సద్గుణములను అమృతము వలె గ్రహింపుము.

- బయట శత్రువులకంటె లోపలి శత్రువులు (కామక్రోధాదులు) మహా ప్రమాదకరములైనవారు.
- తీర్థములన్నిటిలో మహా పవిత్రమైనది నిర్మల హృదయము.
- మనస్సు శుద్ధముగా వుండినచో, వారు పచించువాక్కులు, మంత్ర ములవలె శక్తివంతములుగా నుండును.
- సంతోషమునకు మించిన అలంకారము వేరొకటి లేదు.
- చందనపు చెట్టును నరుకుగొడ్డలికి, ఆ చెట్టు సువాసన యిచ్చును. సత్పురుషులున్ను అట్టివారే.
- అసాధ్యరోగములకు కూడా, భగవన్నామస్మరణకు మించిన దివ్యౌషధము లేదు.
- తాను అనుభవించు ఆనందమును, ఇతరులకు కలిగించు టకు చేయు ప్రయత్నమే కళ.
- సోదరుడా మానవసేవ చేయుట మనుజుని శ్రేష్ఠధర్మము. అయితే మానవసేవ చేయుటకు ముందుగా నీవు మానస సేవ చక్కగా చేయుము. అట్లైన మాత్రమే నీవు మానవసేవ సరిగా చేయగలవు (శ్రీ మలయాళ స్వామి)
- దేవతలను, పితరులను సమస్త మానవులను, సాధు సత్పురు షులను, అతిథులను అను యీ అయిదుగురిని పూజించు వాడు మహోన్నత మగు కీర్తని బడయగలడు.
- దృశ్య పదార్థములందెంతెంత, ఆసక్తి తగ్గుచుండునో, దేవుని యందంతంత భక్తి వృద్ధియగుచుండును.
- బీజమును బట్టి ఫలముండునట్లు, తాను చేసిన సుకృత, దుష్కృతములననుసరించి సుఖదుఃఖములు కలుగు చుండును. కావున ప్రతి ఒకరును పాపకర్మములను ప్రయత్నపూర్వకముగ విడిచి, పుణ్య కార్యములను సర్వదా



చేయుచుండవలయును.

- ధనవృద్ధుడుగాని, విద్యావృద్ధుడుగాని, వయోవృద్ధుడుగాని, అధికార వృద్ధుడు గాని యైనను, తత్త్వబోధకుడగు పరమ గురువు దగ్గర, బాల భావముగలిగి వర్తించవలయును. అట్టివారికి మాత్రమే గురుబోధ సార్థకమగును. (శ్రీ మలయాళ స్వాముల వారు)
- పశుత్వమునకు శివత్వమునకు రెండే మార్గములు. ఇంద్రియ ములకు వశపడిన పశుత్వము, ఇంద్రియములు వశములో నుంచిన ఈశ్వరత్వమున్నూ జీవులకు కలుగు చుండును. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)
- మనసు చాలా పాతదైన వస్త్రము వంటిది. కొంచెము చిరిగి నను, దానిని వెంటనే కుట్టవలయును. లేనిచో అంతయు చినికిపోవును. అట్లే హృదయములో ఏదైన ప్రపంచ వృత్తి గలిగిన, వెంటనే మనః పరివర్తన పరమగు మార్పు చేసుకొన వలెను. లేనిచో దృశ్య విషయ ములలో మునిగిపోవుట తథ్యము. (శ్రీ మలయాళ స్వాముల వారు)
- బంగారము మలములో పడినప్పటికిని, దాని విలువ తగ్గుట లేదు. అటులనే నీచకులమందు ఉత్తమ గుణములుగల వారున్నచో, వారిని సర్వులు పూజింతురు. విలువైనది సుగుణ ముగాని, కులముగాదు. గొప్పవాడు ఏ జాతిలో నున్నను వారి నుండి మంచిని మనము నేర్చుకోవలసినదే (శ్రీ మలయాళ స్వామి).
- పరిపక్వదశలో వున్నవారికి, విచారణమార్గం ఎక్కువ అను కూలం. తక్కినవారు తమతమ స్వభావాన్ని బట్టి భక్తి జ్ఞాన, కర్మయోగ, జప, తప మార్గాల్ని అనుసరించాలి. అవన్నీ ఏకాగ్ర తకు సహకరిస్తాయి. (భగవాన్ రమణ మహర్షి).
- కొండంత దూదియైనను, నలుసంత నిప్పు దానిపై పడినంతనే

తగుల బడి బూడిదయైపోవు రీతిని, పావన భగవన్నామ
మును భక్తితో కీర్తించిన మాత్రాన నీ పాప రాశులన్నియు
పటాపంచలైపోగలవు. (శ్రీ రామకృష్ణ పరమహంస)

- కండ్లు కనిపించనివారియెదుట, ఎంత మనోహరముగ నుండు చిత్ర విచిత్రములైన అనేక వస్తువులను ప్రదర్శించి నను అతడేలాగున వానిని చూడజాలడో, ఆలాగున జ్ఞాన నేత్రము తెరువబడువరకు అతనికి యెన్ని విధములుగ వేదాంతతత్త్వములను బోధించినను గోచరముగాజాలదు.
- చిన్నతనమున తనకు పోసిన కొద్ది నీటిని త్రాగి, ఆ మేలును మరువనిదై కొబ్బరిచెట్టు తననెత్తిన, ఎంతయో బరువుగల, కాయలను మోయుచు జీవిత పర్యంతము, మనుజులకు తియ్యని నీటిని యిచ్చుచున్నది. సాధువులు ఎంత చిన్న ఉపకారమునుగూడా మరువక ప్రత్యుపకార పరాయణులై యుందురు.
- అపవిత్రతను, అవినీతిని, దుర్గుణములను హృదయము నుండి తొలగించుటయే మోక్షమునకు యేకైక మార్గము.
- విజ్ఞానమును బడయుటకు మార్గము తత్త్వవిచారణయే.
- ఏకాంత ప్రదేశమున ఆధ్యాత్మిక సాధనలు చేయుట ముఖ్యము. లేత మొక్కకు కంచె అవసరము. కాని అది పెరిగి పెద్దదయిన తరువాత పశువులు దానిని పాడుచేయలేవు. కొన్ని సంవత్సరములు ధ్యానము చేసి స్థిరచిత్తమేర్పడిన తరువాత నీవు యెచ్చటనున్నను, ఎవరితో కలిసి తిరిగినను నీ మనసులో మార్పుండదు. (శ్రీ శారదాదేవి)
- ధనములేనివాడు అల్పుడని కొందరు పలుకుదురు. ఉత్తమ కులములో జన్మింపనివాడు అల్పుడని మరికొందరు చెప్పుదురు. కాని సమస్త వేదములు తెలిసిన వ్యాస భగవానుడో, భగవంతుని స్మరింపని వాడే అల్పుడని వచించి యున్నారు.



కావున భగవన్నామమును స్మరించి ధన్యులు అవండి.

- మనస్సను తుమ్మెదా నీవు శ్రీరామచంద్రుని పాద కమలము లందు తిరుగాడుము. అచట ధర్మార్థ కామ మోక్షములను నాలుగు విధములైన రసములున్నవి. సామాన్య కమలము నందు, మకరంద (తేనె) రసము ఒక్కటియే కలదు.
- చేయబడిన పాపము చెప్పుకొనుట చేతను, శుభకర్మనాచరించుట చేతను, పశ్చాత్తాపపడుట చేతను, దానము చేయుట చేతను, తపస్సు చేతను కూడా నశించును (ధర్మరాజు)
- గురూపదేశము అవసరము. అది శరీరమును పరిశుద్ధ మొనర్చును. భగవంతుని బీజమంత్రోచ్చారణమువలన మానవుడు పునీతుడగును.
- గురు భక్తి, దైవభక్తి బ్రహ్మచర్య పాలన అను యీ మూడును విజయ మునకు కీలకములు.
- ఆధ్యాత్మక్షేత్రమున నున్న సాధకులకు, ప్రారంభములో విగ్రహారాధన అత్యవసరము. విగ్రహము దేవుని ప్రతీకము. అది దేవుని స్ఫురింప జేయును. కాబట్టి విగ్రహారాధన ద్వారా చిత్తైకాగ్రత, భక్తి చక్కగా అభివృద్ధి చేసుకొని, సాధకుడు క్రమముగా ఉన్నత శిఖరములకు ఎగబ్రాకవలయును. నిర్గుణ నిరాకార పరమాత్మను తెలుసుకొనవలెను.
- కోరికలకు అంతులేదు అనుభవించిన కొలది క్రొత్త క్రొత్త కోరికలు పుట్టుచుండును. భార్యలేనప్పుడు భార్య కావలెనని రాత్రింబగళ్ళు కోరుచుండును. భార్య వచ్చిన తోడనే పుత్రులు కావలెనని కోరు చుండును. పుత్రులు కలిగిన తరువాత పౌత్రులు (మనుమలు) ఉద్భవించవలెనని కోరుచుండును. ఈ ప్రకారముగా కోరికల యొక్క పరంపరచేత మానవుని యొక్క జీవితమంతయు సతమతమైపోవు చుండును. కావున విచారణచే కోరికలు లేకుండా చేసుకొనుటయే

శ్రేయోదాయకము.

- ఒక కార్యము చేసినచో దానిచే సంస్కారమేర్పడును. సంస్కారముచే అలవాటుపడును. అలవాటుచే చరిత్ర ఏర్పడును. చరిత్రచే గమ్యము నిర్ణయింపబడును. కాబట్టి నీ గమ్యమునకు నీవే కారకుడవు.
- వర్షాకాలము నాలుగు నెలలు సుఖముగా గడుపుట కొరకై తక్కిన ఎనిమిది నెలలు కష్టపడవలెను. రాత్రి సుఖముగా గడుపుట కొరకై పగలంతయు కష్టించి పనిచేయవలెను. వార్ధక్యమందు హాయిగా యుండుట కొరకై యౌవ్వన మంతయు కష్టపడవలెను. అట్లే పరలోక మున సుఖపడ వలెనన్న ఇహలోకమున కష్టపడి దైవసాధనలను గావింపవలెను.
- ఎవరికి వారే యమునా తీరే, తండ్రి కుమారుని యొక్క స్థూలదేహ మునకు కారకుడేగాని, సూక్ష్మదేహమునకు కాదు. వారు వారు సంపాదించు హృదయ పవిత్రను బట్టియే తండ్రిగాని, కుమారుడుగాని సత్ఫలితములను బడయు చుందురు. కావున ఎవరికివారు చక్కగా కృషిచేసి సాధన యొనర్చి దైవసాన్నిధ్యమును బడయవలసియున్నారు.
- సత్కర్మదైవపూజతో సమానము. దానిని సరైన పంథాలో ఆచరించి నపుడు అది ధ్యానముగ మారును.
- సంపదలు, ప్రాణము, జీవితము, యౌవ్వనము ఇవన్నియు అస్థిరములే సర్వము అస్థిరమైన ఈ లోకమునందు ధర్మ మొకటియే స్థిరమైనది. కావున దృశ్య వస్తువులను నమ్ము కొనక, ధర్మమును, దైవమును మాత్రమే నమ్ముకొని యుండుట శ్రేయస్కరము.
- చిన్నవాడైననూ ప్రహ్లాదుడు దైవం కోసం తండ్రిని ఎదిరిం చాడు. రాముని కోసం విభీషణుడు సోదరుని త్యజించాడు. కృష్ణభగవానుని కోసం మీరా ప్రాపంచిక సుఖములను త్యజించింది. సత్యం కోసం హరిశ్చంద్రుడు తన సర్వస్వాన్ని



త్యాగం చేశాడు. ఈ విధంగా సాధకులు దైవం కోసం త్యాగబుద్ధిని కలిగియుండాలి.

- భేదభావములు లేకుండా సూర్యభగవానుడు తన వెలుగును అంతటా సమానముగా ప్రసరింపజేస్తున్నాడు. తన వేడినిగాని, వెలుగునుగాని ఇతరులకు ఇచ్చే గుణమునే కలిగియున్నాడు గాని ఇతరుల నుండి తీసుకొనే గుణము అతనిలో లేదు. అలాగే మనలో విజ్ఞానాన్ని మంచి తనాన్ని అందరికి పంచి పెడుతూ వుండాలి. ఇతరుల నుండి ప్రతిఫలాన్ని ఆశించ కూడదు.
- చెడును వదలివేయుము. దైవమును తెలుసుకున్నవారు దైవములోనే లీనమౌతారు. సత్యము అసత్యముకంటె కోటి రెట్లు గొప్పది.
- నదిని దాటుటకు ఈత లేక నావ అవసరమైనట్లు, సంసార మును దాటుటకు బ్రహ్మ విద్య అవసరము. కావున దానిని బడయుటకై జీవుడు ప్రయత్నించవలయును.
- ప్రపంచమంతయు భగవత్ స్వరూపమని యెంచి సర్వుల యెడ ప్రేమ దయ కలిగియుండుము ఎవరిని ద్వేషింపరాదు.
- పరిపూర్ణమగు సుఖము, తనయందే కలదు. మనస్సును నిగ్రహించి, నిర్మలమొనర్చి అంతర్ముఖము చేసిన అట్టి సుఖమును జీవుడు అనుభూతమొనర్చుకొనవలెను.
- కొంత కష్టమునకు తెగించియైనను ఇంద్రియార్థములవలన కలుగు అల్ప సుఖమును ఎట్టైనను త్యాగమొనర్చివైచినచో, ఇంద్రియముల నొకింత సంయమనము చేసినచో ఆత్మా నందమును, మహత్తర ఫలితము లభింపకలదు.
- తాను చేసుకొన్న పుణ్యమే, ధర్మమే తన్ను రక్షించును. కాబట్టి మోక్షమును కోరువాడు పుణ్యకార్యములను, ధర్మకార్యము లను విరివిగా నాచరింపవలెను.

- సాధకుడు ప్రతి నిత్యము తన గురువు చెప్పిన ఉపదేశమును విడువ కుండా ఆచరించుచుండినచో జీవుడు లక్ష్యమును చేరగల్గును, నిరుత్సాహము పనికిరాదు.
- భగవంతుని యెడల సద్గురువు యెడల, శాస్త్రము యెడల పరిపూర్ణ విశ్వాసము కలిగియుండవలెను.
- ఆశను వదెలివైచి భోగజాలమును తృణీకరించి, ఉన్న స్వల్పపదార్థ ముతో లేక భగవంతుడు యిచ్చిన దానితో సంతృప్తినొందియుండ వలెను.
- సమస్త ప్రపంచమునకు ఆత్మయే ఆధారము. ఆత్మ సాక్షాత్కారమే జీవుని ఏకైక లక్ష్యము.
- దేహాభిమానమును విడచిపెట్టి ఆత్మయే తానను భావమును మననము చేయుచూ పవిత్ర జీవితమును గడుపవలెను.
- ప్రాపంచిక వైభవములు క్షణికములు. వానిని నమ్ముకొనక, శాశ్వత పరమాత్మ కొరకే యత్నించుచూ త్వరలో ఆత్మాను భూతిని బడయవలెను.
- ప్రతివారు తమ మనస్సును బాగుగా పరిశోధించి దుష్టవాసనలను దుశ్శీలమును పోగొట్టుకొని సద్వాసనలను సచ్ఛీలమును పెంపొందించుకొనవలెను.
- భగవంతుడు సర్వవ్యాపకుడు అను విశ్వాసము కలిగి పాప కార్యము లవలేశమైనను చేయక, ధర్మబుద్ధి పవిత్రాచరణ కలిగి యుండవలెను.
- అనంతమగు ఆత్మ సుఖమును పొందగోరువారు విషయ సుఖమును త్యజించవలెను. కష్ట సహిష్ణుత గలిగి దైవము కొరకై అనవరతము యత్నించవలెను.
- జీవిత కాలమంతయు దైవభావము కలిగియుండినచో అంత్యకాల మున అట్టి పవిత్ర దైవభావమే కలిగియుండి తరించును.



- ప్రాపంచిక సుఖములు, వైభవములు అశాశ్వతములు వానిని చూచి మురిసిపోరాదు. తాను చేసిన పుణ్యమే తాను పొందిన ఆత్మజ్ఞానమే తన్ను రక్షించును.
- మనుజుడు తన్నుతానే ఉద్ధరించుకొనవలెను. ఆత్మానుభూతిని బడసి అమూల్యమగు మానవజన్మను సార్థకపరచుకొనవలెను. పవిత్రమగు మానవజన్మను దురుపయోగము చేయరాదు.
- అసూయ నీచమైన దుర్గుణము. దానిని మానవుడు ఏ కాలమందును దరికిచేర్చరాదు.
- మానవుని యదార్థ స్వరూపము ఆత్మయేగాని దేహముకాదు. కాబట్టి జడమైన దేహముపై అభిమానమును వదలి ఆత్మయే తానని భావించుచూ పమానందమునుభవించవలయును.
- మనుజుడు ఆశకు లోబడక ఉన్నదానితో తృప్తిపొంది, శేషించిన సమయమును, జీవితమును దైవధ్యానాదులందు వినియోగించ వలెను.
- మనసును ఊరకనుంచరాదు ఏదైనా ఆధ్యాత్మిక కార్యక్రమమును దానికి యివ్వవలెను. ఊరక వున్నచో వ్యర్థమైన సంకల్పమును చేయు చుండును. కాబట్టి ధ్యాన, పఠన, సేవాది కార్యములందు దానిని వినియోగించవలెను.
- ఎవరు ఎట్టి కార్యములను చేయునో, దాని కనుగుణమగు ఫలితమునే పొందును. కాబట్టి వ్యర్థకార్యములను విడనాడి శాశ్వత దైవప్రాప్తికి వలయు సాధనలనే జీవుడు కావింపవలయును.
- మృత్యువెప్పుడు సంభవించునో తెలియదు. కాబట్టి సమయమును వ్యర్థముగా గడుపక నిరంతరము దైవచింతన, ఆత్మానుభూతియందు గడుపుచుండవలెను. జీవితమును దైవమయముగా నొనర్చవలెను.

- విశ్వాసము గొప్ప ఫలితములను కలుగజేయును. కాబట్టి దైవ విశ్వాసమునందు గురువుయందు, శాస్త్రమునందు నమ్మకము ఆత్మ విశ్వాసము కలిగియుండి ఆధ్యాత్మిక అభ్యున్నతిని సాధింపవలయును.
- భగవంతుడు సర్వాంతర్యామి, సర్వజీవుల హృదయాంతరాళము నందు అధివశించియున్నారు. కాబట్టి మోసము, కపటమున్నగు వానిని వదలివైచి, దైవసాక్షిగ పవిత్ర కార్యములనే ఆచరించుచు జీవితమును దైవమయ ముగ నొనర్చుకొనవలెను.
- కోపమునకు విరుగుడు శాంతము. కావున ఎల్లప్పుడు శాంత భావమును అలవాటు చేసుకొనుము. క్రోధమును దరికి చేర్చరాదు. శాంతగుణముచే క్రోధగుణము జయించవలెను.
- జన్మాంతరవాసనలు, దుస్సంస్కారములు జీవుని, ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రబల శత్రువులు. కావున ప్రయత్నపూర్వకముగ వానిని తొలగించి వేయవలెను.
- ఆధ్యాత్మిక విద్య అతిసూక్ష్మమైనదియగుటచే బహుకాలము సాధనచేసి తత్త్వమునుగ్రహించిన, మహనీయులగు గురువులద్వారా అది చక్కగా బోధపడగలదు, గ్రంధముల ద్వారా ఒకింతయు, అనుభవ జ్ఞులద్వారా పరిపూర్తిగను విద్య లభింపగలదు.
- సామాన్య విద్యలకే గురువు అవసరమైనప్పుడు ఇక అతి సూక్ష్మమైన ఆధ్యాత్మిక విద్యకు అవసరమని వేరుగ తెలుప నక్కర లేదు. గ్రంథము లను చక్కగ చదివి, వానిలోని విషయములను, సద్గురువు ద్వారా బాగుగానభ్యసించి, అనుష్ఠాన పద్ధతులను వారి వలన లెస్సగా తెలుసుకొని మానవుడు కడతేరవలెను. ఆధ్యాత్మిక విద్య ఆచర ణాత్మకమైన విద్యయే గాని, వాచా విద్య కాదని ముముక్షువులు జ్ఞప్తి యందుంచుకొనవలెను.



- మానవుడు ఆశాపిశాచమునకు లొంగక అద్దానిని తన దరికి జేర్చక, భగవంతుడిచ్చిన దానితో సంతృప్తి పడి, వచ్చిన పని దైవసాక్షాత్కారము పూర్తిచేసుకొనుట మంచిది.
- సంసార తాపము శమించుటకు సత్సాంగత్యము, మహాత్ముల బోధలు అత్యావసరములు.
- విషము శరీరమునే నశింపజేయును గాని విషయ సుఖపేక్ష రాబోవు జీవితమునందు కూడా హానిచేయును. (శ్రీ వశిష్ఠ మహర్షి)
- సదాప్రాపంచిక వ్యాపారములలోనే మగ్నులైయుండువారు సచ్చిన వారితో సమానులు. ఎవరు తమ జీవితమంతయు, పారమార్థిక చింతనయందే యుండెదరో, వారే నిజముగ జీవితులు. (శ్రీమహమ్మదు)
- ఓ మూఢమనసా, నీ అవసాన కాలమందు నీ విద్యలు, ధనము నిన్ను రక్షింపనేరవు. కావున సదా భగవంతుని భజింపుము. (శ్రీ శంకరాచార్యులవారు)
- గురువు గోవిందుడు యెదుటనే వున్నారు. ఎవ్వని పాదాలు ముట్టు కొనేది? ఓ గురుదేవా నీకే నమస్కారము, గోవింద స్వరూపుడగు పరమాత్మను దర్శింపజేసినవాడవు నీవేగదా. అందుచేత నీవే గొప్పవాడవు. (శ్రీ కబీరు)
- కర్మలు జడములు. వాటికి ఫలమునిచ్చు స్వతంత్ర శక్తి లేదు. ఈశ్వరుడు కర్మయొక్క శుభా శుభ ఫలములనిచ్చువాడు. కాబట్టి భగవదాజ్ఞానుసారము కర్మ ఫలము లభించునని తెలియవలయును. (శ్రీ రమణ మహర్షి)
- ఆత్మ నిగ్రహమే సమస్త ధర్మములకు మూలము.
- ధర్మముత్యజించకుము. అది ప్రాణముకంటె యధికమైనది.
- ధర్మము, సౌఖ్యము ఒకదానికొకటియనుసరించి యుండును.
- భగవంతుని దయను పొందుటకు ప్రార్థన కంటె ఉత్తమమైన

వుపాయము లేదు.

- ◆ చెడును చూడకుము, వినకుము, వర్ణించకుము.
- ◆ దేవాలయములో నుండి, మూడు దినములుపవాసము చేయువాని కంటె, ఒక మంచి పనిచేయుట గొప్పది.
- ◆ చిన్న ఆకులోను, గడ్డిపోచలోను భగవంతుడున్నాడని తెలిసికొనుము.
- ◆ క్షమాగుణము అమూల్యమైన రత్నము, తృప్తికిదియే మూలము.
- ◆ తల్లిదండ్రులు, గురువులు ఇచ్చు యాజ్ఞలపాలించుము. హృదయమును స్వచ్ఛముగ నుంచుకొనుము.
- ◆ న్యాయమనగానేమియో తెలిసిన పిమ్మట వానిననుసరించక పోవుట పిరికివాని లక్షణము.
- ◆ మన జీవితము గాలిలో పెట్టిన దీపము వంటిది. మన జీవితము స్వప్న దృశ్యము.
- ◆ గర్వముండిన పరుల సహాయము లభింపదు. నీవు చెల్లించే మ్రొక్కు బడులు దేవుని సంతోషపెట్టవు. నీ ఆచరణ, నీ నిర్మల హృదయములే ఆయనను సంతోషపెట్టును.
- ◆ ప్రార్థించకపోయినను, సత్య పదముననుసరించువానిని దేవతలు రక్షించెదరు.
- ◆ ఒక్కమారు త్రికరణశుద్ధితో చేసిన ప్రార్థన భగవంతుని కదిలించును. ఇలాంటి ప్రార్థన వలననే నీకు భగవదనుభూతి కలుగును.
- ◆ ఆత్మ సాక్షాత్కారము సాధించవలెనన్న ధ్యానయోగసాధనలు కనీసము రోజుకు మూడు గంటలు చేయవలెను. ఆరు గంటలు చేసిన యింకా మంచిది, తొమ్మిది గంటలు చేయుట ఉత్తమము. (మహర్షి శ్రీ మలయాళస్వామి)
- ◆ రాగద్వేషాలతో నిండిన, ఈ ప్రపంచము స్వప్న తుల్యము. అజ్ఞాని గనున్నంత కాలము అది సత్యముగతోచును, జ్ఞానోద



యముకాగానే ప్రపంచము అసత్యమగును.

- ◆ మనస్సు ప్రాపంచిక విషయాలతో సంచరించడమే సంసార బంధం. మనస్సు ఆత్మయందు నిశ్చలత పొందడమే భవబంధ రహితమగు మోక్షము (శ్రీ కాళీబాబు)
- ◆ పరుసవేది ఇనుమును బంగారముగ మార్చునట్లును, భగవన్నామస్మరణ మలిన హృదయాలను, పరిశుద్ధ హృదయాలుగా మారుస్తుంది. పరిశుద్ధ హృదయాలు భగవంతుని నివాస స్థానాలు. (శ్రీ కాళీప్రసాద్ బాబు)
- ◆ జగత్తు అంతయు భగవంతునిదే, జీవులందరు దైవస్వ రూపులే. అహంకారము దర్పము పనికిరాదు. అవి అసుర గుణములు. ఎవరిని అవమానింపరాదు, బాధింపరాదు. అంతయు దైవమయము కాబట్టి, ప్రతి పాణియెడల ప్రేమ, దయ, కరుణ కలిగియుండవలెను. పరిపూర్ణమగు శాంతి నీ ఆత్మయందే లభించును. మనస్సుతో కూడిన వాడు జీవుడు, మనస్సును దాటినవాడు దేవుడు.
- ◆ దేవాలయమునకు సమర్పించు మణుగు బంగారముకంటె, దయాగుణము గొప్పది. (శ్రీ యేసుక్రీస్తు)
- ◆ వేయిమైళ్ళు నడిచివెళ్ళి పూజచేయుట కంటె, ఇంటి దగ్గరుండి ఒక మంచి పని చేయుటయే గొప్ప (కన్‌ఫ్యూషియస్).
- ◆ పసిబిడ్డలకు దాంపత్యజీవితము తెలియని విధమున, ప్రాపంచిక సుఖాభిరతులగు మానవులకు పరబ్రహ్మైకానంద సుఖము బోధపడ జాలదు. (శ్రీ రామకృష్ణ పరమహంస)
- ◆ సత్యమును బహుకాలము అన్వేషించినపుడు, సదాచారము కలిగి నపుడు మాత్రమే, ఆధ్యాత్మిక రహస్యములు తెలియబడును.
- ◆ మోక్షమునకు కారణము పవిత్రత. బ్రహ్మానందమునకు కారణము ధ్యానము. జ్ఞానమునకు కారణము తత్త్వవిచారణ. ఆత్మానుభూతికి కారణము భక్తి.

- మానసిక ఆరోగ్యము లేకుండా ఎన్ని పుస్తకములు చదివినను వ్యర్థము.
- దేహమునకు అన్నముయెట్లు అవసరమో, మనస్సునకు ఉపదేశములు అత్యవసరములు.
- మనస్సు ఏకాగ్రముకాక పోయినను, మంత్రోచ్ఛారణ మానకుము. నీ విధి నీవు నిర్వర్తింపుము. గాలిలేని చోట భద్రపరచిన దీపమువలె, నామస్మరణ చేయునపుడు మనస్సు నిశ్చల మగును. దీప శిఖ కదలాడునది గాలి మూలముననే గదా. అదే విధముగా మన ఊహలు, కోరికలు, మన మనస్సును కల్లోల పరచును. కష్టములు వచ్చు చుండును కాని కలకాల ముండవు. వంతెన క్రింద పారుచున్న నీటివలె, అవి దొరలి పోవును (శ్రీ శారదాదేవి)
- అహింస, సత్యభాషణము, సమస్త ప్రాణికోట్ల యెడల దయ, క్షమఅను యీ సద్గుణములు ఎవనియందుండునో అతడు సుఖవంతుడగును.
- తనకు అండగా భగవంతుడున్నాడని తలంచువాడు, ఏ కార్యమందును నిరుత్సాహమును పొందడు.
- సత్యము, దానము, సోమరితనము లేకుండుట, అసూయా రాహిత్యము ఓర్పు, ధైర్యము అను యీ ఆరు సుగుణములను ఏ కాలమందును మరువరాదు. (మహాభారతము ఉద్యోగ పర్వము)
- అధిక నిద్ర, మత్తు, భయము, కోపము, సోమరితనము, మందకొడి స్వభావము అను యీ ఆరు దుర్గుణములను మోక్ష కాంక్షియగువాడు పూర్తిగా విడనాడవలెను.
- నీవు కోపమును వదలుము, ఏలయనిన అది సుఖమును, ధర్మమును నశింపజేయును. ధర్మమును సేవింపుము, ఏలయనిన, అది సుఖమును సత్కీర్తిని అభివృద్ధిపరచును.



- మనస్సు చేతను, వాక్కుచేతను, క్రియచేతను, దృష్టిచేతను, జనులకు మంచినే చేయవలెను. ఎవని యెడల ద్వేషము కలిగియుండరాదు. ఈ ప్రకారమాచరించినచో అతడు పాపముచే అంటబడడు.
- దేవుని పేరు సత్యము, ప్రేమయే దేవుడు, ప్రేమకలవాడు దేవునిలో జీవించువారేయగుదురు.
- సత్యమునకు, సన్మార్గమునకు మించిన మతము లేదు.
- భయము కలుగుటకు కారణము మన నిజ స్వరూపమును, ఆత్మను తెలిసికొనకుండుటయే.
- ఎవని హృదయము దయాపూరితమైయున్నదో ఎవని వాక్కు సత్యముతో గూడి అలరారుచున్నదో, ఎవని శరీరము పరుల హితము కొరకై ప్రవర్తించుచున్నదో అట్టి మహనీయుని ఇక కలి ఏమి చేయగలదు.
- దాన ధర్మములు లేని ధనము, సద్గుణములు లేని విద్య, మానవత్వము లేని విజ్ఞానము, త్యాగము లేని క్రియ వ్యర్థములు.
- మానవులకు ఓర్పు చాలా అవసరము. దానిచేతనే అతని శోభ, సూర్యుని కాంతివలె మెరయుచుండును. సర్వశక్తి మంతుడైన భగవంతుడు, శ్రీహరియు ఓర్పుగలవాని యెడల శీఘ్రముగ ప్రసన్నుడగును. (జమదగ్ని)
- ఈ సమస్త ప్రపంచము కేవలము రెండు విషయాల మీదే ఆధారపడి వుంది. అదియేమంటే 1) ధర్మము 2) సత్యము, ధర్మప్రవర్తనతోను, సత్య సంధతితోను ప్రవర్తించే వ్యక్తి నాకు అత్యంత ప్రీతిపాత్రుడవుతాడు (శ్రీ షిర్డీ సాయిబాబా)
- కార్యసాధనకు ఆత్మవిశ్వాసమే ప్రధమసోపానము. ఇతరుల తప్పులను వెదకువారు ముందుగా తమ తప్పులను తెలిసికొని వాటిని సవరించు కొనవలెను.

◆ ప్రారంభించిన శుభకార్యము నెరవేరు వరకు పట్టువిడువరాదు.

◆ నిర్మల సుఖమును బొందవలెనన్న భగవంతుని అనుగ్రహము కావలెను. భగవంతుని అనుగ్రహము కావలెనన్న వారిని ధ్యానించవలెను. వారియందే చిత్తమును సంలగ్నము చేయవలెను.

◆ సుఖము బంగారముచేగాని, వెండిచేగాని కొనదగిన వస్తువుగాదు. అది బాహ్య పదార్థమువంటిది గాదు. పవిత్రత చేతను, భగవద్భక్తి చేతను, హృదయమునందే అనుభూత మొనర్చుకొనదగిన వస్తువే అది.

◆ ప్రాపంచి విషయములలో చిక్కుకున్న వానికి, ఆధ్యాత్మికాభివృద్ధి సిద్ధింపనేరదు. ఎవరి మనస్సు భగవంతునిపై కేంద్రీకరించునో, వారికి అపరి మితమైన ఆనందము లభించును.

◆ ఈ లోకము క్షణ భంగురము. అత్యుత్తమమైన నరజన్మము ప్రాప్తించినది. కాబట్టి సాక్షాత్ పరబ్రహ్మమును ఆరాధించవలెను.

◆ హృదయమందు ధర్మభావమున్నచో శీలమునందు పవిత్రత యుండును. శీలమునందు పవిత్రతయున్నచో ఇంటియందు ఐకమత్యముండును. ఇంటియందు ఐక్యమత్య మున్నచో దేశమందు ప్రేమభావముండును. దేశమందు ప్రేమ భావ మున్నచో, ప్రపంచమందు శాంతి వెలయు చుండును. కాబట్టి ప్రపంచ శాంతికి మార్గము. ధర్మపూర్వకమైన జీవితమే యగును.

◆ గడచిపోయినదానిని గూర్చి ఆలోచించగూడదు. జరగబోవు దానిని గూర్చి ఆశాసౌధములు కట్టుతూ కూర్చోకూడదు. వర్తమానంలో నివశిస్తూ, అప్పుడు చేయవలసిన కర్తవ్యము లనే సత్కార్యములనే ఆచరించుట మంచిది.

◆ తపస్సు, యోగము, సమాధి వీనిచే కూడా ఏ ఫలము



లభించునో, కలియుగమున, ఆ ఫలము భగవంతుని సంకీర్తనము చేతనే లెస్సగా లభించగలదు. (సూతుడు)

◆ భగవాన్ సత్య స్వరూపి ఆయనే సత్యనారాయణుడు. సత్యమే ఆయన సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ అనిన దాశ్రుతి. ఎక్కడ సత్యానుశీలనం జరుగుతుంటుందో అక్కడ ధర్మం వుంటుంది. ధర్మ వ్యవస్థాపనం చేయడం కోసమే కదా, సత్య స్వరూపి భగవాన్ అవతరించడం. శాశ్వత శబ్దరాసులైన వేదాలు సత్య వ్యవస్థాపనం చేస్తున్నాయి. కాబట్టి అవి కూడా సత్య స్వరూపాలే. నిత్యము సత్యమే ఆధారముగా తీసుకొన్న వాడికి ఉత్తమ లోక ప్రాప్తి కలుగుతుంది.

◆ మనుజునకు పాపభీతి కలిగినపుడే పుణ్యపథమున, మోక్షపథమున ప్రయాణము కాగల్గును. పాపము యెడల భయము కలిగి, పాపా చరణమును విరమించుటయే ముముక్షువుల యొక్క ప్రథమ కర్తవ్యము. పాపాచరణము గలవాడు పరమాత్మను ఎన్నటికి చేరలేడు.

◆ జలముచేత శరీరశుద్ధియగును. సత్యముచేత మనస్సు పరిశుద్ధమగును జ్ఞానముచేత బుద్ధి శుచియగును. విద్య చేత తపస్సు చేత, ఆత్మ పరిశుద్ధ మగును.

◆ పరమాత్మను సాక్షాత్కరించుకొనుటకు ప్రతివారు భక్తి, ధ్యాన, ఆత్మ విచారణాదులను సలుపవలసియుండును.

◆ సత్యమొక్కటే భగవంతునికి చక్కని నివాసము. ధర్మం సత్యం లోనే స్థిరంగా వుంది. జ్ఞాన విజ్ఞానాలకు విలాసాలైన వేదాలు సత్యస్వరూపాలే, మనం భగవంతుని సాన్నిధ్యమును పొందటానికి, సత్యమొక్కటే రాజమార్గం. సత్పురుషులు మాట్లాడే సత్యమైన వాక్కులోనే భగవంతుడు నిండియున్నాడు. సర్వేశ్వరుణ్ణి వదలి సత్యమూ వుండదు.

◆ ప్రాపంచిక విద్యలచే ధనప్రాప్తి, భౌతిక సౌఖ్యము గల్గినను, హృదయ శుద్ధి, మనఃశాంతి లోపించుచున్నది. వృద్ధావస్థలో

ఈ దుస్థితి చక్కగా గోచరమగును. వలలో చిక్కిన చేపవలె సంసారము నుండి, తప్పించు కొనజాలక, దుఃఖముతో కాలము గడుపవలసియుండును.(శ్రీ మలయాళ స్వామి)

- కోపముగలవారి జీవితములోగల అనుష్టానములన్నియు కళాయిలేని పాత్రలో వుండిన పప్పు పులుసువంటివని మరువకుడు.
- వర్షములేని కాలములో జీవితమెటువంటిదో, చంద్రుడు లేని రాత్రిలో సంచారమెటువంటిదో, రోగముతో కూడిన బ్రతుకు ఎటువంటిదో, శాంతిలేని జీవితమున్ను అటువంటిదే. (శ్రీ మలయాళ స్వామి)
- తన దోషమును తాను వెదకుకొని, దానిని వివేకముచే సరిదిద్దుకొను వాడే ధన్యుడు.
- భగవత్స్వరూపులగు జనులకు సహాయము చేయు చేతులు, స్తోత్రము లను వల్లించు పెదవులకంటె గొప్పవి. అహంకారమును జయించుటయే అన్నిటికంటె గొప్ప విజయము.
- దుర్గుణములు లేని హృదయములో భగవంతుడు చోటు ఏర్పరచుకొనును.
- జీవునకు తన పాప కర్మలే, తనకు అపకారము చేయును.
- కాలము చాలా అమూల్యమైనది. కాబట్టి ఒక్క క్షణమైనను వ్యర్థము చేయక చిత్తశుద్ధి కొరకు, ఆత్మానుభూతి కొరకు, సద్గుణ సంపాదన కొరకు దానిని వినియోగించవలెను.
- ఆత్మానుభూతిని బడయుదలంచినవాడు, దేహాత్మభావన వదలవలెను.
- ఆభరణములు అనేకములైనను, బంగారు ఒకటే అయినట్లు, దేహములు అనేకములుగా వున్నను ఆత్మ ఒక్కటే.
- ప్రపంచములో ఏ స్థానమునకు వెళ్లినను, తాను చేసిన కర్మయొక్క ఫలితము నుండి ఎవరును తప్పించుకొనలేరు.



- అగ్నిని నీటితో చల్లార్చునట్లు, కోపాన్ని సహనం, ఓర్పు, నేర్పు అను నీటితో చల్లార్చుట మంచిది.
- ప్రార్థన నోటి నుండి కాదు, హృదయము నుండి వెలువడవలెను. అట్టి ప్రార్థన చేయుటకు, మూగవారు, నత్తివారు, అజ్ఞానులు, మందబుద్ధులు కూడా నర్హులే. విష హృదయము గలవారి తియ్యని ప్రార్థనలు భగవానుడు వినడు. ముందుగా హృదయమును పవిత్రము చేసుకొనియే ప్రార్థన చేయవలయునని మరువరాదు. (బాబూజీ)
- భగవన్నామ సంకీర్తనము భవరోగమునకు దివ్యౌషధము.
- సత్యము, జ్ఞానము, ధర్మము, దయ, శాంతి, ఓర్పు అనునవే ఆప్త బంధువులు.
- నేను నాది అను త్రాళ్లచే జీవుడు కట్టుబడుచున్నాడు, వాటిని విడదీసు కొనవలెను.
- మరువవలసినది - ఇచ్చిన దానము, వచ్చిన గౌరవము.
- శక్తిచేత సాధించలేనిది, యుక్తిచేత సాధించవచ్చును. సత్యమునకు సమానమైన సంపద లేదు. నీ మంచితనమే నీకు గొప్ప అండ.
- బ్రహ్మాండమంతటిని కుక్షిలోగల పరమాత్మ సర్వప్రాణుల రూపమున వ్యక్తమైయున్నారు. క్రిమి కీటకాదులు మొదలు కొని బ్రహ్మవరకు ప్రతి ప్రాణియు దైవ స్వరూపమే. కనుక మానవుడు జీవులను సేవించుచు చేతనైనంతవరకు, వారికి ఉపకారమొనర్చుచు, భగవదనుగ్రహమునకు పాత్రుడై సద్గతిని బడయవలెను.
- మన సుఖదుఃఖాలకు, కష్టసుఖాలకు మన కర్మయే మూల కారణం. మన హృదయం నిర్మలంగా స్వచ్ఛంగా ఉన్నంత వరకూ, మనపై పరమాత్మ అనుగ్రహం పరిపూర్ణంగా వుంటుంది. (శ్రీ షిరిడీ సాయిబాబా)

- అహంకారము అను కట్టెను, జ్ఞానమను అగ్నిలో ఆహుతి యొనర్చుటయే మహాయజ్ఞము కాగలదు.
- వైరాగ్యాన్ని అలవర్చుకోవడానికి ప్రయత్నించు. సాధనమార్గంలో సంసార జీవితం వదలుకోనక్కర్లేదు. కాని దానిపై ఆసక్తిని మాత్రం కలిగివుండకు. మితహారివై వుండు ఆహారం మీద, వివిధ రుచుల మీద ఆసక్తిని చంపుకున్నవాడవవుతావు. కామానికి చావు లేదు. కనుక దాన్ని జయించకపోతే నువ్వు పరమాత్మను చేరలేవు. (షిర్డీ సాయిబాబా)
- నువ్వు చేసుకునే పనులకు నువ్వే ఫలితాన్ని అనుభవించాలి. నీ భార్యా బిడ్డల కోసం నువ్వు తప్పుడు పనులు చేస్తే, ఆ పనులు వలన వచ్చే చెడు ఫలితాన్ని నీవే అనుభవించాలి తప్ప, నీ భార్యాబిడ్డలెవరూ ఆ పాప ఫలితాన్ని పంచుకోరు. ఈ విషయాన్ని కనుక నీవు తెలుసు కోగలిగితే మహర్షివై పోతావు. కిరాతకుడయిన బోయివాడు ఆది కవియైన వాల్మీకిగా మారిపోవడానికి కారణం యీ విషయం గ్రహించాడు కనుకనే మంచి పనులు చేస్తూ వుండు, తప్పక భగవంతుడు అను గ్రహిస్తాడు (శ్రీ షిరిడీ సాయిబాబా)
- జీవితము ఒక ప్రవాహము. గడచిన నిమిషము మీది కాదు. వచ్చే నిమిషము మీకు దక్కునో లేదో కనుక ఈ నిమిష ముననే దైవచింత నకు ఉపయోగించి తరించండి, దైవ స్మరణ యొక్కటియే తరుణోపాయము.
- ఆత్మజ్ఞానము మరణమును జయించును. అమరత్వమును సిద్ధింప జేయును.
- క్షమావృక్షము మధుర ఫలములనిచ్చును.
- ఆత్మ విశ్వాసము అద్భుత కార్యములను నెరవేర్చును. కావున దానిని అలవరచుకొనవలెను.
- సముద్రాన్ని దాటడానికి ఓడ మాత్రమే శ్రేష్టమైన సాధనం



అయినట్లే, స్వర్గం చేరడానికి సత్యం ఒక్కటే సాధనం. క్షమను అసమర్థంగా భావించరాదు. క్షమకంటే బలమైనది లేదు.
- గురువు చెప్పినను చెప్పకపోయినను దినదినము చదువు నందు, గురు కార్యములందును అశ్రద్ధ చూపక శిష్యుడు యథావిధిగా చేయు చుండవలెను. శరీరమును, మాటను, మనస్సును, బుద్ధీంద్రియములను నియమించి, గురునాజ్ఞకై గురుముఖమును నిరీక్షించుచుండ వలయును. (మను ధర్మము)
- జ్ఞాని సంసారములో ఉన్నను, నీటి కాకిని నీరంటనట్లు తాపత్రయములు అతనిని అంటవు.
- దిగులుపడకుండా ఉత్సాహము కలిగియుండుటయే ఐశ్వర్య మునకు మూలము. ఉత్సాహమే వాస్తవమగు సుఖము.
- పొలములో రైతువలె శ్రమపడిననేకాని, ఏ కార్యమందును సిద్ధికలుగదు. సాధన ద్వారా ఆత్మ దర్శనమునకు మార్గము తెలియబడుతుంది.
- పరోపకారము, అహింస, దయ మున్నగునవి దైవ గుణములు, వాటిని ఆచరించుటయే మానవుని ధర్మము.
- అన్ని విజయములలో ఇంద్రియ విజయమే గొప్ప విజయము.
- మొక్కను బట్టి భూసారమును తెలిసికొనవచ్చును. అట్లే మాటనుబట్టి మనుజుని స్వభావమును తెలిసికొనవచ్చును.
- ఇతరులకు సహాయపడుచు, ఆనందముగ జీవించుకళను అభ్యసించ వలెను.
- ప్రపంచములో ఏదియు శాశ్వతము కాదు, ఐశ్వర్యము, అధికారము అన్నియు అంతరించిపోవును. సత్కార్యములు మాత్రమే శాశ్వతముగ నిలిచిపోవును.
- ప్రకృతిలో అన్నియు నిదానముగ జరుగును. చెట్టు నిదాన ముగా పెరుగును. పువ్వులు నిదానముగా పూయును. కావున

తొందర పడరాదు.

- దాన బుద్ధి, సత్యవాక్కు, అహింస, ప్రియవచనము, వీటిని బాగుగా అభ్యసించవలెను. ప్రీతి కలుగునట్లు మాట్లాడుటయే స్వర్గమునకు సోపానము.
- మనసులోని ఉత్సాహము, సంతోషము, ముఖము మీద ప్రతిబింబించును
- రెండు చెవులు, ఒక నోరు ఉండుటకు కారణము ఎక్కువ విని, తక్కువ మాట్లాడమని సూచించుటయే.
- అంత్యకాలమున దేహముతో బాటు, సమస్త పదార్థములను జీవుడు ఇచ్చట వదలిపోవుచున్నాడు. అతడు చేసిన సత్కర్మలు, అతని ఆధ్యాత్మిక ఔన్నత్యము మాత్రము పరమ మిత్రుని వలె సర్వత్ర అతనివెంట వుండి అతనిని కాపాడును.
- గంగాజలమును త్రాగినచో, అది దాహమును పోగొట్టును కాని సత్సాంగత్యము ప్రస్తుతమున్న ఆపత్తులచే గాక, రాబోవు ఆపదలను గూడా తొలగించివేయును.
- దేనిని గూర్చి తెలిసికొనినచో, సమస్తము తెలియబడినది అగునో, అట్టి ఆత్మను గూర్చియే తెలిసికొనుము. దానిని గూర్చియే చింతనచేయుము.
- ఆత్మ అందరి యందును సమానముగానే యున్నది. వ్యక్తుల మనస్తత్వ మును బట్టి అది వివిధ రీతుల వ్యక్తమగుచుండును. ఈ ఆత్మను అనుభూతమొనర్చుకొనుటకై యత్నింపుడు. అపుడు అందరి యందును ఆ దివ్యత్వము సమముగా వ్యాపించియున్నట్లు ఎరుగగలరు. (శ్రీ వివేకానంద స్వామి)
- మౌనము దాల్చువారి యందు, అపారశక్తివుండును, వారు ప్రాణికోట్ల యెడల ప్రేమ కలిగి, వారికి సేవచేసి, తమ జీవితములను విరమించు చుందురు. వారెపుడును నేను,



నాది అని అనరు. వారికి అహంభావము లేశమైనను ఉండదు. భగవంతుని చేతిలో ఉపకరణములుగ నుండుట యందేవారు ఆనందపడుదురు.

- శరీరముతో అనేక కార్యములు చేయుచున్నను, మనస్సునందు ప్రశాంతి నీలాకాశమువంటి గాంభీర్యము కలిగి యుండుట ఇదియే భగవద్గీత యందలి ముఖ్యమైన బోధ. భగవంతుని పవిత్ర పాద కమలములందు మనస్సును నెలకొల్పి అన్ని పరిస్థితులందును శరీరముతోను, మనస్సుతోను ప్రశాంతముగను ఉండుటయే గీతా ప్రబోధము.
- ఎవరు సంపాదించుకొనిన, ఆధ్యాత్మిక సత్యములను లోకమునకు ప్రబోధింపవలయును. దీనికి మించిన ఉపకారము మరొకటి లేదు. జ్ఞాన దానమే దానములన్నిటిలో శ్రేష్ఠమైనది.
- ఎవనికి గురువు యెడల అచంచల భక్తియుండునో, ధ్యానము, జపము మొదలగు ఆధ్యాత్మిక సాధనలు వారికి స్వభావముగనే కలుగును. వాటికై శ్రమపడనక్కరలేదు. గురువే బ్రహ్మము, గురువే విష్ణువు, గురువే శివుడు.
- మాయ అను తెర ఎప్పుడు పూర్తిగా తొలగిపోవునో అప్పుడది ఏ కాల మందును లేనే లేదని మనకు తెలియగలదు.
- ఇతరుల శ్రేయస్సు కొరకై మన జీవితములో కొంత భాగమును త్యాగము చేయవలయును. ఆత్మను గూర్చిన దివ్య సందేశమును ప్రచారము చేయుట జ్ఞాని యొక్క లక్షణమైయున్నది.
- ఈ జీవితము వచ్చును పోవును. ధనము, కీర్తి, విషయ భోగములు మూణ్ణాళ్ల ముచ్చట్లు. ప్రాపంచిక కీటకమువలె చనిపోవుట కంటె సత్యమగు భగవంతుని గూర్చి ప్రచారము చేయుచు కర్తవ్యక్షేత్రమందు మృతినొందుట మేలు. కావున ముందుకు పయనించుడు.(శ్రీ వివేకానంద)
- శోకమందుగాని, ఆర్థిక సంకటమందుగాని లేక ప్రాణాంత

కారియగు భయము తటస్థించినపుడు గాని ఎవడు తన బుద్ధిచే దుఃఖనివారణో పాయమును, విచారించుచు ధైర్యము నవలంభించునో, అట్టివాడు కష్టమునను భవించడు (సుగ్రీవుడు).

- నరకమునకు పోవుమార్గము విశాలమై అందమైయుండును. అందు బోవువారనేకులు. మోక్షమునకు బోవు మార్గము ఇరుకుగాను, కష్టముగాను వుండును, అందుబోవువారు బహుకొద్దిమంది (శ్రీయేసుక్రీస్తు)
- తనయందున్న పశు సంస్కారములు కడిగివేయబడినచో, తక్షణమే దైవ సంస్కారములు ఆస్థానమందు పొంగి పొర లును.
- మనము దేవుని నమ్మినపుడు, ఆ దేవుడు వాస్తవముగ మనకంటె వేరుగలేడు. మన ఆత్మయే అయియున్నాడు. మనము ఆ ఆత్మ నుండి వేరై, ఆ దేవుని మన కంటె వేరుగా భావించి, ఆరాదించుచున్నాము. కాని ఎల్లకాలములందు ఆ దేవుడు సత్యరూపమగు మన ఆత్మయే అయి విరాజిల్లు చున్నాడు. ఆ ఆత్మయే విశ్వమందు ఏకైక దేవుడు. (శ్రీ వివేకానందస్వామి)
- గర్వము పతనమునకు హేతువైనది. పొగడ్తలకు మనస్సు పొంగి పోయినచో, నిందలకు క్రుంగిపోవును. ఇంద్రియ సుఖములు, మనసు యొక్క సుఖములు అన్నియు క్షణిక ములు. కాని మన లోపల దేనిపైనను, ఆధారపడని సత్యమగు ఒక అనంత సుఖము కలదు. అది పరిపూర్ణముగ స్వతంత్ర మైనది. అదియే పరమానందము, ఆత్మా నందము, బ్రహ్మా నందము (శ్రీ వివేకానందస్వామి)
- మానవునకు ఓర్పు చాలా అవసరము. దానిచేతనే అతని శోభ సూర్యుని ప్రభవలె మెరయుచుండును. సర్వశక్తి వంతుడైన భగవంతుడగు శ్రీహరియు, ఓర్పుగలవాని



యందు శీఘ్రముగ ప్రసన్నుడగును.(జమదగ్ని)

- సమస్త శాస్త్రముల యొక్క సారము ఒక్క పదములో చెప్పవలెనన్న అది ఆత్మజ్ఞానము అని పేర్కొనవచ్చును. తన్ను తాను తెలుసుకొనుటయే ఆత్మ జ్ఞానము కలిగి యుండుటయే సర్వోన్నత సిద్ధాంతమైయున్నది.
- డబ్బుతో మందులు దొరుకుతాయి, ఆరోగ్యం దొరుకుతుందా. ధనం ఖర్చుపెట్టి పుస్తకాలు కొనవచ్చు. జ్ఞానం రావాలంటే కష్టపడి చదివేతీరాలి.
- తన దుర అలవాట్లే తనకు శత్రువులు.
- సహనముతో పనిచేయునపుడు, ఓటమి కూడా గెలుపుగా మారును.
- ఆశ అనే పాశము (త్రాడు) త్రెంచుకొనుట మానవునికి దుస్సాధ్యమైన పని. ఈ ఆశను పుట్టించేది మానవుని మనస్సు. దానిని మన ఆధీనంలో పెట్టుకోవాలి. అంటే ఈశ్వరాధాన తప్పనిసరిగా చేసినచో ఆశ అనే ఇనుప సంకెళ్ల బారినుండి, అతి సులభంగా మానవుడు విముక్తుడౌ తాడని శంకరుని ఉపదేశం.
- బాహ్యమున ధర్మాచరణ, అభ్యంతరమున జ్ఞాన విచారణ కలిగియుండ వలెను.
- నిజాయితీ లేని వ్యాపారము. దానము లేని సంపద, శీలము లేని విద్య, క్రమశిక్షణ లేని రాజకీయము నిరుపయోగములు.
- స్త్రీలకు నగల కంటె ఉత్తమమైన ఆభరణము భర్త.
- క్రోధము రాకుండా నిరోధింపగలిగినవాడు ఉత్తముడు.
- సత్యము నా తల్లి, జ్ఞానము నా తండ్రి, ధర్మము నా సోదరుడు. దయ నా మిత్రుడు శాంతి నా పత్ని, క్షమ నా పుత్రుడు. యీ యారుగురు నా యాత్మ బంధువులు.
- భార్యాపుత్రులు, ధనధాన్యములు, శరీరము, యిండ్లు, వాకిళ్ళు

ఏవియు శాశ్వతము కాకున్నను బుద్ధిలేని జనులు వానిని శాశ్వతమనుకొని, ఏ జన్మమెత్తినను సుఖమేననుకొందురు గాని, వైరాగ్యమునవ లంభింపరు. నరకమున పుట్టినను నరకమే సుఖమనుకొందురు. దానికే ఆశపడుదురుగాని, శరీరమును విడిచిపెట్టుటకు అంగీకరింపరు. సత్పురుషుల సహవాసము చేయక, వృద్ధులను సేవింపక, కేవలము తమ కుటుంబమనిన, ప్రాణములిచ్చువారు ఏనాడును భగవంతుని ధ్యానింపరు. (ధ్యానింపలేరు)

- సహనము, పట్టుదల వున్నచో ఎటువంటి ఆపత్తులనైనను అధికమించ వచ్చును.
- బాగుగా పరిశీలించి మితముగా మాట్లాడు. అందుకే రెండు కళ్ళు ఒక నాలుక ఏర్పాటు చేయబడినది.
- ద్వేషము ప్రేమచే నశించును. ఇది సనాతన ధర్మము.
- శరీర భావన, దృశ్యభావన, సంకల్పములేనపుడు జీవునకు పరమశాంతి లభించును.
- ఆశలకు తావొసంగక ఉన్నదానితో తృప్తినొందుట శ్రేయస్కరము.
- ఆనందానుభూతిని పొందని జీవితము నిరర్థకము.
- మానవులకు అలంకార మొసంగునది ఆభరణముగాదు, హృదయ సౌందర్యము.
- చితి శరీరమును దహించును. చింత జీవితమునే దహించును.
- గోవులనేకములైనను క్షీరము ఒకటే అయియున్నట్లు దేహములనేకము లైనను ఆత్మ ఒక్కటే.
- ఆశ రోగముతో సమానము. కావున ఆశారాహిత్యమును పొంది, ఆరోగ్యమును చేకూర్చకొనవలెను.
- ఉపకారము చేసిన వారి యెడల సదా కృతజ్ఞత కలిగి



యుండుట మానవత్వము.

- తాను పాతిపెట్టిన ధనమును మరచి, అటు నిటు వేసారి తిరుగు వానివలె అజ్ఞాని, భగవంతుని తనలో వుంచుకొనియే, ఎక్కడెక్కడో వెదకుచున్నాడు (సమర్ధ రామదాసు)
- మరణమును స్మరణమునందుంచుకొని, హరిభక్తితత్పరుడవు కమ్ము (సమర్ధ రామదాసు)
- వృక్షము శీతోష్ణములను సహించుకొని, జనులకు చక్కని నీడను యిచ్చుచున్నది. వంట చెరుకుగా ఉపయోగపడు చున్నది. ఎవరైనా తనపై రాయిని విసిరినచో అతడు తినుటకు చెట్టు పండ్లను రాల్చుచున్నది. అది అపకారికి కూడా ప్రత్యుపకారము చేయుచు, మానవులకు చక్కటి బోధగావించుచున్నది. కనుక మనుజుడు నిందా స్తుతు లందు, మానావమానములందు, శీతోష్ణములందు, జయాప జయములందు సమబుద్ధిని అలవరచుకొని తోటి ప్రాణులకు సేవ చేయుటయందే జీవితమును వినియోగించుచు మహోన్నత సద్గతిని బడయవలెను.
- శరీరము అశాశ్వతము, సంపదలు అస్థిరములు, చావు ఎల్లప్పుడూ దగ్గరలో పొంచి కూర్చునే వుంటుంది. అందుచేత నిరంతరము ధర్మమునే మానవుడు సంపాదించుకుంటూ వుండాలి.
- అజ్ఞాని దేహమే ఆత్మయని తలచును. శాస్త్రవేత్తయైన పండితుడు జీవుడే ఆత్మయని భావించును. జ్ఞాని తానే ఆత్మయని తలచును.
- నిర్మలభక్తుడు ఏ స్థలమున జప, భజన, ధ్యాన, పారాయణము చేయు చుండునో ఆ స్థలమున గంగయు, యమునయు, వేణియు, గోదావరియు, సింధువు, సరస్వతియు మొదలగు గాగల తీర్థములు సాన్నిధ్యముననే గలవు.

- విదేశ వాస సమయమున విద్యయు, గృహమున భార్యయు, రోగ కాలమున ఔషధమును చనిపోయినపుడు చేసిన ధర్మమును తోడు నీడలు.
- జలముచే శరీరశుద్ధియు, సత్యముచేత మనస్సు శుద్ధ మగును. జ్ఞానముచేత బుద్ధిశుచియగును. విద్యచేత, తపస్సుచేత ఆత్మ పరిశుద్ధ మగును.
- ఆయువు యొక్క ఒక్క క్షణమైనను వ్యర్థముగ గడిపివేయ బడినచో తిరిగి అది సమస్త రత్నములచే గూడా లభింప జాలదు. కావున అట్టి అమూల్యమగు ఆయువును ఎవడు (ఆత్మ విచారణ లేక) వ్యర్థముగ గడుపునో అతనికి దానిచే మహా ప్రమాదము వాటిల్లును.
- చిరిగిన వస్త్రమును సరిచేయవచ్చును, విరిగిన మనస్సును సరిచేయుట కష్టము. అపకారము చేయకుండుట ఒక విధంగా ఉపకారం చేసినట్లు.
- తల్లియైనా కొన్ని పర్యాయములు బిడ్డను మరుస్తుందేమోగాని, దైవం ఎన్నటికి మరువడు. దైవం మాత్రమే అందరి కంటె సన్నిహితుడు. కనుక దైవాన్ని విస్మరించకండి. (భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు)
- ఎన్ని జన్మల పుణ్యవశమున నీకు మానవజన్మ లభించినది. శక్తివంచన లేకుండా భగవత్ప్రార్థన చేయుము. దేనినైనా శ్రమపడకుండా సాధించుట కష్టము. ప్రాపంచిక పను లెన్నియైనా యుండనీ, ఆధ్యాత్మిక సాధన చేయుటకు ప్రతి దినము కొంత తీరిక చేసుకొని తీరవలెను. జపము చేయునపుడు, అత్యంత భక్తిశ్రద్ధలతోను, శరణాగతితోను భగవన్నామము చేయుము. నీకు గురువు చెప్పిన విధముగా సాధన ప్రారంభింపుము.
- మనస్సును బట్టియే మరుజన్మ యేర్పడును. మనస్సు పరిశుద్ధ ముగా నున్నచో, ఆత్మానుభూతి ఇచటనే కలిగి జీవుడు



తరించిపోవును. స్వస్వరూప సాక్షాత్కారమును బడయగల్గి, సంసార దుఃఖ మంతరించిన తరువాత, ఆ పుణ్య సంస్కార బలముచే మరుజన్మయందు, జీవిత ప్రారంభము నుండియే తీవ్ర సాధనలగావించుచు క్రమముగా పూర్ణ సిద్ధిని బడసి దైవమందు విలీనమగును. నిర్మలత్వమే దైవప్రాప్తికి మార్గము.

- శుభకార్యమును గాని, దైవకార్యమునుగాని, ధర్మకార్యమును గాని, పరోపకార్యమును గాని తరువాతకు వాయిదా వేయరాదు. ఆ పుణ్య కార్యములను, వెనువెంటనే ఆచరించ వలెను. ఆలసించినచో పరిస్థితులు చేయిజారి పోగలవు. కావున భగవధ్యానము, ధర్మాచరణము మొదలైన వాటిని తక్షణమే ప్రారంభించవలెను.
- తపస్సు చేయడానికి అరణ్యాలకుపోనక్కరలేదు. గృహస్థుడుగా వుండి కూడా, శారీరక, వాచిక, మానసిక తపస్సులను మూడింటిని చేయ వచ్చును. భగవంతుణ్ణి బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం, పరిశుభ్రంగా వుండ టం, కపటము లేకుండా వుండటం బ్రహ్మచర్యాన్ని పాటిం చడం, అహింస ఇవి శరీరంతో చేయవలసిన తపస్సులు.

వినేవారికి కూడా మానసిక క్షోభ కలుగకుండా ఉండేటట్లు పరుషంగా లేకుండా మాట్లాడటం, సత్యభాషణము, ప్రియ ముగ ఇతరులకు మేలు కలుగునట్లు మాట్లాడటం, వేదాలను, స్తోత్రాలను, భగవద్గీతను, ఓంకార జపము వాక్కుతో చేయ వలసిన తపస్సులు. మనస్సును ప్రసన్నంగా వుంచుకోవడం, శాంతంగా వుండటం, మౌనం, మనోనిగ్రహం, శుద్ధమైన, సంస్కారపూర్ణమైన భావము కలిగివుండటము మానసికమైన తపస్సు. ఈ మూడు రకాలైన తపస్సులు ఉత్తమమైనవి. వీటిలో సిద్ధి కలుగకుండా, ఏదో అరణ్యానికి పోయి ముక్కు మూసుకొని కూర్చు న్నందువల్ల, వేషాలు వేసినందువల్ల ఏమి లాభముండదు.

- యేసుక్రీస్తు ఒకనాడు సముద్రతీరమున నడుచుచుండ నొకభక్తుడు సమీపించి యిట్లు ప్రశ్నించెను. ప్రభూ భగవంతుని బొందుటెట్లు? యేసుక్రీస్తు ఆ భక్తునితో గూడ సముద్రములోనికి దిగి, వానిని నీళ్లలో అదిమిపట్టెను. కొంతసేపటికి వానిని లేవదీసి నీకెట్లున్నది అని యడిగెను. ప్రాణము పోవుచున్నదాయనిపించినది గిలగిలకొట్టు కొంటిని అని భక్తుడు బదులు చెప్పెను. అంతట యేసుక్రీస్తు ఇట్లు వచించెను. ఊపిరి ఆడక నీవిప్పుడు ఉక్కిరిబిక్కిరై యెట్లు పరి తపించితివో, అట్లు భగవంతుని కోసము, పరితపించిన యెడల ఆ తండ్రి నీకు కానవచ్చును అని సమాధాన మొసంగెను. (శ్రీ రామకృష్ణ పరమహంస)
- ఇతరులలో దోషాలను చూడడానికి బదులు మన దోషాలను మనం చూచుకున్నట్లయితే మనం భగవంతుని ప్రేమిస్తున్నట్లే.
- దానములలో భూదానము, అన్నదానము, ద్రవ్యదానము, ఔషధ దానము, జ్ఞానదానములును ముఖ్యములైనవి. ఈ దానములు లేనిచో లోకము లోని జనులు ఆకలి బాధతోను, అనారోగ్యముతోను, అజ్ఞాన రూపము లైన కామక్రోధాది గుణములతోను బాధలనను భవింతురు.
- పశుపక్ష్యాదులవలె జ్ఞానములేని వారమై జీవించుట మూఢత్వము జ్ఞానము త్యాగబుద్ధితోనే ప్రారంభమగును. భోజనము చేయుటకు భోగములు అనుభవించుటకు పుట్టినామని ఎవరు తలంచరాదు.
- దాన ధర్మములతోనే దరిద్రదేవత నశించును. దరిద్రదేవత నశించి నప్పుడే ధర్మ ప్రవర్తన జనులలో ఉద్భవించును. ధర్మ ప్రవర్తన వలననే ఆత్మజ్ఞానము కలుగును. ఆత్మజ్ఞానముతో జనన, మరణ రూపమైన సంసార దుఃఖము నశించును. బాహ్యధనాది వస్తువులనే త్యాగము చేయలేని వారు లోనున్న కామక్రోధాది గుణములను త్యాగమెట్లు చేయ సమర్థు



లగుదురు.

- యాచకుడు ప్రతి వాకిట ముందరకును వెళ్లి ఆయా గృహస్తులకు బోధించెడి నీతి ఏమనగా ఇతరులకు దానము చేయక, మావంటి దరిద్రులు మీరు కావలదు. ఇతరులకు దానము చేసి మీ వంటి ధనవంతులే మరల మీరు కండని బోధించుచున్నాడేగాని, యాచించుట లేదని గృహస్తులు గ్రహించవలెను.
- తపస్సు, యోగము, సమాధి వీనిచే కూడ ఏ ఫలము లభించునో కలియుగమున ఆ ఫలము భగవంతుని సంకీర్తనము చేతనే లెస్సగ లభించగలదు (సూతుడు).
- జీవుడు మాతృగర్భమున ఉన్నపుడు దాదాపు ఏడవ మాసమున ఒక్క క్షణకాలము అతనికి పూర్వజన్మల వృత్తాంతమంతయు స్మృతికి వచ్చునట. గత జన్మలందలి జనన మరణాది క్లేశములను పరికించి భయకంపితుడై అతడు భగవంతునితో ఇట్లు మొరపెట్టుకొనును.

ఓ దేవా సంసార దుఃఖములచే నేను మిక్కిలి భీతిల్లితిని ఈ గర్భనరకము నుండి వెలుపలకు రాగానే, సద్గురువును మహాత్ములను తప్పక ఆశ్రయించి తరుణోపాయమును తెలుసుకొందును. జన్మ పరంపరకు దుఃఖపరంపరకు పూర్ణ విరామము పెట్టెదను, నన్ను రక్షింపుడు త్వరగా నన్ను ఇచ్చట నుండి తప్పించుడు అని వాగ్దానము చేయుచు వేడుకొనునట, కాని భూమిపై పడగనే జీవుడు అజ్ఞాన ప్రభావము వలన తన వాగ్దానమును మరచి పూర్వమువలె సంసారమందే తిరుగాడును. ఈ సత్యమెరిగి జనులు సంసార ఘోరారణ్యము నుండి విముక్తులగుటకు యత్నశీలురు కావలెను. ఆత్మజ్ఞాన సంపన్నులగు సద్గురువును, మహనీయులను శరణుపొంది, ఆధ్యాత్మిక సాధన గావించి, శాశ్వత దుఃఖవిముక్తిని ఆనంద ప్రాప్తికై కృషిసలుపవలెను.

◆ కాలకూట విషమును జీర్ణమొనర్చుకొనుట, చంద్రనిప్పులను నిరపాయముగ మ్రింగగలుగుట, పక్షులవలె గగన వీధిలో విహరింప గలుగుట, నీటిపై నడచుట మొదలగు అద్భుత కార్యములను సునాయాసముగ ప్రదర్శించినప్పటికిని, జగత్తునకు ఆధారభూతుడగు పరమాత్మను ఎరుగకుండినచో ఏమి ప్రయోజనము. మనుజుడు జడ పదార్థమైన దేహముతో తాదాప్యమునొందియున్నంతవరకు అతడు ఎంత గొప్పవాడైనను, విద్యావంతుడైనను, అధికారవంతు డైనను, సుందర రూపుడైనను, అమోఘవాక్పటిమగలవాడైనను, అతనికి పరిపూర్ణ సుఖశాంతులు లభించనేరవు.

శరీరము నాశవంతమైనది. ఆత్మ శాశ్వతము అని యెరిగి, ఎపుడాతడు దేహాభిమానమును వీడి, దైవమందు నిలకడను సంపాదించునో, అపుడే అతడు ధన్యజీవి కాగలడు. ఆ మహాత్ముని వలన లోకమున శాంతి సౌఖ్యములు విలసిల్ల గలవు. (శ్రీ శంకరా చార్యులవారు గుర్వాష్టకమ్)

◆ భౌతిక సంపదలను, యవ్వన బలమును, బంధుజాలమును జూచి, అజ్ఞాని మహదానందపడుచుండును. కాని అవన్నియు మున్నాళ్ళ ముచ్చటలేయగుచు కడకు అతనిని దుఃఖముల పాలు చేయుచున్నవి. చిల్లికుండలోని నీరువలె, ఆయువు క్షణ క్షణము క్షీణించిపోవుచున్నది. దృశ్యసంపద నంతటిని, కాలము ఒక్క క్షణములో గ్రహించి వేయు చున్నది. ప్రపంచము యొక్క శరీరము యొక్క నశ్వరత్వమును చక్కగా గుర్తెరిగి, జనులు వివేకవంతులై, నిత్య నిరతిశయానంద స్వరూపులగు పరమాత్మను ఆశ్రయించి, దుఃఖరాహిత్యమును, పూర్ణ శాంతి సుఖములను బడయవలెను. (శ్రీ శంకరాచార్యులవారు)

◆ ప్రపంచము ఒక మాయాజాలము వంటిది. ప్రస్తుతము అన్ని పరిస్థితులు చక్కగ వున్నవని అనుకొనునంతలో ఆపద



అనునది ముంచుకొనివచ్చును. కనుక యిట్టి ప్రపంచములో దుఃఖాలయములో జన్మించిన మానవుడు, మహాత్ముల సాంగత్యము వలన, సత్య విషయమును తెలుసుకొని, జీవితము పూర్తికాకమునుపే బాల్యయవ్వనములందే భగవంతుని ధ్యానించి ఆత్మసాక్షాత్కారమును బడసి జీవన్ముక్తుడై విలసిల్లవలెను. అనేక జన్మల నుండి జీవుని వెంటాడుతున్న అజ్ఞానమును, గురుబోధ ద్వారా శాస్త్ర పరిజ్ఞానము ద్వారా, స్వప్రయత్నముద్వారా పోగొట్టుకొని జనులు తమ హృదయము లందు జ్ఞానజ్యోతిని వెలిగించి ఆత్మానుభూతిని పొంది తరించవలెను.

◆ విశ్వాసపాత్రుడగు స్నేహితుడు జీవితమునకు ఔషధము వంటివాడు.

◆ విశ్వాసమును పోగొట్టుకొనుట, అన్ని నష్టములలోను గొప్ప నష్టము.

◆ చిన్న అజాగ్రత్తవలన పెద్ద కీడు కలుగవచ్చును.

◆ ఉపకారం చేయలేకపోయినా, అపకారం తలపెట్టకు.

◆ చేసిన తప్పులు చేయకపోవడమే యదార్థమైన పశ్చాత్తాపము.

◆ శాంతి సంపదలలో లేదు, సంతృప్తిలో వుంది.

◆ దురాశ దుష్ఫలితములనిచ్చును. అత్యాస అధోగతికి చేర్చును.

◆ ఏదైన సుగుణమును సాధించిన వాని జన్మమే సార్థకమగుచున్నది. పరోపకారము, దయ, కరుణ మున్నగు ఉదాత్త గుణములను సాధించి మానవుడు తన జన్మను సార్థకము చేసుకొనవలయును. లేనిచో పురుగులవలె జన్మవ్యర్థమై పోగలదు.

◆ ప్రపంచములోని సమస్త పదార్థములకంటెను భక్తియే శ్రేష్టమైనది. దానిని మించిన వస్తువు ముల్లోకములందును లేదనియు, నారదుడు ముక్త కంఠముతో చాటిచెప్పినారు.

ఏలయనగా అట్టి భక్తియే భగవంతుని యొద్దకు జీవుని చేర్చు ఉపకరణము. దైవభక్తియే శ్రేష్ఠమైనది.

- దేవునియందు పరిపూర్ణ విశ్వాసము కలిగి యుండవలెను. హృదయ పూర్వకముగ భగవంతుని సేవించవలెను. సాధన యందు అప్రమత్తత కలిగియుండరాదు. పూర్ణ విశ్వాసము అచంచల భక్తితో పరాత్పరుని సేవించవలయును.
- జ్ఞానముతో సమానమైన ధనము లేదు, లోభముతో సమానమైన శత్రువు లేడు. శీలముతో సమానమైన అలంకారము లేదు. సంతుష్టితో సమానమైన ధనము లేదు.
- మానవులకు సువర్ణాది నిర్మిత ఆభరణములు అలంకారములు గావు. వారి సత్ ప్రవర్తన, వారి త్యాగశీలత్వము, వారి నిర్మల దైవభక్తి, వారి పరోపకార పారీణత ఇవియే వాస్తవములైన అలంకారములు. ఇవి జీవునకు పరిపూర్ణమైన శాంతిని, ఆత్మానందమును, జన్మరాహిత్యము కలుగజేయగల సామర్థ్యము గలిగియున్నవి. కావున ఇట్టి సుగుణ రాశిని సంపాదించి, ఇట్టి పవిత్ర గుణములచే సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమునకు పాత్రులై లోకమున విరాజిల్లుదురు గాక.
- అభ్యాసము దీర్ఘకాల మాచరించవలెను. నిరంతరము కొనసాగించ వలెను. అదియు శ్రద్ధతో గావింపవలెను. శ్రద్ధ విశ్వాసములతో గూడి నపుడే కార్యము సఫలమగును. వివేక వైరాగ్యముల సహాయముచే మనస్సును నిరోధించి, అభ్యాసమును శ్రద్ధతో బహుకాలము ఆచరించి, మనస్సుని నిర్మలమొనర్చకొని అంతర్ముఖమొనర్చి, ఆత్మయందు స్థాపించి, పరమశాంతిని బడయవలెను.
- పూర్వజన్మ కర్మానుసారముగ, సుఖదుఃఖములుగాని, నిందాప నిందలు గాని సంభవించును. అందువలన మనము ధైర్యముగా ఉంటూ భగవంతుని భక్తితో సేవిస్తూ, సత్కార్యములు చేస్తూ జ్ఞాన వైరాగ్యాదులను అలర్చుకొని,



మోక్షమును పొందవలెను. ఇంతకంటే ఉన్నతమైనది మరియేదియు లేదు.

- మాయ, అజ్ఞానము, అహంకారమువలననే జీవుడు భగవంతుడు కంటే వేరుగా ఉన్నట్లు తలంచుచున్నాడు. మహాత్ముల నాశ్రయించి పరమార్ధ సాధనను ఆచరించినచో, కాలక్రమమున జ్ఞానోదయము కలిగి, మనుజుని అజ్ఞాన మంతయు నశించిపోవును. అప్పుడే అతడు సాక్షాత్ భగవత్స్వ రూపుడుగ నెచెన్నొందును.
- ఒక చిన్న రంధ్రము పెద్ద పడవను ముంచివేయును ఒక చిన్న దుర్గుణము మానవుని జీవితమునకు కళంకము తెచ్చును.
- దైవము యెడల పెద్దల యెడల, గురువు యెడల, వినయ విధేయతలు కలిగి అందరిని ప్రేమతో చూస్తూ, చేతనైనంత వరకు పరప్రాణికి ఉపకారం కలుగజేస్తూ, ఆధ్యాత్మిక నియమాలు కొన్నింటిని ఏర్పరచు కొని, వాటిని చక్కగా అనుసరిస్తూ రోజు రోజుకు తానేమైనా ఉన్నతిని పొందుతున్నానా అని పరీక్షించుకోవాలి.
- ఇంద్రియాలు చాలా బలవత్తరమైనవి. వాటిని యిష్టం వచ్చినట్లు పోనీయక ధర్మమార్గంలో నడిపించాలి. సవ్యమైన మార్గాన్ని అనుసరించేట్లు చేయాలి. ఇంద్రియాలపై మనసుపై నిఘావేసి యుండాలి. చెడుమార్గంలో పోతుంటే వాటికి చక్కగా బోధించి తన అదుపులో వుంచుకోవాలి. ఈ ప్రకారంగా జీవితాన్ని నియమ బద్ధంగా నడిపిస్తే మనుజునకెంతయో సుఖము శాంతి లభిస్తాయి.
- జనులలో పెక్కురు తమ హృదయాలలో భగవంతునకు చోటు యిచ్చుట లేదు. వారు దేవుని తమ హృదయ పీఠానికి ఆహ్వానించటం లేదు. కామక్రోదాది రాక్షసులను దంబదర్పాది దయ్యాలను బొట్టుబెట్టి ఆహ్వానిస్తున్నారు. అందుచేతనే

జనానికి అశాంతి, తాపత్రయాలు కలుగుతున్నాయి. అవి పోవాలంటే ఒక్కటే ఉపాయం. భగవంతుని ఆహ్వానించ వలసిందే. వేరొక ఉపాయమేదీ లేదు. ఎక్కడ భగవంతు డుండునో అక్కడ నీతి ధర్మం తాండవిస్తుంటా యని సంజయుడు చెప్పాడు. ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడ విజయం తప్పకుండా వుంటుంది. కాబట్టి ఓ జీవుడా అనేక జన్మల నుండి నీ హృదయములో తిష్టవేసికొనియున్న దుష్ట సంస్కారాలు, దుర్గుణాలు, అసురభావాలు అను రాక్షసులను బలవంతంగా గెంటివేయి. దేవుని ఆహ్వానించు వారికి సగౌరవంగా నీ హృదయంలో స్థానం కల్పించు. అపుడిక నీ ఆనందానికి లోటుండదు. దుఃఖం దరికిరాదు. నీకు ఆనందం కలుగు తుంది. నీ జన్మ ధన్యమవుతుంది. సుఖానికి రాజబాటయిదే అని తెలుసుకో.

- ఇతరుల కష్టాలను తనకు వచ్చినట్లుగా భావించువాడు. అహంకారము లేనివాడు. ఎవరిని గూర్చి చెడ్డగా మాట్లాడనివాడు. అందరిని సమానంగా గౌరవించేవాడు. తన మాటలను అదుపులో వుంచుకొనేవాడు. సత్యవచనాలే పలికేవాడు. పరుల సంపదలను ఆశించనివాడు పరుల భార్యలను మాతృమూర్తులుగా భావించేవాడు. పవిత్రత శీల సంపద కలిగినవాడు ప్రపంచ విషయాల మీద ఆసక్తి లేనివాడు భగవంతునికి ఇష్టమైనవాడు.
- ఈ లోకానికి వచ్చినప్పుడు పుట్టుకతోపాటు చావు అనునది కూడా వెంట వచ్చినదే, చస్తామని అందరికి తెలుసు. దానిని గూర్చిన దిగులు దుఃఖము అనవసరం. మనం చేయ గలిగిందల్లా పుట్టినందుకు ఏదో ఒక మంచి పనిచేయాలి. భగవద్భక్తి విశ్వాసము కలిగి దైవకృప కొరకై ఆత్మానుభూతి కొరకై పాటుపడాలి.
- పెద్దల సాంగత్యముచే మాయయొక్క మర్మమెరిగి, కీలు



తెలుసుకొని వాతపెట్టునట్లు, ఆత్మజ్ఞానము యొక్క సహాయ ముచే ఆ మాయను అంతమొనర్చి, ఆత్మ సామ్రాజ్య మునకు అధినేతలై వర్తించవలెను. కాలము చాలా అమూల్యమైనది. ఒక్క క్షణము గడిచిపోయినచో అది తిరిగి రానేరదు. కనుక బ్రహ్మానుభూతికై వలయు సాధనలందే జీవితము గడిపి లక్ష్యమును సాధించి మానవత్వమును చరితార్థ మొనర్చు కొనవలయును.

- కంచెలేకున్నచో మొక్కలను పశువులు పాడుచేయును. కాని అవి పెద్దవృక్షములైనచో ఏనుగులను కట్టినను వాటికి హానిలేదు. అట్లే పూర్ణ వైరాగ్యములేకున్నచో, అనేక ఆటంకము లను ఎదుర్కొనుట కష్ట సాధ్యము. సాధనా కాలములో చాలా జాగ్రత్త కలిగియుండవలెను. (శ్రీ రామకృష్ణ పరమహంస)
- నా తల్లిగాని, నా తండ్రిగాని, స్నేహితులు గాని, సోదరులు గాని భార్య గాని బిడ్డలు గాని ఉన్నను లేకున్నను, ఈ శరీరము ఉన్నను పోయినను, ఆత్మ సాక్షాత్కారమును బడయువరకు నేను సాధన యందు వెనుకకు మరలను అనునట్టి దృఢ నిశ్చయము కలిగి, ఇతర విషయములన్నింటిని దూరముగ ఉంచి, లక్ష్యము వైపునకు కొనసాగు టయే పురుష ప్రయత్న మనబడును. (శ్రీ వివేకానంద స్వామి)
- గుణమును గుర్తించుము, కులమును విస్మరించుము.
- కోపానికి దూరముకండి, దైవానికి దగ్గరకండి.
- హింసను విడనాడండి - అహింసను పాటించండి.
- మాలిన్యాన్ని తొలగించండి - మతిని శుద్ధము చేయండి.
- కాఠిన్యము విడవండి - కారుణ్యము పొందండి.
- జరిగేదేదో జరగకమానదు - అనవసరంగా ఆందోళన పడకండి ఆందోళన అనారోగ్యానికి మూలం.
- కారణములలోకెల్ల కారం, అహంకారం, అహంకారం అధో

గతికి మూలం.

- ఆత్మ జ్ఞానమును పొందుటయే జీవితము యొక్క పరమ లక్ష్యమై యున్నది. అవతారస్వరూపులును, జగద్గురువులునగు మహనీయుల యెడల మీకు భక్తియున్నచో అట్టి ఆత్మ జ్ఞానము దానంతటనదియే ఉత్పన్నము కాగలదు.
- స్వర్గమునకును, నరకమునకును మధ్యదూరము ఒక తప్పట డుగు మాత్రమేయగును.
- ప్రతిప్రాణియందును భగవంతుడు అధివశించుచు ఆ ప్రాణికి ఆధార భూతుడైవెలయుచున్నాడు. కాబట్టి ఏ ప్రాణికిని అపకారము చేయ రాదు. జీవరాసులయందు దయ, కరుణ, ప్రేమ కలిగి వర్తించాలి. బ్రహ్మాండమంతయు సచ్చిదానంద మయము, పరబ్రహ్మ స్వరూపమై విరాజిల్లుతోంది. ప్రతి ప్రాణి యొక్క ఉపాధి దేవుని మందిరమే యగును. కాబట్టి అద్దానిని పవిత్రముగ వుంచుకోవాలి. దేవాలయ మును ప్రతిరోజు కడిగి శుభ్రంచేయుచు పవిత్రముగ యుంచునట్లు శరీరమును, మనస్సునుగూడా నిర్మలముగ వుంచుకోవాలి. రాగ ద్వేషాలకు, కామక్రోధాదులకు హృదయంలో ఏ మాత్రం చోటీయ కూడదు.
- మోక్షసాధనలందు భక్తిచాల ప్రధానమైనది. సులభమైనది కూడాను. భక్తియను తైలము ఉండిననే జ్ఞానమను జ్యోతి ప్రకాశించును. భగవంతుని యెడల అనన్యమైన, అచంచలమైన భక్తిగలవారికి అపరాత్పరుని దివ్యాను గ్రహముచే మాయ పటాపంచలైపోవును. అజ్ఞానము పలాయనము కాగలదు. కాబట్టి ముముక్షువులెల్లరు దృఢతర భక్తిని, అచంచల దైవ విశ్వాసమును, కలిగియున్నవారై ఈ జీవితమందే ఆత్మ సాక్షాత్కారమును బడసి పరమానంద మును అనుభవించ వలసియున్నది.



- పిచ్చివాడు అలసిపోయివున్నవాడు, కోపముతో వున్నవాడు, ఆకలితో వున్నవాడు. లోభి, పిరికివాడు, ఏదియో తొందరలో వున్నవాడు, కాముకుడు - ఇట్టివారు ధర్మమును సరిగా తెలసుకొనలేరు.
- మనస్సును జయించుటయే మోక్షమునకు ఏకైక మార్గము.
- చెప్పినది చేయుట, చేసినది చెప్పుట పెద్దల లక్షణము.
- గతించిన దానిని గూర్చి చింతింపకుము, వర్తమాన కాలమున నీ కర్తవ్యమును నెరవేర్చుము. పవిత్రహృదయము, దైవభక్తికలిగి యుండుము.
- అహంకారము ఎంతటి వారినైనను పతనము నొందించును. అహంకారమను ఒక్క దుర్గణమునకు, హృదయములో చోటిచ్చినచో అది సుగుణములన్నిటిని నాశన మొందిం చును. కాబట్టి అట్టి అహం కారమునకు, గర్వము నకు దేహాభిమాన మునకు అవకాశమివ్వక, జనులు వినయ విధేయతలు, భక్తి ప్రపత్తులు వృద్ధిచేసుకొని, ఇహపరము లందు పరమశ్రేయ మును బడయవలెను.
- మాతాపితరుల యెడల వినయ విధేయతలు, మహాత్ముల యెడల భక్తి విశ్వాసములు, దైవభక్తిగలిగి మనుజుడు జ్ఞాన మును పొందును.
- నీవు కోపమును వదలుము. ఏలయనిన అది సుఖమును ధర్మమును నశింపజేయును. ధర్మమును సేవించుము. ఏల యనిన అది సుఖమును సత్కీర్తిని అభివృద్ధి పరచును.
- సోమరితనము పనికిరాదు. ఆధ్యాత్మికక్షేత్రమున సోమరి తనానికి తావే లేదు. సాధకుడు గురువాక్యాన్ని శాస్త్ర వాక్యాన్ని చక్కగా పరిపాలిస్తూ ఆయా బోధలను లెస్సగ ఆచరణయం దుంచుతూ సత్ఫలితాలను పొందాలి. ఊరకే కూర్చుంటే కొంతకాలానికి మృత్యువు వస్తుందేకాని మోక్షం రాదు. ప్రయత్న

ఫలితమే మోక్షం. కాబట్టి వివేకవంతుడు భగవద్భక్తి గలిగి, వైరాగ్యోపేతుడై శమదమాది సాధనలను పట్టుదలతో ఆచరించి ఆత్మానుభూతిని బడసి జీవితాన్ని ధన్యమొనర్చు కోవాలి.

- ఆత్మయొక్క స్వభావము ఆనందము, శాంతి, నిర్వికారము దానిని మనము పొందనక్కరలేదు. అది మన స్వరూపమే అయియున్నది. మనస్సునందుగల మురికిని తుడిచివేసిన చాలును ఆత్మ దర్శనము ఆత్మ సాక్షాత్కారము సిద్ధించును. (శ్రీ వివేకానందస్వామి)
- పరమతమును దూషించువాడు, స్వమతమును గూడా సరిగా నెరుగనివారేయగుదురు. ఏ మతస్తులైనప్పటికిని పుట్టుకచే అందరూ మానవులే. మతావేశములు మధ్య ఏర్పడినవి. కాబట్టి సజ్జనులు మతము పేరిట, మానవత్వ మును మరువకుందురు గాక. మతము భగవంతుని పొందుట కొరకు ఏర్పడినది మాత్రమే. (శ్రీ విద్యా ప్రకాశానంద గిరి స్వాముల వారు)
- నీళ్ళచే శరీరం శుభ్రమవుతుంది. మనస్సు సత్యముచేత శుభ్రమవు తుంది. జీవాత్మ విద్యా తపస్సులచే శుద్ధమవుతుంది. జ్ఞానంతో మాత్రమే బుద్ధి శుద్ధమై మోక్షం వస్తుంది.
- పరమాత్మ జ్ఞాన స్వరూపుడు, సమస్త కోరికలందు ఆసక్తిని విడచి, నిష్కాముడై సర్వజీవరాసులలో చైతన్యస్వరూపుడుగా వెలుగొందు చున్న భగవంతుని శరణు వేడు. (శ్రీ షిర్డీ సాయిబాబా)
- రామనామము గాని, ఇతర దైవనామముగాని జపము చేయుచు కూర్చుండుము. మాట్లాడుము, భజింపుము, నడువుము నిన్ను అనుసరించు పరమ సంపద ఇదియే.
- ప్రాపంచిక సుఖములు క్షణికములు. దుఃఖ మిశ్రితములు వాటిని అనుభవించుట వలన మనుజుడు శాంతిని బడయ



జాలడు. ప్రపంచాధిపతియగు భగవంతునియందే ఆత్మ యందే జీవుడు శాశ్వతానందమును, పరమశాంతిని అనుభ వించగలడు.

- పాపము యొక్క ఫలితము కేవలము దుఃఖమేయగును. దానిని స్వయముగనే అనుభవించవలసియుండును. కాబట్టి ఏ మూఢుడు పాపము చేయునో అతడు స్వయముగనే తనను తాను వధించు కొనును (కుబేరుడు)
- ఇతరులకు ఏదియో ఒక ఉపకారమును సలుపుటకై ప్రయ త్నింపుము. నీ కోరికలను తగ్గించుకొనుము. సుఖకరమైన, సంతుష్టికరమైన జీవితమును గడుపుము.
- పూర్వం ఒక కోతి వుండేది. అది ఒక చోట నిశ్చలంగా వుండక, ఇటూ అటూ తెగ తిరిగేది. అట్లా తిరుగుతుంటే ఒక చోట కల్లు వుండటం చూసి దాన్ని కొద్దిగా సేవించింది. చిందులు త్రొక్కుతూ, తొక్కుతూ ఒక తేలుపై కాలువేసింది. వెంటనే ఆ తేలు కుట్టగా కుప్పిగంతులు వేస్తూ పరుగెత్తసాగింది. ఆ పరుగులో దానికి దయ్యం పట్టింది. ఇక దాని అవస్థ ఏమిటో దేవునికే ఎరుక. అపుడది ఎంత చంచలంగా వుంటుందో ప్రతివారు ఊహించుకోవచ్చు. అట్టి కోతితో పోల్చారు పెద్దలు ఈ మనస్సును. ఈ ప్రకారంగా అది చంచలంగా వున్నా ఎవరూ అధైర్యపడవలసిన పనిలేదు.

మనస్సు ఎక్కడికి పోతుందో, దేనిపై వాలుతుందో గమనిస్తే చాలు. దాన్ని అరికట్టడానికి వీలవుతుంది. దానికి హితబోధ చేయాలి. ఓ మనస్సా ఎన్ని జన్మలో తిన్నావ్, తాగినావు గంతులేశావ్, దానివల్ల నీకేమైనా లాభం కలిగిందా, మరి అమూల్యమైన ఈ మానవ జీవితాన్ని ఆ ప్రకారంగానే వ్యర్థం చేయడం నీకు పాడిగాదు. క్షణిక ఆనందం వైపు పరుగెత్తక, శాశ్వత ఆనందం కోసం ప్రయత్నించు. ఆ శాశ్వత ఆనందం ఆత్మలోనే వుంది. కాబట్టి ఆత్మజ్ఞానము పొందడానికి

ప్రయత్నించాలి. ఈ ప్రకారంగా దానికి హితబోధచేయాలి. అపుడది లొంగితీరుతుంది. చెప్పినట్లు వింటుంది, లక్ష్యం సాధిస్తుంది.

- మనస్సు సంకల్పించునట్లు చెప్పుటయు, చెప్పేలాగున చేయుటయు కలిగి వర్తించిన వారు ప్రకృతి రహితులు. ఈ త్రికరణములను ఏకరీతిగా ప్రయత్నించేలాగున అభ్యసించుటయే తపస్సనియు, యోగమనియు పెద్దలు చెప్పుదురు మరియు పుణ్య కర్మానుష్ఠాన మనియు, వేదాంత శ్రవణాదులనియు మరువకుడు. ఇదే త్రిపుటిని ఏకము చేసెడి విద్య. ఇట్టి నిష్ఠలేనివాడు ఏ విధమైన అనుష్ఠానము చేతను ముక్తులు కాజాలరు. (శ్రీ మహర్షి మలయాళస్వాములవారు)
- 1) సత్యము 2) దానము 3) సోమరితనము లేకుండుట 4) అసూయ రాహిత్యము 5) ఓర్పు 6) ధైర్యము అను ఈ ఆరు గుణములను ఏ కాలమందును వదలరాదు. (భారతము ఉద్యోగ పర్వము)
- 1) అధిక నిద్ర 2) మత్తు 3) భయము 4) కోపము 5) సోమరి తనము 6) మందకొడి స్వభావము అను ఈ ఆరు దుర్గుణములను మోక్షకాంక్షియగువాడు పూర్తిగ విడనాడవలెను. (భారతము ఉద్యోగ పర్వము).
- దేహము నశించిపోవుననియు, ఆత్మ శాశ్వతమనియు ప్రతి క్షణము చింతన చేయుచుండవలెను. అశుభ కార్యములను త్యజించి శుభ కార్యాలను ఆచరించాలి.
- దైవభక్తి మహా సులభసాధ్యమైనది. అట్టి సులభతరమైన ప్రేమ మార్గమును, భక్తి మార్గమును చేబట్టి భగవంతుని యందు అనన్య ప్రేమ, శ్రద్ధ, భక్తి విశ్వాసములు కలవాడై మనుజుడు భగవత్కృపకు పాత్రుడై పరమానందమును, ఈ జీవితము నందే అనుభవించవలెను. వ్యర్థములగు ప్రాపంచిక విషయ



ములందు మనస్సును ప్రవర్తింప జేయక భగవంతుని పాదపద్మములందే, అద్దానిని నెలకొల్పి జనులు దైవసుఖాను భూతిని బడయుదురు గాక. (నారద భక్తి సూత్రములు)

- ఓ చిత్తమా ఆయాసమును కలుగజేయు ఈ ఇంద్రియార్థము లనెడు అరణ్యమార్గమును నీవు వదలిపైచి, శ్రేయస్సును గలుగజేయు నదియు సర్వదుఃఖ వినాశకరమైనదియునగు ఆత్మ రూప సన్మార్గమును ఆశ్రయింపుము. ప్రశాంత భావమును బడయుము. కావున మోక్షకాంక్షులందరును సదాజాగరూకులై, తమ తమ చిత్తములను అత్యంత నిర్మలముగా వించుకొని, దృశ్యవృత్తులను జేరనీయక బహు మెలకువతో ప్రవర్తింపవలెను.
- రాత్రింబగళ్ళు దేవుని గూర్చియే తలంచుము. సాధ్యమైనంత వరకు అన్యమేమియు తలంచవద్దు. ప్రతిదినము అవశ్యకమైన క్రియలన్నిటిని దైవభావముతో చేయవలెను. దైవ భావముతో భుజింపుము. దైవ భావముతో త్రాగుము. దైవ భావముతో నిద్రింపుము. దేవుని గూర్చియే ఇతరులతో మాట్లాడుము. ఈ పద్ధతి దైవసాక్షాత్కారమునకు చాలా సహాయకారిగా నుండగలదు.
- శాశ్వతమగు భగవంతుని పొందదలంచువాడు, నశ్వరములగు ప్రాపంచిక పదార్థములందు ఆసక్తిని విడువవలెను. దేహాదులపై మమత్వమును వీడవలెను. దేహము క్షణికమైనదనియు, అది జడమైనదనియు, పంచ భూతము లచే నిర్మితమైన చైతన్యము లేనిదనియు అట్టి జడవస్తువు నశ్వరత్వమును, అనుక్షణము చింతన జేయుచు, చెడు కార్యములందు మనస్సును పోనీయక, మంచి కార్యములనే ఆచరించుచు యుండవలెను. ఇదియే మోక్షమునకు ఏకైక ఉపాయము. నిరంతరము ఆత్మయొక్క శాశ్వతత్వమును దేహము యొక్క క్షణికత్వమును చింతన చేయుచుండి

నచో కైవల్యము శీఘ్రముగ సిద్ధించును.

- కలియుగములో ఆత్మసాక్షాత్కారముకొరకై బిగ్గరగ, భగవన్నామస్మరణ చేయుట విధింపబడినది.
- మనుజుడు దేనిని తన హృదయమందు భావించునో అది అతని ముఖమందే వ్యక్తమగును.
- సుఖదుఃఖములు ఒకదాని వెంట ఒకటి వచ్చుచుండును.
- నీ ప్రవర్తనలో ఇసుకరేణువంత పాపమునకు ఈ దినమున అవకాశ మిచ్చినచో రేపటికదియే మహా మేరువంతయగును.

విద్యలేని వారైనను ఆత్మబోధగల్గియుండిన దైవసాక్షాత్కార జ్ఞానము గల్గు సమర్థతగల వారగుదురు. (శ్రీ మలయాళ స్వాములవారు)

- అడుసు త్రొకినవాడు వెంటనే కాళ్ళు కడిగివేసుకొంటుండాలి. తప్పులు అసలు చేయకుండా చూడాలి. ఒకవేళ ఏదైన పొరపాటున తప్పుచేస్తే వెంటనే దానిని కడిగివేసుకోవాలి. మనస్సులో ఏ మాత్రం మాలిన్యం వుంచుకోకూడదు. శుద్ధ చిత్తుడే జీవితమున ఉన్నతిని సంపాదిస్తాడు.
- అజ్ఞానియగు మనుజుడే లాభాలాభములకు, సుఖదుఃఖములకు ద్వంద్వములకు లోబడి అశాంతిపాలగునుగాని, భగవంతుని ఆత్మను ఎరిగినట్టి మహాత్ములు కాదు. వారు ఎట్టి పరిస్థితులందైనను మేరు సమాన గాంభీర్యముగలవారై నిర్వికారముగ నిశ్చలముగ ఉండుచు పరమశాంతిని అనుభవించుచుందురు. కనుక ఏనాటికైనను దేహ వియోగము బంధు వియోగము తప్పదని తలంచి, జనులు శాశ్వత పరమాత్మను ఆశ్రయించి సచ్చిదానందస్వరూపులై విలసిల్లుచు అనంతానందమునందును ఓలలాడవలెను. వ్యవహారము సలుపుచున్నను, దైవదృష్టిని విడనాడక ప్రశాంత జీవితమును గడుపుచుండవలెను.



- ఒకరిపై ఎన్నడును చాడీలను, నిందలను మోపరాదు. ఒకరికి అపకారము చేయదలపెట్టినచో, తనకే ముప్పు వాటిల్లగలదు. ఈర్ష్య, ద్వేషము, చాడీలు చెప్పుట మొదలగు దుష్ట గుణములకు జనులు తమ హృదయమున అవకాశమివ్వ రాదు. పరోపకారము ప్రేమ, దయ మున్నగు మహోన్నత ఆదర్శ గుణములను అలవరచుకొని, హృదయమును నిర్మలము గావించుకొని మనుజులు ఆధ్యాత్మిక సుఖమును అనుభవించవలెను.

ధర్మకార్యములకు, పుణ్య కార్యములకు వినియోగించు ధనము, పుణ్యఫలమును కలుగజేసి, జీవునకు ఇహలోక, పరలోకములందు సహాయకారిగ ఉండును. అట్లు పరోపకారమునకై వినియోగించు ధనమే ఎల్లకాలము లందును జీవుని వెంటవచ్చు ధనము. అట్టి పుణ్య ధనమును సంపాదించుకొనుటకును, పరమశాంతిని అనుభవించు టకును మనుజుడు కృత నిశ్చయుడు కావలెను.

- ఉద్ధరేదాత్మనాత్మానం - అన్నట్లు తన్ను తాను ఉద్ధరించుకోవాలి. పుత్రుల వల్ల తనకు మోక్షం రాదు. ఆకలి కలవాడే అన్నం తినాలి. తన మోక్షానికి తానే ప్రయత్నించాలి. పుత్రులు రుణ విముక్తిని కలిగిస్తారే గాని, బంధవిముక్తిని కలిగించలేరు.
- తాను చేసింది మంచిదో, చెడ్డదో అనుభవించవలసిందే. దానిని ఇంకొకడనుభవించడు. శుభం రానీ, అశుభం రానీ, సంతోషం గానీ, దుఃఖం గాని చెందగూడదు. బ్రహ్మరాసింది జరిగే తీరుతుంది. దాన్ని దేవతలైనా, రాక్షసులైనా అనుభవించక తప్పదు. నరుడు సర్వదా సుఖదుఃఖాలతో ముడిపడి వుంటాడు. ఈ శరీరం సుఖ దుఃఖాలతో పుట్టింది. కాబట్టి సుఖదుఃఖాలు అనుభవించి తీరవలసిందే. ఎవడికైనా సుఖం తరువాత దుఃఖం, దుఃఖం తరువాత సుఖం కలుగుతుంది.

రాత్రి, పగలు మాదిరి జీవులకిది తప్పదు. సుఖం నడుమ దుఃఖం, దుఃఖం మధ్య సుఖం ఇవి మిత్రులులాగా, నీటిని విడచి పద్మం, పద్మం వదలి నీళ్ళుండనట్లు కలిసే వుంటాయి. కాబట్టి సాధకుడు వాటికి జంకక ఆధ్యాత్మిక సాధనలో ముందుకు పయనించాలి తప్ప వెనుకంజ వేయరాదు.

- ఒకనాడు యమధర్మరాజు పక పక నవ్వుచుండెనట. అప్పుడు మంత్రి స్వామీ యేల ఇట్లు నవ్వెదరని అడిగెను. అప్పుడు అతి భయంకరుడగు ఆ యముడు, మంత్రీ ఏమి వింత? ఎట్టి విపరీతము నిత్య కళ్యాణ దాయకంబగు ఆ పరమేశ్వరుని వైకుంఠము చూడుడు. అతి భయంకరమును, దుఃఖదాయకంబును అగు నా యమపురి జూడుము దిన దినము నా రాజ్యము మనుష్యకోటిచే అభివృద్ధి పొందుటయు అనిర్వచనీయమైన, అనంతమైన సుఖమును యిచ్చు వైకుంఠమునకు యెప్పుడో యొకరు పోవుచుండు టయు చూడ నాకు పట్టశక్యముగాని నవ్వువచ్చుచున్నదని జవాబు చెప్పెను.
- సత్సంగం ముఖ్యం సత్య స్వరూపమైన బ్రహ్మంతో సంగమే సత్సంగం. బొగ్గు నలుపు పాలతో కడిగినా పోదు. నిప్పులో వేస్తేపోతుంది. తీవ్ర ఆవేదన కలవారే భగవానుని పొందగలరు. శాంతిలేని జీవితం నిరర్ధకం. భోగేచ్ఛతో జడవస్తువులకై ఏడుస్తారు గాని, భగవంతునికై ఆర్తిచెందేవారు చాలా తక్కువ. అహంకారమనే తెర తొలగిస్తే, భగవద్దర్శన మవుతుంది. తక్కువ స్థితిలో వుండే వారిపై దయ, పెద్దలతో సాంగత్యం, దుర్జనుల పట్ల ఉదాసీనత కలిగి వుండాలి.
- పాపి హృదయంలో కూడా పరమాత్మ వున్నాడు. పాపం తొలగిపోతే ప్రకాశిస్తాడు. భగవంతునికి ప్రీతిపాత్రమైన పని మనం చేయాలి. రజస్తమనస్సులు తొలగి స్వస్వరూపంలో నిల్కడకలిగితేనే ఆనందం. పశువు పుట్టినపుడెలా వుంటుందో



చచ్చేటప్పుడు అలాగే వుంటుంది. మానవుడలా వుండకూడదు. జన్మనా జాయతే శూద్రః కర్మణా భవతిద్విజః అన్నట్లు జన్మతో శూద్రుడైనా కర్మతో బ్రాహ్మణుడు కావాలి.

- మనము ఎట్టివారము అనునది మనము చేయు కర్మచే కాదు. ఎట్టి భావముతో అట్టి కర్మ చేయుచున్నామో దానిచే తెలియబడ గలదు.
- తినుటకు జీవించువాడు బద్ధుడు. జీవించుటకు తినువాడు ముక్తుడు.
- మహాత్ముల యొక్క సాంగత్యము చేత ప్రపంచము యొక్క వాస్తవ స్థితి జీవునకు గోచరమగును. ఏది సత్యమో, ఏది అసత్యమో తేలిపోవును. కాబట్టి ముముక్షువు పెద్దల యొక్క సాంగత్యము నభిలషించుచూ వారి సన్నిధానమున తత్త్వము ను చక్కగా తెలుసుకొని దైవము యెడల తీవ్రతర ఆసక్తి గలవాడై పవిత్రమగు మానవ జీవితమును సార్ధక మొనర్చు కొనవలెను. పెద్దల యొక్క సాంగత్యము వలన తమ హృదయములో వెలుగుచున్న పరమాత్మను గూర్చిన విజ్ఞానముగలవాడై మనస్సును బహిర్ముఖత్వము నుండి మరల్చి అంతర్ముఖము చేసుకొని ఆత్మయందు లయింప జేయవలెను. మోక్షమున కిదియే ఏకైక మార్గము.
- విలు విద్య నేర్చుకొను వ్యక్తి ప్రప్రథమమున పెద్ద పెద్ద వస్తువులను గురి నిలుపుచు తదుపరి చిన్న చిన్న వస్తువులపై గూడా గురి నిలుప గలుగును. అటులనే మొదట భగవంతుని సగుణ ధ్యానమందు మనస్సు లగ్నము చేసినచో, పిదప పరమాత్మ యొక్క, నిర్గుణ ధ్యానమును చేయుట సులభ మగును. (శ్రీ రామకృష్ణ పరమహంస)
- ఆత్మసాక్షాత్కారమును అభిలషించువాడు మనస్సును, వాక్కును, ఆచరణను పరిశుద్ధముగ ఉంచుకొనవలెను. మనస్సులో వున్న సద్భావములనే నోటితో చెప్పవలెను. వాటినే ఆచరించ

వలెను. మనుజుడు త్రికరణ శుద్ధి గలిగి, దైవ ధ్యానాదులను సలుపుచు, ఆత్మ సాక్షాత్కారమును బడసి, జీవన్ముక్తుడై విలసిల్లవలెను. (శ్రీ రామకృష్ణ పరమహంస)

- కుండకు ఒక రంధ్రం పడితే నీరంతా కారిపోతుంది. మన శరీరమనే ఘటానికి తొమ్మిది రంధ్రాలు ద్వారా ఆయుస్సు అనే నీరు కారిపో తున్నది. పుణ్య ధనం మన వెంట వస్తుంది కాని ఇదేదీ రాదు, చాలా మంది ఆత్మసాధనను వాయిదా వేస్తారు. అంతా ఉడిగిన తరువాత ధ్యానం చేయాలంటే కుదురుతుందా? దేహధారణం బరువు మోయడం వంటిది. దీనిని ఎంతో శీఘ్రంగా ఆధ్యాత్మిక సాధనలు చేయడం మంచిది. రేపు అని వాయిదా వేయరాదు. ఉదయం నాలుగున్నరకు లేవడం స్నానం, ధ్యానం, జపం వగైరా సత్కార్యక్రమాలు అమలు జరపాలి. గీతలో ఆధ్యాత్మిక సాధన పద్ధతిని శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు. మన జీవితాన్ని ఆధ్యాత్మిక వాతావరణంలోనికి తీసుకు పోవాలి అని చెప్పి యున్నారు.
- పురుషుడు పురుషోత్తముడుగ మారాలి. శరీరం పోయినా కర్మలు మిగిలే వుంటాయి. అవిద్య వల్ల కోర్కెలు కలుగుతాయి. అవి నశించిన వారు శాంతిని పొందుతారు.
- సుఖము దృశ్య వస్తువులలో గలదని, తలంచి అజ్ఞాని వాటిని పొందుటకై అహోరాత్రములు కృషిసలుపుచున్నాడు. కాని వాస్తవముగ ఆనందము, సుఖము బాహ్య వస్తువుల నుండి రానేరాదు. లోని సుఖమే అటుల తోచుచున్నది. కావున జనులు క్షణిక సుఖములకై ప్రపంచమునందు కాలమును వృధాచేయక శాశ్వత సుఖము కొరకై, ఆత్మ సుఖము కొరకై ధ్యానాదులను సలుపుచు కృతార్థులు కావలెను. ఆత్మానందమే అన్ని సుఖములకంటెను ఉత్తమమైనది.



- బురదలో వుంటూనే నాకు బురద లేకుండా చేయండి అంటే? అదెలా సంభవం. ముందు బురద నుండి బయటపడాలి, అలాగే శోకం, దుఃఖం, చింత, ఆందోళన, భయం మొదలగు వాటిలో వుంటూనే నాకు శాంతి, సుఖం, ఆనందం కలగా లంటే అవెలా లభిస్తాయి.

శోకం, దుఃఖం, చింత ఆందోళన, భయం ఇవన్నీ శాంతి, సుఖ, ఆనందాలను నాశనం చేసేవే. ఎక్కడ శోకం వుంటుందో అక్కడ సుఖం శాంతి వుండదు. ఎక్కడ చింత వుంటుందో అక్కడ సుఖం వుండదు. ఎక్కడ ఆందోళన వుంటుందో అక్కడ ఆనందం వుండదు. కాబట్టి ముందు శోకం, దుఃఖం, ఆందోళన, చింత, భయం మొదలగు వాటి నుండి బయటపడాలి. అలా బయటపడిన తరువాతనే శాంతి మార్గం గోచరిస్తుంది. ఈ ఒడ్డు వదలనిదే అవతల ఒడ్డును ఎలా చేరగలవు. త్రాడు విప్పనిదే, పడవను ముందుకు ఎలా నడపగలవు.

కాబట్టి అశాంతి, దుఃఖం వీటికి కారణమైన మనోవృత్తులను వదలి పెట్టనిదే, నీకు శాంతి మార్గం కనబడదు. కావున శాంతి కావాలంటే మనోమాలిన్యాన్ని తొలగించుకోవాలి.

- జీవితము సుఖశాంతులతో వర్ధిల్లవలెనన్న ఆత్మ సాధనయే ముఖ్య మైనది, అదియే పునాది రాయి వంటిదిగా భావించాలి. ఆత్మ చిరంజీవి, సర్వమందూ ఒకే రూపమున వుండును. ఆత్మ అతి సూక్ష్మరూపమున వుండును. అందుచేత దానిని తెలుసుకొనుటకు చాలా పరిశ్రమ అవసరము. వివేక వైరాగ్యాదులు, మానవుడు సంపాదించుకొనవలెను. వాటిచేత అతడు నిత్యయోగశాంతులతో ఆనందమును అనుభవించ గలడు. (శ్రీ సత్యసాయి బాబా)
- కామముతో సమానమైన వ్యాధి లేదు. అజ్ఞానముతో సమాన మైన శత్రువు లేడు. కోపముతో సమానమైన అగ్ని లేదు.

జ్ఞానముతో సమానమైన సుఖము లేదు.

- మనస్సే బంధమోక్షాలకు కారణమైనది. సృష్టిలో గల 84 లక్షల రకాల జీవరాసులలో మనస్సుగలవాడు మానవుడొక్కడే. అందుచేతనే అన్నింటిని వశపరచుకొని ఉపయోగించు కొనుచున్నాడు. అందుకే అన్నింటికిది కడసారి జన్మ అన్నారు పెద్దలు. అట్టి మనస్సును ఎరిగిన వారే మానవులు. మనస్సును అనుసరించినవారు దానవులు అనబడుదురు. గుణాతీతులే జన్మహక్కైన శాంతి సుఖా లను పొందగలరు.
- అతిథి అంటే ఒక్క మీ యింటికి వచ్చిన బంధువొక్కడే కాదు. ఆకలి బాధతో నిన్నాశ్రయించిన ప్రతిజీవి పశుపక్ష్యాదులు సైతం అతిథులే. వారిని తృప్తిపరచి పంపు. అతిథి దేవోభవ అన్న శ్రుతిని ఎల్లప్పుడూ గుర్తించుకొని మెలగుతూ వుండు. నీకు శుభం కలుగుతుంది. (శ్రీ షిర్డీ సాయిబాబా)
- ఆధ్యాత్మ క్షేత్రమున సాధనచేయువారు శాస్త్రములందు, మహనీయు లెట్లు చెప్పిరో గురుదేవుడెట్లు చెప్పెనో దానిని ఆలకించి, శ్రద్ధగా గురు వాక్యాన్ని శాస్త్రవాక్యాన్ని పాటించాలి.
- జయాపజయాలు, జనన మరణాదులు, భగవంతుని చేతిలో ఉంటాయి. మానవులెంత మూఢులంటే భగవంతుని అనుగ్రహముంటే మనకు సర్వం చేకూరుతాయన్న సంగతిని మరచి పోయి ప్రవర్తిస్తుంటారు. మీరు ఎప్పుడు, ఎక్కడ ఉన్నా ఏంచేస్తున్నా నాకు తెలుస్తుందనే విషయాన్ని దృష్టిలో వుంచుకోండి. (శ్రీసాయిబాబా)
- వేదవేత్తలగు సద్గురువుల పాదపద్మములే జనులకు శరణ్యము. సంసార సముద్రమును అవి అవలీలగా దాటించి వేయ గలవు. అనగా గురు భక్తిగలవారు, దైవభక్తిగలవారు, సంసార సాగరమును సులభ ముగ దాటివేయగలరు. కాబట్టి అనిష్ట మగు బంధము యొక్క నివృత్తి కొరకును, అభీష్టమగు మోక్షము యొక్క ప్రాప్తికొరకును, జనులు గురుదేవుల



పాదములను తప్పక ఆశ్రయించవలెను.

- ఆత్మ సాక్షాత్కారము, దైవానుభూతి కలుగు వరకు సాధన చేయుచునే యుండవలెను. సోమరితనమును ఆశ్రయించి, మధ్యలో దానిని విరమింపరాదు.
- స్త్రీ, ధన, మిత్ర, పుత్ర, క్షేత్రాది, భోగసాధనములన్నియు స్వప్నము లేక ఇంద్రజాలము, వంటివని నిశ్చయించుము. ఎందుకనగా ఇవన్నియు కొలదికాలములో అదృశ్యమైపోవుచున్నవి. అందుచేత వీటిపై మమత్వము విడిచిపెట్టుట ఉత్తమము అని అష్టావక్ర మహాముని జనకమహారాజునకు చెప్పినది.
- మనస్సు దైవమను లక్ష్యమును మరచి, ఒకింత బహిర్ముఖ మైనచో, క్రమక్రమముగా క్రిందికి దిగజారిపోవు ప్రమాదము కలదు. మేడ మెట్లపై వున్న బంతి ఒక్క మెట్టు జారినచో క్రమక్రమముగా ఒక్కొక్క మెట్టు దిగజారి క్రిందకు పడిపోవును గదా. కాబట్టి సాధకుడు నిరంతరము బహుజాగరూకుడై, దైవమను తన లక్ష్యమును, ఏ కాలమందును మరువక యుండవలెను.
- ఈ జీవితము వచ్చును, పోవును సంపదలు కీర్తి, భోగములు మూణాళ్ళ ముచ్చటలు, పురుగువలె చచ్చుటకంటె, సత్యమును బోధించుచు కార్యక్షేత్రమున మరణించుట చాలా ఉత్తమము. కావున ముందుకు పయనించుడు. (శ్రీ వివేకానందస్వామి)
- కర్మకు సాక్షులు : సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్ని , అంతరిక్షము, భూమి, జలము, హృదయము, యముడు, పగలు, రాత్రి, రెండు సంధ్యలు, ధర్మము అను ఇవన్నియు మనుజుడు చేయు మంచి, చెడు పనులన్నిటిని తెలుసుకొను చున్నవి (మహాభారతము-ఆదిపర్వము)

కోర్టులో కేసు విచారణచేయునపుడు వాది తరుపున ప్రతి వాది తరుపునగల సాక్షులను గూడ విచారించు చుందురు. సాక్ష్యము బలముగయున్నపుడే కేసునకు బలము చేకూరును

అట్లే జీవుడు చేయు, పుణ్య పాపకర్మలన్నిటికి పదునలుగురు సాక్షులు గలరు. వారు క్రమముగ 1) సూర్యుడు 2) చంద్రుడు 3) వాయువు 4) అగ్ని 5) ఆకాశము 6) భూమి 7) నీరు 8) హృదయము 9) యముడు 10) పగలు 11) రాత్రి 12) ఉదయ సంధ్య 13) సాయంకాల సంధ్య 14) ధర్మము అనునవి.

ఆకాశము సర్వత్ర నిండియుండును. పగలుగాని, రాత్రిగాని ఆ రెండిటిలో ఏదో ఒకటి యుండియే యుండును. యమధర్మరాజు బహు జాగ్రత్తగ జీవులొనర్చు పుణ్య పాప కర్మలను రికార్డు చేయుచునే యున్నాడు. ప్రాతఃకాల సాయం సంధ్యలు జీవుని కర్మలను గమనించుచునే యున్నవి. సాక్షాత్ భగవంతుడు హృదయస్థుడై జీవుడొనర్చు కర్మలను గమనించుచునే యున్నారు. ఇట్టి పరిస్థితులలో ఇతరులకు తెలియకుండ జీవుడు పాపకర్మలు ఎట్లు చేయగలడు. తాను చేసిన కర్మలకు ప్రబల సాక్ష్యమున్నందున ఇక విశ్వనియమము ప్రకారము, పాప ఫలితమగు దుఃఖమును అతడు అనుభవించియే తీరవలెను.

మనుజుడు వివేకమును కూడబెట్టుకొని పాపమును దరికి జేర నివ్వక, పుణ్యమునే ఆశ్రయించి, ధర్మమునే ఆశ్రయించి, పరమ పవిత్ర మగు మానవ జీవితమును సఫలమొనర్చుకొనవలెను.

- సూర్యుడు ప్రార్థింపబడకయే పద్మవనమును వికసింపజేయుచున్నాడు. చంద్రుడు యాచింపబడకయే కలువలను వికసింపజేయుచున్నాడు. మేఘుడు అర్థింపబడకయే నీటి నిచ్చుచున్నాడు. సత్పురుషులెప్పుడు పరులకు హితమొనర్చుటయందే ఇష్టపడు తుంటారు.
- దానధర్మములు లేని ధనము, సద్గుణములు లేని విద్య, మానవత్వము లేని విజ్ఞానము, త్యాగము లేని క్రియ వ్యర్థములు.



- నిర్మల సుఖమును బొందవలెనన్న దుఃఖములు తొలగవలెను. దుఃఖములు తొలగవలెనన్న భగవంతుని అనుగ్రహము కావలెను. భగవంతుని అనుగ్రహము కావలెనన్న వారిని ధ్యానించవలెను. వారియందే చిత్తమును సంలగ్నము చేయవలెను.
- ద్రవ్యార్జన చేయగలగినంతవరకే, దారాసుతాదులు ప్రేమింతురు. ఆశక్తుడవైనప్పుడు నిన్నొక్కరు చూడరు. కాబట్టి వెర్రిభ్రమలు విడిచి, సదా భగవంతుని భజింపుము. (శ్రీ శంకరాచార్యులవారు)
- ఇంద్రియములకు లోబడిన మనుజుడు జీవుడగును. ఇంద్రియము లను నియమించి, వాటిని లోబపరచు కొనినచో అతడు సాక్షాత్ శివుడే కాగలడు. మాయాధీశుడగు శివుడు పరమసుఖమును, ఆత్మానందమును ఆస్వాదించును కనుక మానవుడు సాధనాతి శయము వలన, ఇంద్రియ జయమును సంపాదించి, జీవత్వమును దాటిపోయి, సాక్షాత్ పరమేశ్వరుడుగ సచ్చిదానంద స్వరూపుడగ, పరిణతి నొంది, జన్మ సార్థకతను బడయవలెను.
- ఒక చెరువులో నీళ్ళు బురదగ యుంటే, మలినంగా యుంటే, అడుగు భాగానయున్న వస్తువులు కనిపించవు. ఆ నీటిలో బురదలేనపుడు నీళ్ళు నిర్మలంగాయున్నప్పుడు నీటి అడుగు భాగాన వున్న పదార్థాలు చక్కగా గోచరిస్తాయి. అట్లే మనస్సు స్థూలంగా యున్నపుడు రజోగుణ, తమోగుణాలతో కూడి యున్నపుడు, ఆత్మయొక అనుభవం అతనికి కలుగనే కలుగదు. మనస్సు సూక్ష్మం కావాలి. రజోగుణ, తమోగుణాలు అంతమైపోవాలి. మనస్సు నిర్మలం కావాలి. అప్పుడే స్వస్వరూపమైన ఆత్మ యొక్క పరిచయం క్రమంగా జీవునకు కలుగుతుంది.
- వైరాగ్యమునకు సమమైన లాభమగు ధనము లేదు. బ్రహ్మబోధకు సరియగు సుఖము లేదు. సద్గురువునకు సముడగు

రక్షకుడు లేడు. సంసారమునకు సమమగు శత్రువున్ను లేడు.

- సుఖము బంగారముచేగాని, వెండిచేగాని కొనదగు వస్తువు కాదు. అది బాహ్య పదార్థము వంటిది కాదు. పవిత్రత చేతను, భగవద్భక్తి చేతను, హృదయమునందే అనుభూతమొనర్చు కొనదగిన వస్తువే అది. తాను సుఖము నొందుటకు సులభమైన మార్గము ఇతరులను సుఖపెట్టుటయే.
- ఎంతవరకు బ్రహ్మము అనుభూతము కాలేదో, అంతవరకు బ్రహ్మరూపముయొక్క మనన నిధి ధ్యాసములను గావించు చుండవలెను. బ్రహ్మజ్ఞానామృతముచే తృప్తిచెంది కృత కృత్యుడైన యోగికి, చేయ వలసిన కార్యమేదియులేదు. అతడెల్లప్పుడును బ్రహ్మానందమును అనుభవించుచుండును. తైలధారవలె ఎడతెగకుండగను దీర్ఘమైన ఘంటానాదము వలె, బ్రహ్మస్వరూపమైన ప్రణవమును (ఓంకారమును) ఉపాసించుచుండవలెను. అట్టి ప్రణవమును ఎరిగినవాడే వేదవేత్త. పొగలేని అగ్నిజ్వాలవలె ప్రకాశమానమై అతి స్వచ్ఛమైన బ్రహ్మమును అనుభవించువరకు నిరంతరము బ్రహ్మచింతన కలిగి ధ్యానించుచుండవలెను.
- కృషిచేయువారెంత శ్రద్ధతోను, శ్రమతోను, దున్ని ఎరువువేసి పోషించి నను భూమి చవిటి మట్టియైనచో యెట్లు సరిగా ఫలింపదో అలాగున శ్రమపడి శ్రద్ధగల్గి చేసెడు తపస్సుగాని, వ్రతము గాని, యోగము గాని, జపముగాని, ధ్యానము గాని, మనన నిధి ధ్యాసములు గాని, పూజా పారాయణాదులు గాని, హృదయ శుద్ధిలేనిచో ఫలము నివ్వజాలదు. కావున సదా హృదయములో దృష్టినుంచి, సత్యము నుండియు, దైవ ధర్మము నుండియు, శాంతము నుండియు, విరక్తి నుండియు, కరుణ నుండియు, భక్తి నుండియు, మనస్సు మార్పుదల చెందుచున్న దాయని, జాగ్రత్తతో సాధకుడు చూచుచుండవలయును. భూమి శుద్ధముగా నుండిన,



కర్షకుని ప్రయత్నమంతయు నేలాగున ఫలించునో, అలాగున హృదయము శుద్ధమై యుండిన సాధకుని తపోవ్రత యోగాదులన్నియు ఫలించును. (శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు)

- పగలంతయు ఇంటిలో కట్టబడియుండు ఆవుదూడ తల్లి యగు గోవు సంధ్యాకాలము వచ్చుతరి పాలు పితుకుట కొరకు విడిచిపెట్టి, స్థనములో పాలువచ్చుచున్నప్పుడు పిండుట కొరకు, దూడను పట్టి లాగునపుడు, అది వచ్చుటకు ఎంత ప్రయాసముగా నుండునో, అదే రీతిగా యెవని మనస్సు ధ్యానానందము నుండి అనివార్యకార్యముల కైనను, బహిర్ముఖమునకు వచ్చుటకు కష్టముగా కనుపించునో అట్టి మనస్సు దైవామృతమును పానము చేయుచున్నదని తెలిసి కొనవలయును. వీరికి మోక్షము అనగా దైవసుఖము, కరతలా మలకము, బంధము తెగిన ఆత్మకు మాత్రమే ఇట్టియవస్థగలుగును. (శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు)
- మేలుచేసిన వారికి ఎన్నడును అపకారము తలపెట్టురాదు. అపకారికి కూడ ఉపకారము చేయవలసియుండగ, ఉప కారికి చెడు తలపెట్టుట క్షమించరానిది. తోటి ప్రాణులను తనవలె చూసుకొనుచు ఆత్మౌపమ్య దృష్టినలవపరచుకొని, మనుజుడు పరోపకారము క్షమ, దైవభక్తి మొన్నగు సద్గుణ ములను పెంపొందించుకొని తన జన్మను ధన్యము చేసుకొన వలెను.
- ఈ సమస్త సృష్టికి నేనే తల్లి, తండ్రి. తల్లిదండ్రులకు తగ్గ బిడ్డని అనిపించుకోండి. అలా కాగలగాలంటే జ్ఞానాన్ని సంపాదించాలి. మంచి లక్షణాలను అలవరచుకోవాలి. ఈ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని నువ్వు కనుక ఈ జన్మలో తెలుసు కోలేకపోతే సువర్ణావ కాశమైన ఈ జన్మను నువ్వు వృధాపరచుకున్నట్లే ఇది తెలుసుకునే లోపులో కనుక నువ్వు మరణిస్తే నీ శరీరం

మట్టిలో కలిసిపోతుంది. నీ శ్వాస వాయువులో కలిసి పోతుంది. అప్పుడు పరిస్థితి ఏమిటో ఇప్పుడొకసారి ఆలోచించి చూడు (శ్రీ షిర్డీ సాయిబాబా)

- మనుజుడు తన ఇంద్రియములపై విజయమును పొంది నప్పటికి జిహ్వేంద్రియమును వశమొనర్చుకొననంత వరకు జితేంద్రియుడు కానేరడు. ఆ నాలుకను జయించి నచో సమస్తమును జయించినట్లే యగును. (శ్రీ దత్తాత్రేయులవారు)
- మనిషి పుట్టినపుడు మూడు ఋణాలతో పుడతాడు. అవి ఋషి ఋణం, పితృఋణం, దేవఋణం.

  1) ఋషి ఋణం : దీనిని తీర్చుకోవడానికై వేదాధ్యయనం చేయవలెను.

  2) పితృ ఋణం : దీనిని తీర్చుకోవడానికి పుత్రులు శ్రార్ధకర్మలు చేసి పున్నామ నరకం నుండి రక్షించాలి. శ్రాద్ధ కర్మ పౌత్రులు, ప్రపౌత్రులు (ముని మనుమలు) కూడా చేస్తే చనిపోయిన వారు. సూర్యలోకానికి పోతారు అని మనుస్మృతిలో చెప్ప బడింది.

  3) దేవఋణం : దీని నుండి విముక్తి కావాలన్న ఇంద్రాది దేవతల గూర్చి యజ్ఞాదులాచరించవలయును. గృహస్థుడు దీనిని భార్య సమేతంగా చేయాలి. ఇందువలన దేవతలు సంతుష్టులై వర్షాలు బాగుగా కురిపించి, సమృద్ధిగా పంటలు పండేటట్లు చేస్తారు. కనుక ఈ మూడు ఋణాలను తీర్చుకోవడానికై అర్ధకామాలను ధర్మయుతంగా నెరవేరు స్తూంటే వీటివలన బుద్ధి శుద్ధమయి, పరమ పురుషార్ధం అయిన మోక్షమునకు సాధనలుగ అవుతాయి. మోక్షం పరమ పురుషార్ధం - పొందితే నపునరావర్తతే తిరిగి జన్మలేదు అని శృతి చెప్పింది. మిగిలిన మూడు పురుషార్ధాల వలన క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి అన్నట్లుగా తిరిగి జన్మ వుంటుంది.
- కార్యసాధనకు ఆత్మ విశ్వాసమే ప్రధమ సోపానము.



- ఇతరుల తప్పులు వెదకువారు ముందుగా తమ తప్పులను తెలిసికొని వాటిని అనుసరించుకొనవలెను.
- ప్రేమ అతి విశాలమైనది. దానిలో తారతమ్యములు వుండవు.
- ఇతరులపై దయ, కరుణ కలవాడే దైవానుగ్రహమునకు పాత్రుడు కాగలుగును.
- పూజలలోకెల్ల గొప్ప పూజ ఉపకారము చేయుట. కావున నీకున్నది నీవు తిను కాని దానిలో కొంత భాగము ఒక ప్రాణికి సహకరించుటకు ఉపయోగించు. లోభమును దురీకరించు, ఒకరి బాధను నీ బాధగ తలంచు, నీవు సుఖంగా సౌఖ్యంగా, సంతోషంగా, ఆనందంగా, శాంతిగా వుండాలనుకొంటున్నావు. ఎదుటి వ్యక్తి కూడా ఆలాగే వుండాలని కాంక్షించు ఇలా సద్గుణాలనే పూలతో పూజించు. అదే ఉత్తమపూజ, విశేషపూజ, అగ్రపూజ దానికే అధిక ఫలితం. అట్టి సద్గుణాలనే పూలతో భగవంతుని పూజించి, దుర్గుణాలనే ధూళిని దులిపి, దేహమనే దేవాలయమును, పవిత్రంగా ప్రశాంతంగా వుంచు కోవాలి. ఇట్టి పరమ పవిత్రమైన సద్గుణాలను, అవలంభించుట ద్వారా పరమాత్మను పొందగలుగుతాము.
- ఆత్మజ్ఞానం పొందాలంటే ముందు మనస్సు శుద్ధం చేసు కోవాలి. మనసులోని రజోగుణ, తమోగుణాలు అంతరించి పోవాలి. దైవిక గుణములను అలవరచుకోవాలి. కామక్రోధాది అరిషడ్వర్గమును పారద్రోలాలి. శుద్ధ మనస్సుగలవారికే ఆత్మానుభూతి కలుగుతుంది. అపుడే జీవితం సార్ధకమవు తుంది అని మహాత్ములు సెలవిచ్చి యున్నారు.
- సత్యమును మించిన గొప్ప మతము వేరొకటి లేదు.
- చక్కని నడవడిక, అన్ని కళలలోను గొప్పది.
- జీవితమనగా గడచిన సమయముకాదు, సాధించిన సత్కార్యముల లోనే వుంది.

- శరీరమునకు వ్యాయామము వంటిది, మనస్సుకు పుస్తక పఠనము.
- మనిషికి చదువుకంటే వ్యక్తిత్వమే చాలా అవసరము.
- విషయ సుఖము అతిథిగా ప్రవేశించి, మనుజుని బానిసగా చేసివైచును.
- ఈ సంసార బాధ నుండి తప్పించుకోవటానికి సద్గురువు దగ్గరకు వెళ్ళాలి. జ్ఞానజ్యోతిని పొందాలి. ఈ జగత్తు మిధ్య అని ఆత్మ సత్యమని గ్రహించాలి. స్వస్వరూప సాక్షాత్కారం పొందాలి. అప్పుడే భయ మంతయు పలాయనమైపోతుంది. జీవునకు బంధ విముక్తి కలుగుతుంది. మోక్షం సిద్ధిస్తుంది. కావున జీవుడా మేలుకో.
- ఆహార నియమాదులు, మంత్రజపము, ప్రాణాయామము మొదలగు నవి మనస్సును లోబరచుకొనుటకు సహాయ కారులు, అందువలన మనస్సునకు ఏకాగ్రత ప్రాప్తించును.
- పాపకార్యము చిన్నదని అజాగ్రత్త గలిగియుండరాదు. అగ్ని చిన్న కణమని వదలిన క్రమముగా అది ప్రజ్వరిల్లి పెద్ద పెద్ద పట్టణములే భస్మము గావించును. చిన్న బీజమని వదలినచో, అది దట్టమగు అరణ్యమును పెంచును. కావున పాపకార్యమెంత చిన్నదైనను, దాని మూలవేరు సహితము తీసివేసి వాసనారాహిత్యము గావించవలెను. అజాగ్రత్త గలిగి యుండిన, మోహమావరించి సర్వనాశనము గావించును.
- శ్రీ వ్యాసమహాముని రెండు వాక్యములచే, సర్వశాస్త్ర పురాణ సారమును వచించెను. పరోపకారము పుణ్యము కొరకును, పర పీడనము పాపము కొరకును అగుచున్నది అని సెలవిచ్చి యున్నారు.
- ఓ జీవుడా శాశ్వతపరమాత్మను పొందుటకే, అహర్నిశలు ప్రయత్నించి, సాధన చేసి, అభ్యాసం గావించి, ఆత్మాను



భూతిని బడసి సుఖించు ఎండమావుల కోసం పరుగెత్తే వాడు ఏమైనా నీళ్ళను పొందగలుగు తాడా? వాడికి శ్రమ మాత్రమే మిగులుతుంది. జీవుడా ఇప్పటికైనా తెలివినొంది, వ్యర్థం చేసిన జన్మలన్నింటిని తలచుకొని, లజ్జను పొంది సత్యమార్గాన్నే చేపట్టి, ఏది నిత్యమో, ఏది అనిత్యమో బాగుగా గ్రహించి ఆత్మ సాక్షాత్కారానికే దానిని వినియోగించు. లెమ్ము మేలుకొనుము. గమ్యస్థానము (ఆత్మ సాక్షాత్కారము) చేరువరకు ఆగకుము. (విద్యాప్రకాశానందగిరి స్వామి)

- విశ్వాసమే హనుమంతునిచే కొండలు మోయించినది. సముద్రము దాటించినది. భగవంతుడు మనలో వున్నాడను విశ్వాసమే దానికి కారణము. మనలను భయంకర తుఫాను మధ్య నుండి కూడ రక్షింప గలదు. విశ్వాసమను దివ్యశక్తియే మానవులకు దివ్యతత్వమును ప్రసాదింపగలదు (శ్రీ బాపూజీ).
- పాపాచరణకలవాడు దుఃఖమనుభవించును. పుణ్యకార్య తత్పరుడు పరోపకారపరాయణుడు సుఖమును అనుభవిం చును. ఆత్మ జ్ఞానమును స్వస్వరూప సాక్షాత్కారమును సంపాదించినవాడు, మోక్షమును, కైవల్యమును శాశ్వత ఆనందమును పొందును. కనుక జనులు పాపకార్యము లందు ప్రవేశింపక, పుణ్య కార్యములను, దైవ కార్యములను ఆచరించుచు చిత్తశుద్ధిని జ్ఞానసిద్ధిని బడసి, ఆత్మ సాక్షాత్కా రమునొంది, మహత్తర ప్రయోజనమగు జన్మ రాహిత్యమును, దుఃఖ రాహిత్యమును కలుగజేసుకొని జన్మము చరితార్థము చేసుకొనవలెను.
- కాలము చాలా విలువైనది. దానిని వృధాగా ఖర్చుచేయరాదు. అత్యవసరమగు వ్యవహారమునకు కొంత సమయమును కేటాయించినను, పారమార్థిక అభ్యున్నతికి ఎక్కువ కాలము వినియోగించవలెను. దేనినైనన తిరిగి పొందవచ్చును గాని గడచి పోయిన కాలమును ఎవరును పొందలేరు.

కాబట్టి జీవితమందలి ఒక్కొక్క క్షణము ఎంతయో విలువ గలిగినదని, గ్రహించి ఆత్మ సాక్షాత్కారమును లక్ష్యమును సంపాదించుటకొరకే దానిని వినియోగించవలెను. పరమార్థ సాధనమునకు, బాల్య యవ్వన ములు అత్యంత ప్రాముఖ్యత గల సమయములు. కాబట్టి వాటిని బహు జాగ్రత్తగ మోక్షసాధన కొరకే వినియోగించుచు, సయమును చాలా పొదుపుగా వాడవలెను. విషయభోగములందు, దృశ్య సౌఖ్యము లందు, సమయమును వృధా చేయరాదు. కాలమును పరమార్థ సాధన అందు సద్వినియోగము చేయు వాడే, మానవ జీవితమును మోక్ష ప్రాప్తి ద్వారా చరితార్థమొనర్చుకొనగలడు.

కావున ముముక్షువులు బహు జాగరూకులై పవిత్రమగు మానవ జీవితమును సద్వినియోగపరచి, జన్మరాహిత్యమును, కైవల్యమును బడయవలెను.

- పాలలో తీపు, మిరియంలో కారం, నీటిలో ద్రవత్వం, గాలిలో చలనం, విడి విడిగాలేవు. అదే రీతిగా పరమాత్మకంటె, జగత్తు లేదు. బ్రహ్మమనే రత్నం నుండి జగత్తనే వెలుగు, కారణం లేకనే వెలువడుతున్నది. ఆ వెలుగు బ్రహ్మము కంటె వేరైనది కాదు.

- ప్రాణికి భోగాల పట్ల కొంచెమయినా విరక్తి కలిగిందంటే అతడు ఉన్నత స్థితి పొందుతాడని శ్రుతి చెబుతున్నది. దేనిపట్ల విరక్తి కలిగితే, దాని నుండి విముక్తి సిద్ధిస్తుంది. దేహాత్మ బుద్ధిలేనివారికి, జనన మరణ భ్రాంతి కూడా వుండదు.

ఎవరు నామరూప రహిత చిత్స్వరూపాన్ని గ్రహిస్తారో వారు తరిస్తారు. ఈశ్వర చైతన్యం కంటె, జీవ చైతన్యం వేరు కాదు.

- సాధకులు సంశయములు పెంచుకొనరాదు. శాస్త్రవాక్యములపై గురు వాక్యములపై సంపూర్ణ విశ్వాసము గలిగి, సాధనలను గావించవలెను. కొంతకాలమునకు, తమకే దైవాను



భూతి చక్కగా కలుగగలదు.

- భుక్తికై ఉద్యోగము జేయువారే, వేళకు పనిచేయుచుండగా శాశ్వతమగు ముక్తికై ఎంత జాగరూకులై యుండవలెనో యోచింపుడు (శ్రీ మలయాళ స్వామి)

- పేర్లు మారుచున్నవి. నెలలు మారుచున్నవి. తిథులు మారుచున్నవి. వారాలు మారుచున్నవి. అన్ని మారుచున్నవి. కాని కొందరిలోని దుష్ట స్వభావములు మారుట లేదు. ఇది చాలా విచారించదగ్గ విషయము.

- భగవంతునిచే కల్పింపబడిన యోగమాయ సత్వం, రజస్సు తమస్సనే మూడు గుణాల రూపంలో వున్నది. ఇది జీవులకు దాటరానిది. భగవంతుని శరణుజొచ్చినవారే ఈ మాయను దాటగలరు. ఇతరులకెవ్వరికి సాధ్యం కాదు. కనుక భగవంతుని శరణుజొచ్చి మాయ మేలిముసుగులో నుంచి మనం బయటపడాలి.

- ప్రాపంచిక పదార్థములందాశయున్నంతవరకు, తృష్ణ హృదయమున వీడనంత వరకు, మానవుని మనస్సు భగవంతుని యందు సంలగ్నము కానేరదు. కావున ముముక్షువులగు వారు ప్రయత్న పూర్వకముగ అద్దానిని విడనాడవలెను.

- మనకు రెండు కన్నులున్నను దానితో శరీరమందలి భాగములన్నిటిని చూడలేము. మన వీపుపైనే మున్నదో మన ముఖమెట్లున్నదో చూడజాలము. అట్లు శరీరములందలి భాగములన్నియు చూడవలె నన్నచో రెండు నిలువుటద్దముల మధ్య నిలబడి చూసినచో శరీర భాగములన్నియు కనిపించును. అట్లే జ్ఞాన స్వరూపుడైన భగవంతుని తెలిసికొనుటకు రెండద్దములు కావలెను. మొదటిది గురు కృప, రెండవది దైవకృప.

అన్ని ప్రదేశములయందు నిండియున్న ప్రకృతి, రహస్యములను తెలిసికొని, భగవంతుని చేర్చునదియే జ్ఞానము. కావున

ముముక్షువు లగువారు గురు విశ్వాసమును, దైవ విశ్వాసమును పెంపొందించు కొనవలెను. శాంతికి మార్గమిదియే. (శ్రీ విద్యాప్రకాశానంద గిరి స్వాములవారు)

- కర్మయోగము గాని, ధ్యానయోగము గాని, భక్తియోగము గాని, జ్ఞానయోగము గాని, ఏ సాధనను అవలభించుచున్నప్పటికిని, జనులు, సర్వభూత దయను, కరుణను వదలరాదు. తోటి జనులను, దైవ స్వరూపులుగ గుర్తించి, శక్తి కొలది వారికి సేవలందించువారు. శీఘ్రకాలములోనే పరమాత్మ కృపకు పాత్రులు కాగలరు. నరుని సేవయే నారాయణుని సేవ. ప్రాణుల సేవయే దైవపూజ.

- వేదములందు, శాస్త్రములందు అనేక దేవుళ్ళు దేవతలు చెప్పబడి నప్పటికిని తెలిసికొనదగినవాడు పరమాత్మ ఒక్కడే అయియున్నాడు. ఆయా దేవాదులందురు, బ్రహ్మ, విష్ణు మహేశ్వరాదులందరు, ఒక్క పరమాత్మ యొక్క వివిధ రూపములేయగుదురు. కావుననే వేదము లన్నిటిచే తెలిసికొనదగినవాడు భగవానుడే. వేదశాస్త్రాదులను సృష్టించినది భగవంతుడే కాని మానవ మాత్రులు కాదు. ఆ వేదాదులందు తెలుపబడిన సత్యములందు నమ్మకము కలిగి ప్రవర్తింపవలెను. అవి దైవ నిర్మితములగుటచే వాటియందు అఖండ విశ్వాసముంచవలెను.

- అనేక దుఃఖములు కలిగినను, మానవుడు దృష్టిని లోపలి పరమాత్మ మీద కేంద్రీకరించి, మనస్సును శుద్ధముగా ఉంచిన, శాంతి అనుభవింపవచ్చును. యేసుక్రీస్తును అనేక బాధలు పెట్టిరి. తుదకు శిలువమీద మేకులు వేసికొట్టిరి. ప్రభూ వీరిని క్షమింపుము వారు చేయు పనులు వారికి తెలియవు అని శాంతముగ చెప్పెను. తన ప్రాణములు ఒక ప్రక్కన పోవుచున్నను, ఆ మహానుభావుడు ఎంత శాంతముగా నుండెనో చూడుడు. అతడు లోపల ఆత్మశాంతిని



అనుభ వించుచుండెను. కష్టములు, దుఃఖములు బాధలు అతనిని అంటలేకపోయెను.

- ధ్యానముచేత మనస్సును నిశ్చలపరచనిదే ఆత్మజ్ఞానము కలుగదు. చలించు మనస్సుగలవారికి, జ్ఞాన సంపాదనకు తీవ్రమైన కృషిచేయ వలెను. ధ్యానము అభ్యసింపనిదే మనశ్శాంతి లభింపదు. కోరిక, తృష్ణ, వస్తువులపై వాంఛ శాంతికి శత్రువులు, ఇంద్రియ సౌఖ్యములు కోరు వాని మనస్సు స్థిరత్వము లేక వానికై పరుగెత్తుచుండును. ఈ కోరికలు నిర్మూలనము కానిదే మనస్సునకు శాంతి లభింపదు.

- ఈగ ఒకప్పుడు అశుద్ధ పదార్థములపై, మరొక్కప్పుడు మధుర పదార్థములపై వాలును. అదే విధముగ వైరాగ్యము లేనివాడు ఒక పర్యాయము ప్రపంచ విషయములను గూర్చి ఆలోచించును. మరొకసారి ఆధ్యాత్మిక ప్రసంగములను చేయుచుండును. విషయాసక్తి వలన దుఃఖము, అశాంతి కలుగునని తెలసుకొని మనుజుడు పరమశాంతిని, సుఖ మును, ప్రసాదించు దైవభక్తి, విశ్వాసమును, పెంపొందించు కొనవలెను. అనన్య భక్తి వైరాగ్యము కలవాడు త్వరలోనే దైవప్రాప్తిని బడయగలడు. (శ్రీ రామకృష్ణ పరమహంస)

- దుర అలవాట్లు ప్రారంభములో సాలెగూళ్ళవలె నుండును. తదుపరి గట్టిపడి ఇనుపగొలుసులు వలె పరిణమించును. కనుక దుర అలవాట్లకు ఆదిలోనే అరికట్టని యెడల అది అవసరముగా మారి పోవును.

- దేహము ఒకనావ వంటిది, దానికి తొమ్మిది చిల్లులు కలవు. ఆ నావను నడుపువాడు జీవుడు. అతడు పరమసోమరిగా నుండి ఆ చిల్లులను అరికట్టనిచో సముద్ర జలము పడవ లోనికి ప్రవేశించి పడవను ముంచివేయగలదు.

చిల్లులను అరికట్టుటయనగా ఇంద్రియములను నిగ్రహిం

చుట, జీవుడు యింద్రియ నిగ్రహముగావించనిచో విషయ జలములోనికి ప్రవేశించి, అతనిని అధఃపతితుని గావించి వైచును. (శ్రీ విద్యా ప్రకాశానంద గిరి స్వాములవారు)

- నీటితో నిండియున్నటువంటి అన్ని కుండలయందును, సూర్యబింబ మున్నట్లు అన్ని ప్రాణులలో పరమాత్మ యున్నట్లు, విశ్వమంతా విశ్వనాథుడున్నట్లు తెలుసుకో.
- భౌతిక నేత్రములు అనగా తోలు కళ్ళు, జ్ఞాన నేత్రముగా మారినప్పుడే మానవ జీవితము సార్థకమగును. (శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు)
- ఎన్ని విద్యలు అభ్యసించినను, మనుజుని చిత్తవృత్తిలో మార్పు రానంత వరకు, పవిత్రతను అవలంభించనంతవరకు జీవితమున శాంతి చేకూరదు.
- సాధనచేతనే, అనుష్టానముచేతనే ఆచరణ చేతనే శక్తి సమకూర గలదు. నోరు మంచిది అయినప్పుడే ఊరున్నూ మంచిది కాగలదు.
- ధర్మమును ఆచరించినచో, అదియే తక్కిన వాటిని సమకూర్చగలదు.
- విశ్వేశ్వరుని పొందుటకు మార్గము విశ్వాసమే.
- జీవుడు మనస్సును ఎంతెంత శుద్ధపరచుకొనుచుండునో, అంతంత దైవమునకు సమీపముగ పోగలుగుచుండును.
- కష్టములను చూచి బెదరిపోకూడదు. నిలబడి జీవితమును, సుఖ వంతముగ నొనర్చుకొనవలెను.
- మంచిని ఆచరించుటయే సమస్త ధర్మముల యొక్క సారాంశము
- పరమార్థ జ్ఞానం లేని జీవితం చుక్కానిలేని పడవవంటిది.
- ఆత్మ వికాసమునకు, సజ్జనుల సాంగత్యము అతి ముఖ్యమైన అంగము.



- పరబ్రహ్మకు వాచకం ప్రణవం, వాచ్యవాచకయోరభేదః అన్నట్లు ప్రణవానికి, పరబ్రహ్మకు భేదం లేదు. పరబ్రహ్మ కళ్యాణ రూపమైనది. నిత్య కళ్యాణాలకు ఆశ్రయమైనది. స్మరించేవారికి వరాలు ప్రసాదిస్తుంది. అందువల్ల మంగళకరమైనది. దానిని ముందు ఉచ్ఛరించు కొని కార్యక్రమములు ప్రారంభిస్తే అవి నిర్విఘ్నంగా నెరవేరుతాయి.
- ఏ వాక్కు భగవంతుని గుణములను గానమొనర్చునో, అదియే నిజమైన వాక్కు. ఏ చేతులు భగవత్సేవ చేయునో అవియే నిజమైన చేతులు. ఏ మనస్సు చరాచరప్రాణులందు నివశించునట్టి దేవుని స్మరించునో అదియే నిజమగు మనస్సు ఏ చెవులు భగవత్కథలను వినునో అవియే నిజమగు చెవులు.
- నేను నాది అను ఈ అహంకార మమకారములు, రెండే జీవులకు ప్రబల శత్రువులైయున్నది. కావున మోక్ష కాంక్షియగు వాడు, ఆ రెండిటిని విచారణ పూర్వకముగ త్యజించివేయ వలెను. తాను ఆత్మయే కాని, దేహము కాదను దృఢ నమ్మకము ఏర్పడవలెను. దేహమే తాను కానపుడు, ఇక దేహమునకు సంబంధించిన బంధు క్షేత్రాదులు తనవెట్లగును. కావున విచారణచే జీవుడు అజ్ఞానమును, అహంకార, మమకారములను దూరముగ పారద్రోలి పరమ సుఖమును బడయవలెను. చిత్తము నిర్మలముగా వున్నపుడే మనుజుడు సత్యమును గాని, సత్య వస్తువగు పరమాత్మను గాని దర్శింప గల్గును. లోభము, మోహములచే చిత్తమెపుడు కలుషిత మగునో, ఆ మలిన చిత్తముచే చిత్తమెపుడు కలుషితమగునో, ఆ మలిన చిత్తముచే మనుజుడు సత్యవస్తు వును గాంచ జాలడు. (శ్రీ పరీక్షిత్ మహారాజు)
- దృశ్యభావన తొలగినపుడే దృక్స్వరూపమగు పరమాత్మ యొక్క అనుభూతి కలుగగలదు.

- ఓ మనస్సా ఎన్ని జన్మలు ఈ సంసార చక్రమందు పడి వృధా చేసినావు. అమూల్యమైన ఈ మానవ జీవితాన్ని కూడ అలాగున వృధా చేస్తే ఎంత ప్రమాదం. అన్ని అనుకూలాలతో కూడిన ఈ మానవ జన్మ బహు దుర్లభం కూడా. కాబట్టి ఇట్టి సదవకాశం పోగొట్టుకోవడం నీకే మాత్రం తగదు. మహాత్ముల సన్నిధి చేరి, వారి ముఖతః అనుభవ వాక్యము లను శ్రవణం చేసి, వాటిని ఆచరణ యందుంచి తరించు మోహ నిద్ర నుండి మేలుకో (శ్రీ విద్యా ప్రకాశానంద గిరి స్వాములవారు)
- భగవత్స్వరూపులగు జనులకు సహాయము చేయు చేతులు, స్తోత్రములను వల్లించు పెదవుల కంటె గొప్పవి.
- అహంకారమును జయించుటయే అన్నింటి కంటె గొప్ప విజయము.
- మనస్సున కామమను కళంకము అణుమాత్రమున్నను గూడ భగవంతుని గనజాలవు.
- లౌకిక చింతలు, తాపత్రయములు నీ మనస్సును కలవర పెట్టును. కావున నీ మనస్సును మాత్రము సదా భగవానునిపై నిలుపుము.

## శ్రీ రామకృష్ణ పరమహంస - సదుపదేశములు

- నేను నాది అనుకొనుటయే అజ్ఞానము. నిజమైన భక్తుడిట్లు భావించును. దేవా నీవు కర్తవు. సకలము నీవే చేయు చున్నావు. నేను నీ చేతిలోని ఉపకరణమును నీవు నన్ను ఏమి చేయించినను, నేను అదే చేయుదును. ఈ సర్వము నీవిభూతియే. ఈ యిల్లు, ఈ సంసారము అన్నియు నీవే. నావికావు. నీ ఆజ్ఞానుసారము సేవ చేయుటకు మాత్రమే నాకధికారము కలదు.



- జీవాత్మకు పరమాత్మకు నడుమ ఈ అహంకారము వచ్చి పడుటచేతనే, వారిరువురును వేరుపడుచున్నారు. నీటిమీద కర్రను వేసిన యెడల ఆ నీరు విభాగమైనట్లు కన్పించును. అహంకారమే ఈ కర్ర దీనిని తొలగించితివా నీరు మరల విభిన్నమై కన్పించును. అహంకారము వేయిసార్లు అణచినను, మరల మరల తలయెత్తుచునేయుండును. దాని మూలము ననే మరల మరల మనము ఈ లోకమున జన్మయెత్తు చుండుట.
- గీత యిట్లు బోధించుచున్నది. ఓ సంసారులారా త్యాగము చేయుడు. అన్నిటిని త్యజించి, భగవానునిపై బుద్ధి మరల్పుడు అని బోధించినది.
- రాతిముక్కలో నీరు యింకజాలనట్లు, ధర్మబోధలు, సంసార బద్ధుని మనస్సునకెక్కజాలవు. అతని యందెట్టి మార్పును కలిగింపజాలవు.
- మేకును రాతిలో కొట్టజాలము, కాని మట్టిలో సులువుగా గ్రుచ్చవచ్చును. అటులనే సాధు జనులహితబోధ లౌకికుని మనస్సున కెక్కజాలవు. కాని శ్రద్ధాభక్తులుగల ఆస్తికుని హృదయమున అతి సులభముగ నాటుకొనును.
- వంతెన క్రింద నీరు ఒక వైపు నుండి ప్రవేశించి, రెండవ వైపు నుండి పోవునట్లు సంసారికులకు జేయు ధర్మబోధ ఒక చెవిలో నుండి వారి మనసున ప్రవేశించి, రెండవ చెవి నుండి పలాయనమగును. వారి హృదయమున రవంతయు మార్పు గలుగదు.
- లౌకికుడు జీవితమున ఎన్నియో యాతనలను అనుభవించి, యెట్లో బుద్ధితెచ్చుకొని లౌకిక చింతలను విడిచి, భగవంతుని శరణు జొచ్చును. కాని పాపము, సంసార భారమను, వ్యసనములను, వాని నచట నిలువనీయవు కదా. సంసార తాపత్రయములలోనికి లాగి వేయుచుండును.

- వరి పొలముల నడుమ కాలువలలో చేపలను బట్టుటకు వెదురు మావులను బెట్టుదురు. వాని ద్వారముల నుండి తళతళలాడుచు నీరు ప్రవహించుచుండుట చూచి, చిరుచేపలు, అందు మహా ఉల్లాసముతో ప్రవేశించును. కాని యందొకసారి ప్రవేశించిన వెనుకకు, మరలనవి తప్పించుకొని పోజాలవు. అటులనే అవివేకులగువారు మాయా సంసార సుఖములచే మోహితులై సంసారమున బ్రవేశింతురు. సంసార జాలమున సుఖముగ ప్రవేశింపగలరు గాని, వెలువడజాలరు. పాపము వెదురు మావులందు చేపల వలెనే, వీరును అందులో తగుల్కొని దరిగానక బద్ధులైయుందురు.
- నీవు గృహస్తుడవైనను మరేమియు యభయము లేదు. నీ మనసు మాత్రము భగవంతునిపై నిలుపుము చాలును. ఒక చేతితో నీ గృహస్థ ధర్మములను నిర్వర్తించుచు, రెండవ చేతితో పరమేశ్వరుని పాదార విందములను పట్టుకొనుము.
- నీవు సంసారము చేయుము. కాని సర్వదా భగవంతుని స్మరించు చుండుము. ధర్మమార్గము నుండి యెన్నడును తొలగి వర్తింపకుము. ఎట్టి పరిస్థితులలోనున్నను తన మనసు మాత్రము ధర్మమార్గము నుండి తప్పిపోకుండా మెలకువ గలిగి మెలగవలయును. ఓ సంసారీ నీ చేతులతో, సంసారిక ధర్మములను నిర్వర్తించుకొనుచుండుము. కాని నిండు మనసుతో భగవన్నామమును, వాని గుణములను, కీర్తనలను చేయుచుండుము. మనస్సు భగవానునిపై నిలిపి, సంసార ధర్మములనన్నిటిని నిర్వర్తించువాడే నిజమైన వీరుడు. తండ్రివలన గలుగునది మొదటి జన్మ. ఉపనయనముచే నేర్పడునది ద్వితీయ జన్మ, సన్యాసము మూడవ జన్మ.
- భగవన్నామ ముచ్ఛరించువారే పావనులు. హృదయమున భక్తిలేని వాడికి తీర్థయాత్రల వలననేమి ప్రయోజనము.



బ్రహ్మసాక్షాత్కార మునకు భగవన్నామమే చాలునని, ఒక ధర్మబోధకుడు పలుకగ, శ్రీ గురుదేవుడిట్లు వచించెను. నిజమే భగవానుని దివ్యనామము అఖండ శక్తిమంతము, సందియము లేదు. కాని భక్తిలేనిదే అది చాలునా? భగవంతుని కొరకు పరితపింపవలయును. భగవానుని వేడుకొనుచు సదా వాని నామస్మరణ చేయుచుండవల యును. భగవద్భక్తి పరాయణులగువారు, ప్రతి శ్వాసతోడను భగవన్నామమును ఉచ్ఛరింతురు.

- ప్రశాంతమైన యొకతావును గూరుచుడి, మౌనముగా భగవన్నామ మును స్మరించుచుండుటయే జపమనబడును. చేతులను చరచుచు ఉదయము, సాయంకాలము హరి నామ సంకీర్తన చేయుడు. మీ పాపములను, మీ బాధలను అన్నియు మిమ్ములను విడిచి పలాయనమగును. చప్పట్లు గొట్టుచు హరినామ సంకీర్తన చేయుచున్న యెడల మీ పాపములు పలాయనమగును.
- కలియుగమున హరినామ సంకీర్తనము కంటె తరుణోపాయము ముమ్మాటికి మరియొకటి లేదనియు, సదా హరి నామము చేయు చుండుమనియు శ్రీ చైతన్యస్వామి తరచుగా బోధించేవాడు.
- శ్రీకృష్ణ సంకీర్తనము వలన, హృదయమను అద్దము శుభ్రమై, చిత్తము నందలి సమస్త కళంకములును తొలగును. మనల ఎల్లప్పుడు దహించుచున్న విషయవాసనలు నశించును. చంద్రకిరణములచే కలువలు వికసించు చందమున శ్రీకృష్ణ సంకీర్తనము వలన హృదయము వికసించును.
- దుర్లభమగు మానవజన్మ ఎత్తియు, ఈ జన్మముననే భగవంతుని, తెలిసికొనడానికి ప్రయత్నింపనివాని జీవితము నిరర్థకము. మొదట ఆత్మ లాభమును పొందుము. తరువాత ధనమును సంపాదింపుము. ఈ వరుసను తలక్రిందులు

చేయయత్నింపకుము. పరమార్థమును బొందిన వెనుక, సంసారమున మెలగినను నీ మనశ్శాంతికి భంగము కలుగబోదు.

- సచ్చిదానందమయుని ధ్యానింపుము. నీకు బ్రహ్మానందము లభించును. బ్రహ్మానందమే నిత్యమైనది. అయినను అజ్ఞానము దానిని గప్పిపుచ్చుచున్నది. విషయములందు రాగము తగ్గినకొలదియు, ఈశ్వరానురక్తి నీయందు వృద్ధియగుచుండును. చమురు లేనిదే దీపము వెలగని రీతిని, నారాయణుడు లేనిదే నరుడు జీవింపజాలడు.
- పక్షి ఎగిరిపోయిన తరువాత పంజరమును ఎవరు రక్షింపరు. ప్రాణ మనెడి పక్షి ఎగిరిపోయిన పిమ్మట మిగిలియున్న కళేబరము ఎవ్వరికిని అక్కరలేదు.
- మాయాబద్ధమగు ఆత్మయే జీవుడు. బంధముక్తమగు ఆత్మయే ఈశ్వరుడు. దైవభక్తి లేకపోవుటయే మానవుని యపరిమిత బాధలన్నిటికిని కారణము. కావున నరుడు అవసానకాలమున నారాయణ స్మరణకు తోడ్పడునట్టి సాధన చేయవలయును. అదియే భక్తిసాధన. జీవితకాలమున అటువంటి సాధన చేసిన యెడల, అవసాన కాలమున భగవంతుడు తప్పక తలపునకు వచ్చును. సరిగ అవసాన కాలమున నరుడేమి చింతించుచుండునో దానినను సరించియే వానికి ముందు జన్మ కలుగుచుండును.
- నీరు ఒక్కటే అయినను దానిని జనులు వేర్వేరు పేర్లతో పిలుచుచుందురు. అట్లే సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమొక్కటే అయినను, కొందరు దానిని దేవుడనియు, కొందరు అల్లాయనియు, కొందరు హరియనియు, మరికొందరు బ్రహ్మమనియు సంభోధింతురు. కుమ్మరి ఒకే మట్టితో అనేక రకములైన కుండలను చేయును. అటులనే భగవంతుడొక్కడే, వివిధ దేశములలో వివిధ నామములతో పిలువబడు



చున్నాడు. వివిధ రూపములతో పూజింప బడుచున్నాడు.

- ధ్యానము, నామస్మరణము, సంకీర్తన, ప్రార్థన, దానము, ధర్మము, యజ్ఞము, యాగాచరణము మొదలగు సత్కార్యములు భగవత్ప్రాప్తిని కలుగజేయును.
- పరమపావనమైన భగవన్నామముయొక్క ప్రభావమున, సంపూర్ణ విశ్వాసముయున్న యెడల, నిరంతర నామస్మరణమున మనస్సు రమించునెడల, అట్టివారికి మరి యే ఇతర సాధనగాని, విచారణ గాని అనావశ్యకము, అపుడు సర్వసంశయములును సమసిపోవును. మనస్సు నిర్మల మగును. పావన నామ ప్రభావమున, భగవానుడే స్వయముగ వానికి సాక్షాత్కరించును.
- వేదములును, పురాణములును పఠింపదగినవి, వినదగినవి. హరి నామమును నోరారా పలుకవలయును. చెవులారా వినవలయును, భవరోగ నివారణకై భగవత్కథలను, భవన్నామమును, శ్రవణమును, కీర్తనయును గూడ చేయవలయును.
- ధనము కొరకు లోభి పరితపించునట్లు - భగవానుని కోసము పరితపింపుము.
- నీటిలో మునిగిపోవువాడు ఊపిరాడక పరితపించునట్లు, భగవంతుని కోసము పరితపింపవలయును. అపుడు భగవంతుని దర్శనము లభించును.
- నీవెంతగా ప్రయత్నించినను భగవదనుగ్రహము లేనిదే ఏమియు లభింపదు. వాని కృపలేనిదే నీవు వాని సాక్షాత్కారమును పొందజాలవు. కాని భగవత్కృప సులభముగ చేజిక్కునది కాదు. హృదయము నుండి అహంకారమును నిర్మూలనము చేయవలయును. నేను కర్తను అను అహంకారము ఏ మాత్రమున్నను, నీవు భగవంతుని గనజాలవు. తనకు

ఎపుడు కృపగలుగునో అపుడే భగవంతుడు సాక్షాత్కరించును.

- శ్రవణము, మననము, నిధి ధ్యానము :- బ్రహ్మయే సత్యము ప్రపంచము అసత్యమని మొదట వినవలయును. పిమ్మట మననము చేయవలయును. తరువాత దానిని గూర్చి ధ్యానము, అనగా మనస్సును, అసత్యమగు ప్రపంచము నుండి మరల్చి సత్యమగు బ్రహ్మముపై నిలుపవలయును. ఇదే వేదాంత విచారణక్రమము.
- నామజపములను చేయుట, ఏకాదశ్యాది పుణ్యతిథులందు ఉపవాస ముండుట, తీర్థయాత్రాదులు చేయుట, శాస్త్రోక్తమైన పూజాద్రవ్య ములతో భగవంతుని అర్చించుట ఇట్టి నియమ ములన్నియు దైవభక్తి లక్షణములు. చాలాకాలమిట్లు సాధన చేసిన యెడల ఉత్తమమగు రాగభక్తి లభించును. ఐహిక వాంఛలు పూర్తిగా నశించి, మనస్సు సంపూర్ణముగా భగ వంతునిపై నిలుపవలయును. అప్పుడే మనము భగవంతుని పొందగలము. రాగభక్తిలేనిదే ఎవ్వరును భగవంతుని అను గ్రహమును పొందలేరు.
- బొమ్మల కొరకై పోరుపెట్టి ఏడ్చుచు, తల్లిని వేధించుబిడ్డవలె, ఎవడు భగవంతుడే తనకు సర్వస్వమని గ్రహించి, అతనికై పసిపాపవలె వెక్కి వెక్కి ఏడ్చునో అట్టివానికి చివరకు భగవంతుడు సాక్షాత్కరించి తీరును.
- హృదయాకాశనమున కోరికలనెడు గాలి దుమారములు చెలరేగి వీచుచున్నంత వరకు అందు పరమేశ్వరుని దివ్య కాంతులను చూచుట దుర్లభము. ప్రశాంతమైన దైవచింత నతో గూడిన హృదయమునకే దివ్యానందము యొక్క అనుభూతి కలుగును.
- పుట్టుట కాదు గొప్ప, పుణ్యం సంపాదించాలి. పునీతుడు కావాలి. చీమలు, దోమలు, చెదపురుగులు పుట్టుచున్నవి, గిట్టుచున్నవి. మానవులు కూడా ఆ జాబితాలోనికిపోరాదు.



మానవజన్మ ఉన్నతజన్మ. శ్రేష్ఠమైన తనను సృష్టించిన సృష్టికర్తను తెలుసుకొని, తిరిగి జన్మలేని కైవల్య ప్రాప్తినొందు టకే మానవజన్మ వచ్చినదని గ్రహించి, గమనించి, అట్టి జన్మరాహిత్యమునకు సంపూర్ణ దుఃఖరాహిత్యమునకు కావలసిన భక్తి, జ్ఞాన సాధనాది ఏర్పాట్లు చేసుకొని, పునీతుల మగుదుము గాక. అట్టి శక్తి, భక్తి భగవానుని అనుగ్రహించ మని ప్రార్థించవలయును.

- వడ్ల గింజలను నేరుగా భుజించుటకు వీలుపడదు. అలాగు ననే, రజోగుణ, తమో గుణములతో కూడిన మలిన మనస్సు భగవానుని దర్శించవలెనన్న మొదట పుణ్య కర్మాచరణ ద్వారా, జ్ఞానుల సాంగత్యము ద్వారా పరిశుద్ధతను పొంద వలెను. నిర్మలమయిన మనస్సునందే భగవానుడు గోచరించును.
- ఏ మతమువారైనను, తమ తమ మతమందు తెలుపబడిన బోధనలను చక్కగా ఆచరించిన భగవంతుని చేరగలరు. శ్రద్ధయే అన్నిటికి మూలము.
- చాలాకాలము నుండి నమ్మకముతో పనిచేయుచున్న సేవకు నకు యజమాని ఎంతయో సంతోషించి ఉన్నత పదవిని ఒసంగి, అతనిని ఆనందింపజేయును. అలాగుననే బహు కాలము భక్తిశ్రద్ధలతో దైవారాధన గావించు భక్తునకు భగవానుడు ఆత్మజ్ఞానమును, మోక్షమును అనుగ్రహించును.
- రాతి మీద నడచినచో అడుగులు పడవు. కాని బురద మట్టిపై నడచినచో అడుగులు స్పష్టముగా పడును. అదే రీతిగా బుద్ధమనస్సు జ్ఞానమును గ్రహింపలేదు. కాని భక్తుని యొక్క పరిశుద్ధమైన మనస్సు జ్ఞానమును చక్కగా గ్రహించును.
- మొసలి యొక్క వీపు చాల కఠినముగ, దట్టముగ ఉండును. అందువలన బాణము యొక్క దెబ్బ తగులదు. అదే విధముగ కఠిన మనస్సుగలవారికి, దైవ విషయములు చెప్పినను వారిలో ఏ మార్పు కలుగనేరదు. కాని మృదు స్వభావము,

నిర్మల మనస్సుగలవారు, కొంచెము బోధవిన్నను గొప్ప ప్రయోజనము పొందెదరు. కాబట్టి జనులు మృదు స్వభావ మును అలవరచుకొనవలెను.

- పేలాలను వేయించునపుడు బాగుగా వేగినగింజ పేనము నుండి వెలుపలకు వచ్చిపడును. కాని కొంచెము మాత్రము వేయింపబడిన గింజ పేనమునందే యుండును. అదే విధముగనే జ్ఞానాగ్నిచే పరిశుద్ధమైన మనస్సుగల జీవుడు ముక్తినొందును. కాని యింకను పరిశుద్ధముగాని మనస్సు గలవారు జ్ఞానమును సంపాదించి ముక్తికై యత్నించు చుందురు.
- మాలిన్యము గల గదిలో నివశించువాని శరీరము కూడా మలినము గనే యుండును. అదే రీతిగనే దుర్మార్గుల సహవా సము చేసినచో, మనుజునకు దుష్ట స్వభావము కలుగును. కావున జనులు దుర్మార్గమును వీడి, సత్సాంగత్య మునే అవలంభించుచు, చిత్తశుద్ధిని బడసి, జన్మను చరితార్థ మొనర్చుకొనవలెను. భౌతిక ధనముగాని, బంధువులు గాని, పేరు ప్రతిష్టలు గాని మరణ సమయమున జీవుని రక్షించ లేవు. కావున మానవులు సర్వలోక రక్షకుడైన భగవంతుని ఎల్లవేళలా స్మరించుచు దృశ్యమందాసక్తిని వదలి వేసి ఈ జీవితము నందే పరమసుఖమును అనుభవించ వలెను.
- పేడపురుగు మలిన పదార్థములందే తిరుగాడుటకు యిష్ట పడును గాని పరిశుభ్ర వాతావరణములో ఇష్టపడదు. అదే విధముగా విషయాసక్తులగువారు దృశ్యవస్తు సంపాదన యందే కాలమును గడుపుదురు గాని సత్య విషయమును తెలుసుకొనటకు ప్రయత్నించరు. అట్లు గాక వివేకవంతుడైన వాడు దృశ్యము నాశవంతమైనదని, దుఃఖ పూరితమైనదని తెలుసుకొని శాశ్వతమగు పరమాత్మ ప్రాప్తి కొరకు కృషి సలిపి సఫలీకృతుడు కావలెను.



- కమ్మరివాడు కొలిమిలో నిప్పు ఆరిపోకుండ తిత్తుల ద్వారా గాలిని ఎల్లప్పుడు పంపుచు జాగ్రత్తపడుచుండును. అదే విధముగనే మానవుడు తన మనస్సును, అజ్ఞానాంధ కారము నందు మునగనివ్వక బ్రహ్మజ్ఞానుల యొక్క బోధలను గ్రహించి ఆచరించుచు జ్ఞాన ప్రకాశమందు ప్రవేశపెట్టవలెను. అట్లు చేయుట వలన మనస్సు పరిశుద్ధతను పొందును. అపుడు మానవుడు శాశ్వతానందమును అనుభవించును.
- కొద్దికాలము నీటి వెలుపల వున్న చేపను నీటిలో వదలినచో దాని మనస్సు ఎంతయో శాంతిని ఆనందమును అనుభ వించును. అదేరీతిగా ప్రపంచ వ్యవహారమందు ఉన్నవారు ఆనంద సాగరుడగు భగవంతుని యందు ప్రవేశించినచో, వారు అనుభవించు ఆనందమునకు పరిమితియే ఉండదు.
- ఆత్మజ్ఞానమును పొంది, సత్యవస్తువును తెలుసుకొనినవారే నిజమైన మానవులు. తక్కినవారు కేవలము మానవా కారము కలిగియున్న వారేయగుదురు. కావున ఆత్మ సాక్షాత్కారమును పొందుటయే మానవ జీవితము యొక్క పరమ లక్ష్యము.
- అమృతమును త్రాగినవాడు ఆనంద భరితుడైయుండునట్లు, భక్తుడు జ్ఞానామృతమును బడసినపుడు అనంతానందముతో నిమగ్నుడై యుండును. అపుడతనికి దృశ్యభావమేమియు గోచరించదు. సర్వత్ర తన ఆత్మయే అని అనుభూతమగు చుండును. తోటి ప్రాణుల యెడల ప్రేమ, దయ, ఉపకార స్వభావము కలిగియుండును.
- రామా, కృష్ణా అను పలుకుచుండు చిలుక, పిల్లిచే పట్టుబడి నపుడు, కా కా అని దీనముగా అరచుచు భగవన్నామమును ఉచ్ఛరించుటను మరచిపోవును. అట్లే తమ అభీష్టముల నెరవేరుటకు గాని, కొందరు జనులు పుణ్య కార్యములను ఆచరించుచుందురు. ఏమైన దుఃఖములు గాని, కష్టములు

గాని సంభవించినపుడు ఆ పుణ్య కార్యములను వదలివేసి దీనత్వమును వహింతురు.

- జనులు తాము జనకునివలె వ్యవహారము సలుపుచున్నామని పలుకు చుందురు. కాని జనకుడు ఎంతయో సాధన చేసి అసూయా, ద్వేషములను నిర్మూలించి, ఆత్మజ్ఞానమును బడసిన మహనీయుడు. సాధన ఏమియు చేయక ఆత్మ సాక్షాత్కారము నొందక; తాను జనకుని వంటివాడను అనుకొనుట హాస్యాస్పదమే కాగలదు.
- ఉప్పుబొమ్మ, గుడ్డబొమ్మ, రాతిబొమ్మ అను మూడు రకముల బొమ్మలను నీటిలో వేసి పరీక్షించుచుండుము. ఉప్పుబొమ్మ కరిగి పోవును. గుడ్డబొమ్మ నీటిని పీల్చుకొనియుండును. రాతిబొమ్మ ఏ మార్పులేకయుండును. అలాగుననే ఒకడు తన ఆత్మను పరమాత్మలో లీనము గావించును. ఇంకొకడు దైవానుగ్రహముచే పరమాత్మ జ్ఞానమును, సంపూర్ణముగ కలిగియుండును. మరొకడు పరమాత్మ జ్ఞానము గాని దైవచింతన గాని లేశమైనను కలిగియుండడు.
- సేవకుడు తన యజమాని యొక్క గృహమున స్వంత గృహముగ భావించి దానిని పరిశుభ్రముగా ఉంచును. యజమాని యొక్క పిల్లవానిని, తన వానినిగా భావించి, వాని ఆలనా పాలనా గావించు చుండును. అదే విధముగా జ్ఞాని విశ్వమంతటిని ఆత్మమయముగ, సర్వప్రాణులను ఆత్మ స్వరూపులుగ కరుణ కలిగి వ్యవహరించు చుండును.
- భగవంతుడు మాయాధీసుడై, జీవులను వారి చర్యలను సాక్షిగ గమనించుచున్నాడు. మాయకు లోబడిన జీవుడు భగవానుని దర్శించలేకపోవుచున్నాడు. దైవానుగ్రహముచే ప్రయత్న పూర్వకముగ మనస్సును శుద్ధము చేసుకొన్నచో భగవత్సాక్షాత్కారము కలుగును.
- తరించుటకు ఆటంకములు లేని స్థలమందుగాని, ఏకాంత



మందు గాని అంతరంగమందుగాని మనుజుడు భగవ ధ్యానము చేయవలెను.

- భగవంతుని పొందుటకు భక్తిమార్గము చాల సులభమైనది. ఈ మార్గమందు భక్తుడు తనను పూర్తిగ భగవంతునకు అర్పించుకొని దైవచింతన చేయుచు దైవసాన్నిధ్యము పొంది పరమశాంతిని అనుభవించును.
- దైవప్రాప్తిని, ఆత్మానుభూతిని అభిలషించువాడు దృశ్య వస్తువుల యెడల విరక్తి కలిగి దైవ ప్రార్థనను చేయుచుండ వలెను. వైరాగ్యము బాగుగా కలిగిన పిదప మహాత్ముల సాంగత్యమును అవలంభించ వలెను. అచట మహాత్ముల బోధలను ఆలకించుచు, శ్రద్ధతో, భక్తితో, శమదమాది సాధనలను ఆచరించవలెను. ఇట్లు అభ్యాసము చేయుచు రాగా, అతని మనస్సు నిర్మలమగును. అపుడు దైవానుగ్రహము వలన అతడు భగవత్సాక్షాత్కారమును బడసి, అమితానంద మును అనుభవించును. దృశ్యభావము తొలగనిదే దైవభావము ఎన్నటికి కలుగనేరదు.
- ఒక గృహమందు కోడలు అత్తమామలను మరియు ఇతరు లను ఆదరించుచు ప్రేమించుచున్నప్పటికిని తన భర్తయందు విశేష ప్రేమాను రాగములను కలిగియుండును. ఆ ప్రకారము గనే భక్తుడు తన ఇష్టదైవమందు మిక్కుటముగ భక్తి ప్రేమ విశ్వాసము కలిగియున్నను ఇతర దేవతలయందు ద్వేషము కలిగియుండక దేవతలందరు ఒకే దైవము యొక్క వివిధ రూపములేయని భావించి గౌరవించవలయును.
- కోరికలచే ఈడ్వబడు మనస్సు భగవధ్యానమందు ఏకాగ్రతను పొందలేదు. కాబట్టి కోరికలను విడనాడి, శాంత మనస్కుడై దైవచింతన చేయవలెను.
- మలిన జలముగల గుంటయందే పాచి పెరుగును. నిర్మలజలముగల తటాకమునందు పాచి పెరగజాలదు. అదే

విధముగ సంకుచిత మనస్సుగల వానియందే స్వార్థబుద్ధి, ఈర్ష్య ద్వేషాదులు కలుగు చుండును. సత్ప్రవర్తన, విశాల హృదయముగల వానియందు దుర్గుణములు ఏ మాత్రము ఉండనేరవు. అతడు తోటి ప్రాణుల యెడల ప్రేమ దయ, సహనము కలిగియుండును. సద్గుణములు సచ్ఛీలము కలిగి దైవధ్యానాదులు నాచరించువాడు శీఘ్రముననే భగవంతుని పొంది అమితానందమును అనుభవించును.

- సత్యాన్వేషియగు మనుజుడు, సత్యజ్ఞానమును బడసిన మహాత్ములను ఆశ్రయించవలెను. అంతియే కాని సాధన చేయక, కేవలము పుస్తక జ్ఞానము కలిగినవారిని ఆశ్రయించి నచో పెద్ద ప్రయోజనము కలుగదు. కనుక ముక్షువు ఆత్మజ్ఞాన మును సంపాదించిన మహనీయులను శరణుపొంది వారు చేయు బోధలను శ్రద్ధగ ఆలకించవలెను. వీరిద్వారా బ్రహ్మ సత్యము, జగత్తు, మిధ్య, జీవుడే బ్రహ్మము అను తత్త్వమును బాగుగా తెలుసుకొని, మిధ్యాజగత్తునందు అనాసక్తిని సత్యస్తు వగు బ్రహ్మమందు ఆసక్తి గలిగి దైవధ్యా నాదులను గావించ వలెను. అభ్యాస వశమున, అతడు కొలదికాలము లోనే సత్య స్వరూపుడగు భగవంతుని అనుభవమును పొందగలడు.
- నరుడు తన అహంకారమును పోగొట్టుకొని, నారాయణుని యందు, భగవంతుని యందు ఐక్యము కావలసియున్నది. కేవలము నోటి మాటలతో అహంకారము తొలగనేరదు. తాను భగవంతుని సేవకుడను అని గాని, దేహము కంటే వేరైన ఆత్మ స్వరూపుడను అనిగాని భావించువాడు శీఘ్రముగ దేహభావమును తొలగించుకొని పరబ్రహ్మమునందు ఐక్యమై పరమానందమును అనుభవించును.
- అనేక సంవత్సరముల నుండి చీకటిగ ఉన్న గదియందు ఒక చిన్న దీపమును తీసుకొని వచ్చినచో, ఆ అంధకార మంతయు అదృశ్య మగును. అటులనే, వేలకొలది జన్మల



యందు జీవునియందున్నటు వంటి అజ్ఞానాంధ కారము భగవదనుగ్రహకిరణముచే పటాపంచల మగును.

- మేఘములు అడ్డుగా ఉన్నపుడు జనులు సూర్యప్రకాశమును దర్శింప లేరు. మధ్యలో వున్న మేఘములు గాలిచే తొలగింప బడినచో, మనుజులు సూర్యుని దర్శింపగలరు. అదే విధ ముగా అజ్ఞానము, అవిద్య దుర్గుణములు మనస్సులో ఉన్నంతవరకు మానవుడు దైవదర్శనమును, దైవానుభూతిని బడయలేడు. ప్రయత్నపూర్వకముగ పుణ్య సంపాదన గావించి, దుష్ట స్వభావమును, దుర్గుణములను నిర్మూలించుకొనినచో అతని మనస్సు నిర్మలమగును. నిర్మల మనస్సు నందు భగవ త్కృపచే గురుకృపచే జ్ఞానోదయమగును. జ్ఞాన ప్రకాశము వలన, అజ్ఞానంధకారము నశించిపోవుటచే మనుజుడు భగవదనుభూతిని బడసి జీవన్ముక్తుడై విరాజిల్లును.
- రాజు తన సేవకుని గృహమునకు పోదలంచినపుడు తనకు కావలసిన సౌకర్యములన్నిటిని రాజు ముందుగనే సేవకుని యింటి యందు ఏర్పాటు చేయును. ఆ ప్రకారముగనే భగ వానుడు దర్శన మొసంగుటకు పూర్వమే ప్రేమ, దయ, భక్తి, విశ్వాసము మొదలగు దైవీసంపదను భక్తునకు అనుగ్రహిం చును.
- జీవన్ముక్తుడు తాను భగవంతుని చేతిలో ఒక పరికరముగ భావించి, నిమిత్తమాత్రుడుగా కర్మలు చేయుచుండును. మాయాబంధమున చిక్కుకొనినవాడు కర్తృత్వ బుద్ధిగలిగి కర్మలనాచరించుచుండును. అందువలన అతడు ఆయా కర్మఫలములను అనుభవించును. కాని జ్ఞానులు దేహాభి మానమును కర్తృత్వాభిమానమును నిర్మూలించుకొని యుండుటవలనను, కర్మఫలాసక్తి లేకుండుట వలనను, లోక వ్యవహారములచే వారు బంధింపబడక శాంతిని అనుభ వించుచునే యుందురు.

◆ లౌకికులు దృశ్యవస్తు సంపాదనయందే తమ కాలమును గడుపు చుందురు. కొందరు సంతానములేదని మరికొందరు సంపదలు లేవని చింతించుచుందురు. కాని వివేకము గలవాడు దృశ్యవస్తువులు అశాశ్వతములని ప్రాపంచిక సుఖములు క్షణికములని తెలుసుకొని శాశ్వత పరమాత్మ కొరకై కృషి సలుపుచుండును. భగవంతుని కొరకై తీవ్ర పరితాపమును, ఆసక్తిగలవాడు శీఘ్రముగ దైవసాక్షాత్కార మును పొంది శాశ్వత ఆనందమును అనుభవించును.

◆ కుమ్మరివాడు ఒకే మట్టితో కుండలు, మూకుళ్ళు మొదలగు అనేక రకముల వస్తువులను తయారుచేయును. అదే రీతిగ భగవానుడు చరాచర ప్రాణికోట్లుగను, స్థావర జంగను పదార్థములుగను వ్యక్తమై యున్నారు. సృష్టియందు మనుజునకు భిన్నత్వము కనిపించినను, వాస్తవముగ ఏకత్వము కలదనియే ఎరుగవలెను. బహిర్ముఖముగ ప్రవర్తించు ఇంద్రియములను, అంతర్ముఖముగ ఒనర్చి, నిశ్చల మనస్సుతో దైవ ధ్యానము, విచారణాదులను చేయుచుండ వలెను. ఒక్క భగవంతుడే ఆత్మయే సర్వత్ర వ్యాపించి యున్నట్లు, అనుభవ మును బడయగలడు.

◆ అద్వైత జ్ఞానమును సంపాదించుటయే ప్రతివాని యొక్క చరమ లక్ష్యము. మొదట మనుజుడు వివేకముతో ఆలో చించి, ఇంద్రియ నిగ్రహమును, వైరాగ్యమును అభ్యసించ వలెను. మహాత్ములను ఆశ్రయించి వారు బోధించిన రీతి, భక్తి శ్రద్ధలతో ధ్యానాది అనుష్ఠానమును దైవసేవను, ఆచరించినచో శీఘ్రకాలముననే అతడు అద్వైత జ్ఞానము, పరమాత్మ జ్ఞానమును బడసి, దైవమందు ఐక్యము కాగలడు.

◆ పెడమార్గమున పోవు కుమారుని తండ్రి బాధ్యత వహించి, అతనిని సన్మార్గమున నడిపించును. ఆలాగుననే అజ్ఞాన మార్గమున, అధర్మమార్గమున, ప్రవర్తించుచు నానా బాధలు



నొందుచున్న జనులను చూసి మహాత్ములు, దయా హృదయ ముకలవారై సద్బోధలను గావించి వారిని ధర్మమార్గ మున నడుచునట్లు చేయుదురు. కనుక జనులు మహాత్ముల ప్రబోధము నాలకించి శ్రద్ధాభక్తులతో ధ్యానాదు లను ఆచ రించి దుఃఖరాహిత్యమును ఆనంద ప్రాప్తిని బడయవలెను.

◆ దీపము యొక్క కాంతి ఎంతయో దూరము వరకు ప్రసరిం చును. కాని దాని అడుగున మాత్రము చీకటి ఉండును. జ్ఞానుల సాంగత్యమున ఉన్న కొందరు వారి యదార్థ స్వభావమును గ్రహించ లేరు. కాని దూరమున ఉన్నప్పటికిని కొందరు జ్ఞానుల మహిమను తెలుసుకొన గలుగుదురు.

◆ పంచాంగమందు కుంభవృష్టి కురుయునని వ్రాయబడి యున్నది. పుస్తకమును నలిపినచో, ఒక్క బొట్టు నీరు కూడ రాలదు. అటులనే ఆధ్యాత్మిక శాస్త్రములను ఊరక పఠించు చున్నచో, ఆత్మానందము లభించదు. అందు చెప్పబడిన రీతి అనుష్టించినచో మాత్రమే దైవ సాక్షాత్కారము కలిగి పరమానందమును అనుభవించగలరు.

◆ ముముక్షువు నిరంతరము మహాత్ముల సాంగత్యమును భగవద్భక్తుల సహవాసమును చేయవలెను. దుస్సహవాసము చేయరాదు. దైవ ప్రార్థనలందు నామ సంకీర్తనలందు ఆధ్యాత్మిక సమావేశములందు పాల్గొనుచు, అతడు భగవద్భక్తి శ్రద్ధలను పెంపొందించుకొనవలెను. జ్ఞానుల సాంగత్య మందు, సాధకుని హృదయములో మంచి మార్పు కలుగు చుండును కనుక మానవుడు సత్సాంగత్యమును భగవదారా ధనను, ధ్యానాదులను గావించుచు, ఈ జన్మయందే దైవ సాక్షాత్కారమును బడసి, మోక్షమును, పరమానందమును అనుభవించవలెను.

◆ ఒక కొంగ నీటిలో చేపలను పట్టుకొనుటకు నెమ్మదిగా ముందుకు నడుచుచుండెను. దాని వెనుక ఒక వేటగాడు

కొంగకు గురిపెట్టు చుండెను. ఈ విషయము తెలియక కొంగ చేపమీదనే దృష్టిని నిలిపి ముందుకు పోవుచుండెను. అవధూత అది గమనించి కొంగను తన గురువుగా స్వీకరించెను. దైవ ధ్యానముచేయునపుడు ఇతర లోక వ్యవహారము లన్నిటిని పూర్తిగ విస్మరించి మనస్సును భగవంతుని చింతించుటయందే లగ్నము చేయవలెను.

- చెల్లాచెదురుగ పడిపోయిన నువ్వుల విత్తనములను ఒక చోట ఏరికూర్చుట చాలా కష్టము గదా. ఆ ప్రకారముగనే అనేక ప్రాపంచిక విషయములందు ఆసక్తమైయున్న మనస్సును ఏకాగ్రపరచి భగవంతునియందు లగ్నము చేయుట కూడ కష్టసాధ్యమైన విషయము. కాన అభ్యాసము చేతను వైరాగ్యము చేతను మనస్సు తన చంచల స్వభావము వీడి పరమాత్మ ధ్యానమందు నిలకడను పొందును.
- భగవంతుని ఎలుగెత్తి అయినను, మౌనముగ అయినను, ఎటులైనను ప్రార్థించవచ్చును కాని ప్రార్థన చేయునపుడు అత్యంత భక్తిశ్రద్ధలు కలిగి హృదయపూర్వకముగ చేయ వలెను. చీమ నడక వలన కలుగు శబ్దమును కూడ భగవానుడు వినగలడు.
- ఈ శరీరము మాంసము, రక్తము ఎముకలచే నిర్మింప బడినదని, అశాశ్వతమని బాగుగా తెలుసుకొనియున్నచో, మనుజునకు తన దేహమునందు ఆసక్తి తొలగిపోవుచున్నది. దేహ, అహంభావము తొలగినచో నరుడు నారాయణుడుగా మారిపోవును.
- భగవద్భక్తుడు కాగోరినవాడు ప్రత్యేకమైన దుస్తులు ధరించ వలసిన పనిలేదు. సన్యాసి వేషము వేసి, కమండలము ధరించి నంత మాత్రముచే భక్తులు కాగలరనుట సరికాదు. భక్తికి హృదయ పవిత్రత, సదాచారము, ప్రధానము, కరుణగల హృదయమందే భగవానుడు నివసించును.



- సూర్యోదయము కాబోవుచున్నపుడు తూర్పువైపున అంధ కారము క్షీణించుచు ప్రకాశము గోచరించుచుండును. అటులనే భగవత్సాక్షాత్కారము కలుగుటకు, ముందు భక్తుని హృదయమందు అజ్ఞానంధకారము నశించిపోయి శుద్ధ, సత్వగుణము ప్రకాశించు చుండును. అతని హృదయమున పరోపకార స్వభావము, పరిశుద్ధత, జ్ఞానము వెల్లివిరియు చుండును.
- తేమ తగిలిన కట్టెలను అగ్నియందు ఉంచినపుడు వాటి యందలి తేమ ఆరిపోయి బాగుగా మండును. ఆలాగుననే మహాత్ముల సాన్నిధ్య మహిమచే జనులయందలి అజ్ఞానము మాయమైపోయినపుడు, వారు సజ్జనులుగా మారిపోవుదురు.
- బీదవాడు ధనమును గూర్చియే ఎల్లప్పుడు చింతించు చుండును. అదే విధముగ ముముక్షువు నిరంతరము దైవచింతనను, దైవ ధ్యానాదులను సలుపవలెను. అనన్య భగవచ్చింతన చేయువాడు, శీఘ్రముగ దైవసాక్షాత్కారమును పొంది అమితానందమును బడయును.
- ఆధ్యాత్మిక పురోభివృద్ధిని కోరువారు, మహాత్ముల యొక్క భగవద్భక్తుల యొక్కసాంగత్యమును సంపాదించవలెను. మరణకాలమునందు మనస్సులోగల ఆలోచనలు బట్టియే పునర్జన్మ కలుగుచుండును. ఆత్మజ్ఞానమును బడసినచో ఇక జన్మయేయుండదు (జన్మ రాహిత్యము సిద్ధించును). కావున ఈ జన్మయందే మనస్సును శుద్ధపరచుకొని ఆత్మజ్ఞానమును బడసి జనులు జన్మరాహిత్యమును బడయవలెను.
- భగవత్ప్రాప్తికై సాధనగావించువాడు. దేహము యొక్క, ఆరోగ్యమును నిర్లక్ష్యము చేయరాదు. మితమైన, హితమైన, సాత్వికమైన ఆహారమును తీసుకొనుచు శరీరమును ఆరోగ్య ముగ ఉంచుకొన వలయును. ఆహారమును అధికముగ భుజించినచో శరీరము బరువగుటవలన, సాధకుడు ధ్యాన

మందు తమస్సులోనికి, నిద్రలోనికి జారిపోవు అవకాశము కలదు. అసలు ఆహారమేమియు స్వీకరించ నిచో, శరీరము దుర్బలమై, మనస్సు దైవధ్యానము చేయలేక, నీరసించి పోవును. కనుక సాత్విక, మిత ఆహారమును గైకొనుచు, ముముక్షువు ధ్యానాదులను సలిపి దైవసాక్షాత్కా రమును పొంది పరమానందమును అనుభవించవలెను.

- కొందరు సంగీత విద్వాంసులు చేతులతో వీణ మొదలగు వానిని వాయించుచు నోటితో పాటలు పాడుచుందురు. అదే విధముగ జనులు చేతులతో పనులు చేయుచున్నను హృదయమందు భగవంతుని ధ్యానించుచుండవలెను.
- వేశ్య యింటి పనులు చేయునప్పుడు మనస్సునందు విటుల రాకను కోరుచుండును. అటులనే మనుష్యుడు కూడ లోక వ్యవహారములను గావించుచున్నప్పటికిని భగవత్ప్రాప్తి యందే లక్ష్యముంచవలెను.
- ధనవంతుల గృహములందుండు సేవకులు యజమాని పిల్లలను తమ పిల్లలుగా భావించి వారిని ఆడించు చుందురు. కాని సేవకులకు ఆ పిల్లలు తమ వారుకాదని బాగుగా తెలియును. అట్లే గృహస్థుడు తమ పిల్లలకు నిజమైన సంరక్షకుడు భగవంతుడని వారిని పోషించుటయందు తాను నిమిత్తమాత్రుడనేయని భావించవలెను.
- జనన మరణ చక్రమున సంసార చక్రమున తగుల్కొని బాధపడు చున్న జీవుడు దుఃఖవిముక్తికై కృషి సలుపవలెను. విషయ సుఖములను ఎంత అనుభవించినప్పటికిని కోరి కలు, ఆశ వృద్ధియగునే గాని క్షీణించవు అని వివేకముచే విచారించి తెలుసు కొనవలెను. ప్రపంచ సుఖములందు వైరాగ్యము కలిగి జీవన్ముక్తులగు మహనీయులను ఆశ్రయించి సంసార తరుణోపాయమునకు మార్గమును అన్వేషింపవలెను.



- సద్గురు సేవ, దైవసేవ చేయుచు, భగవన్నామ జపము, ధ్యానములను భక్తిశ్రద్ధలతో ఆచరించుచుండిన, అతడు అల్పకాలములోనే జ్ఞానమును పొంది, ఆత్మ సాక్షాత్కారమును బడసి మోక్ష సుఖమును శాశ్వత ఆనందమును అనుభ వించును.
- నిష్కామ కర్మ, భక్తి - జ్ఞానము అనునవి దేవుని పొందుటకు మార్గములు.
- ప్రహ్లాదునివలె హరిని నిరంతరము తీవ్రముగా ప్రార్థించుము. రాధవలె గోవిందునికై విరహబాధను పొందుము. వాల్మీకి మహర్షివలె భక్త తుకారామునివలె, తులసీదాసువలె, నారాయణుని పవిత్ర నామమును నీ పెదవులపై నాట్యమొన రింపుము, అట్లు అనన్య భక్తి కలిగియుండిన సర్వేశ్వరుని నీవు అచిరకాలములోనే చూడగలవు.
- భక్తుడు భగవానుని బిడ్డవంటివాడు. భగవద్భక్తియే భక్తుని రక్షించు చుండును.
- పతివ్రత తన భర్తకు సేవలొనరించుటయందే ప్రీతి కలిగి యుండును. తల్లిదండ్రులు తమ ఒక్కగానొక్క గారాబు బిడ్డనియందే తమ ప్రాణములుంచి వానిని పోషించు చుందురు. పరమలోభి యొక్క మనస్సు, ఎల్లప్పుడు అతని ధనమందే లగ్నమైయుండును. ఆ ప్రకారముగనే భక్తుడు అత్యంత ప్రేమపూర్వకముగ భగవంతుని ఆరాధించవలెను.
- కాయ ఏర్పడునపుడు పువ్వు యొక్క రేకులు వాటంతట అవియే రాలిపోవును. ఆ విధముగనే దైవమునందు భక్తిశ్రద్ధలు మిక్కుటమగు కొలది, మనుజునియందలి దుర్గుణములు వాటంతటవియే మాయమగును. నిర్మల హృదయమందే భగవానుని దర్శనమగును గదా.
- కొందరు స్త్రీలు తమ శిరస్సుపై మూడు లేక నాలుగు నీటి

కుండలను పెట్టుకొని ప్రక్కవారితో ఉల్లాసముగ మాట్లాడుచు నడుచుచుందురు. అయినప్పటికి ఒక్క నీటి చుక్క కూడా క్రిందరాలదు. అలాగుననే సాధకులు లోక వ్యవహార మందున్నను, సన్మార్గమును దైవమార్గ మును వీడక అనుసరించు చుండవలెను.

◆ పాచిగల నీటిగుంటలో చేపలు కనబడవు. కర్రలతో పాచిని తొలగించినచో చేపలు గోచరించును. అదే రీతిగ దుర్గుణములు అజ్ఞాన మాలిన్యము ఉన్నంతవరకు మానవులకు భగవదనుభూతి కలుగదు. పుణ్య సంపాదన వలన సత్సాంగత్యమువలన, దుష్ట స్వభావమును పోగొట్టుకొని, మనస్సును నిర్మలముగ చేసికొనినచో, మనుజుడు దైవానుభూతిని బడసి పరమానందమును అనుభవించగలడు.

◆ ఎండు కొబ్బరికాయ యొక్క పై టెంకకు దెబ్బ తగిలినను లోపలగల కొబ్బరికి దెబ్బ తగలదు. అందు ఎండిన కొబ్బరి టెంక నుండి వేరుపడి యుండును. ఆ రీతిగనే జ్ఞాని తన శరీరము నుండి వేరుపర్చుకొని ఆత్మయందు నిలకడ కలిగియుండును. కావుననే అతని శరీర మునకు కష్టము కలిగినను అతడు తన శాంత స్వభావమును వీడకయే యుండును.

◆ ఒక పిల్లవాడు తన ఆట వస్తువు పోయినదని తల్లికి చెప్పి ఏడ్చును. కాని తల్లి వానిని దగ్గరకు తీసుకొని ప్రేమతో ఓదార్చును. ఆ రీతిగనే కొందరు జనులు తమకున్న దృశ్య పదార్థములు నశించిపోయి నపుడు దిగులు నొందుచుందురు. కాని వారు మహాత్ములను భగవంతుని ఆశ్రయించినచో ఆ మహనీయులు జనుల దుఃఖమును తొలగించి పూర్ణ సుఖమునకు పరిపూర్ణ శాంతికి మార్గమును బోధించెదరు.

◆ భగవానునకు అనేక నామములు, అనేక రూపములు గలవు.



సర్వజీవులందును భగవంతుడు ఆత్మ స్వరూపుడై వెలయుచున్నాడు. జనులు ఏ రూపముతో ధ్యానించినను భగవంతుడు ఆ రూపముననే వారికి సాక్షాత్కరించును.

◆ ప్రపంచమున ఒకడు రాజుగా వుండి రాజ్యపాలన చేయుచుండును. మరొకడు వ్యవసాయమును చేయుచుండును. ఇంకొకడు మత ప్రచారము గావించుచుండును. ఈ రీతిగా భగవానుడే సర్వుల హృదయమందు నివశించును. వారిచేత వివిధ కార్యములను చేయించుచున్నారు. కనుక జనులు స్వధర్మమును నిర్వర్తించు కొనుచు భగవద్భక్తి, విశ్వాసము, నిరహంకారము కలిగి ఆదర్శ జీవితము గడుపవలెను.

◆ త్రిగుణములననుసరించియే మానవుల స్వభావములలో భేదము కలుగుచున్నది. మానవుడు రజోగుణ, తమోగుణముల నుండి విడివడి సత్త్వగుణములను అలవరచుకొనవలెను. కొంతకాలమునకు ఆ సత్త్వగుణము కూడ, లయమైపోయినచో పరమాత్మ, ఒక్కడే శేషించును.

◆ చిన్న పిల్లవాడు ధనమును ఆభరణమును వాంఛింపక తన కిష్టమగు బొమ్మలనే కోరుకొనును. అట్లే భక్తుడు కూడ కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడక, భగవంతుని మాత్రమే అభిలషించును.

◆ భగవద్భక్తుడు మొదట సాకార భగవానుని ధ్యానించును. కొంతకాలము తరువాత అతడు నిరాకార భగవద్ధ్యానమును అభ్యసించును. భగవానుడు సాకారుడు, నిరాకారుడు మరియు రెండిటికిని అతీతుడు. హనుమంతుడు సాకార, నిరాకార బ్రహ్మ సాక్షాత్కారములను బడసెను. శ్రీరామ చంద్రుని సేవకునిగ, అతడు దైవారాధన గావించి, తుదకు సాక్షాత్ దైవముగ మారిపోయెను.

◆ దృశ్యమానమగు ఈ ప్రపంచము భ్రాంతి మాత్రమే అయియున్నది. ఈ ప్రపంచము ఇంద్రియాల వల్ల, మనస్సు వల్ల మాత్రమే ఏర్పడి యున్నది. వాస్తవముగ దీనికి అస్తిత్వము

లేదు. త్రికాలములందును సత్యమైనది ఆత్మ ఒకటియే. అట్టి ఆత్మయే తానని తలంచి, దేహాది దృశ్య పదార్థముల యెడల మమత్వము వీడి జీవుడు బంధ విముక్తి పొందాలి. ఆత్మజ్ఞానమును సంపాదించి, అజ్ఞానమును విడనాడి భ్రాంతి జన్యమగు ఈ జగత్తు యెడల మమత్వమును పోగొట్టుకొని, స్వస్వరూప సాక్షాత్కారముచే పరమానందమును అనుభవించాలి. భ్రాంతి కలిగిన జీవత్వమును విడనాడి, సత్యమగు శివత్వమును పొంది, సచ్చిదానందమగు ఆత్మయందు స్థితి కలిగి దుఃఖరహితుడై పరమానందమును అనుభవించాలి.

- రాయి ఎన్ని రోజులు నీటియందున్నను ఒక్క చుక్క నీరు కూడ దానిలోనికి ప్రవేశింపజాలదు. కాని మట్టి ముద్దకు నీరు తగిలినచో అది కరిగిపోసాగును. ఆలాగుననే దృఢమైన దైవభక్తిగలవాడు ఎన్ని ఆపదలు వచ్చినను చలింపడు కాని దృఢ విశ్వాసము లేనివాడు ఒకింత బాధ కలిగినప్పటికిని అతడు తన సాధనను వదలివేయును. ఎన్ని ఆటంకములు వచ్చినా ధీరులైనవారు భక్తి ప్రపత్తులను విస్మరించరాదు.

- రైలు యింజను అనేక రైలు పెట్టెలను లాగుకొనిపోవు చుండును. అవి పూర్తిగ నింపబడి, అధిక భారము కలిగి యున్నప్పటికిని ఇంజను పెట్టెలను లాగుకొనియే పోవును. ఆ విధముగనే మహాత్ములు తమకు ఎన్ని కష్టములు సంప్రాప్తించినప్పటికిని తమ నాశ్రయించియున్న జనులను దైవ సన్నిధికి తీసుకొనిపోవుటకు ఏ మాత్రము సంశయింపరు.

- దారపుకొన విడిపోగులు లేక ఏకముగ వున్ననే అది సూది రంధ్రము లోనికి ప్రవేశించగలదు. ఒక్క విడిపోగువున్నను దారము సూదిలోనికి పోజాలదు. అదే ప్రకారముగ మనస్సునందు సంకల్పములు కోరికలు లేకుండ పరిశుద్ధముగ వుండిననే అందుజ్ఞానోదయము కలుగును. ఒక్క సంకల్పమున్నను మనుజుడు జ్ఞానసిద్ధిని బడయులేడు. మానవుడు



సత్సంకల్పము ధ్వారా దుస్సంకల్పములను నిర్మూలించుకొని నిస్సంకల్ప స్థితిని బడయువలెను. అదియే దైవసాక్షాత్కారస్థితి.

- దొంగను చూచుచున్నచో వాడు యింటిలోనికి చొరబడలేడు. ఆ విధముగనే మాయను గమనించు చున్నచో అది హృదయములోనికి ప్రవేశించజాలదు.

- ఒకడు పులివేషము వేసి, చిన్నపిల్లవాడగు తన సోదరుని వద్దకు వెళ్ళినచో ఆ పిల్లవాడు నిజము తెలియక భయపడి కేకవేయును. కాని మొదటివాడు ఆ వేషమును తొలగించగనే పిల్లవాని భయ మంతయు పోగా అతడు శాంతినొందును. అటులనే జగుత్తయొక్క మోహరూపమును మాయారూపమును జూసి జనులు దుఃఖము నొందు చున్నారు. కాని జ్ఞానము వలన జగత్తంతయు భగవత్స్వ రూపమే అని అనుభూతమైనపుడు పరమశాంతిని, సుఖమును జనులు అనుభవించుచుందురు.

- భగవానుడు నామరూపములకు అతీతుడు. సత్, చిత్ ఆనందమే భగవంతుని యొక్క స్వరూపము. నామ రూపములు ఆశ్రయించి నచో మానవుడు దుఃఖమునే అనుభవించును. కనుక జ్ఞాన స్వరూపుడు, చిత్స్వరూపుడు అయినటువంటి పరమాత్మను ఆశ్రయించి జనులు, దుఃఖరాహిత్యమును ఆనంద ప్రాప్తిని బడయ వలెను.

- క్రొత్తగా వచ్చిన కోడలు గృహ కృత్యములను చక్కగా నిర్వహించుకొను చుండును కాని సంతానము కలిగిన పిమ్మట, ఇంటి పనులను జేయుటకంటే పిల్లవానిని జాగ్రత్తగా చూచుకొనుటయందే ఆమె కాలము గడుపును. అదే విధముగ అజ్ఞాని లౌకిక కార్యములను మిక్కిలి ప్రీతితో ఆచరించుచుండును. జ్ఞానమును సంపాదించి భగవ ద్దర్శనము కలిగిన పిమ్మట అతడు దృశ్య విషయములందు ఆసక్తిని విడనాడి నిరంతరము ఆత్మయందే ప్రీతి కలిగి యుండును.

◆ సముద్రమును గురించిగాని, ఆకాశమును గురించి గాని వర్ణించు నపుడు వాటి యొక్క కొన్ని గుణములను మాత్రమే చెప్పగలరు గాని, పూర్ణముగ ఎవరును తెలుపలేరు. అలాగు ననే భగవంతుని కూడా సంపూర్ణముగ ఎవరును వర్ణించ లేరు. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రి యములు, మనస్సు, బుద్ధి వీటన్నిటికి పైన వున్నటువంటి భగవంతుని మాటలతో వర్ణించజాలము. కాని సాధనచేసి దైవానుభూతిని బడయ వచ్చును.

◆ ఒంటరిగా నున్నను ఎవరు నన్ను చూడలేదు గదాయని పాప కార్యములు చేయక, ఈశ్వరుడు కనిపెట్టియే యున్నాడని తలంచి, పాపకృత్యములు నొనరింపనివాడు నిజమైన మతముగలవాడు.

◆ మానవుడు తనకుగల అహంభావము విషయాసక్తి, కామము, లోభము మొదలగునవి నశించినవా, లేదాయని అప్పుడప్పుడు పరీక్షించుకొనుచుండవలెను. ఈ దేహమేమి? ఇది తోలుతోగప్పబడిన ఎముకల పుట్ట. దీనిలో నేమి కలదు. నెత్తురు, మాంసము, పైత్యరసము మొదలగునవి కలవు. ఇట్టి ఈ పాడుదేహమును జూచి ఏలగర్వపడ వలెను. దాని యందేల ఆసక్తిగొనవలెను. ఇట్టి ఆలోచనల వలన అహంభా వాదులు చీల్చివేయబడగలవు.

◆ మనుష్యులు మేలుకొన్న యింటిలో దొంగలు ప్రవేశింప జాలరు. అట్లే నీవు జాగ్రత్తగానున్నచో దుష్ట తలంపులేవియు నీ మనస్సునందు జొరబడజాలవు.

◆ భగవంతునకు పూర్తిగా ఆత్మార్పణము గావించుకొని వారి ఇచ్ఛ ప్రకారము నడుచుకొనుట కంటె భక్తునకు సుఖమైన మార్గము మరొకటి లేదు. సర్వమును భగవానునకు అర్పిం చుకొనిన భక్తునకు నేను, నాది అనుభావము ఏమియు వుండనేరదు.



◆ పెద్ద తుఫాను గాలి వీచినపుడు అనేక రకముల చెట్లు కూలిపోవును. అదే విధముగ ఆత్మసాక్షాత్కారముచే జనించిన జ్ఞానము వలన మనుజునకు దృశ్య జగత్తునందలి భేదములన్నియు నమసిపోయి, ఒకే దైవ స్వరూపము అనుభూతమగుచుండును. కాల్చనటువంటి పచ్చికుండ విరిగిపోయినచో దానిని తిరిగి కుండగా తయారుచేయ వచ్చును. కాని కాల్చబడినటువంటి కుండ పగిలి ముక్కలై పోయినచో, దానిని తిరిగి కుండగా చేయుటకు వీలుపడదు. అలాగుననే దృశ్య సంబంధ వాసనలుగల మనస్సు జ్ఞానాగ్నిచే నిర్మలముకానిచో అది జీవునకు మరల ఉపాధిని కల్పిం చును. కాని జ్ఞానాగ్నిచే మనస్సు నిర్మలత్వమును పొందినచో అది జీవునకు జన్మ రాహిత్యమును కలిగించును. కావున జనులు జ్ఞానమును సంపాదించి, పరిశుద్ధ హృదయులై మోక్షమును బడయవలెను.

◆ చిన్నపిల్లవాని మనస్సు విషప్రవృత్తిలేక నిర్మలముగనుండును. కాని వాడు పెద్దవాడైనచో అతని మనస్సు బంధువులు, కీర్తి ప్రతిష్టలు మొదలగు దృశ్యసంబంధ విషయములందే తిరు గాడుచుండును. అట్టివానికి పరమానందమగు దైవాను భూతి ఎట్లు కలుగును? కావున మనస్సునందు ప్రపంచ సంబంధమైన వాసనలు రానీయక, మానవుడు సత్యమును, దైవ జ్ఞానమును తెలుసుకొని శాశ్వత సుఖమును అను భవించవలెను.

◆ విత్తనములు వేయించబడినచో తిరిగి మొలకెత్తనేరవు. కాని వేయింపబడని విత్తనములు సులభముగ మొలకెత్తును. ఆ విధముగానే జ్ఞాన ప్రభావము వలన అజ్ఞాన గ్రంధులు చిన్నమైపోయినవాడు తిరిగి జన్మింపడు. అనగా అట్టివాడు సచ్చిదానంద పరమాత్మయందు లీనమై యుండును. అజ్ఞానము కలిగియున్నవాడు, జ్ఞానమును బడయు వరకు

జన్మలనెత్తుచునే యుండును.

- మానవజన్మను పొందినవాడు ప్రప్రథమమున తన జీవిత లక్ష్యమేమిటో తెలుసుకొనవలెను. పునర్జన్మను బడయకుండుటకై ఆత్మజ్ఞానము సంపాదించవలెను. సర్వమును భగవంతునకు సమర్పించి, దైవమార్గమున, ధర్మమార్గమున ప్రశాంత జీవితము గుడపుచు, ఆనందమయుడై విలసిల్లవలెను.
- పాలలో వెన్న కలదు అని పలుమార్లు అరచుచున్నచో వెన్న కంటికి కనబడునా లేదు. పాలను పెరుగుగా మార్చి పెరుగును చిలికినచో వచ్చిన మజ్జిగ నుండి వెన్నను బయటకు తీయవలెను. అలాగుననే అదృశ్యరూపుడగు భగవంతుని దర్శింపగోరి, ఊరక కూర్చుండినచో, దైవ దర్శనము కలుగదు. సత్సాంగత్యము ద్వారా దైవ నామ జపము ద్వారా హృదయమును పరిశుద్ధముగా ఒనర్చు కొన్నచో భగవానుడు సాక్షాత్కరించును. కావున ప్రయత్నము చేతనే లక్ష్యసిద్ధి సంప్రాప్తించును.
- రోగము వచ్చినవాడు ఔషధమును గూర్చి తెలుసుకొని దానిని సేవించకయున్నచో రోగమెట్లు నయమగును. ఆ విధముగనే భవరోగమును పోగొట్టుకొనదలంచినవాడు సద్గురువు సచ్ఛాస్త్రములు బోధించిన ప్రకారము ఆచరించినచో మాత్రమే ముక్తుడు కాగలడు.
- మనుజునియందు అహంకారము నిర్మూలింపబడినప్పుడు అతనికి దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి కలుగును. అదియే మోక్షస్థితి. అట్టి పరమానంద స్థితి కొరకై సర్వులును ప్రయత్నించవలెను.
- కాలియందు ముల్లుగ్రుచ్చుకొనినపుడు దానిని మరియొక ముల్లు సహాయముతో తీసివేయవలెను. అట్లే జీవుడు దుఃఖదాయకమగు దృశ్య ప్రపంచ జ్ఞానమును, పరమాత్మ



జ్ఞానము యొక్క సహాయముతో తొలగించి నిర్వికారుడై పరమానందమును అనుభవించ వలెను.

- బ్రహ్మానందము ఒక్కసారి అనుభవించినవాడు, విషయానందము కొరకై ప్రాకులాడడు. ఒకవేళ విషయా సక్తిని కలిగి యున్నచో అతడు ఇంకను భగవత్సాక్షాత్కారము నొందలేదని గ్రహింపవచ్చును. ప్రపంచములోని అన్ని ఆనంద ములకంటే గొప్పదైన ఆత్మానందమును పొందుట కొరకే ప్రతివారును కృషి సలిపి ధన్యులు కావలెను. విషయా నందము కొరకై పరుగిడరాదు.
- భగవానుడు సర్వజీవుల హృదయమందు స్థితుడైయుండి, వారినెల్లరను జగన్నాటకమందు ఆడించుచున్నాడు. కావున మాయా చక్రము నుండి తప్పించుకొనదలంచినవాడు, హృదయ పరమేశ్వరుడగు పరమాత్మను ఆశ్రయించినచో శీఘ్రముగ విముక్తుడై ఆనందమును బడయగలడు.
- దొంగతనము చేయువానిని ఎవరైనను గమనించినచో వాడు పారిపోవును. ఆ తీరుననే కామక్రోధాది వికారములను సాక్షిగ గమనించుచుండినచో అవి జీవుని యేమియు చేయజాలక అదృశ్యములైపోవును.
- ఓ మానవుడా నీవు శాశ్వత సచ్చిదానంద సాగరమున ఓలలాడవలసి యున్నది. కావున అమృత స్వరూపుడా, కోపము, ధనాశ మొదలగు నీటి జంతువులను వివేక వైరాగ్యములను ఆయుధలముచేత తొలగించి, జ్ఞానమను నౌకద్వారా సంసార సాగరమును దాటివేయుము.
- సముద్ర ప్రయాణము చేయు నావికుల వద్ద దిక్సూచి యంత్రము వుండును. అది ఎల్లప్పుడు ఉత్తర దిక్కునే చూపును. అందుచే వారు మార్గమును సరిగా తెలుసుకొనుచు నిరాటంకముగ లక్ష్యమును చేరుదురు. ఆ

ప్రకారము గనే జనులు లోక వ్యవహారమందు మునిగి యున్నను, తన మనస్సు ఎల్లప్పుడు భగవంతుని పాదపద్మము లందే లగ్నమై యుండులాగున అభ్యసించవలెను. అట్లు చేయుట వలన మనస్సు దృశ్య విషయములలో చిక్కుకొనక పరమశాంతిని అనుభవించుచుండును.

- అగ్నియందు ఉన్నంత వరకు బొగ్గు ఎర్రగా వుండి ప్రకాశించుచుండును. కాని అగ్ని నుండి వెలుపలకు తీసివేసినచో, దాని ఎర్రదనముపోయి నలుపుగా మారిపోవును. అటులనే సాధకుడు భగవంతుని ధ్యానము చేయుచు వారి సన్నిధియందు వున్నంత కాలము జ్ఞాన ప్రకాశము కలిగియుండును. ఒకవేళ ఎప్పుడైనా దైవధ్యానమును విస్మరించినచో మాయ ఆక్రమించి, అతనిని అశాంతిపాలు చేయును. కావున శరీరమున్నంత వరకు జనులు ఆనందదాయకమగు బ్రహ్మాభ్యాసమును ఆచరించుచునే యుండ వలెను.
- రాత్రిపూట నక్షత్రములు కనబడుచున్నవి. కాని పగలు సూర్య ప్రకాశము వలన నక్షత్రములు కనబడనంత మాత్రముచే అవి లేవు అని పలుకుటకు వీలులేదు. ఆ ప్రకారముగనే అజ్ఞానమున్నంత వరకు భగవానుడు కనబడడు. అంతమాత్రముచే భగవంతుడు లేడు అని వాదించుట సరికాదు. జ్ఞానము నొందినప్పుడు భగవానుని దర్శనము జనులకు కలుగుచున్నది.
- పాలను ఎక్కువ నీటిలో కలిపినచో అవి నీటి స్వభావమును పొందును. అట్లే ఆత్మజ్ఞానమును సంపాదింపగోరువాడు పలు రక ముల జనుల మధ్య తిరుగాడుచున్నచో అతడు మునుపు వున్నటువంటి దైవజ్ఞానము కూడా కోల్పోవును. కావున ముముక్షువులు ఎల్లప్పుడును దుర్జన సాంగత్యమును అవలంభించక, మహాత్ముల సహవాసమును, దైవధ్యాన పరాయణులగు భక్తుల సహవాసమును చేయుచు ఆత్మాభి వృద్ధిని



సంపాదించగలరు.

- కోతి తిరుగులాడుతుంటే దాని పిల్ల తల్లిని గట్టిగా అంటిపెట్టుకొని ఉంటుంది. పిల్లికూన అలాగాక మ్యావు, మ్యావు అంటూ ఉంటుంది. అప్పుడు దాని తల్లి దానిని మెడపట్టుకొని తీసుకొనిపోతుంది. కోతి పిల్ల తన పట్టువిడిస్తే క్రిందపడిపోతుంది. ఎందుకంటే కోతి పిల్ల తన బలాన్నే నమ్ముకొని వుంది. కాని పిల్లి పిల్లకు అలాంటి భయం లేశం కూడ ఉండదు. తల్లే దాన్ని ఒక చోటు నుండి మరొక చోటుకు తీసుకుపోతుంది. పరమేశ్వరుడికి పూర్తిగా ఆత్మార్పణ చేసికొనడానికి తన్ను తాను నమ్ముకొని ఉండడానికి గల భేదం ఇటువంటిది.

## శ్రీ రామకృష్ణ పరమహంస సదుపదేశములు సంపూర్తి

- - - - -

- అంతులేని కోరికలుండటమే పెద్ద దోషం. ఇతరుల గురించి చెడుగా చెప్పడమే పెద్ద పాపం. సత్యంగా ప్రవర్తించడమే నిజమైన తపస్సు.
- అందరిలో మంచిని చూడటం నేర్చుకుంటే మనలో మంచి మరింత పెరుగుతుంది.
- అతిథి అంటే ఇంటికొచ్చిన బంధువు మాత్రమే కాదు. ఆకలి బాధవలన మిమ్ములను ఆశ్రయించిన ప్రతిజీవి.
- అదృష్టం నుదుటను లేదు. మానవుడు చేసే కృషిలోనే వుంది.
- అధైర్యం అనేక అనర్థాలకు దారితీస్తుంది. అనుభవమే గురువు. అనుభవానికి మించిన గురువు లేడు.
- అనుమానమే మనిషి మనసును నరకంగా మారుస్తుంది.
- అభినందించటము తప్ప అసూయపడడం ఎరుగానివాడు

ఎంతో అదృష్టవంతుడు.

- అవమానాన్ని భరించి సర్దుకునిపోయేవాడిలో ఎంతో గొప్పతనం దాగివుంది.
- అశాంతికి మూలం మనిషిలో స్వార్థం. శాంతికి మూలం ప్రేమ.
- ఆటంకం కలుగుతుందని శ్రమకు భయపడి అధములు పనిని మొదలుపెట్టరు. మధ్యములు విఘ్నాలు కలిగాక మొదలుపెట్టిన పనిని వదిలేస్తారు. కాని ఉత్తములు ఎన్ని అంతరాయములు ఏర్పడినా ఎదుర్కొని ఉత్సాహంగా కార్యం సఫలమయ్యేవరకు వదలరు.
- ఆదర్శవంతమైన జీవితానికి ఉత్తమ గ్రంథాలు, ఉత్తమ మిత్రులు ఎంతో అవసరం.
- ఇచ్చింది మరచిపోవడం, పుచ్చుకొన్నది జ్ఞాపకముంచుకోవడమే స్నేహం.
- ఇతరుల తప్పును నీవు మన్నిస్తే, నీ తప్పును భగవంతుడు మన్నిస్తాడు.
- ఇతరులకు మేలు చేయడమంటే తనకు తాను ఉపకారము చేసుకోవడమే.
- ఈర్ష్య లేకపోవడము, దానగుణం, ప్రియభాషణ, స్వచ్ఛమైన హృదయం ఇవి విజయానికి సోపానాలు.
- ఉత్తములను గౌరవించడం, సేవకుల్ని దయతలచడం, శత్రువులను క్షమించడము అభివృద్ధికి ఆధారాలు.
- ఎదుటి వ్యక్తిని గౌరవిస్తేనే అతడు నిన్ను గౌరవిస్తాడు.
- ఎప్పటికీ తరగని ధనం నీలో మంచితనమే.
- ఎవరి గురించైనా చెప్పాల్సివస్తే వారిలోని మంచిని చెప్పండి. వారిలోని చెడును మాత్రం మీ మనసులోనే దాచుకొనండి.



- ఎవరి సన్నిధిలో మనస్సుశాంతిని పొందుతుందో అతడే సత్పురుషుడు.
- ఎవరైనా నిన్ను నిందించినా, అవమానపరచినా వారిపై కోపించక. ప్రేమతో నవ్వుతూ వారిని సమాధానపరచు.
- ఐశ్వర్యానికి ఆభరణం మంచితనం. విద్యకు అలంకారం నీతి. ధనానికి అలంకారం దానం. అన్ని గుణాలకు అలంకారం మంచిశీలం.
- తల్లిదండ్రులను, గురువులను, పెద్దలను గౌరవించుట మన సంప్రదాయం. పెద్దల అనుభవాలే మనకు గుణపాఠాలు. అనుభవాలకు మించిన విద్య మరొకటి లేదు. ఏ విద్యకైనా గురువు తప్పనిసరిగా వుండి తీరవలసినదే.
- ఒకరిపై చాడీలు చెప్పేవారితో నీవు ఏకీభవిస్తే తరువాత నీ పని కూడా అంతే.
- ఒక మర్రి విత్తనము మహావృక్షమయినట్లే, చిత్తశుద్ధితో చేసే చిన్న సత్కార్యం మహా ఫలితాన్నియిస్తుంది.
- కెరటములతో వున్న కొలనులో నిశ్చలమైన ప్రతిబింబము కనబడదు. ఆ విధముగనే నిలకడలేని మనసులో శాంతి కలుగదు.
- కుమ్మరి పురుగు బురదలో తిరిగినప్పటికి దానికి బురద అంటదు. అదే విధముగా సంసారములో వున్నప్పటికి, ఆ వాసనలు మనసుకు అంటకుండా వుండేవాడే వివేకి.
- ఆలోచించడం కాదు. ఆచరణ ముఖ్యం. అది యిప్పుడే ప్రారంభించాలి తప్ప రేపటికి వాయిదా వేయకూడదు.
- గురువు ప్రేమమూర్తి, జ్ఞానమూర్తి, అతను వెలిగించే దీపం లాంటి వాడు. తాను వెలుగుతూ మరెందరికో వెలుగును ప్రసాదిస్తాడు.
- తన ధననష్టాన్ని, తన మానసిక దురవస్థను, తన యింట్లోని

కలహాన్ని, తనకు జరిగిన మోసాన్ని, అవమానాన్ని రహస్యంగానే వుంచడం వివేకి లక్షణం.

- తమ తప్పులను కప్పిపుచ్చుకోవాలని ప్రయత్నించేవారే ఇతరులలోని తప్పులను ఎత్తి చూపుతారు.
- తీసుకోవడం కన్నా యివ్వడంలోనే సంతృప్తి వుంది. పెత్తనం కన్నా సేవే పవిత్రం.
- త్యాగం, సేవ, సదాచారం వల్ల మానవజన్మ సార్థకమవుతుంది.
- దుర అలవాట్లు మొదట్లో సాలెగూళ్ళులాంటివి. తరువాత అవి ఇనుపగొలుసులై మిమ్మలను బంధిస్తాయి.
- నలుగురికి ఉపయోగపడే గృహస్థధర్మం చాలా మంచిది.
- నిత్యతృప్తి, సంతోషముతో నున్నవారితో స్నేహం, దీనులపై దయ, గుణవంతులపై ప్రీతి, దుష్టులకు దూరముగా ఉండటము ఇవి మనశ్శాంతికి మార్గాలు.
- నిన్ను నీవు రక్షించుకొనుటకు యితరులపై నిందవేయకు. కాలానికి నిజాన్ని నిరూపించే శక్తి వుంటుంది.
- పంతం, కోపం వున్న వ్యక్తి స్నేహానికి అర్హుడు కాడు.
- పది రూపాయలు ఆదాయానికి, వంద రూపాయల ఖర్చు చేస్తే జీవితాంతం కష్టాలు తప్పవు.
- ప్రపంచములో అన్నిటికంటే కష్టమైనది ఎదుటివారిని అర్థం చేసుకొనడమే.
- ప్రపంచాన్ని జయించినవాడికంటే, తన మనస్సును జయించిన వాడే వీరుడు. ధైర్యవంతుడు.
- గొప్ప లక్ష్యాన్ని సాధించాలంటే కృషి, పట్టుదలకంటే ముందు సంకల్పబలం వుండి తీరాలి. సంకల్పబలంతోనే ఏలాంటి పని నైనా మనము అవలీలగా సాధించగలం.
- ప్రతి ఫలాన్ని ఆశించకుండా ఒక మంచిపనికి సహాయ



పడేవారు గొప్పవారు.

- ఆనందం కలిగినప్పుడు అది నలుగురికి పంచిపెట్టు, కాని విషాదం సంభవించినప్పుడు మాత్రం అది నీ దగ్గరే దాచుకో.
- విద్య అనేది మనిషి నుండి వేరుచేయలేని సంపదవంటిది.
- జీవితంలో తృప్తిపడటం నేర్చుకున్న వ్యక్తి ఎన్నడూ విచారానికి గురికాడు. అదిచేతకాని వ్యక్తి ఎప్పుడూ దుఃఖానికి గురియౌతూనే వుంటాడు.
- ఒక చిన్న క్రొవ్వొత్తి కాంతి కిరణాలతో ఏ విధముగా వెలుగు నివ్వ గలదో, ఈ ప్రపంచములో ఒక మంచి పని కూడా ఆ విధముగానే ప్రకాశించగలదు.
- పూలలో సువాసన, వ్యక్తులలో యోగ్యత దాచినా దాగవు.
- పదవులు, అధికారం కంటే, సేవాభావం ఎంతో గొప్పది.
- వయసుమీరిన తరువాత మనకు అవసరమైన ఆశ్రయాన్ని ఇవ్వగలిగింది విజ్ఞానమే. అయితే వయసులో వున్నప్పుడు మొక్క నాటితే పెరిగి పెద్దదై వార్ధక్యంలో అది తగినంత నీడను యిస్తుంది.
- ఆహారశుద్ధి, వస్త్రశుద్ధి, నివాసశుద్ధి, సంసర్గ శుద్ధి, వాక్ శుద్ధి, క్రియాశుద్ధి, ధ్యానశుద్ధి, సంకల్పశుద్ధి అను ఎనిమిది శుద్ధులు. ఆత్మశుద్ధికి కారణములని మరువకుము. (మహర్షి శ్రీమళయాళ స్వామి)
- మానవుడు పుట్టుకచేతనే బ్రాహ్మణుడుగా గాని, పంచముడుగా గాని రాలేదు. తన సంస్కారమును బట్టియే బ్రాహ్మణుడును, పంచముడును అగుచున్నాడు. (శ్రీ బుద్ధ భగవానుడు)
- గర్వముచేగాని, కోపముచేగాని దేహమెరుగక అరచువాని కంటే, ఓండ్రపెట్టుగాడిదయే మేలు.
- రాత్రింబవళ్ళువలె సుఖదుఃఖములొకదాని వెనుకనొకటి అనుసరించుచు, వచ్చుచుండునని గ్రహింపవలయును. (మహమ్మద్)

- మహాత్ముల సహవాసముచే బంధు మిత్రులందు ఆశపోవు చున్నది. ఈ ఆశ నశించినతోడనే జీవన్ముక్తి లభించుచున్నది. (శ్రీ శంకరాచార్యులవారు)
- వాఙ్మయమము మహాపురుషుల లక్షణమైయుండును. కాకులు అరచునట్లు హంసలు అరవవు గదా. (మహర్షి శ్రీమళయాళ స్వామి)
- విత్తనము ఎంత శ్రేష్ఠమైనను వర్షము లేనిదే ఫలింపని విధమున, మనుష్యుడు ఎంత బుద్ధిమంతుడైనను భక్తిలేనిదే తరింపజాలడు (శ్రీ మహమ్మద్)
- ఆశ, మోహము, అభిమానము, హర్ష, శోకములు, పరనింద ఎవడు వదలివేయునో వాడే సత్పురుషుడు. (శ్రీ కబీరు)
- వర్షము లేని కాలములో జీవితమెటువంటిదో, చంద్రుడు లేని రాత్రిలోగల సంచారమెటువంటిదో, రాగముతో కూడిన బ్రతుకు ఎటువంటిదో, శాంతిలేని జీవితమున్నూ అటువంటిది.
- భర్తకు యిష్టమైనదే తనకు యిష్టమని, మరి వేరే యిష్టమైన వస్తువులకు ఆశించని సాధ్వీమణికి సంసారము బాధగా తోచదు. స్వర్గం కంటే ఎక్కువగా తోస్తుంది. (కనిపిస్తుంది)
- భర్తలు గల స్త్రీలు పతినే దైవమని భావించినట్లు, భర్తలేనివారు వితంతువులు దైవాన్ని భర్తగా భావించాలి. భర్త అంటే ఏమిటి? భరించేవాడే భర్త. అందరికి భర్త భగవంతుడే.
- జీవునకు దుఃఖము దేనివలన కలుగుచున్నది. శరీర పరిగ్రహణము వలన శరీరము దేని వలన కలిగినది. కర్మ వలన, కర్మ దేనివలన కలిగినది. రాగాదుల వలన, రాగాదులు దేనివలన కలిగినవి. అజ్ఞానము వలన. అజ్ఞానమెటుల పోవును జ్ఞానముచే. కాబట్టి జీవునకు జ్ఞానము అవసరమై యున్నది.



- దేవుని చేరుటకు మార్గము, అపవిత్రతను, అవినీతిని దుర్గుణములను హృదయము నుండి తొలగించుటయే
- పుణ్యముచే సుఖము, పాపముచే దుఃఖము, జ్ఞానముచే మోక్షము కలుగును. ఇది దైవశాసనము. అందుచే పాపకార్యములను వదిలి, పుణ్యకార్యములను చేపట్టవలెను.
- దైవము కొరకు పరితపించకుండా ఎవరును దైవమును పొందలేరు.
- కాలం చాలా విలువైనది. రేపు అనుదానికి రూపులేదు. కావున మంచి పనులకు వాయిదా వేయకూడదు.
- ధనము భోగాలకు ఖర్చుచేసి రోగాలను తెచ్చుకోకు. మంచి పనులకు ఖర్చుచేసి పుణ్యాన్ని సంపాదించుకో, ఆ పుణ్యమే నిన్ను కాపాడగలదు. నిదానముగా ఆలోచించిమాట యివ్వుము. ఇచ్చిన మాటను పాటించుము.
- దేవుడు విశాల హృదయుడు. నీవు దుఃఖము పొందినపుడు భగవంతుని శరణుపొందు. నిత్యము భక్తికలిగియుండు. అప్పుడు పూర్ణ శాంతిని పొందగలవు.
- ధనము, ప్రాపంచిక వస్తువులు పోయినచో వాటిని తిరిగి సంపాదించవచ్చును. కాని పోయిన సమయము తిరిగి సంపాదించలేము.
- ధర్మ ప్రవర్తనమే దైవమును చేరుటకు మార్గము. సద్గుణములే సకల సంపదలు.
- నిర్మల హృదయము చేతను, పరిశుద్ధ మనస్సు చేతను దైవ సాక్షాత్కారము లభ్యము కాగలదు.
- అంతా నా మేలునకే వచ్చినదని కష్టాలను ఓరిమితో అనుభవించుము.
- భగవంతుడు నీకు యిచ్చినది చాలు అనుకొనుటయే జీవితములో తృప్తికి ఏకైక మార్గము.

- అసూయ నీచమైన దుర్గుణము. దానిని మానవుడు ఏ కాలమందును దరికి జేర్చరాదు.
- తనకు అండగా భగవంతుడున్నాడని తలంచువాడు యే కార్య మందును నిరుత్సాహమును పొందడు.
- భగవంతుని దయను పొందుటకు ప్రార్థన కంటే ఉత్తమమైన ఉపాయము లేదు.
- శక్తిచేత సాధించలేనిది యుక్తిచేత సాధించవచ్చును. సత్యమునకు సమానమైన సంపద లేదు. నీ మంచితనమే నీకు గొప్ప అండ.
- మన సుఖదుఃఖాలకు, కష్టసుఖాలకు మన కర్మయే మూల కారణం .
- పొలములో రైతువలె శ్రమపడినగాని ఏ కార్యమందు సిద్ధి కలుగదు. సాధన ద్వారా ఆత్మదర్శనమునకు మార్గము తెలియ బడుతుంది.
- ప్రపంచములో యేదియు శాశ్వతము కాదు. ఐశ్వర్యము, అధికారము అన్నియు అంతరించిపోవును. సత్కార్యములు మాత్రమే చేసిన (మంచి పనులు) శాశ్వతముగ నిలిచిపోవును.
- ఉపకారము చేసినవారియెడల సదా కృతజ్ఞత కలిగి యుండుట మానవత్వము. ఇతరులకు ఏదియో ఒక ఉప కారము చేయుటకై ప్రయత్నించుము. కాని ఉపకారం చేయలేకపోయినా అపకారం తలపెట్టకు.
- విలువైన కాలాన్ని సద్వినియోగము చేసుకోవాలంటే, అన వసర ప్రసంగాలను కట్టిపెట్టాలి. అతివాగుడు వాగేవారితో స్నేహము బ్రేకులు లేని బండి ప్రయాణము వంటిది.
- ఇతరులు నిన్ను నిందించినపుడు (విమర్శించినపుడు) ఉద్రేకంతో కోపం తెచ్చుకోకుండా సహనశక్తి కలిగియుండాలి.
- ఆత్మసాక్షాత్కారానికి అంత్యంత ఉపయోగకరమైనది



మానవజన్మ. కాని పాపపరిహారమైతేగాని పరమాత్మను దర్శించే జ్ఞానము కలుగుదు. ముందుగా అహంకారాన్ని జయించాలి. అప్పుడే నీకు దైవమార్గము దొరుకుతుంది. చెడు భావాలను, చెడు చింతలను, చెడు తలంపులను దూరము చేసుకొని దైవానుగ్రహం పొందాలి.

- స్వార్థము, అసూయ, పరదూషణ మొదలగు అల్పబుద్ధుల వలన మానవులు తమలోని దైవత్వమును పూర్తిగా కోల్పోవుతున్నారు. కావున మానవ ప్రయత్నం ఫలించాలంటే దైవానుగ్రహం కూడా యెంతో అవసరము.
- బంధమునకు, మోక్షమునకు మనస్సే కారణము. మనస్సుని అరికట్టడానికి ఆధ్యాత్మిక మార్గము తప్ప వేరు మార్గము లేదు.
- అంతులేని కోరికల వలన మానవుడు దుఃఖమునకు గురియగుచున్నాడు. పవిత్రభావముతో దైవమును స్మరించిన దుఃఖము తొలగుతుంది.
- సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ అనే మోక్షమార్గమున నడవాలి. అప్పుడు దైవం సదా మన సమీపములోనే వుంటాడు.
- సేవచేయుట వలన లభించిన ఆనందము మరెక్కడ లభించదు. సేవా భావము వలన అహంకారము తరిగిపోవును.
- సత్సాంగత్యము చేయాలి. సన్మార్గమున సదా పయనించాలి. సత్సంగములో చేరినపుడు సద్భావములు మనలో ఆవిర్భ వించుతాయి. అది నిత్య సత్యము.
- మానవుని (మనస్సు) హృదయము ఆశతో కూడినదయితే, అది ఎప్పుడూ పతనమార్గమునే చూపుతుంది.
- నిరంతర భగవన్నామ స్మరణలో ఆత్మానందము తప్పక లభిస్తుంది. ప్రయత్నించి ఫలితము సాధించండి.
- అనుకూలవతియైన భార్య, చక్కని దేహారోగ్యమే పురుషునికి విలువైన సంపద.

- యజ్ఞము, అధ్యయనము దానము, తపస్సు, సత్యము, క్షమ, ధమము, లోభము లేకుండుట అనునవి ఎనిమిది విధములగు ధర్మములనబడును.
- మానవుడు అజ్ఞానిగా పుట్టినా, జ్ఞానిగా మరణించాలి. ఏడుస్తూ జన్మించినా నవ్వుతూ శరీరం వదలాలి.
- దానము గాని, తపస్సు గాని, సత్యము గాని, విద్యగాని లేని జీవితము నిరుపయోగము.
- వయసు, తలనెరపు, ధనము, బలము వీటి ఆధిక్యతచే ఎవరున్నూ పెద్దరికమును పొందలేరు. జ్ఞానియే మనలో జేష్టుడని ఋషులు ధర్మమునేర్పరచుకున్నారు.
- గురుభక్తిగలవారు, దైవభక్తిగలవారు, సంసారసాగరమును సులభముగ దాటివేయగలరు. కాబట్టి మోక్షము యొక్క ప్రాప్తి కొరకు జనులు దైవభక్తి మరియు గురుభక్తి, గురుపాదములను తప్పక ఆశ్రయించవలెను.
- మోక్షమును పొందగోరువారు, సంసార సాగరమును దాటించ శక్తిగల గురువును సమీపించి, వారి ఉపదేశమును నావగా చేసుకొని, అభ్యాసనాశక్తిచే సుఖముగా భవసాగరమును దాటగలరని అన్నపూర్ణోపనిషత్తు చెప్పుచున్నది.
- ఏ ప్రాణికిని ఎన్నడును శరీరముతో, వాక్కుతో, మనస్సుతో బాధ కలిగించకుండుటయే అహింసాధర్మమని ఋషులు తెలిపిరి.
- పుణ్యకర్మలు చేసిన మాత్రమే భక్తి కలుగును. భక్తిచే జ్ఞానము, జ్ఞానముచే మోక్షము కలుగును. ఇదియే శాస్త్రముల యొక్క నిశ్చయాభిప్రాయము.
- నేనుయనగా అహంకారము. నాదియనగా మమకారము. ఈ కారమున్నంత వరకు కన్నీళ్ళు తప్పవు. ఈ నేను నాదియనునవి పోయినగాని జ్ఞానము కలుగదు. కావున సత్కర్మలు,



జపము, ధ్యానము, నిష్కామకర్మ చేయుచుండ వలయును.
- త్యాగము వల్లనే అమృతము లభించును. త్యాగమనగా - అరిషడ్వర్గ మును ఈషణత్రయమును జయించవలెను. చేయవలసినది చేయకుండగా రావలసినదిరాదు. కావున త్యాగము చేసినవాడే సుఖమును, ఆనందమును పొందగలడు. ఇది ఒక మానవులకే సాధ్యము కాగలదు. మిగతా జీవరాసులకు సాధ్యము కాదు. అందువలన త్యాగము చేయవలసియున్నది.
- ముముక్షువు నిరంతరము మహాత్ముల సాంగత్యము, భగవద్భక్తుల సహవాసము దైవ ప్రార్థనలు, ఆధ్యాత్మిక సమావేశములయందు పాల్గొనుచు భక్తి, శ్రద్ధలను పెంపొందించుకొనవలెను. జ్ఞానుల సాంగత్యము వలన, సాధకుని హృదయములో మంచిమార్పు కలుగుచుండును. కావున మానవుడు సత్సాంగత్యము భగవదారాధన, ధ్యానాదులను గావించుచు ఈ జన్మయందే దైవసాక్షాత్కారమును, మోక్షమును పొందవలెను.
- ప్రాపంచిక ధనముతోటి సంబంధము మనుజునకు శరీరముండు నంతవరకే కలుగుచుండును. శరీర వియోగముచే ఆ రెండిటికిని ఎడబాటు కలుగును. జ్ఞాన సంపద అట్లుగాదు. ఉత్తమ సంస్కార రూపమున, అది మోక్షపర్యంతము వాని వెంటనే యుండి, నీడవలె వెంబడించుచు, తుదకు గమ్యమగు భగవంతుని యొద్దకు చేర్చును. కాబట్టి భౌతిక సిరి సంపదలు కంటే ఎన్నోరెట్లు శ్రేష్ఠమైనది ఆధ్యాత్మిక సంపద.
- చిత్తశుద్ధి కొరకు నిష్కామకర్మ, చిత్తఏకాగ్రత కొరకు ఉపాసన, మోక్షము కొరకు బ్రహ్మ విజ్ఞానమును సంపాదించవలయును.
- కర్మ బంధము నుండి తప్పించుకోవడానికి, జనన, మరణాల నుండి విడివడడానికి, పరమశాంతిని పొందడానికి ఆత్మ

జ్ఞానం ఎంతో అవసరము. ఏ క్షణమందు మానవుడు తన యదార్థ స్వరూపమైన ఆత్మను గూర్చి తెలుసుకుంటాడో, ఏ క్షణమందువానికి బ్రహ్మను భూతి కలుగుతుందో అప్పుడే కర్మరాశి అంతా భస్మమైపోతుంది.

- మనము జీవించు లోకము స్థిరమైనది కాదు. యవ్వనము మధ్యలో వచ్చి మధ్యలోనే పోవునది. ధనము స్థిరమైనది కాదు. దారాపుత్రాదులు మధ్యలో అవరించి, మధ్యలో విడిపోవువారే. పెండ్లికి పూర్వము భార్య ఎవరు? భర్త ఎవరు? ఎవరికి తెలియదు. మధ్యలో వచ్చి, మధ్యలోనే ఒకరి కొకరికి వియోగం సంభవిస్తుంది. బిడ్డలూ అంతే పుట్టక పూర్వము తల్లి ఎవరు? బిడ్డ ఎవరు? పుట్టిన తరువాతనే ఈ విధమైన సంబంధ బాంధవ్యములు కలిగి వుంటాయి. ఇవన్నీ అస్థిరములే. మరి స్థిరమైనది ఏమిటి? ధర్మము, కీర్తి ఇవి రెండే మానవునికి స్థిరమైనవి.
- పరవస్తు పరిగ్రహముచే తన పుణ్యము క్షయించుటయే గాక, ఎవరి నుండి గ్రహించితిమో వారి పాపము గూడా వచ్చి చేరును. అయితే తగిన విధములేనిచో, తన అనుష్ఠాన మునకు భంగము కలుగకుండునట్లు పరవస్తువును గ్రహించవచ్చును. అప్పుడు గూడా జాగ్రత్త కలిగి భోగపరుడు గాక యోగపరుడై యుండవలెను.
- పూర్వపుణ్యము వికసించినవారికి మంచి గురువు దొరుకుతాడు. మంచి గ్రంథములు దొరుకుతాయి. మంచి వారి స్నేహము దొరుకుతుంది.
- భోగముల మీద దృష్టిపెట్టుకుంటే యోగం పోతుంది. అనేక జన్మల చేత వచ్చిన అజ్ఞానమును, గురువులచేత, శాస్త్రముల చేత, ధ్యాన సాధనచేత తొలగించుకొనవలెను.
- ఇంద్రియములను నిగ్రహించడానికి చక్కని వైరాగ్యమును సంపాదించాలి. సుగుణముల ఆహ్వానించాలి. దుర్గుణములను బయటకు నెట్టాలి. పరుగెత్తే మనస్సును నిలపాలి. అభ్యాసము ద్వారా స్వాధీనము చేసుకోవాలి.



- రేపుకు రూపులేదు. ఈ రోజు యిలా వుంది. రేపటి రోజు యిలాగే వుంటుందని చెప్పలేము. గాలిలో వున్న దీపము ఎంత చంచలంగా వుంటుందో ఆ విధముగానే ఈ ప్రాణము కూడా నిఖరముగాదు. బయటకు పోయిన శ్వాస తిరిగి వచ్చేదాక నమ్మకము లేదు. దేవుడు రక్షించుతాడని అనుకోవద్దు. మనము చేసిన ధర్మమును మనకే వదులుతాడు.
- నిద్ర మనస్సుకే గాని, ఆత్మకెలాలేదో, చావు దేహానికే గాని ఆత్మకు లేదు. ఆత్మ నిత్యము, శాశ్వతము సనాతనము.
- నిన్ను నీవు ఉద్ధరించుకొన్ననాడే నీవు ప్రబోధకుడువు కాగలవు. గాదెలోని ఎలుకలు ధాన్యాన్ని పాడుచేయునట్లు, మనిషిలోని అహంకారము జ్ఞానాన్ని పాడుచేస్తుంది.
- అద్ధమునకు పట్టిన మురికిని తొలగించగనే, ప్రతిబింబము గోచరించులాగున, తపస్సు ధ్యానముల ద్వారా మనో మాలిన్యములు తొలగించబడగానే ధ్యానస్థితిలో ఆత్మానుభవం కలుగుతుంది.
- మౌనము, ప్రార్థన, జపము, ధ్యానము వీటి వలన హృదయమున శాంతి కలుగగలదు.
- శరీరములు అశాశ్వతములు, సంపదలు శాశ్వతములు కావు. మృత్యువెప్పుడును కాచుకొనియే వున్నది. కాబట్టి నిరంతరము ధర్మమునే ఆచరించవలెను.
- ఓర్పు, దయ, సత్యము, సంతోషము, ఋజుత్వము అను ఈ సద్గుణము లను అమృతమువలె గ్రహింపుము.
- దేవతలను, పితరులను, సమస్త మానవులను, సాధు సత్పురుషులను, అతిథులను అను యీ అయిదుగురిని పూజించువాడు మహోన్నతమగు కీర్తిని బడయగలడు.

* ఏకాంత ప్రదేశమున ఆధ్యాత్మిక సాధనలు చేయుట ముఖ్యము. మొక్కలేతగా వున్నపుడు కంచె అవసరము. కాని అది పెరిగి పెద్దదయిన తరువాత పశువులు దానిని పాడు చేయలేవు. కొన్ని సంవత్సరములు ధ్యానము చేసి స్థిరచిత్తము యేర్పడిన తరువాత నీవు యెచ్చటవున్నను, ఎవరితో కలిసి తిరిగినను నీ మనస్సులో మార్పుండదు (శ్రీశారదాదేవి)
* ఆధ్యాత్మ క్షేత్రమున వున్న సాధకులకు ప్రారంభములో విగ్రహా రాధన అత్యవసరము. విగ్రహము దేవుని ప్రతీకము. అది దేవుని స్ఫురింపజేయును. కాబట్టి విగ్రహారాధన ద్వారా చిత్తై కాగ్రత భక్తి, చక్కగా అభివృద్ధి చేసుకొని సాధకుడు క్రమ ముగా ఉన్నత శిఖరములకు ఎగబ్రాకవలయును. నిర్గుణ నిరాకార పరమాత్మను తెలుసుకొనవలెను.
* కోరికలకు అంతులేదు. అనుభవించిన కొలది క్రొత్త క్రొత్త కోరికలు పుట్టుచుండును. భార్య లేనప్పుడు భార్య కావలెనని, రాత్రింబగళ్ళు కోరుచుండును. భార్య వచ్చిన తోడనే పుత్రులు కావలెనని కోరుచుండును. పుత్రులు కలిగిన తరువాత పౌత్రులు కావలెనని (మనుమలు) కోరుచుండును. ఈ ప్రకారముగ కోరికల యొక్క పరంపరల చేత మానవుని యొక్క జీవితమంతయు సతమతమై పోవుచుండును. కావున ఆత్మ విచారణచే కోరికలు లేకుండా చేసుకొనుటయే శ్రేయోదాయకము.
* చిన్నవాడైనను ప్రహ్లాదుడు దైవం కోసం తండ్రిని ఎదిరిం చాడు. రాముని కోసం విభీషణుడు సోదరుని త్యజించినాడు. సత్యం కోసం హరిశ్చంద్రుడు తన సర్వస్వాన్ని త్యాగం చేశాడు. ఈ విధముగా సాధకులు దైవం కోసం త్యాగబుద్ధి కలిగి యుండాలి.
* నదిని దాటుటకు ఈత లేక నావ అవసరమైనట్లు, సంసార మును దాటుటకు ఆధ్యాత్మిక విద్య (బ్రహ్మవిద్య) అవసరము.



కావున దానిని సంపాదించుటకై జీవుడు ప్రయత్నించవల యును.

* సాధకుడు ప్రతి నిత్యము తన గురువు చెప్పిన ఉపదేశమును విడవకుండా ఆచరించుచుండినచో జీవుడు లక్ష్యమును చేరగల్గును. నిరుత్సాహము పనికిరాదు. భగవంతుని యెడల సద్గురువు యెడల, శాస్త్రము యెడల పరిపూర్ణ విశ్వాసము కలిగి యుండవలెను.
* జీవిత కాలమంతయు దైవభావము కలిగియుండినచో, అంత్యకాల మున అట్టి పవిత్రమైన దైవభావమే కలిగియుండి తరించును.
* ప్రాపంచిక సుఖములు, వైభవములు అశాశ్వతములు వాటిని చూసి మురిసిపోరాదు. తాను చేసిన పుణ్యమే, తాను పొందిన ఆత్మజ్ఞానమే తన్ను రక్షించును.
* అసూయ నీచమైన దుర్గుణము. దానిని మానవుడు ఏ కాలమందును దరిజేరనివ్వరాదు.
* మనుజుడు ఆశకు లోబడక వున్నదానితో తృప్తిపొంది శేషిం చిన సమయమును, జీవితమును దైవధ్యానాదులందు వినియోగించవలెను.
* ఆధ్యాత్మిక విద్య అతి సూక్ష్మమైనదియగుటచే బహుకాలము సాధన చేసి తత్త్వమును గ్రహించిన మహనీయులగు గురు వుల ద్వారా అది చక్కగ బోధపడగలదు. గ్రంథముల ద్వారా కొంతయు, అనుభవజ్ఞుల ద్వారా పరిపూర్తిగను విద్యలభింప గలదు.
* సత్యమును బహుకాలము అన్వేషించినపుడు, సదాచారము కలిగినపుడు మాత్రమే ఆధ్యాత్మిక రహస్యములు తెలియ బడును.
* నీవు కోపమును వదులుము. ఏలయనిన అది సుఖమును,

ధర్మమును నశింపజేయును. ధర్మమును సేవింపుము. ఏల యనిన అది సుఖమును సత్కీర్తిని అభివృద్ధి పరచును.

- ◆ దానధర్మములు లేని ధనము సద్గుణములు లేని విద్య, మానవత్వము లేని విజ్ఞానము త్యాగము లేని క్రియ వ్యర్థములు.
- ◆ తపస్సు, యోగము, సమాధి వీనిచేకూడా ఏ ఫలము లభించునో కలియుగమున ఆ ఫలము భగవంతుని సంకీర్తనము చేతనే లభించగలదు (సూతుడు)
- ◆ తన దోషమును తాను వెదకుకొని, దానిని వివేకముచే సరి దిద్దుకొనువాడే ధన్యుడు.
- ◆ నేను, నాది అను త్రాళ్ళచే జీవుడు కట్టుబడుచున్నాడు. వాటిని విడదీసుకొనవలెను.
- ◆ కామానికి చావు లేదు. దాన్ని జయించకపోతే నువ్వు పరమాత్మను చేరలేవు. (సాయిబాబా)
- ◆ మౌనము దాల్చువారి యందు అపారశక్తియుండును. వారు ప్రాణి కోట్ల యందు ప్రేమ కలిగి, వారికి సేవజేసి తమ జీవితములను విరమించుచుందురు. వారెపుడును నేను, నాది యని అనరు. వారికి అహంకారము లేశమైనను వుండదు.
- ◆ ఇతరుల శ్రేయస్సు కొరకై మన జీవితములో కొంత భాగమును త్యాగము చేయవలయును. ఆత్మను గూర్చిన దివ్య సందేశమును ప్రచారము చేయుట జ్ఞానియొక్క లక్షణమై యున్నది. ఈ జీవితము వచ్చును పోవును ధనము, కీర్తి, విషయ భోగములు మూన్నాళ్ళ ముచ్చట్లు, ప్రాపంచిక కీటకమువలె చనిపోవుటకంటె, సత్యమగు భగవంతుని గూర్చి ప్రచారము చేయుచు, కర్తవ్య క్షేత్రమందు మృతినొందుట మేలు. (శ్రీ వివేకానందస్వామి)
- ◆ ఆశ అనే పాశము (త్రాడు) త్రెంచుకొనుట మానవునికి దుస్సాధ్యమైన పని. ఈ ఆశను పుట్టించేది మానవుని మనస్సు.



దానిని మన ఆధీనంలో పెట్టుకోవాలి. అంటే ఈశ్వరారాధన తప్పనిసరిగా చేసినచో, ఆశ అనే ఇనుప సంకెళ్ళ బారి నుండి అతి సులభంగా మానవుడు విముక్తుడౌతాడని శ్రీ శంకరాచార్యుల వారి ఉపదేశం.

- ◆ నిజాయితీ లేని వ్యాపారము, దానము లేని సంపద, శీలము లేని విద్య, క్రమశిక్షణ లేని రాజకీయము నిరుపయోగము.
- ◆ విదేశ వాస సమయమున విద్యయు, గృహమున భార్యయు, రోగ కాలమున ఔషధమును, చనిపోయినపుడు చేసిన ధర్మమును తోడు నీడలు.
- ◆ ఎన్నో జన్మల పుణ్యవశమున నీకు మానవజన్మ లభించినది. శక్తివంచన లేకుండా భగవత్ప్రార్థన చేయుము. దేనినైనా శ్రమపడ కుండా సాధించుట కష్టము. ప్రాపంచిక పనులెన్నైనా వుండనీ, ఆధ్యాత్మిక సాధన చేయుటకు ప్రతి దినము కొంత తీరిక చేసుకొని తీరవలెను.
- ◆ శుభకార్యమునుగాని, దైవ కార్యమును గాని, ధర్మకార్యమును గాని, పరోపకార్యమును గాని, తరువాతకు వాయిదా వేయరాదు. ఆ పుణ్య కార్యములను వెనువెంటనే ఆచరించవలెను. ఆలసించినచో పరిస్థితులు చేయజారి పోగలవు. కావున భగవధ్యానము, ధర్మాచరణము మొదలైన వాటిని తక్షణమే ప్రారంభించవలెను.
- ◆ దానములలో భూదానము, అన్నదానము, ద్రవ్యదానము, ఔషధదానము, జ్ఞాన దానములును ముఖ్యములైనవి. ఈ దానములు లేనిచో లోకములోని జనులు ఆకలి బాధతోను, అనారోగ్యముతోను, అజ్ఞాన రూపములైన కామ క్రోధాది గుణములతోను బాధలననుభవింతురు.
- ◆ భౌతిక సంపదలను, యవ్వన బలమును, బంధుజాలమును జూచి, అజ్ఞాని మహదానందపడుచుండును. కాని అవియన్నియు మున్నాళ్ళ ముచ్చట్లేయగుచు కడకు అతనిని దుః

ఖముల పాలుచేయుచున్నవి. చిల్లికుండలోని నీరువలె ఆయువు క్షణ క్షణము క్షీణించిపోవుచున్నది. దృశ్య సంపద సంతతిని కాలము ఒక్క క్షణములో గ్రహించివేయు చున్నది. ప్రపంచము యొక్కయు, శరీరము యొక్క నశ్వరత్వమును చక్కగా గుర్తెరిగి జనులు వివేకవంతులై, దుఃఖరాహిత్యమును, పూర్ణశాంతి సుఖములను బడయ వలెను. (శ్రీ శంకరా చార్యులవారు)

- ఏదైన సుగుణమును సాధించిన వాని జన్మమే సార్థకమగు చున్నది. పరోపకారము, దయ, కరుణ మున్నగు ఉదాత్త గుణములను మానవుడు సంపాదించుకొని తన జన్మను సార్థకము చేసుకొనవలయును. లేనిచో పురుగులవలె జన్మవ్యర్థమై పోగలదు.
- మానవులకు సువర్ణాది నిర్మిత ఆభరణములు అలంకార ములు గావు. వారి సత్ ప్రవర్తన, వారి త్యాగశీలత్వము, వారి నిర్మలదైవభక్తి, వారి పరోపకార పారీణత, ఇవియే వాస్తవము లైన అలంకార ములు, ఇవి జీవునకు పరిపూర్ణమైన శాంతిని, ఆత్మానందమును, జన్మరాహిత్యమును కలుగజేయగల సామర్థ్యము గలిగియున్నవి. కావున ఇట్టి సుగుణములను సంపాదించుకొని సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమును పొందవలసియున్నది.
- పూర్వజన్మకర్మానుసారముగ సుఖ దుఃఖములు గాని, నిందాప నిందలు గాని సంభవించును. అందువలన ధైర్య ముగా వుంటూ, భగవంతుని శక్తితో సేవిస్తూ సత్కార్యములు చేస్తూ, జ్ఞాన వైరాగ్య ములను సంపాదించుకొని (అలవర్చుకొని) మోక్షము పొందవలెను.
- ఒక చిన్న రంధ్రము పెద్ద పడవను ముంచివేయును. ఒకచిన్న దుర్గుణము మానవుని జీవితమునకు కళంకము తెచ్చును.



- దైవము యెడల పెద్దల యెడల, గురువు యెడల వినయ విధేయతలు కలిగి అందరిని ప్రేమతో చూస్తూ, చేతనైనంత వరకు పరప్రాణికి ఉపకారం చేస్తూ, ఆధ్యాత్మిక నియమాలు ఏర్పాటు చేసుకొని, వాటిని చక్కగా ఆచరిస్తూ జన్మను సార్థకము చేసుకొన వలసియున్నది.
- ఈ లోకానికి వచ్చినప్పుడు పుట్టుకతోపాటు చావు అనునది కూడా వెంట వచ్చినదే. చనిపోతామని అందరికి తెలుసు. దానిని గురించి దిగులు, దుఃఖం అనవసరం. మనము చేయవలసినది పుట్టినందుకు ఏదో ఒక మంచి పనిచేయాలి. భగవద్భక్తి, గురువు నందు దేవుని యందు విశ్వాసము కలిగి, దైవ కృప కొరకై, ఆత్మాను భూతి కొరకై పాటుపడాలి.
- కంచె లేకున్నచో చిన్న మొక్కలను పశువులు పాడుచేయును. కాని అవి పెద్ద వృక్షములయినచో, ఏనుగులను కట్టివేసినను వాటికి హానిలేదు. అట్లే పూర్ణ వైరాగ్యములేకున్నచో, అనేక ఆటంకములను ఎదుర్కొనుట కష్టసాధ్యము. (శ్రీరామకృష్ణ పరమహంస)
- దేవాలయమును ప్రతి రోజు కడిగి శుభ్రం చేయుచు పవిత్రముగ వుంచునట్లు శరీరమును, మనస్సునుగూడా నిర్మలముగ వుంచు కోవాలి. రాగ ద్వేషాలకు కామ క్రోధాదులకు హృదయ ములో ఏ మాత్రం చోటీయరాదు
- మోక్షసాధనములందు భక్తి చాలా ప్రధానమైనది. సులభ మైనది. భక్తియను తైలముండిన, జ్ఞానమనుజ్యోతి ప్రకాశిం చును. భగవంతుని యెడల అనన్యమైన అచంచలమైన భక్తిగల వారికి, అపరాత్పరుని దివ్యాను గ్రహముచే మాయపటా పంచలై పోవును. అజ్ఞానము పలాయనము కాగలదు.
- అమూల్యమైన మానవజన్మను పొందిన జీవుడు, తన భౌతిక సంపదలను చూసి మురిసిపోక ఆధ్యాత్మిక సంపదను, సుగు

ణములను సంపదలను, పుణ్యధనమును, జ్ఞాన ధనమును సంపాదించుటకు కృషి సలుపవలసియున్నది.

- దుర్గుణములలో ఆశ చాలా చెడ్డది. అది కలవారికి మనో రథములు పెరిగి, పెరిగి అశాంతి కలుగుచుండును. ఆశకల వాడు అందరికంటె గొప్ప దరిద్రుడనియు ఆశలేనివాడు అందరికంటే గొప్ప ధనవంతుడనియు శ్రీ శంకరాచార్యులవారు పేర్కొనిరి. ఆశ కలిగియున్నచో మనస్సు చంచలత్వము కలిగియుండును. చంచల మనస్సుకలవానికి ఆత్మజ్ఞానము దయించదు. ఆత్మజ్ఞానము లేని వారికి పరిపూర్ణ శాంతి లభించదు. కాబట్టి పరిపూర్ణ శాంతిని పొందగోరువారు, ఆత్మానుభూతిని పొందగోరు వారు ఆశను వదల వలెను.
- ఓ మనస్సా ప్రాపంచిక విషయములు సుఖములని తలంచి వాటి వెంట పరుగిడుచున్నావు. వాస్తవముగ అవి భ్రాంతి మాత్రమే. భోగానంతరమవి దుఃఖమును కలుగజేయును. కాబట్టి ఓ మనస్సా పరమాత్మ యొక్క పవిత్ర పాదపద్మ ములను సేవించి తరించుము.
- ఆధ్యాత్మిక మార్గములో సోమరితనానికి తావే లేదు. సాధకుడు గురు వాక్యాన్ని శాస్త్రవాక్యాన్ని చక్కగా పరిపాలిస్తూ, ఆయా బోధలను ఆచరణయందుంచుతూ సత్ఫలితాలను పొందాలి. ఊరకే కూర్చుంటే కొంతకాలానికి మృత్యువు వస్తుందేకాని మోక్షం రాదు. కాబట్టి వివేకవంతుడు భగద్భక్తి గలిగి వైరాగ్యము, శమ, దమాది సాధనలను పట్టుదలతో ఆచరించి, ఆత్మానుభూతిని పొంది జీవితాన్ని ధన్యమొనర్చుకోవాలి.
- పరమతమును దూషించువాడు, తన స్వమతమును గూడా సరిగా ఎరుగనివారే యగుదురు. ఏ మతస్థులై నప్పటికిని పుట్టుకచే అందురు మానవులే. మతావేశములు మధ్య ఏర్పడినవి. కాబట్టి సజ్జనులు మతము పేరిట మానవత్వ



మును మరువకుందురు గాక. మతము భగవంతుని పొందుటకు ఏర్పడినది. (శ్రీ విద్యాప్రకాశానంద గిరి స్వాముల వారు)

- సత్యము ధానము, సోమరితనము లేకుండుట, అసూయా రాహిత్యము, ఓర్పు, ధైర్యము అను ఈ ఆరు గుణములను ఏకాలమందును వదలరాదు. (మహాభారతము)
- అధిక నిద్ర, మత్తు, భయము, కోపము, సోమరితనము, మందకొడి స్వభావము అను యీ ఆరు దుర్గుణములను మోక్ష కాంక్షియగు వాడు పూర్తిగా విడనాడవలెను (మహాభారతము)
- ఒకరిపై ఎన్నడును చాడీలను, నిందలను మోపరాదు. ఒకరికి అపకారము చేయదలపెట్టినచో, తనకే ముప్పు వాటిల్లగలదు. ఈర్ష్య, ద్వేషము, చాడీలు చెప్పుట మొదలగు దుష్ట గుణము లకు జనులు తమ హృదయమున అవకాశ మివ్వరాదు. పరోపకారము, ప్రేమ, దయ మున్నగు మహోన్నత ఆదర్శ గుణములను అలవరచు కొని, హృదయము నిర్మలము గావించుకొని మనుజులు ఆధ్యాత్మిక సుఖమును అనుభ వించవలెను.
- మానవుడు సర్వదా సుఖదుఃఖాలతో ముడిపడి వుంటాడు. ఈ శరీరం పాప పుణ్య మిశ్రమ కర్మవలన పుట్టింది. కాబట్టి సుఖ దుఃఖాలు అనుభవించి తీరవలసిందే. ఎవరికైనా సుఖం తరువాత దుఃఖం, దుఃఖం తరువాత సుఖం కలుగుతుంది. రాత్రి పగలు మాదిరి జీవులకిది తప్పదు. కాబట్టి సాధకుడు వాటికి జంకకుండ, ఆధ్యాత్మిక సాధనలో ముందుకు పయనించాలి తప్ప వెనుకంజ వేయరాదు.
- ధన సంపాదన చేయుచున్నంతవరకే దారాసుతాదులు నిన్ను ప్రేమింతురు. నీవు అశక్తుడవైనప్పుడు నిన్నొకరు చూడరు.

కాబట్టి వెర్రిభ్రమలు విడిచిపెట్టి, సదా భగవంతుని భజింపుము (శ్రీ శంకరాచార్యుల వారు)

- పూజలలోకెల్ల ఉత్తమ పూజ ఇతరులకు ఉపకారము చేయుట. నీకున్నది నీవు తిను కాని దానిలో కొంతభాగము ఒక ప్రాణికి సహకరించుటకు ఉపయోగించు. లోభత్వము వదిలిపెట్టు, ఒకరి బాధ నీ బాధగా తలంచు, నీవు సుఖముగా సంతోషంగా, ఆనందంగా శాంతిగా వుండాలనుకొంటున్నావు. ఎదుటి వ్యక్తి కూడా అలాగే వుండాలని కాంక్షించు. ఈ విధముగా సద్గుణాలనే పూలతో పూజించు. అదే ఉత్తమ పూజ. విశేష పూజ. దానికే అధిక ఫలితం. అట్టి సద్గుణాలనే పూలతో భగవంతుని పూజించి, దుర్గుణాలనే ధూళిని దులిపి, దేహమనే దేవాలయమును పవిత్రముగా, ప్రశాంతముగా వుంచుకోవాలి. ఇట్టి పరమపవిత్రమైన సద్గుణాలను అవలంభించుట ద్వారా పరమాత్మను పొందగలుగుతాము.
- ఆత్మజ్ఞానం పొందాలంటే ముందు మనసుని సుద్ధం చేసుకోవాలి. మనలోని రజోగుణ, తమోగుణాలు అంతరించిపోవాలి. దైవీ గుణాలు అలవరచుకోవాలి. కామక్రోదాధి అరిషడ్వర్గమును జయించాలి. పరిశుద్ధ మనసుగలవారికే ఆత్మానుభూతి కలుగుతుంది. అప్పుడే మానవజన్మ సార్ధకము కాగలదు.
- పట్టుదల, సహనం, వైరాగ్యం, అభ్యాసం వుంటేనే జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం, సమాధి సిథించాలంటే దృఢమైన వైరాగ్యం కలగాలి. విషయాదులందు ఏ మాత్రం కోరిక వున్నా సమాధి సిద్ధించదు. దృఢమైన వైరాగ్యం గలవానికి సమాధి స్థితి సిద్ధిస్తుంది. సమాధి పొందినవారికి దృఢమైన జ్ఞానం కలుగుతుంది.
- ధర్మానికి లక్షణాలు, సత్యం, దయ, తపస్సు, శౌచం, వివేకం, మన సంయమము, ఇంద్రియ సంయమము, అహింస,



బ్రహ్మచర్యం, త్యాగం, స్వాధ్యాయము, సంతోషము, సమదర్శిత్వం, మహాత్ముల సేవ, సద్బుద్ధి, మౌనం, ఆత్మచింతన, అన్నదానము ఆత్మభావము కలిగి వుండటము, ఇష్టదేవతాభావన, భగవంతునికి ఆత్మ సమర్పణ, భగవంతుని భక్తితో ఆరాధించడము ఇవి ధర్మము యొక్క లక్షణములు.

- మంచిపని చిన్నదియైనను అది పెద్ద పనులకు దారితీస్తుంది.
- మీ ఆదాయమునకు మించిన ఖర్చులు చేసిన యెడల మీరు కష్టాలు పాలగుదురు. కావున ఆదాయానికి మించని ఖర్చుతో సర్వదా జీవించడం ఎంతో మేలు.
- కాలము అనేది సర్వసంపదలకంటె విలువైనది. కావున కాలమును వృథా చేయకండి.
- మీరు వృద్ధాప్యములో ఖర్చుపెట్టుకొనుటకు, మనఃశాంతిగా జీవించుటకు, యవ్వన కాలములో కావలసిన ధనమును, మంచిని సంపాదించుకోండి.
- చెడును ధైర్యముగా ఎదుర్కొంటూ, మంచి కొరకు సాహసముతో పోరాడండి. ఈ సమాజములో మంచి చెడులు రెండూ వుంటాయి.
- నీ సిరిసంపదలు, హోదా, సౌఖ్యము, ఇవి మనిషికి గ్యారంటీ యివ్వవు. వస్తూపోతూ వుంటాయి.
- కష్ట సమస్యలు వచ్చినపుడు బాగా ఆలోచించి, సజ్జనుల సలహాలు తీసుకొనిన తరువాత నిశ్చయముగా పరిష్కరించుకొనుము.
- నీ తల్లిదండ్రుల, గురువుల, పెద్దల యొక్క సలహాలను, సూచనలను పాటించుము.
- పెద్దల యందు గౌరవము, పిన్నలయందు ప్రేమ, వృద్ధుల యందు కరుణ, దయ కలిగి యుండవలెను.

- ఆత్మ సాక్షాత్కారానికి సాధనలో ఎంతో ఓర్పు అవసరము.
- నిజమైన స్నేహితుడు, నీ సౌఖ్యమును ఇనుమడింపజేయును. నీ దుఃఖములలో పాలుపంచుకొనును.
- ఒక కుళ్ళిపోయిన యాపిల్‌పండు ఆ బుట్టలోని పండ్లన్నిటిని ఏ విధముగా పాడుచేస్తుందో ఆ విధముగనే ఒక చెడ్డ స్నేహము వలన మనకు కూడా అట్టి యిబ్బంది కలుగును. అటులనే మంచి స్నేహము పొందటానికి కొంత ఖర్చుచేసినా పరవాలేదు. గాని ఎంత ఖర్చు చేసైనా చెడు స్నేహాన్ని వదిలించుకోవడం చాలా ఉత్తమం.
- ఇతరులు చేసిన కీడును, మంచి వారిని మన్నింపుము. అప్పుడు నీవు ఈశ్వరత్వమును పొందెదవు.
- నీవు జీవితమును ధైర్యముగా ఎదుర్కొనుము. కీర్తివంతమైన భవిష్యత్తు నీకై వేచియుండును.
- మనస్సును అదుపులో పెట్టుకొనుము. అహంకారమును అణచివేయుము.
- శరీరము, మనస్సు, ఆత్మ ఈ సమ్మేళనమే మానవుడు.
- విచక్షణా జ్ఞానము లేనివాడు నిజమైన గ్రుడ్డివాడు.
- మన శరీరములోని అవయవాలన్నిటిని హరిసేవకు, మానవ సేవకు మాత్రమే వినియోగించాలి. అప్పుడే భక్తి, మానవత్వం పరాకాష్టకు చేరుతుంది.
- నీ సత్ ప్రవర్తనమే, నిజమైన సుఖమునకు దారితీయును.
- బాధలలో వుండేవారితో దయతో మాట్లాడుట దానము చేసిన దానితో సమానము.
- సత్యము, ప్రేమ, దయ, మంచితనము, కరుణ ఇవియన్నియు ఒక్కటే. అంతే గాక ఒక్క కోవకుచెందినవే.



- అనుభవానికి మించినది మరొకటి లేదు. చిలకపలుకుల్లా ఎన్ని శాస్త్రాలు వల్లించినా, అనుభవం కలవారితో సరితూగ లేరనేది జగమెరిగిన సత్యం. అంతేకాదు చదివిన దానికంటే అనుభవం ఎన్నోరెట్లు మేలు సుమా.
- తెలియని విషయాన్ని తప్పుగా మాట్లాడి అపఖ్యాతి పాలయే కన్నా, అసలు మాట్లాడకుండా ఉండటం ఎంతో ఉత్తమం.
- పూలమాలతో చేరడం వల్ల, దారం కూడా గౌరవం పొంది నట్లు సజ్జన సహవాసము వల్ల గౌరవింపబడతారు.
- నీవు సత్యవంతుడువు అయితే తక్కిన అన్ని సద్గుణములు నీ వద్దకు సకాలములోనే వచ్చి చేరుతాయి.
- మంత్రజపము మనస్సును శుభ్రపరచి, దానిని భగవంతుని వైపు నడిపించును.
- ఈ భౌతిక దేహం వున్నంతకాలం సుఖం, దుఃఖం, కష్టం, నష్టం ఆరోగ్యం అనారోగ్యాలు వస్తూ వుంటాయి. వాటికి చలించక, దైవ మార్గములోనే ప్రయాణించాలి.
- ఎంత చిన్న విషయమైనా ఇచ్చినమాట నిలబెట్టుకోవడము చాలా ముఖ్యమైనది.
- చెప్పడమే నాధర్మంయని అనుకోవద్దు. వాటిని ఆచరించి, ఇతరులను మార్గదర్శకులుగా ఆదర్శంగా వుండాలి.
- ఏమి జరిగినా దానిని చిరునవ్వుతో స్వీకరించు. అది భగవంతుని అనుమతితో జరిగినదేయని గ్రహించు.
- గురువు మీకు దారిని మాత్రమే చూపుతాడు. కాని మీరు కడవరకు ప్రయాణించవలసినదే ఎంతో ఓర్పుతో.
- ఇతరులపై ఆధారపడక మీ పనులను మీరే చేసుకొనండి. దీనివల్ల ఆత్మ విశ్వాసము పెరుగుతుంది.

- మోసపు మాటలతో వంచించినవారు. అదే బాటలో వంచనకు గురియవుతారు.
- తోటివారికి సహాయం చేసిననూ, చేయకపోయిననూ అన్యాయము మాత్రము చేయకుము.
- తల్లిదండ్రులను, గురువులను, పెద్దలను గౌరవించుట మన సంప్రదాయం. పెద్దల అనుభవాలే మనకు గుణపాఠాలు. అనుభవాలకు మించిన విద్య మరొకటి లేదు. ఏ విద్యకైనా గురువు తప్పనిసరిగా వుండి తీరవలసినదే.
- తూర్పుదిక్కునకు అభిముఖంగా కూర్చొని చేసే పూజ ఐశ్వర్య ప్రదం. విష్ణువునకు తులసీదళం. లక్ష్మీదేవికి పానకం, వడపప్పు, చలివిడి, శివునికి అభిషేకం, విష్ణువునకు అర్చన ప్రీతికరం.
- దేవీ పూజ సౌభాగ్యకరం, సూర్యుడు నమస్కార ప్రియుడు. క్షీరాన్నం నైవేద్యం పెట్టాలి. వినాయకునికి కుడుములు ప్రీతికరమైనవి.
- పూజా సమయములో శరీరము మనస్సు రెండూ శుద్ధిగా వుండాలి.
- వేయించిన గింజలు మొలకెత్తలేనట్లే. చిత్తశుద్ధిలేని మనస్సు ఫలితాన్ని పొందలేదు.
- సముద్రమున అనంతమైన అలలు వున్నట్లే. సంసార సాగరమున కూడా జన్మ, మృత్యురూపమైన, సుఖ, దుఃఖ తరంగాలు అనంతముగా నుండును.
- పొగచేత అగ్ని, ధూళిచేత అద్దము, మాయచే జీవుడు కప్పివేయ బడినట్లు కామముచే జ్ఞానము కప్పివేయబడింది. (భగవద్గీత)
- హోమములో నెయ్యి, సమిధలు వేసిన కొలది అగ్ని వృద్ధి అయినట్లే భోగములు అనుభవించిన కొలదీ, భోగ తృష్ణ



పెరుగుచునే యుండును.

- బియ్యము అన్నముగా మారడానికి, నిప్పు, నీరు కావాలి. అలాగే మనిషి మాధవుడు కావడానికి సత్ ప్రవర్తన, సత్‌బుద్ధి కావాలి.
- బుద్ధిబలముతో మనస్సును వశపరచుకొని, కామ రూప శత్రువులను జయించవచ్చు.
- రాత్రివేళ సర్వత్రా వ్యాపించిన అంధకారము, సూర్యోదయమయి నంతనే పటాపంచలైపోయినట్లు, పరమాత్మ తత్త్వజ్ఞానము కలిగినంతనే మోహ జనిత వికారములు నశించును.
- సూర్యుడు ప్రతి రోజూ ఉదయిస్తూ, అస్తమిస్తూ వుంటాడు.కాని జ్ఞాన సూర్యుడు ఒకసారి ఉదయిస్తే మరల హస్తమించడు. పరమాత్మ జ్ఞానము శాశ్వతమైనది. అది ఎన్నటికి నశించదు.
- అగాధము, అపారము అయిన సముద్రమను నౌకద్వారా ఆవలి తీరము చేరవచ్చు. అలాగే మహాపాపకర్మలు జ్ఞాన నౌకద్వారా అవలీలగా సంసార సముద్రమును దాటవచ్చు.
- తెలియనిది తెలియదనుకుంటే తెలుసుకునే ప్రయత్నము చేయవచ్చు. కాని తెలియకపోయినా తెలిసినట్లు నటించడం నిన్ను నువ్వు మోసగించుకొన్నట్లే.
- గర్వముతో చేయు ధర్మము, కోపముతో చేయు సేవ, ప్రేమ లేనిచోట భోజనము వ్యర్థములు.
- దేహము నీటివలన, మనస్సు సత్యము వలన, జీవుడు భగవ ధ్యానము వలన పరిశుద్ధమగును.
- పృథ్విగంధాన్ని, అగ్ని తేజస్సును, వాయువు స్పర్శను, జలము రుచిని ఆకాశం శబ్దాన్ని, చంద్రుడు శీతలాన్ని, సూర్యుడు ప్రకాశాన్ని యముడు ధర్మాన్ని కలిగివుంటారు. ఇవి వారి సహజ లక్షణములు
- భూతదయలేని తపము, విరక్తిలేని త్యాగము, సత్యములేని

వాక్యము పరోపకారము లేని ప్రయాస వ్యర్థములు.

- చేసిన ఉపకారము మరిచేవాడు. ఇచ్చిన దానితో తృప్తిపడని వాడు శక్తివుండి కూడా ఇవ్వనివాడు పాపకర్ములవు తారు.
- భోగాలకు ఖర్చుచేసి రోగాలను కొనితెచ్చుకోకు. మంచి పనులకు ఖర్చుచేసి పుణ్యాన్ని సంపాదించుకో. ఆ పుణ్యమే నిన్ను కాపాడ గలదు. నిదానముగా ఆలోచించి మాట యివ్వుము. ఇచ్చిన మాటను పాటింపుము.
- పదవుల కొరకు ప్రాకులాడుటకంటే పరమాత్మ కొరకు ప్రయత్నించు శరీర సౌందర్యము లేదని బాధపడవద్దు, మనోబలము కావాలని మనసారా ప్రార్థించు.
- దేవుడు విశాలహృదయుడు. నీవు దుఃఖము పొందినపుడు భగవంతుని శరణుపొందు. నిత్యము దేవునియందు భక్తి కలిగియుండు. అప్పుడే పూర్ణశాంతిని పొందగలవు.
- మధురవాక్కు కోపాన్ని చల్లబరుస్తుంది. కఠినమైన వాక్కు కోపాన్ని రెచ్చగొడుతుంది.
- ధనము, ప్రాపంచిక వస్తువులు పోయినచో వాటిని తిరిగి సంపాదించుకొనవచ్చును. కాని పోయిన సమయము తిరిగి సంపాదించలేము.
- ధర్మప్రవర్తనమే దైవమును చేరుటకు మార్గము.
- భగవంతుడు నీకు యిచ్చినది చాలు అనుకొనుటయే జీవితములో తృప్తికి ఏకైక మార్గము.
- ఒక్కమారు త్రికరణ శుద్ధితో చేసిన ప్రార్థన భగవంతుని కదిలించును. ఈలాంటి ప్రార్థన వలననే నీకు భగవదను భూతి కలుగును.
- దేవుని పేరు సత్యము. ప్రేమయే దేవుడు. ప్రేమగలవాడు దేవునిలో జీవించువారేయగుదురు.



- ప్రపంచములో ఏ స్థానమునకు వెళ్ళిననూ తాను చేసిన కర్మ యొక్క ఫలితము నుండి ఎవరును తప్పించుకోలేరు.
- పొలములో రైతువలె శ్రమపడిననే గాని, ఏ కార్యమందు సిద్ధి కలుగదు. సాధనద్వారా ఆత్మ దర్శనమునకు మార్గము తెలియ బడుతుంది.
- గంగానదిలో స్నానము చేస్తే పాపాలుపోతాయి అంటారు. జ్ఞానిని దర్శిస్తే ఆ పాపము చేసే బుద్ధిపోతుంది.
- దైవమును చేరుటకు మార్గము సత్ ప్రవర్తన, దైవచింతన, అందరికి సహాయము చేసే మంచి స్వభావము వుండాలి.
- సత్సంగములో చేరినపుడు సద్భావములు మనలో ఆవిర్భవిం చును. ఇది నిత్య సత్యము.
- దానము చేయునపుడు శ్రద్ధతో చేయవలయును, సంపద ననుసరించి చేయవలయును. ప్రత్యుపకారము కోరక దానము చేయుట మంచి లక్షణము.
- నిరంతర భగవన్నామ స్మరణలో ఆత్మానందము తప్పక లభిస్తుంది. ప్రయత్నించి ఫలితము పొందండి.
- ధనము మిక్కిలి కష్టముచే పొందబడుచున్నది. మూఢులు తృప్తిరహితులై దొరికిన దానితో సంతసింపరు. జ్ఞానులట్లుగాక లభించిన దానితో సంతోషించెదరు.
- మానవుడు అజ్ఞానిగా పుట్టినా జ్ఞానిగా మరణించాలి. ఏడుస్తూ జన్మించినా నవ్వుతూ శరీర పరిత్యాగం చేయాలి.
- గురుభక్తిగలవారు, దైవభక్తిగలవారు సంసార సాగరమును సులభముగ దాటివేయగలరు. కాబట్టి మోక్షము యొక్క ప్రాప్తి కొరకు జనులు దైవభక్తి మరియు గురుపాదములు తప్పక ఆశ్రయించాలి.
- పుణ్యకర్మలుచేసిన మాత్రమే భక్తికలుగును. భక్తిచే జ్ఞానము.

జ్ఞానముచే మోక్షము కలుగును. ఇదియే శాస్త్రముల యొక్క నిశ్చయాభిప్రాయము.

- ఈ శరీరము ఒక పచ్చికుండ దీనిని నమ్మి విశ్రమీగకుము. దైవమంత్రముచే దీనిని పరిశుద్ధమొనర్చుకొని జన్మరాహిత్య మును బొందుము.
- అహంకారమనేది మనిషిని - దైవాన్ని వేరుచేసి మాయలో పడవేస్తుంది.
- అహింసలో పరిపూర్ణత సాధించడానికి ఏ జీవితోను శత్రుభావం వుండకూడదు.
- అన్ని శాస్త్రాలు బాహ్యాన్ని మాత్రమే వివరిస్తాయి. కాని ఆధ్యాత్మిక శాస్త్రమొక్కటే అంతర్యాన్ని తరచి ఆత్మానుభూతిని అందిస్తుంది.
- అభ్యాసము - వైరాగ్యములనే రెండిటితో మనస్సును వశపర చుకోవచ్చు.
- అహం బ్రహ్మాస్మి అంటే - అహం చస్తే బ్రహ్మమే మిగులుతుంది.
- అవతార పురుషులకూ - కారణజన్ములకు - అన్ని విద్యలూ వాటంతటవే వచ్చి ఆశ్రయిస్తాయి. వారి గురు శుశ్రూష నామమాత్రమే.
- ఇంద్రియములను వశములో నుంచుకొనినవాడు, సకల భూతములలో నుండు ఆత్మను, తనలో వుండు ఆత్మను ఒకటిగా కనుగొనువాడు మాత్రమే శాశ్వత సుఖము నొంద గలడు.
- అనుకోని విధంగా ఎప్పుడైనా సజ్జనసాంగత్యము కలిగితే దానిని వదలిపెట్టకండి, దాని వలన కలిగే మేలు ఇంత అని లెక్కపెట్టుటకు వీలుకానిది
- అగ్ని స్పర్శలేనిదే వంట జరగనట్లే జ్ఞాన సాధన లేనిదే జన్మ సార్థకము కాదు మోక్షము దొరకదు. (శ్రీ శంకరాచార్యుల వారు)



- అనుభవము ద్వారా కలిగిన జ్ఞానం ఒక్కటే అజ్ఞానాన్ని నాశనం చేస్తుంది. ఆత్మ విచారణ వల్ల తప్ప మరే సాధన ద్వారాను జ్ఞానం రాదు. నేనెవరిని ఈ ప్రపంచము ఏమిటి? దీనికి కర్త ఎవరు? అని ఆలోచించాలి. (శ్రీ శంకరాచార్యులవారు)
- అత్తమామలను, ఆడబిడ్డలను, మరదులను విడచిపెట్టి, భర్తతో వేరు కాపురం కోరు స్త్రీ మరుజన్మలో ఆడకుక్కగా పుడుతుంది. (శ్రీ గురుచరిత్ర)
- ఆత్మజ్ఞానానికి చిత్తశుద్ధికావాలి, చిత్తశుద్ధి కలగాలంటే విగ్రహా రాధన నిష్కామ కర్మ వుండాలి. జ్ఞానవంతులకు ఆత్మభావనే వుండుట మంచిది. (శ్రీ గురుచరిత్ర)
- ఆత్మ సకల ప్రాణులలో వుంటుంది. అతి సూక్ష్మమయినది. దేనికీ లొంగనిది. చావు పుట్టుకలు లేనిది. (కఠోపనిషత్)
- ఆత్మ శరీరములోనికి రావడమే జననం - శరీరాన్ని విడవడమే మరణం.
- ఆత్మే ఈ జగత్తుకు మూలం. ఆత్మవల్లనే ఈ లోకాలు చైతన్య వంతమయినాయి. (చాందోగ్యోపనిషత్)
- ఆత్మ సహజమైనది. అది ప్రాణులకు చైతన్యాన్ని కలిగిస్తుంది. శరీరం వేరు ఆత్మవేరు కాని రెండూ కలిసి వుంటాయి. (తైత్తరీయ బ్రాహ్మణము)
- ఆత్మను సాక్షాత్కారం చేసుకోవడం చాలా కష్టం - అయితే చేసుకున్నవారు వేలమంది వున్నారు. ఎంతో సంకల్ప శక్తి కావాలి.
- ఆత్మకు తెలియకుండా ఏమీ వుండదు. బుద్ధిని మనస్సును చూస్తుంది. అన్నిటికి సాక్షిభూతమదే. అందుకే అందరూ ఆత్మ స్వరూపులే. (శ్రీ శంకరాచార్యులవారు)
- ఆత్మానుభవంకలగాలంటే నిరంతరం అభ్యాసము చేస్తుం

డాలి. జిజ్ఞాసువు నిర్గుణబ్రహ్మోపాసన చేస్తుండాలి.

- ఆదిశంకరులు తన 8వ ఏటనే నాలుగు వేదాలు పూర్తి చేశారు. 12వ యేట వేదాంగాలన్నిటిని తెలుసుకున్నారు. 16వ యేట భాష్యాల రచన పూర్తిచేశారు. 32వ యేట శివసాయుజ్యం పొందారు. (సంస్కృత శ్లోకం)
- స్త్రీ సంతోషం ఆమె తల్లిదండ్రులు స్నేహితుల చిరునవ్వులో కనబడదు. నిజానికి ఆమెలో కూడా కనబడదు. ఆమె భర్తే ఆమెకు ఏకైక సహచరుడు. అతడే ఆమెకు స్వర్గం. (రామాయణం)
- ఆందోళన, ఆత్రుత నిస్పృహ వంటివి మానవులలో క్రొత్త క్రొత్త రోగాలను సృష్టిస్తాయి.
- ఆత్మ దేహంలోనే వున్నది. అయితే అది మామూలు కళ్లకు కనిపించదు. తపస్సు, వైరాగ్యము, భక్తి, జ్ఞానము గలవారికే అది కనిపిస్తుంది.
- ధర్మాన్ని ఆచరించేవారు దీర్ఘాయుష్షును, కోరిన కోరికలను, ధనసంపత్తిని కలిగి వుంటారు. ఆచారం అన్ని అవలక్షణాలను, దోషాలను పోగొడుతుంది.
- ఆత్మను అనుభవపూర్వకంగా తెలుసుకొన్నవాడే యోగి. అతడికి ఈ లోక సంబంధమేమీ వుండదు. అతని చిత్తం పరిశుద్ధం. అతడే ఆత్మానందాన్ని అనుభవిస్తాడు. (శారద పరివ్రాజకోపనిషత్)
- ఆరోగ్యమైన దేహం, అందమైన భార్య, మంచి సంతానము, కావలసినంత ధనము, మంచి కీర్తి ప్రతిష్టలు వున్నవాడు ఎంతో అదృష్టవంతుడంటారు. కాని అతడు దుఃఖితుడే. వాడి చిత్తం వీటన్నిటి మీదనే వుంటుంది. ఇక వీడెప్పుడు జ్ఞానాన్ని పొందుతాడు. ఎవని చిత్తము ఎప్పుడూ బ్రహ్మము నందుంటున్నదో, అతనిదే నిజమైన ఆనందము. అతని స్వరూపం ఆనందం. అతడు నిత్యము ఆనందముతోనే వుంటాడు



(పతంజలియోగసూత్రాలు)

- ఇతరులు దాచుకొన్న ధనమును దొంగిలించినవాడు దుఃఖముల పాలవుతాడు. ధనాన్ని కాజేసినవాడు ఒంటెగను, పండ్లను కాజేసిన వాడు కోతిగనుపుడతారు (శ్రీగురుచరిత్ర)
- ఇతరుల దుఃఖాన్ని చూచి ఎల్లప్పుడూ తల్లడిల్లేవారు. సర్వప్రాణుల హితమూ కాంక్షించేవారు మహాత్ములు (ఋషులు).
- ఇతరులు అడిగినప్పుడు తెలిస్తే చెప్పకపోవడం, కాని విషయాన్ని తారుమారు చేసి చెప్పడం నేరం. తెలియనివారికి తెలియజెప్పడం భూదానము చేసినంత ఫలితం కలుగుతుంది. (మహాభారతము)
- ఇతరుల దోషాలు ఎంచకు, ఎంచితే నీ దోషాలను భగవంతుడు ఎంచుతాడు. (ఏసుక్రీస్తు)
- ఇంద్రియాలు కోర్కెలవైపు ప్రసరించినపుడు వివేకంతో మంచి చెడు తెలుసుకొని చెడు తలంపులు కార్యరూపం దాల్చకుండా ప్రయత్నించాలి. (శ్రీ సాయిబాబా)
- దేహము కంటె యింద్రియములు గొప్పవి. ఇంద్రియముల కంటె మనసు గొప్పది. మనస్సు కంటె బుద్ధి గొప్పది. బుద్ధి కంటె గొప్పదే ఆత్మ (భగవద్గీత)
- ఇక్కడ నుండి ఏదో ఒక రోజున పోక తప్పదు. పోయేనాటికి కొంత మంచిని మూటగట్టుకొని పో, పరలోకములో సహాయపడుతుంది. ఇక్కడ నీవెన్ని మూటలు గట్టినా ఇందులో చిల్లిగవ్వకూడా నీ వెంటరాదు. (శ్రీ స్వామి బ్రహ్మానంద సరస్వతి)
- ఇతరులకు సహాయపడటం వారిని ప్రేమించడం నేర్చుకో,అదే యీ జన్మలో నీవు నేర్చుకొనదలచినది. (శాస్త్రాలు).
- ఇవాళ నీవు అనుభవిస్తున్న సుఖం దుఃఖం ఆనాడెప్పుడో నీవు తయారుచేసి పెట్టుకున్నవే. (ఖలీల్ జిబ్రాల్)

- నిత్యము ఆచరించదగినవి 1) తల్లిదండ్రులను పూజించుట 2) భర్తను ప్రేమించుట 3) సమస్త జనులయందు సమత్వ బుద్ధి గలిగియుండుట 4) మిత్ర ద్రోహానికి పాల్పడకుండుట 5) సర్వేశ్వరుని యందు భక్తి కలిగియుండుట. ఈ అయిదింటిని మహాయజ్ఞములంటారు. (వేదవ్యాసుడు పద్మపురాణం)
- ఈ శరీరమే పరమాత్మకు నిలయమైన దేవాలయము. మానవుని మనస్సు ధర్మసాధనలకు ఈ శరీరమే ఆధారం. అందుకు ఈ శరీరమనే గృహాన్ని శుద్ధంగా వుంచుకోవాలి. అందుకు భక్తియే ప్రధానం. (శ్రీ శంకరాచార్యులవారు)
- ఈశ్వరారాధనయనగా :- దేవునికి గుళ్ళో ధూప, దీప, నైవేద్యాలను సమర్పించడము కాదు. స్వధర్మాన్ని ఆచరిస్తూ దాని ఫలితాన్ని ఈశ్వరునకు అర్పించడమే నిజమైన ఆరాధన.
- ఈ ప్రపంచములో ఏది మనది అని ప్రాకులాడుతున్నామో అది మన స్వంతం ఏనాటికి కాదని మన వారే మనకు గుర్తుచేస్తారు. ఈ జీవుడు పోయేడప్పుడు నావారు అనుకునే వారు వెంటరారు. యమదూతలు ఎప్పుడు ఎలా వచ్చేది, ఎక్కడికి తీసుకొని వెళ్ళేది ఎవరికి తెలుసు. ప్రాణం పోయిందని ఏడవడం తప్ప బంధువులు, స్నేహితులు, భవనాలు, సంపదలు, కీర్తి ప్రతిష్టలు అన్నీ మరణంతో మనలను విడిచి పోతాయి. మనము చేసిన పాపపుణ్యాలే మనలను వెంబడించును.
- ఏ మానవుడు పరోపకారాన్నే తన పరమలక్ష్యంగా చేసుకొని నిష్కామ భావంగా పనులు చేస్తుంటాడో అటువంటివారికి భగవంతుని కృప ఎప్పుడూ వుంటుంది.
- ఏది మనస్సులో సంకల్ప వికల్పములు చేయదో దేని చేతనైతే ప్రాణుల బుద్ధి పనిచేయుచున్నదో అదే బ్రహ్మం. ఎవరైతే సత్యంపై విశ్వాసముంచి ధర్మాన్ని అనుసరించి, సంపదను



కీర్తిని కలిగి వుంటాడో అతడెక్కడున్నా గౌరవింపబడతాడు. (బుద్ధుడు)

- ఎంతో తపస్సు చేసిన మీదట నేను కనుగొన్న సత్యం ఏమిటంటే ప్రతి జీవియందు భగవంతుడున్నాడు. అంతకు మించిన దైవం లేడని ఎవరు సాటి జీవులను (దయతో) గౌరవంగా చూస్తారో వారే నిజమైన దైవారధకులు. (స్వామి వివేకానంద)
- ఎవరు మహానుభావులను సేవిస్తారో అతడే మాయను దాటగలడు. (నారద మహర్షి)
- ఓం తత్ సత్ అను మూడు పదాలు బ్రహ్మమును సూచించును. ఈ పదాలను యజ్ఞ సమయములో మంచి పనులు చేసేటప్పుడు, తపస్సు వేళలో (భక్తిగా యున్నప్పుడు) దానములు, సహాయము చేయునపుడు అనినచో సర్వదోషాలు తొలగును.
- ఓం తత్ సత్ అనునవి పరబ్రహ్మము యొక్క పేర్లు, పూర్వము ఆ పేరులతోనే బ్రాహ్మణులు, వేదాలు, యజ్ఞాలు ప్రారంభించెడివారు. వీటిని ఉచ్ఛరించినంత మాత్రముననే వేద, యజ్ఞ ఫలములు వచ్చును.
- ఓం నమో నారాయణాయ అనే అష్టాక్షరీ మహామంత్రమును మనసారా ఎవరు స్మరించుతారో వారు పూర్ణాయుర్దాయము కలిగి అమృతత్వాన్ని పొందుతారు.
- ఓం అన్న పదం హైందవుల ప్రతి మంత్రానికి ముందుంటుంది. అసలు ఈ సృష్టి ఓంకారముతోనే ప్రారంభమయినదని మన ఋషులు కనిపెట్టి చెప్పారు. ఇది ఎంతో పుణ్యప్రదమైనది. మనస్సును ప్రశాంతమైన, నిశ్చలమైన ఏకాగ్రతకు తీసుకొని వెళ్ళుతుంది అంటారు.
- ఓ మానవుడా సదా ప్రేమతో రామనామాన్ని ఉచ్చరించుము.

కలియుగంలో అది ఉత్తమమైన సాధనం. (తులసీదాసు)

- కర్మకారణంగా శరీరం ఏర్పడింది. పూర్వజన్మ సుకృత దుష్కృత కర్మవలన సుఖ-దుఃఖములు ఏర్పడతాయి. జన్మాంతర సంస్కార మును బట్టి జీవునికి సుఖదుఃఖాలు ముందే నిర్ణయమవౌతాయి. దేవతలైనా యీ కర్మగతిని తప్పించుకోలేరు. జీవుడు దేహాన్ని ఆశ్రయించుకొని వుంటాడు. దేహము కాలానికి కట్టుబడి వుంటుంది. గుణకర్మలకధీనుడైన శరీరధారి విధిచేత కీలుబొమ్మల వలె తిరుగుతూ వుంటాడు. అందుకే ఇది పెద్ద మాయ. (శ్రీ నరసింహ సరస్వతి స్వామి)
- సత్కర్మలు చేస్తూ ఆ కర్మల ఫలమును కోరక, పాపాలను పోగొట్టు కొని మంచి సాంగత్యము అలవరచుకో. (శ్రీ శంకరాచార్యులవారు)
- కామ క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యం అను ఈ ఆరు మనిషిని పతనం చేస్తాయి. అయితే భగవద్గీత పారాయణ అర్థ, భావము వలన వీటిని జయించవచ్చు.
- క్రమశిక్షణ లేకపోతే బుద్ధి నిలకడగా మనస్సు ఏకాగ్రతగా వుండదు. ఏకాగ్రత లేకపోతే శాంతి వుండదు. శాంతి లేకపోతే సుఖం ఎక్కడ నుండి వస్తుంది.
- గతజన్మలో పెట్టి పుట్టినవారే ఈ జన్మలో భాగ్యవంతులుగ పుడతారు.
- గురువు, దైవము, తీర్థము, సర్వమును భర్తే అనుకొను స్త్రీ పతివ్రత. ఆమె పాదస్పర్శచే భూమి పవిత్రమవుతుంది. సూర్య చంద్రులు తమ కిరణములు పతివ్రతను తాకినను చాలని అనుకొందురు. వాన, గాలి పతివ్రతను తాకిన చాలను కుంటారు. ఆమె ఒకసారి నదిలో స్నానం చేసిన, అంతకు ముందు స్నానము చేసిన కోట్లాది పాపుల పాపం ప్రక్షాళన మవుతుందని నదులు తలపోస్తుంటవి. (శ్రీ గరుచరిత్ర)
- గంగలో మునిగితే పాపాలు పోతాయంటారు. (శరీర కర్మలు



తగ్గుతాయి). కాని జ్ఞాన గంగలో మునిగి, పరిశుద్ధ కర్మలు చేసినపుడే ఆత్మ పవిత్రమవుతుంది. (ప్రజాపిత బ్రహ్మ)

- చిత్తశుద్ధి, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను, జీవాత్మను పరమాత్మయందు విలీనం చేసి జనన మరణ సంబంధము నుండి ముక్తిపొందుటయే యోగము. (కుండలినీ సిద్ధమహా యోగము)
- చెట్టున పండిన పండు నేలరాలిపోతుంది. మళ్ళీ దానిని కొమ్మకు అంటించడము వీలుపడదు. ఆ విధముగనే ఎన్నో జన్మల పుణ్యము చేతను దుర్లభమైన ఈ మానవజన్మ లభించినది. ఈ ప్రపంచం ఒక భ్రాంతి (కల), ఈ శరీరము ఈ జీవితము ఒట్టి మాయ. మనలను విముక్తి చేసేందుకే దైవం మనకీ మానవజన్మ యిచ్చాడు. ఈ వచ్చిన జన్మను సద్వినియోగము చేసుకోవాలి. ఈ వచ్చిన అవకాశాన్ని జారవిడువక భగవంతునియందు భక్తి గలిగి మంచిగా వుండు. (కబీరు)
- జ్ఞానుల ముందు, పూజనీయుల ముందు క్రిందనే కోర్చోవాలి. వారు నడిచివెళ్ళుతుంటే వాహనం మీద వెళ్ళరాదు. అలా చేసిన ఆయుర్థాయం తగ్గిపోతుంది. (శ్రీ గురుచరిత్ర)
- జన్మజన్మల వాసనలచేత మనసు మలినమై వుంటుంది. అందుకని దైవాన్ని స్మరించడం కష్టమవుతుంది. అయినా ప్రయత్నిస్తూనే వుండాలి. అభ్యాసము వలన సాధించవచ్చు. (స్వామి బ్రహ్మానంద సరస్వతి).
- జీవించాలి అనే ఉద్దేశ్యం ఎందుకు కలిగి వుండాలంటే ఇంత వరకూ దైవ దర్శనం కాలేదు గనుక, అందుకు బ్రతికివున్నా నని అనుకోవాలి.
- జ్ఞానుల మాటలో అంతరార్థం ఎంతో నిగూఢంగా వుంటుంది. అందుకే జ్ఞానిని జ్ఞానే గుర్తిస్తాడు. (స్వామి బ్రహ్మానంద సరస్వతి)

- జీవితంలో ఒడుదుడుకులు వస్తూనే వుంటాయి. వాటికి చలించక కామ మోహాలకు లోబడక నుండువారికే శాంతి కలుగుతుంది.
- జపాలలో స్వాధ్యాయ జపం అని ఒకటున్నది. ప్రతి రోజూ కొంత సమయము భగవద్గీత, రామాయణ, భారత, భాగవతాల వంటి ధార్మిక గ్రంధాల పఠనం పరిశీలన చేస్తూ వుంటే స్వాధ్యాయ జపం చేసినట్లే.
- జ్ఞానికి సంకల్పమంటూ ఏదీ వుండదు. (శ్రీ రమణ మహర్షి)
- జ్ఞానం పొందాలంటే మనసు నిర్మలంగా వుండాలి. నిష్కామ కర్మ చేసినప్పుడు మాత్రమే మనసు నిర్మలమ వుతుంది. అందుకే మొదట చేయవలసినది నిష్కామకర్మయే. (శ్రీకృష్ణ భగవానుడు - భగవద్గీత)
- జీవులకు యీ ప్రపంచము పాంచ భౌతికముగా కనబడినా జ్ఞానికి ఇదంతా పరబ్రహ్మ స్వరూపంగా కనబడుతుంది. (శ్రీకంచిస్వామి)
- జ్ఞానులు తమ మనస్సును నాయందే నిలిపి, ఇంద్రియ నిగ్రహము గలవారై ఎల్లవేళలా నా గురించే భావన చేస్తూ నా గురించే చర్చించుకుంటూ వుంటే నన్ను చేరగలిగే విజ్ఞానం నేనే కలుగజేస్తాను. (శ్రీ భగవద్గీత 10వ అధ్యాయము)
- జ్ఞానం ఎవరుబడితేవారు చెప్పేది కాదు. ఎవరి బడితే వారికి కలిగేది కాదు. తత్త్వవేత్తలైన జ్ఞానులు ప్రత్యక్షంగా అనుభవించి చెప్తేనే జ్ఞానం వస్తుంది. సాధకుడు మహాత్ముడైన జ్ఞానికి భక్తితో వినయ విధేయతలతో సాష్టాంగ నమస్కారం చేయాలి. గర్వం, దర్పం, అహంకారం లేకుండా వుండాలి. దేవుని దగ్గర, గురువు దగ్గర, మహనీయుల ముందు అధికార, భౌతిక, బలసంపదలు, హోదాలు తలవంచవలసినదే. (శ్రీకృష్ణ భగవానుడు శ్రీ భగవద్గీత)



- జ్ఞానికి అజ్ఞానికి ఉన్న బేధం ఏమిటంటే జ్ఞాని దైవ విషయంలో దృష్టిపెట్టి విషయ భోగాలయందు విరక్తి గలిగి వుంటాడు. అజ్ఞాని దైవ విషయాలలో దృష్టిపెట్టకుండా విషయ భోగాల పట్ల ఆసక్తి కలిగివుంటాడు. (భగవద్గీత సాంఖ్యయోగము)
- తల్లిదండ్రులను విడిచిపెట్టి భార్యతో తమ సుఖము కొరకు వేరు కాపురము పెట్టువారు రోగగ్రస్తులై పుడతారు. (శ్రీగురు చరిత్ర)
- తల్లిదండ్రులను తిట్టేవాడు మరుజన్మలో నీచుడుగా పుడతాడు. (శ్రీ నరసింహ సరస్వతి)
- తనకు భగవంతుడిచ్చిన దానితో తృప్తిచెందక యింకా ఎంతో కావాలని రాత్రింబవళ్ళు ఆరాటపడేవాడు నిజమైన బీదవాడు. (భాగవతం)
- తన కంటే పెద్దలయందు సహనము, తన తోటివారియందు స్నేహము, పిన్నలయందు దయగలవారినే దైవం అనుగ్రహిస్తాడు. దయ అనేది మానవులకు ప్రధాన ధర్మము. (స్వయంభువమనువు)
- తల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురిని సేవించుటలో పురుషుడు చేయవలసిన పనులన్నియు పూర్తవుతవి. ఇక అతడు ఏమి చేయనక్కరలేదు. ఇక ఏమి చేసిన ఉపధర్మాలు మాత్రమే. తల్లి, తండ్రి, గురువును సేవించడమే పరమధర్మం. (మనుధర్మ శాస్త్రము)
- తిన్న ఆహారము జీర్ణము చేసుకున్నట్లే చదివినదీ తెలుసు కున్నది. జీర్ణం చేసుకుంటేనే దాని ప్రయోజనం.
- తత్త్వవేత్తలైన జ్ఞానులను ఆశ్రయించి వినయంతో వివేకంతో ప్రణమిల్లి వారి సేవచేస్తూ సమయ సందర్భాన్ని కనిపెట్టి ప్రశ్నించిన జ్ఞానోపదేశం చేస్తారు. (శ్రీ భగవద్గీత)

- తల్లిదండ్రులకు సేవచేయువారును, పతి సేవకురాలైన భార్యయు, జ్ఞానులను, యోగులను సేవించువారే నా భక్తులు. (శ్రీ మహావిష్ణువు)
- తల్లికి దుఃఖాన్ని కలిగించే కుమారుడు నరకానికి పోతాడు. తరువాత ఏడు జన్మలలో దరిద్రుడై సంతానం లేనివాడై అష్టకష్టాలు పడతాడు. (శ్రీ గురుచరిత్ర)
- తల్లిదండ్రులు కుమారులను పోషించి పెంచుతారు. అతడు పెద్దవాడయిన తరువాత తల్లిదండ్రులను పోషించాలి. ఇదే నిజమైన యజ్ఞం. వారి సేవే అసలైన శ్రాద్ధం, తర్పణం. బ్రతికి వుండగా చూడకుండా చనిపోయినాక శ్రాద్ధాలు పెడితే అవి నిరుపయోగం. (గోపథ బ్రహ్మణం)
- తల్లికి పిల్లల మీద వుండే వాత్సల్యం. భార్యకు భర్తమీద వుండే అనురాగం, పిసినారికి ధనం మీద వుండే వ్యామోహం ఈ మూడు ఆకర్షణలు కలిస్తే ఎంత ప్రేమ వుంటుందో అంత ప్రేమ భగవంతుని మీద చూపాలి. అప్పుడే భక్తి వున్నట్లు లెక్క. (శ్రీరామకృష్ణ పరమహంస).
- ధర్మాధర్మములు ఎలా వున్నా కష్ట సమయములో ఆశ్రయం కల్పించిన వారిని విడువకూడదు. (భీష్ముడు, మహాభారతం)
- దేవా నేను చేసిన సమస్త పాపాల ఫలాన్నీ నాకు వ్యాధి రూపంగా ప్రసాదించి నన్ను తొందరగా పరిశుద్ధిని గావింపుము. (భీష్ముడు, మహాభారతం)
- దుష్టుడు తీయగా మాట్లాడినా వానిని నమ్మకు, దుర్మార్గుల మనస్సున విషం పెట్టుకొని నాలుక చివర నుంచి తీయని మాటలు చెప్తారు. (సుభాషితములు)
- ధర్మాన్నికి మూలం : వేదం, సత్యము పలుకుట, ధర్మం ఆచరించుట, తల్లిని, తండ్రిని. పెద్దలైన పండితులను, జ్ఞానులను (గురువులను) గౌరవించుట అనునవి ధర్మానికి పునాదులు.



- దేవుని సొమ్ము తినువాడు ఉదరరోగములచే బాధలు పడతాడు. (శ్రీ గురు చరిత్ర)
- దేవుడు దుర్మార్గుల వెంటే వుంటాడు. వారి దుర్మార్గాలను చూస్తూ వుంటాడు. క్రమేపీ వారు పెచ్చు పెరుగుతూ వుంటారు. ఒక్కసారి వారిని అంతం చేస్తాడు. (మురళీకృష్ణ)
- దేవతలకు నమస్కరించడం వలన, గురువులను గౌరవించుట వలన నిత్యము మంచివారితో సంభాషించుట వలన, వేదాలు వినుటవలన, భగవద్గీత పారాయణము వలన, భక్తి ప్రదమైన పురాణ కథలు చదవడం వలన, యజ్ఞయాగాదులకు ప్రోత్సహించడం, జపము చేయడము వలన మనుజు లకు గ్రహ పీడలు కలిగించలేవు.
- ధ్యానం అంటే మనస్సును తన వైపునకే మరల్చి త్రిప్పడం. మన మనస్సులోకి వచ్చే ఆలోచనలను ఆపడం. మొదట్లో కష్టంగా వున్నా కృషి చేయగా చేయగా ధ్యానం కుదురుతుంది. (స్వామి వివేకానంద)
- ధర్మాన్ని చెప్పే గ్రంథాలు చదవడం వలన శుభము, బుద్ధి వికాసము ఆయుష్షు, కీర్తి, మోక్షము కలుగుతుంది. (మనువు)
- దుష్టుడైన వ్యక్తికోసం అంతటా వెతికాను. కాని ఎక్కడా దుష్టుడు కనబడలేదు. అప్పుడు నా మనసులో వెతికాను. అధమాధముడైన దుష్టుడు నాలోనే కనబడ్డాడు. నేను తప్ప అందరూ ఉత్తములే. ప్రపంచాన్ని ఈ దృష్టితో చూచేవారినే నేను మిత్రులుగా భావిస్తాను. (కబీరుదాసు)
- ధనాశ పెరిగే కొద్ది మంచి గుణాలు తగ్గిపోతుంటవి. ధనము పెరిగే కొద్దీ కూడబెట్టుకోవాలని బుద్ధి కూడా పెరుగుతుంది. ధనంతోపాటే హృదయము కూడా గట్టిపడిపోతుంది. కావున భగవంతుడిచ్చిన దానితో తృప్తిని పొందాలి. అప్పుడే నీకు శాంతి కలుగుతుంది. (యోగవాసిష్టం)

- నిత్య జీవితములో ధనం కొరకు ప్రాకులాడుతూ, ఆలయానికి వచ్చినపుడు మాత్రం మోక్షం కోరడం ఆత్మ వంచనే. (శ్రీ షిర్డి సాయిబాబా)
- నీటి నుండి అలలు జనించినట్లు సంపద నుండి అసంఖ్యాకములైన చింతలు పుడుతూ వుంటాయి. అవి మనిషిని అశాంతునిగా చేస్తూ వుంటాయి
- నా మనస్సనే కోతి ఎప్పుడూ మోహమనే అడవిలో సంచరిస్తూ వుంటుంది. యువతుల మీదికి వెళ్ళుతుంది. ఆశలు అనే కొమ్మల మీద గంతులేస్తుంది. నీవు భిక్షాటన కోసం కపాలం చేత ధరించిన వాడివి. కోతులనాడించే వేషం నీది. భక్తి అనే తాడుతో గట్టిగా నా మనస్సనే కోతిని కట్టి నీ ఆధీనం చేసుకో. (శ్రీ శంకరాచార్యులవారు)
- న్యాయంగా సంపాదింపబడిన అన్నం దొరకక ఈ శరీరం నశించినా అందులో తప్పు లేదు. కాని అన్యాయపు సంపాదనతో తినే అన్నం మాత్రం విషముతో సమానం (యోగవాసిష్టం)
- నమస్కారం ఎలాపడితే అలా చేయకూడదు. దేవతలకు ప్రదక్షిణ చేసి నమస్కారం చేయాలి. గురువులకు, తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళే ముందు తన చెవులను తాకి, ఆ తరువాత వారి పాదములను పట్టుకొని నమస్కరించాలి. పెద్దవారికి, గౌరవించవలసినవారికి, చదువు చెప్పినవారికి, అన్నం పెట్టిన వారికి వంగి నమస్కరించాలి. యతులకు, జ్ఞానులకు, అవ ధూతలకు బోర్లాపడుకుని దండ ప్రమాణం చేయాలి. ఒంటి చేతితో నమస్కారం ఎప్పుడూ చేయకూడదు. (శ్రీ గురుగీత)
- నిత్యం మనము దేవతాపూజలో నిర్వర్తించే ధూప, దీప, నైవేద్య గంధము, తోయంబులు, ధూపం ఆకాశానికి గుర్తుగాను, దీపం అగ్ని దేవుడికి, గంధం భూత సంతుష్టికిగాను, నైవేద్యం వాయు దేవుడికి, తోయం (జలం) నీటికిగాను, ప్రకృతి



శక్తులను సంతుష్టి పరచేందుకు మన ఋషులు యీ నియమాలు పెట్టారు. (కర్మకాండ గ్రంధాలు)

- నీవు ఎవరివాడవు కాదని, ఎవ్వరూ నీవారు కాదని గుర్తించుకో? ఎప్పుడో ఒకరోజు నీవు హఠాత్తుగా ఈ ప్రపంచాన్ని వదలిపెట్టి పోవలసినదని గుర్తుంచుకో? కావున దేవునితో యిప్పటి నుండే పరిచయం పెంచుకో (శ్రీ శంకరాచార్యులవారు)
- నూవు గింజలో నూనె, పాలలో నేయి, చెకుముకి రాయిలో నిప్పు వున్నట్లే మానవునిలో దేవుడున్నాడు. (కబీరుదాసు)
- నీవు యితరులకు బోధించడానికి ప్రారంభించావంటే వారు ముందు నీవెలా వున్నావో చూస్తారు. నీవు చెప్పేది ఆచరిస్తున్నావా లేక యితరులకు చెప్పడానికా అని చూస్తారు. ముందు ఎవరికి వారు సంస్కరించుకొని యితరులకు చెప్పాలి. మనకే ఈత రానపుడు యితరులకేం నేర్పగలం.
- నవ్వుతూ పాపపు పనులు చేసేవాడు - ఏడుస్తూ ఆ కర్మల ఫలాన్ని అనుభవిస్తారు. (శ్రీ శంకరాచార్యులవారు)
- నేను త్రిలోక రాజ్యాలను ఆశించను, దేవతల రాజ్యం కూడా నాకక్కరలేదు. ఆ రెండింటికంటె మహత్తరమైన దానిని కూడా త్యజించగలను. కాని సత్యాన్ని త్యజించలేను. (మహాభారతం, భీష్ముడు)
- నీకున్న దానిలో కొంత త్యాగము చేయి. నీకున్నది దైవానికి అర్పించి భుజించు. (ఈశావాస్యోపనిషత్)
- నిష్కామకర్మ యోగం వలన మనస్సు నిర్మలమవుతుంది. స్థిరమైన మనస్సు మోక్షానికి దగ్గరవుతుంది. దీన్ని మొదట, సూర్యభగవాను నికి ఆ సూర్యుడు వైవస్వతమనువుకు, ఆయన ఇక్ష్వాకు మహారాజుకు, ఆయన ద్వారా లోక వ్యాప్తి చెంది, ఎందరెందరో ఆచరించి మోక్షగాములైనారు. (శ్రీభగవద్గీత)

- నరకమనే వ్యాధికి యిప్పుడే యీ జన్మలోనే అనుష్ఠానము ద్వారా నయం చేసుకోకపోతే, కర్మానుష్ఠానానికి అవకాశం లేని తగిన లోకాలలో ఏమి చేయగలరు. ఈ భూలోకములో కర్మానుష్ఠానానికి మనుష్య జన్మే అనుకూల మైనది. తక్కిన లోకాలు చేసిన కర్మను అనుభవించడానికి ఏర్పడినవే? (గరుత్మంతునితో - విష్ణుమూర్తి)
- పాండిత్యమంటే కేవలం ప్రాపంచిక విద్యలలో పేరు సంపాదించడం కాదు. నిర్మలమైన మనస్సుతో కోరికలను విడనాడి, ఆత్మజ్ఞానం కలిగి వుండటమే పాండిత్యం. (శ్రీ భగవద్గీత)
- ప్రాణాయామం కూడా ఒక యజ్ఞమే. ఇది అష్టాంగయోగాల లోని, యమ నియమాదులలో నాలుగవది. శరీర ఆరోగ్యం యిచ్చి, మనస్సు యొక్క చంచలత్వం పోగొట్టుతుంది. పూరక, కుంభక, రేచకాలని మూడు. అపానంలో ప్రాణాన్ని హోమం చేయడమంటే, పూరకం ప్రాణంలో అపానాన్ని హోమం చేయడం రేచకం. ప్రాణాపానాలల మార్గాలను నిరోధించడం కుంభకం. దైవ భావనతో చేయాలి. ఈ ప్రాణాయామము వలన మనస్సు బహిర్ముఖత్వాన్ని విడిచి నిశ్చలంగా వుంటుంది. ప్రాణానికి మనస్సుకు చాలా దగ్గిర సంబంధం వుంది గనుక, మనో నిరోధంతో ప్రాణ నిరోధం, ప్రాణ నిరోధంతో- మనో నిరోధం కలుగుతూ వుంటుంది. మనస్సు యొక్క చపలత్వాన్ని యిదిఅరి కడుతుంది. ఇది అనుభవజ్ఞుల దగ్గర నేర్చుకొని ఆచరించాలి. దీనినే క్రియా యోగం అంటారు. (శ్రీ భగవద్గీత)
- పంచజ్ఞానేంద్రియాలు, పంచ ప్రాణాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి యీ పదిహేడు కలిస్తే సూక్ష్మ శరీరం. దీనినే జీవాత్మ అంటారు. ఇది స్థూల (భౌతిక) శరీరాన్ని విడిచి పెట్టడమే మరణం అంటారు. ఆ తరువాత యీ స్థూల శరీరం పంచ భూతాలలో చేరిపోతుంది. ఇక జీవాత్మ కర్మానుసారం భోగార్థం మళ్ళీ మరో శరీరంలో ప్రవేశిస్తుంది, అతడే జీవుడు.



మనస్సు జీవుడిలో అంతర్భాగమే. ఈ పదిహేడు తత్త్వాలు జీవుని ఆత్మ సాక్షాత్కార పర్యంతం కలిసే వుంటాయి. అంటే మోక్షం వచ్చేదాకా, ప్రాణం పోగానే వెళ్ళి, మరల పునర్జన్మకు జీవి రాగానే అతని శరీరంలో చేరిపోతుంది. వెనుకటి జన్మల పుణ్య పాపల కర్మఫలం అనుభవించ డానికి, స్వర్గ, నరక ఇతర లోకాలకు వెళ్ళి, ప్రారబ్ధకర్మానుసారం ప్రస్తుత జన్మలో చేసిన కర్మలు కొన్ని సంచితకర్మగాను, ఆగామి కర్మగాను, ప్రారబ్ధ కర్మగాను విభజించబడతాయి. కనుక గత జన్మల కర్మఫలం ఎవరైనా అనుభవించవలసినదే. భగవత్ దర్శనముతో దూరం చేసుకోవచ్చు. ఈ విధంగా జన్మలెత్తుతూ వున్న జీవి కల్పాంతరములో, పంచభూతాలు వాటి తన్మాత్రక రూపంలో కలుస్తాయి. అందుచే జీవి ఎప్పటికైనా తన మంచి ప్రవర్తనతో భగవంతుని సాన్నిధ్యము చేరుకోవడానికి ప్రయత్నించాలి. (కఠోపనిషత్ - గీత ఆధారముగా)

- పాపమైనా పుణ్యమైనా ఎవరు సంపాదించుకున్నది వారే అనుభవించాలి. అనుభవించనిదే నివారణము కాదు. (శ్రీ గురు నరసింహ సరస్వతి)
- పూర్వజన్మలో దానధర్మాలు చేసివుంటే, యిప్పుడు అరణ్యంలో వున్నా ఆ ఫలితం దక్కి తీరుతుంది. పూర్వజన్మలో దానధర్మాలు చేసి వుండకపోతే బంగారు కొండ మీద కూర్చున్నా ఇప్పుడూ ఏమీ అంటదు. (శాస్త్రాలు)
- పాపపు సంపాదన చెయ్యకు, పోయేటప్పుడు పూచికపుల్ల కూడా నీవెంటరాదు. (గురునానక్)
- ప్రాణం వున్నా శవంలా జీవించడం నేర్చుకో, అప్పుడే నీకు దైవదర్శనం అవుతుంది. యమదూతలు వచ్చాక అందరిలాగా మరణించడంలో ప్రయోజనం లేదు.
- పూర్వజన్మలో చేసుకొన్న పాపదోషాల వల్ల ఈ జన్మలో శరీర

వ్యాధులు మానసిక రోగాలు వచ్చి పీడుస్తూ వుంటాయి. ఇక ఈ జన్మలో పాపాలు చేయక మందులతో, దానధర్మాలతో భగవన్నా మాన్ని జపించడంతో, యజ్ఞాలు దేవతా పూజలు చేయుటచే పాపములు తొలగించుకొని శాంతిని పొందాలి.

- పూర్వజన్మలో గర్భస్రావము చేయించుకున్నను, పరుల సొమ్మును తిన్నవారికి, ఆవునుగాని, గుర్రమును గాని చంపిన వారికి, యీ జన్మలో పిల్లలు పుట్టి చనిపోతారు, నిలువరు. (శ్రీ గురుచరిత్ర)
- పరులను ద్వేషించేవాడు ఇతరులచే తను ద్వేషింపబడతాడు. (గురు చరిత్ర)
- పుట్టిన ప్రతి మనిషికి ప్రారబ్ధ, సంచిత, ఆగామి అని మూడు కర్మలుంటాయి. గత జన్మలో చేసినవి ఈ జన్మలో అనుభవించే వాటిని ప్రారబ్దమని, ఈ జన్మలో చేసినవాటిని ఈ జన్మలో, వచ్చే జన్మలో సంచిత కర్మలుగా అనుభవించాలి. ఆగామి కర్మను పై జన్మలో అనుభవించాలి. అయితే ఆత్మ సాక్షాత్కా రము వలన సంచిత ఆగామి కర్మలను ఈ జన్మలోనే నశింప జేసుకొనవచ్చును. కాని ప్రారబ్ద కర్మను మాత్రం ఎంతటివారైనా సుఖదుఃఖాల రూపాలతో ఈ శరీరంతో అనుభవించి తీరవలసిందే. సంచిత కర్మ ఎవరు తమ యిష్ట దైవాన్ని భ్రూమధ్యములో దృష్టిని నిలిపి ధ్యానించి నపుడే పూర్తిగా నశిస్తుంది. (ముండకోపనిషత్)
- ఫలాపేక్షతో చేసే పూజలు బజారు బేరంలాంటివి. దీనివల్ల లభించే ఫలం స్వల్పం. పారమార్థికత లభించదు. కోరికలతో చేసే జపం, పూజలు చిత్త శుద్ధినివ్వవు.
- పెద్దకొండ రాయిని పర్వతము పైకి ఎక్కించుట యెంత కష్టమో, మంచి పేరు తెచ్చుకొనుట కూడా అంతే కష్టము. కొండ శిఖరము నుండి, రాయిని క్రిందకు త్రోయుట ఎంత



సులభమో దుష్టుడని పించుకొనుట అంత సులభము.

- భర్తకు తెలియకుండా ప్రక్కయిండ్లకు పెత్తనాలకు వెళ్ళు స్త్రీ మరుజన్మలో గుడ్లగూబగా పుడుతుంది. (గురుచరిత్ర)
- బ్రహ్మముఖము నుండి బ్రాహ్మణులు, భుజాల నుండి క్షత్రియులు, తొడల నుండి (ఉదరము) నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు పుట్టారంటే, విద్యకు సంకేతం ముఖం అని, శౌర్యానికి భుజాలని, శక్తికి తొడలని ఈ మూడింటికి ఆధారభూతమయినవి పాదములు. ఏ పని చేయాలన్నా, ఎక్కడికి వెళ్ళాలన్నా కాళ్ళే, పాదములతో వెళ్ళి ముందుపని ప్రారంభించాకే మిగతా అవయవాల పనులు, మరి యీ మూడింటి భారము మోసేవే పాదములు. అందుకే మన పూర్వీకులు ముందుగా పాదములకే నమస్కారాలు పెట్టేవారు. పాదపూజ, పాదములకే గాని వేటికీ వుండదు. ఆనాడు కులాల మధ్య తేడాలు తప్ప, ద్వేషాలు లేవు. (వేదము మురళీకృష్ణ)
- భగవద్గీత చదవడం వలన సర్వపాపాలు నశించుతాయి. సర్వతీర్థాలు అక్కడకు చేరుతాయి. సర్వదేవతలు అక్కడే వుంటారు. ముక్తిని కోరేవారికి ఈ గీతాపఠనం మహా మంత్రంగా వుంటుంది.
- భక్తి ఎలాంటిదంటే ఒక వస్తువు యొక్క నీడ ఆ వస్తువును వదలి ఎలా వుండలేదో మేమూ ఆ కృష్ణుని వదలి ఒక్క రెప్పపాటుకాలం కూడా వుండలేము. (గోపికలు)
- భక్తికి సాధు సాంగత్యం ముఖ్యం (సజ్జన సాంగత్యం) ప్రేమ లేకుండా భక్తి కలుగదు.
- వేదాలిచ్చిన సందేశం సత్యంవద - ధర్మం చర. సత్యాన్నే మాట్లాడు, ధర్మాన్నే అనుసరించు, ఈ సత్య ధర్మాలు రెండు రెండు చక్రాలవంటివి. ఈ రెండింటిని అనుసరించిన జీవితమే ధన్యము కాగలదు. (వేదం)

- భగవంతుడు మనకు రెండు చెవులిచ్చి, ఒక నోరు పెట్టాడు. ఎందుకంటే ఎక్కువ విని తక్కువ మాట్లాడమని.
- భక్తియనగా భగవంతుని మహోత్మమును సమగ్రంగా తెలుసు కోవడం వలన మిగతా విషయాలకంటె దైవం మీద ప్రీతి కలుగుతుంది. ఆ ప్రీతి ద్వారా మోక్షం వస్తుంది తప్ప మిగతా వేటివల్లా మోక్షం రాదు.
- భోగులకు రోగభయం, ధనవంతులకు దొంగల భయం. బలవంతులకు శత్రువుల భయం. అందమయిన వారికి ముసలితనపు భయం. శాస్త్ర పాండిత్యం గలవారికి విమర్శ కుల భయం. మంచివారికి చెడ్డవారితో భయం, బ్రతికియున్న వారికి యముడంటే భయం. కనుక ఏ భయం లేనిది వైరాగ్యం. ఇది యలవరచుకుంటే భయందేనికి, ఎవరికి భయపడనవసరము లేదు. (భర్తృహరి వైరాగ్య శతకం)
- మానవులు పుణ్య కార్యాలయిన దాన, ధర్మ, సత్యము పాటించ ఉత్సాహపడరు గాని, పుణ్య ఫలితం కావాలని కోరుకుంటారు. పాపపు పనుల యందాసక్తి ఇచ్ఛా చూపుతుంటారు గాని, పాపఫలం తమకు రాకూడదని కోరుకుంటారు. మానవుల ప్రవృత్తి ఎంత విచిత్రమైనది.
- మునియనగా కష్టాలు వచ్చినపుడు ఉద్రేకం పొందక, సుఖముల యందు ఆసక్తుడుగాక, మనసులో కోరికలు, భయము, కోపమూ లేక ఎప్పుడూ స్థిరమైన బుద్ధిగలవాడే ముని. (భగవద్గీత - తులసీదాసు)
- మనము సంపాదించిన ధనము యిక్కడే యీ భూమి మీదే వుండిపోతుంది. పశువులు పశుశాల వరకూ, భార్య యింటి ముఖ ద్వారం వద్ద ఆగిపోతుంది. సంతానంలో మగవారు స్మశానము వరకూ వస్తారు. మనం పోషించిన శరీరము చితివరకు మాత్రమే వస్తుంది. ఇక మన వెంట వచ్చేది మనం చేసిన ధర్మం మాత్రమే. మన పాప పుణ్యాలు మాత్రమే



వస్తాయి. (భాగవతం)

- మనం అనుభవించే భోగాలన్నీ మెరిసే మెరుపులాంటివి. ఆయుష్షయేమో నిప్పు మీద పడ్డ నీటి బిందువులాంటిది. ఇంత స్పష్టంగా తెలిసినా మానవునిలో ఆశ చావక పాము నోట్లోపడి చావ సిద్ధంగా వున్న కప్ప, అందిన దోమలను చప్పరించే విధంగా, మనం అనిత్యమైన సుఖాలనే కోరు కుంటున్నాము. ఇక సంపద చూద్దామా చంచలమైనది. యవ్వనం నీటి తరంగం లాంటిది. ఆయుష్షు మరీ అనిశ్చత మైనది. అయినా జీవులకు తాత్కాలికమైన ఇంద్రియ సుఖ ములయందు తన జీవితమును వెళ్లబుచ్చుతారు (ఆధ్యాత్మిక రామాయణము)
- మహాత్ముల దర్శనం, సేవ వల్లనే భగవత్తత్వం బోధపడుతుంది. అలాంటి వారిని సేవించనిదే జ్ఞానం లభించదు. (సాయిబాబా)
- మనిషి మరణించాక ఏమవుతున్నాడు అనేది అతని కర్మల మీద ఆధారపడి యున్నది. అతని ఆశలే (కోరికలు) అతని తలవ్రాతగా మారుతాయి. మరణించాక మరో లోకానికి వెళ్లి ఇక్కడ చేసిన కర్మఫలాలు అనుభవించి, మళ్లీ ఈ కర్మక్షేత్రా నికే తిరిగి వస్తాడు. ఈ విధముగా కోరికలున్నంతవరకూ వస్తూ పోతూ వుంటాడు. ఈ కోరికలు, సంకల్పాలు ఎప్పుడు రహితమవుతాయో, అప్పుడు అజ్ఞానమనే మాయనుండి బయటపడి, బ్రహ్మమును చేరి తానే బ్రహ్మము అవుతాడు. (బృహదారణ్యకోపనిషత్)
- మహాపురుషులు మానవుల కోసం మానవలోకంలో జన్మి స్తారు. తమ రచనలతో, బోధనలతో ప్రజలను చైతన్య వంతు లను చేస్తారు. (స్వామీజీ మహరాజ్)
- మానవులలో దివ్యశక్తి వున్నప్పుడే వారు గురువులు కాగలుగు తారు. సామాన్య మానవులు ఆశక్తిని గుర్తించి పూజించాలి.

ఫలితంగా వారి ఆశీర్వాదంతో పునీతులు కాగలుగుతారు.

- మహాపురుషుల జీవితములో అడుగడుగునా అవరోధాలే ఎదురవుతూ వుంటాయి. వాటిని సంకల్ప బలంతో ఎదుర్కొన్నప్పుడే విజయం సిద్ధిస్తుంది. ఈశ్వరుని ప్రేమ ఎవరి మీద వుంటుందో వారిని అనేక కష్టాలకు గురిచేస్తాడు. ఆ పరీక్షలో నెగ్గినవారిదే అదృష్టము. (పండిత శ్రీరామశర్మ)
- మహాగ్రంథాలు చదవగానే మన పని తీరిపోదు. నిజానికి మన పని అప్పుడే మొదలవుతుంది. ఎందుకంటే అవి ఆచరణలో పెట్టాలి. గ్రంథపఠనం, ఆచరణకొరకుగాని చదివి మరచిపోవడానికి కాదు. (శ్రీ గురునానక్)
- మనసులో ఒకటి, బయటకు మరొకటి చెప్పేవారు నరకానికే పోతారు. ఎందుకంటే వారిని వారు మోసం చేసుకుంటూ ఇతరులను మోసం చేస్తుంటారు. (స్వామి బ్రహ్మానంద సరస్వతి)
- యజ్ఞయాగాదులు చేసిన దానికంటె, నూరుమంది పుత్రులను కన్నదాని కంటే ఒక మంచి మాట మేలు. (మహాభారతం)
- లభించని వాటికై విచారించకు; లభించిన వాటిని చూసి పొంగిపోకు, లాభనష్టాలకు, సుఖదుఃఖాలకు సాక్షిభూతుడిగానే వుండు. సంసార విషయాలలో తగుల్కొని అదే జీవిత మనుకోకు. (సుభాషితాలు)
- వ్యాధిగ్రస్తుడు వృద్ధుడు అయిన తండ్రిని విడిచి వెళ్ళిన కుమారుడు రౌరవ నరకాన్ని పొందుతాడు.
- వకార పంచకములనగా 1) వస్త్రము 2) రూపము 3) వాక్కు 4) విద్య 5) వినయము. వీటిలో యేది తక్కువయినా అతడు గౌరవనీయుడు కాదు. (శాస్త్ర గ్రంధాలు)
- శరీర పోషణకు సంపాదన అవసరమే అయినా ఆశతో కూడిన ధర్మ విరుద్ధమైన సంపాదన, ఆ కుటుంబములో తరతరాల వారిని నాశనం చేస్తుంది. (శాస్త్ర గ్రంధాలు)



- శివలింగమును సరాసరి చూడరాదు. ఎడమచేతితో నంది వెనుక భాగాన్ని తాకుతూ, బొటనవ్రేలు చూపుడు వ్రేలు నంది కొమ్ముల మీద వుంచి ఆ మధ్య నుండి శివదర్శనము చేయువాని గృహమందు ధన సంపత్తి, పుత్రపౌత్రాభివృద్ధి కలుగుతుంది. (శ్రీ గురుచరిత్ర)
- శ్రుతులనగా వేదాలు, మంత్ర ద్రష్టలైన ఋషులు ధ్యానంలో అనుభూతి పొందిన సత్యాలు. (ఋగ్ వేదం)
- సత్ప్రవర్తన కలిగినపుడు కాలాన్ని వృథా చేయకు. పుణ్యకార్యాలు చేసి పునర్జన్మ లేకుండా చేసుకో (తిరువళ్ళువార్)
- సర్వవేదమయుడు హరి, సర్వతీర్థ స్వరూపము గంగానది, సర్వ ధర్మ సంపూర్ణము మను ధర్మశాస్త్రము, సర్వశాస్త్రమయము. శ్రీ భగవద్గీత, (శ్రీ స్వామి అనుభవానంద)
- స్త్రీకి అంగరక్షకులుగా బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కుమారుడు కనిపెట్టుకొని చూడాలి.
- సదాచారం పాటించే మనిషి ఔషధ సేవలేకుండగనే స్వస్థత పొందవచ్చు. సదాచారం అంటే ఆధ్యాత్మిక చింతన, దేవతార్చన, జపము, పురాణ, ధర్మశాస్త్రముల పఠనము. ఇందు దేవతార్చన లేక సంకీర్తన దీర్ఘాయువును, జ్ఞాపకశక్తిని, తేజస్సును, శరీర బలాన్ని వాక్కు శుద్ధిని కలిగిస్తుంది. (చరకమహర్షి)
- సత్పురుషుల సమక్షంలో వుండటం. వారితో మాట్లాడటం. పరిచయం కలిగివుండటం అభీష్టసిద్ధికి హేతువులు. ఇక వారితో స్నేహం కలిగి వుండటము మరీ ఘనమైనది. (మహాభారతము)
- సూక్ష్మగ్రహణ శక్తిగల పిల్లలకు మంచివీ, అనుకూలమైనవీ అయిన సూచనలు చెవులకు ఎక్కేటట్టు చేయాలి. వాళ్ళకు చిన్నప్పుడు ఏర్పడే అభిప్రాయాలు లోతుగా నాటుకుని చాలా కాలం వుంటాయి.

- సంఘము దైవానికి లోబడినట్లుగా భార్య కూడా ప్రతి విషయము లో తమ భర్తకు లోబడి వుండవలెను. అటులనే భర్త కూడా తమ సొంత శరీరమువలె తమ భార్యను ప్రేమించవలెను.
- సజ్జనులతోను, మంచి మనసుగలవారితో స్నేహము చేస్తే నీలో ఆధ్యాత్మికాభివృద్ధి కలుగుతుంది. మోక్షమునకిదియే అత్యంత ప్రధానమైనది.
- హైందవ ధర్మం మానవులు సృష్టించినది కాదు. అనాదిగా వస్తున్న ధర్మమది. ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా చెక్కుచెదరనిది హైందవ ధర్మం. యుగాలు ఎన్నోసార్లు వచ్చిపోతుంటాయి. కాని సనాతన మైన హైందవధర్మం విరాజిల్లుతూనే వుంటుంది. యుగాన్ని బట్టి ధర్మం మారుతూ వుంటుంది. (శ్రీ జయేంద్ర సరస్వతీ స్వామి)
- హైందవ ధర్మం అందరిలోనూ, అన్నింటిలోనూ దేవుడున్నాడను విశ్వాసమే వివిధ రకాల దేవతలను, శిలలను, వృక్షాలను, జంతువులను, పాములను, గరుత్మంతుడిని అందరినీ అన్నింటి లోనూ పూజించమంటున్నది.
- 1) నిష్కామ కర్మాచరణ 2) నిర్మల హృదయము 3) మనస్సును జయించడము 4) ఇంద్రియాలను అదుపులో వుంచుకొనుట 5) అన్ని జీవులను సమముగా చూడటం. ఇవి జ్ఞాన లక్షణాలు. ఈ అయిదింటిని ఆచరిస్తే కర్మ విముక్తి అవుతుంది. (భగవద్గీత)
- మనస్సు బాహ్యమైన కోరికల్ని విడిచిపెట్టి - అంతర్ముఖమయినపుడు - ఆత్మజ్ఞానం పొందుతారు.
- నిష్కామ భక్తుడు ప్రపంచ సుఖములను వదలి భగవంతుని మాత్రమే కోరును. భగవంతుని యందు అమిత ప్రేమ కలిగి వుండడమే భక్తి. భగవంతుని అన్నిటా, అంతటా చూచుటే



భక్తి, భగవంతుని దయకలిగినవారికి జ్ఞానము కలుగుతుంది. మీ పాత్రను మీరు సక్రమంగా నిర్వహించగలిగినపుడు గౌరవ మర్యాదలు వాటంతటవే చేరుతాయి.

- అమ్మ, తల్లియనగా నీళ్ళుపోసి, అన్నంపెట్టి, దుస్తులు తొడిగే ఒక స్త్రీ మాత్రమే కాదు. ఆమె ప్రేమమూర్తి. మాతృప్రేమతో సాటియైన ప్రేమ లేదు. పుట్టిన ప్రతి శిశువు ప్రేమ కొరకు తపిస్తుంది. అట్టి ప్రేమ తల్లివద్దనే లభిస్తుంది. అందుకే తల్లిఒడిలో కోర్చోవడానికి బిడ్డ ఆరాటపడుతుంది. తల్లి ఒడి పసిపాపకు ఆనందాన్ని కలిగిస్తుంది. తల్లియే మొదటి గురువు. దేవాలయములో ఎంతటి పవిత్రత వుంటుందో దేవుని కృప కొరకు మనుజుడు ఎంత ఆవేదన చెందుతాడో అలాగే తల్లి సమక్షంలో బిడ్డ ప్రశాంతిని పొందుతాడు. తల్లియొక్క అనురాగం కొరకు తపిస్తాడు.

తల్లిబిడ్డకు ప్రేమనిస్తుంది. బిడ్డ తప్పుచేసినా క్షమిస్తుంది. ప్రేమయే దైవము. అందుచేత తల్లి దైవముతో సమానమైనది. తండ్రి డబ్బును సంపాదించి బిడ్డలకు చదువు చెప్పిస్తాడు. బట్టలు అవసరమైన వస్తువులు యిచ్చి ఆదుకుంటాడు. చివరకు తను సంపాదించిన ఆస్తిని కూడా బిడ్డలకే సంక్రమింపజేస్తాడు. కనుక తండ్రి దైవముతో సమానము. బిడ్డల యొక్క పురోభివృద్ధికై కృషిచేయు తల్లిదండ్రుల యెడ బిడ్డలు కూడా అనురాగముతో నడుచుకోవాలి.

బిడ్డకు జన్మనిచ్చేవారు తల్లిదండ్రులు. వారతనిని పెంచి పెద్ద చేస్తారు. వారు శ్రమించి, బిడ్డల కొరకు అన్నీ సమకూర్చుతారు. అట్టి తల్లిదండ్రుల యెడల కుమారుడు కృతజ్ఞత చూపాలి. వారిని వృద్ధాప్యంలో ఆదుకోవాలి. అలా చేయకపోగా, తల్లిని గాని, తండ్రిని గాని ధూషించిన వాని జీవితము అంధకార బంధురమవుతుంది. కావున ఈ జన్మకు కారకులైన తల్లిదండ్రు

లను దైవ స్వరూపులుగా భావించి, వృద్ధాప్యంలో వారి సేవ చేసిన, బిడ్డ జన్మ చరితార్థము కాగలదు. తల్లిదండ్రుల ఆశీర్వాదము వలన బిడ్డ అభివృద్ధిని పొంది, మంచి మార్గములో ప్రయాణము సాగించిన భగవంతుని దయను పొందగలడు.

- ధనవంతునికి చదువురానట్లయితే అతని సంపద యావత్తూ అసహ్యంగా పరిణమిస్తుంది. అది రాణించుట కష్టము, సద్వినియోగపడదు. అలాగే విద్యగలవానికి వినయం లేనట్లయితే, అతనికి గల విజ్ఞానము చెడ్డ ఫలితాలనిస్తుంది. అతడు తన విద్యలో ఇతరుకు మేలు చేయలేడు. కనుక విద్యావంతుడు వినయాన్ని అలవరచుకోవాలి.
- మానవునికి అపకారము గాని ఉపకారముగాని ఇతరులెవరో చేయరు. అతని గుణములే అతనికి కీడుగాని మేలుగాని చేస్తాయి. అతని కోపము వలననే శత్రువులు ఏర్పడతారు. అతనికి గల శాంతమే అతనిని కాపాడుతూ వుంటుంది. అతడు యితరుల ఎడ చూపు దయాగుణము చుట్టములె సహాయపడుతుంది. స్వర్గమెక్కడో లేదు. అతని సంతోషమే స్వర్గంగా అనిపిస్తుంది. అతనికి కలిగెడు దుఃఖమే నరక ప్రాయంగా వుంటుంది.
- ఎవరికైనా కష్టం వచ్చినా, బాధ కలిగినా అతని యెడల సానుభూతి చూపాలి. వెళ్ళి ధైర్యం చెప్పాలి. బాధలో వున్న వ్యక్తి ఇతని మాటల వలన ఉత్సాహం పొందుతాడు. నిరాశను వదిలేస్తాడు. ఇతనిని తన ఆప్తమిత్రునిగా పరిగణిస్తాడు. అందుచేత మంచిమాటకు విలువ చాలా ఎక్కువ.
- ఎంత గొప్పవాడైనా ఎంత విద్యావంతుడైనా ఎంతటి పండితుడైనా కోపం తెచ్చుకున్నట్లయితే అతని ఘనత తగ్గిపోతుంది. ఇతరులు అతనిని గౌరవించడం మానివేస్తారు. కోపిష్టిని ఎవరూ అభిమానించరు. కోపము వలన వ్యక్తి స్నేహితులను కోల్పోతాడు. వీలయినంత వరకు కోపమును దరిజేర



నివ్వరాదు.

- ఇతరులను నిందించగూడదు. ఎందువల్లనంటే ఇతరులలో వున్న లోపాలు నీలో గూడా వుంటాయి. నీలోని దోషాలను గ్రహించి, సరిదిద్దుకొనుటకు ప్రయత్నించు. అంతేగాని పరులను నిందిస్తూ కాలం గడపకు. నీవు పిడికిలి ముడిచి చూపుడు వ్రేలుతో ఇతరులను నిందిస్తూ వుంటావు. అప్పుడు మిగతా మూడువేళ్ళూ, నీ వంకకు తిరిగి నిన్ను వెక్కిరిస్తూ వుంటాయి. కనుక పరనిందచేయకు.
- వృక్షము జీవించినంత కాలము జనులకు కాయలు పండ్లు అందించి ఆకలి తీర్చుచున్నది. తరువాత ఏగాలి వానకో చెట్టు పడిపోయిన తరువాత కూడా జనులు తన శరీరాన్ని రంపాలతో కోసినప్పటికి చెక్కలు,కట్టెపుల్లలుగా తన దేహాన్ని చీల్చి యిస్తుంది. వాటిని గృహనిర్మాణమునకు, వంట చెరకకు వాడుతూ వుంటారు. ఇలా తాను ప్రాణం కోల్పోయి మరణించిన పిదప గూడా తన శరీరాన్ని ఇతరుల ఉపయోగానికై అందిస్తున్నది.

మనిషి చనిపోతే అతని శరీరం 24 గంటలలో కుళ్ళిపోయి పనికి రాకుండాపోతుంది. కాని చెట్టు తాను చనిపోయిన పిదప కూడా లోకానికి ఉపయోగపడుతుంది. త్యాగము అనే సుగుణాన్ని అలవరచుకొనుటకు వృక్షములే తగిన గురువులు.

- స్త్రీ కంటి నుండి కన్నీరు కారినట్లయితే ఆ గృహములో సంపద నిలువదు. గృహములో తల్లి, చెల్లెలు, భార్య, కుమార్తెలు మున్నగు వారుంటారు. వీరిలో ఎవరూ కన్నీరు కార్చరాదు. గృహస్తుడయినవాడు భార్య మనస్సుగాని, తల్లి మనస్సుగాని ఇంటిలో ఉన్న ఏ మహిళ మనస్సు గూడా కష్టపెట్టగూడదు. ఆడపడుచులకు గూడా బాధ కలిగించరాదు. వీళ్ళలో ఎవరి కంట నీరు వచ్చినా అట్టి గృహములో సంపద నిలువదు.

అందుచే స్త్రీని, లక్ష్మీదేవితో పోల్చారు. కనుక స్త్రీలు సద్గుణములు అలవరచుకోవాలి. స్త్రీకి ఓర్పు చాలా అవసరము. ఓర్పే స్త్రీకి సద్గుణము.

- మానవునికి తనకుగల సంపద, ఆస్తులు ఎడసంతృప్తి వుండాలి. ఇంకా, ఇంకా సంపదకావలెనని ఆశ తగదు. తనకంటే పేదవారితో పోల్చుకొని ఉన్న సంపదతో సంతుష్టి చెందాలి.

తనకు గల విద్య యెడల తృప్తిపడగూడదు. ఇంకా, ఇంకా విజ్ఞానం కావాలనే వాంఛ అతనికుండాలి. విజ్ఞానం అనంత మైనది. కనుక దానిని పొందడములో తృప్తిపడ గూడదు. జీవితాంతం జ్ఞాన సముపార్జనకై కృషిచేయాలి. ప్రతి వ్యక్తి ఆనందం కోరతాడు, హాయిగా జీవించాలనుకుంటాడు. అలా ఆనందంగా జీవించాలంటే ప్రేమ వుండాలి. ఇతర వ్యక్తులను, ప్రాణులను ప్రేమగా చూడాలి. పరస్పరం ప్రేమతో మెలగడమే ఆనందాన్ని పొందే మార్గం. తరువాత జ్ఞానాన్ని సముపార్జించు కుంటూ వుండాలి. జ్ఞానం ఒక జ్యోతిలాంటిది. అట్టి జ్ఞానంతో అతడు తన మనసులోని అంధకారాన్ని పారద్రోలుతూ వుంటాడు. కష్టాలు సంభవించినపుడు దానితో తాదాప్యము చెందక, ఇది భగవంతుని చేరుటకు పరీక్ష అని మనో నిగ్రహము కోల్పోడు. ఆనందముగా జీవించాలంటే ప్రేమ, జ్ఞానము అనేవి రెండూ అవసరం.

- భగవంతుడు మనకు నాలుక ఒకటే యిచ్చాడు. కాని చెవులు, కళ్ళు రెండేసి యిచ్చాడు. ప్రకృతిలో కనిపించే ఈ సత్యాన్ని బట్టి ఆలోచిస్తే రెండేసి వున్న కళ్ళతో ఎక్కువగా చూడాలి. చెవులతో అధికంగా వినాలి. మాటలు మాత్రం తక్కువగా మాట్లాడాలి. నిరంతరం కళ్ళద్వారా, చెవుల ద్వారా తెలుసు కుంటూ వుండాలి. జ్ఞానాన్ని ఆర్జించాలి. అనవసరంగా మాట్లాడక అనగా అతిగా వాగకూడదు. పరిమితంగాను, అవసరం వచ్చినప్పుడే మాట్లాడగలగాలి.



- మామిడిచెట్టు వేసవికాలములో పసుపు పచ్చని పండ్లను కాసి అందముగా వుంటుంది. పండ్లు క్రిందికి వ్రేలాడుతూ వుంటాయి. వాటి బరువు వలన చెట్టుకొమ్మలు కూడా వంగి వుంటాయి.

అలాగే పండితుడైనవాడు, జ్ఞానవంతుడు తన జ్ఞానము వలన అహంకారి కాకూడదు. నమ్రత కలిగియుండాలి. అవసరమై నపుడు మాత్రమే తన విద్యను ప్రదర్శించాలి. అణకువ కలిగి యుండుట ఘనతగలవాని ప్రధాన లక్షణము. (శ్రీ రామకృష్ణ పరమహంస)

- త్యాగము, సేవ అనేవి రథానికి రెండు చక్రాలవంటివి. తల్లిబిడ్డను ప్రేమిస్తుంది. స్నేహితుడు స్నేహితుని ప్రేమిస్తాడు. భార్య భర్తను ప్రేమిస్తుంది. ఈ ప్రేమకు మూలము త్యాగమే. సేవ ఒకరికి జబ్బు చేస్తే మరొకరు రాత్రింబవళ్ళు దగ్గరుండి సేవ చేస్తారు. తల్లి తాను తినకుండా బిడ్డకు రుచికరమైన మధుర పదార్థములను పెడుతుంది. ఇలా ఒకరి కొరకు మరొకరు త్యాగం చేయడం వలన, సేవచేయడం వలన వారి నడుమ ప్రేమ ఏర్పడుతుంది.
- నిన్ను నీవు ఉద్ధరించుకో, ఎవరో ఉద్ధరిస్తారని ఎదురు చూడకు
- నీకు అర్హత కలిగినపుడు సద్గురువు వారంతట వారే ఎదురు పడును. పడితే లేచి పరుగెత్తు, ఎవరో లేపుతారని ఎదురు చూడకు.
- ఇతరులను సంస్కరిద్దామని కలలు కనకు - నిన్ను నీవు సంస్కరించుకో
- నిన్ను ఎవరో ఏదో అన్నారని విచారించకు నీవు ఎవరిని ఏమి అనకు.
- ఆధ్యాత్మిక పంథాన శీఘ్రముగా ప్రయాణించు - కాలము

చాలా విలువైనది; సోమరిగా వుండకు

- భగవంతుడు యిచ్చిన నేత్రములు వున్నందుకు సంతోషించక - జ్ఞాన నేత్రమును పొందనంతుకు విచారించు
- నీవు ఆనందముగా వుండుట ఎట్లు కోరుకొందువో - మనస్ఫూర్తిగా ఎదుటవారి ఆనందమునకు అడ్డుపడకు.
- నిన్ను నీవు పొగుడుకోకు - ఎదుటవారు పొగిడేటట్లు నడుచుకో
- పెద్దలు వేసిన బాటలో నీవు ఉత్తీర్ణుడవైతే - ఆ తరువాత భావి తరానికి ఉత్తమోత్తమమైన రాచబాట వేయగలవు.
- తామస, రజో గుణములను వదులుకో - సత్త్వగుణాతీత స్థితికి ఎదుగు.
- నిర్మల భక్తిని పెంచుకో -ఆ భక్తియే నీకు ముక్తినిస్తుంది.
- దేహమే దేవాలయమని - ఆ దేహములో హృదయస్థానమే పరమాత్మ స్థానమని ధ్యానించు.
- నీవు ఎదుటవారిలోని మంచిని గుర్తించిన, పలువురు నీ మంచిని గుర్తించుతారు.
- ఆధ్యాత్మిక రంగాన ప్రయాణము చేయువారికి అనేక సమస్యలు వచ్చిపడుతూ వుంటాయి. కాని యివి యన్నియు భగవంతుడు కల్పించు పరీక్షలేయని చిరునవ్వుతో ఎదుర్కో.
- సత్య ధర్మాలను పాటించు అవే నిన్ను కాపాడగలవు.
- చెడును వదులు, మంచిని పెంచు అదే నీకు భాగ్యనిలయమవుతుంది.
- సూర్యప్రకాశములో వస్తుజాలము చూసినట్లు, ఆత్మ ప్రకాశ కాంతిలో సృష్టి రహస్యమంతా చూడగలవు.
- ఏది జరిగినా అంతా మన మంచికే అనుకో, ఏ కష్టము



వచ్చినా ప్రారబ్ధమని తలచి, అట్టి ప్రారబ్ధ కర్మను తొలగించు తీవ్ర ప్రయత్నమాచరించు.

- దేహబలము కొరకు యోగసాధన, ఆత్మబలము కొరకు ధ్యానసాధన, ఆత్మ సాక్షాత్కారము కొరకు జ్ఞానసాధన అవసరమై యున్నది.
- మనుజుడు సాకార ధ్యానము నుండి - నిరాకార ధ్యానము నకు ఎదగాలి.
- దేహములోని జీవుడు తొలగితే కన్నులుండి చూడలేడు, చెవులుండి వినలేడు, మనస్సుతో చింతించలేడు. బుద్ధి అనునది అసలే వుండదు. నాది, నా వారు అనేది నామ రూపముండదు.
- నీకు యితరులు యిచ్చినది పంచుతుంటే మరలా నీకు ఇతరులు ఇస్తూ వుంటారు. పదిమందికి పంచవలసినది దాచుకుంటే ఇక నీకు దాచుకొనుటకు ఏమి మిగలదు.
- జన్మజన్మల సంసార వృక్షమును, జ్ఞాన ఖడ్గముతో ఈ జన్మ యందే ఛేదించు, మరుజన్మలకు వాయిదా వేయకు.
- అలలు, బుడగలు అన్నీ సముద్రములోనివే అయినట్లు, సకల జీవుల ఆత్మలన్నీ - పరమాత్మలోని బిందువులే
- బీజము వృక్షమగుటకు, బాలుడు యవకుడగుటకు, కొంత కాలము పట్టినట్లు, ఆత్మ సాక్షాత్కారము పొందుటకు ఎంతో కాలము కావలెను గదా.
- పునాది లేని గోడ నిలువనట్లు, అనుష్టానము లేని వాచా వేదాంతము గమ్యాన్ని ఎట్లు చేర్చును?
- మన కంటికి కనిపించేదంతా నశించేదే. కనిపించే దానినంతా నడిపించే శక్తే చైతన్య బ్రహ్మము. ఇదియే యుగయుగాల సనాతన బ్రహ్మము.

- జీవితమే ఒక పరుగుపందెం. ఆ పరుగు పందెములో ఎన్నెన్నో ఆటుపోట్లు వస్తూ వుంటాయి. వాటిని తట్టుకొని నిలచినవాడే ధీరుడు.
- అన్నదానము చాలా గొప్పది. విద్యాదానం మహత్తరమైనది. అన్నము ఒక పూటమాత్రమే కడుపునింపును. విద్యాదానం వల్ల జీవితాంతము సుఖముగల్గును.
- రూప, యౌవన సంపన్నులైనను, ఉత్తమ కులములో పుట్టిన వారైనను విద్యలేనివారు శోభింపరు. మోదుగ పువ్వు ఎంత బాగా వున్నా వాసన లేనిదైనందున నిష్ప్రయోజనము.
- విద్య వినయము నిచ్చును. వినయము వలన యోగ్యత గల్గుచున్నది. యోగ్యత వలన ధనము పొందుచున్నాడు. ధనము వలన ధర్మము, దాని వలన సుఖము కలుగును.
- పురుషునకు విద్యయే రూపము. విద్యయే రహస్యముగా దాచిపెట్టబడిన ధనము. విద్యయే సకల భోగములను కీర్తిని, సుఖమును కలుగజేయును. విద్యయే గురువువలె అన్నియు బోధించును. పరదేశమునందు జుట్టమువలె సహాయ మొనర్చును. విద్యయే రాజపూజితము. ఇట్టి విద్యలేనివాడు పశుతుల్యుడు.
- లోకమునందు గొడ్రాలు సహింపలేని ప్రసవవేదన ఎట్లు ఎరుగదో అట్లే విద్యాహీనుడు విద్వాంసుల పరిశ్రమను ఎరుగడు.
- విద్యలేనివాడు ఎంత గొప్ప కులములో పుట్టినప్పటికి నిష్ప్రయోజనమే. విద్వాంసుడు తక్కువ కులములో పుట్టినప్పటికి దేవతలతనిని ఆశీర్వదిస్తారు.
- బిడ్డలు కనకుండా, పాలను యివ్వకుండా వున్న ఆవు పనికి మాలినదిగా తలచబడును. అదే విధముగా చదువులేక మూర్ఖుడై వుండి, దేవునియందు పెద్దలయందు భక్తిలేకుండా



వున్న పుత్రుడు కూడా పనికిమాలినవాడే. కనుక బాలలందరూ బాగుగా చదవుకొని భయభక్తులు కలిగియుండవలెను.
- ఓ మనుష్యులారా జ్ఞానమునకు, ఈ లోకములో సంపదల కొరకు సౌఖ్యము కొరకును, పరలోకములో మోక్షము కొరకును, దేవుని సేవింపుడు. (వేదము)
- సంసార సముద్రములో పడి, మృత్యుభీతితో బాధపడుతున్న ప్రాణికోటికి ఆధారం ధర్మం ఒకటే. ఎంత అంగబలం వున్నా, అర్థబలం వున్నా, ధర్మాచరణలేనివానికి స్వర్గాది పుణ్యలోకములు లభించవు. ధనహీనుడు, బంధురహితుడు అయిన ధర్మాత్ముడు ఒంటరిగా స్వర్గాన్ని చేరగలడు. ధర్మము కంటే గొప్ప లాభము మానవునికి మరొకటి లేదు.
- మానవ జీవితము శాశ్వతమైనది కాదు. కనుక ఎప్పుడో వృద్ధాప్యమున ఆ ధర్మము ఆచరించవచ్చునని వాయిదా వేయక, ప్రతివాడు యౌవనమునందే ధర్మశీలుడు కావలెను. ఎవరికెప్పుడు మృత్యువాసన్నమగునో ఎవరికి తెలుసు.
- సత్యము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు, శుచిత్వము, సంతోషము, సిగ్గుపడుట, ఓర్పు, ఋజుత్వము, జ్ఞానము, దయ, ధ్యానము ఇవియే సనాతన ధర్మములు
- అన్ని ధర్మములలోను అహింసయే పరమధర్మము. అంతకు మించిన తపస్సుగాని, సత్యముగాని వేరొకటి లేదు. అహింస వలననే న్యాయముగా జీవింపగలుగును. కనుక అహింస అన్ని ధర్మములలోను ఉత్తమమైనది. అహింసయనగా ఏ ప్రాణినిని ఏ జీవిని కష్టపెట్టక హింసింపక చంపక ఉండడమే.
- ధైర్యం, సహనం, ఇంద్రియ నిగ్రహం, దొంగతనము చేయకుండుట, శుచి, బహిరింద్రియ నిగ్రహము, ధీరత్వము, విద్య, క్రోధము లేకుండుట, సత్యము చెప్పుట ఈ పది లక్షణములు ధర్మాన్ని తెలియజేయును.

- జీవులన్నిటియందు దయ, ప్రియభాషణము, ఎల్లజీవులకు హితమొనర్చుటలో శ్రద్ధ, పరమేశ్వరుని యందు భక్తి అనునవి ఉత్తమ మనుజుల లక్షణములు.
- ధర్మంతోనే అర్థం, కామం లభిస్తుంది. మీరు ధర్మాన్ని సేవించండి అని రెండు చేతులూ పైకెత్తి చెప్పుతున్నా నా మాట ఎవరూ వినరే అంటూ వ్యాసులవారు. (మహాభారతము)
- ఎవరికి విద్యలేదో, తపస్సు లేదో, జ్ఞానము లేదో, శీలము లేదో, ధర్మము లేదో, వారు భువియందు భారభూతులై మనుష్య రూపంతో వున్న మృగములుగా సంచరించుచున్నారు. దీని భావమే మనగా : మనుష్యులుగా పుట్టిన మనము విద్యావంతులమై, తపోవంతులమై, దానవంతులమై, జ్ఞానవంతులమై, గుణవంతులమై, శీలవంతులమై, ధర్మవంతులమై వుండ వలెనని భావము.
- జ్ఞానమునకు వేదమే మూలము. గృహమునకు భార్యయే మూలము; ధ్యానమునకు కృషియే మూలము. జగత్తునకు ధనమే మూలము.
- ధనము సంపాదించుట దుఃఖం. సంపాదించిన ధనం రక్షించుటకు దుఃఖం కూడబెట్టిన ధనం ఖర్చుపెట్టడం కూడా దుఃఖమే.
- ఏ ప్రకారముగ తల్లిని ఆశ్రయించి అన్ని ప్రాణులు జీవించు చున్నవో, ఆ ప్రకారముగానే గృహస్తుని ఆశ్రయించి, సన్యాసులు, మార్గస్థులు, దరిద్రులు, అతిధులు జీవించు చున్నారు. (మనుస్మృతి)
- నీకు లభించిన దానిలో కొంత దాన ధర్మములు చేయ వలెను. ఇంద్రియములను వశపరచుకొనవలెను. సకల భూతముల యందు దయకలిగి సంచరించవలెను. ఇష్టదైవమును ఎల్లప్పుడు పూజించవలెను. జ్ఞానమును ఉపదేశించు



గురువునందు భక్తిప్రపత్తులు కలిగియుండ వలెను. ధర్మరక్షణకై కష్టములను ఓర్చుకొనవలెను. పవిత్రముగా నుండవలెను. సత్యమును పలుకు చుండవలెను. లోపల, వెలుపల పవిత్రముగా నుండవలెను. ఏకాదశీ మొదలగు పవిత్ర దినములలో ఉపవాసములు చేయు చుండవలెను. దొంగతనము చేయ రాదు. న్యాయముగా సంపాదించ వలెను. ఈ పది గుణములు ఉత్తములైన గృహస్థాశ్రమ వాసులకు ధర్మములు.

- భార్యావియోగము, జనుల చేత అపవాదము పొందుట, ఋణశేషము, చెడ్డవానియందు కొలువు, దరిద్ర కాలమందు స్నేహితులు వచ్చుట, ఈ అయిదును శరీరమును నిప్పు లేకయే దహించును.
- పుట్టినప్పటి నుండి స్త్రీచే గాని, పురుషునిచేగాని చేయబడిన పాపమంతా పుష్కర సమయములో స్నానము చేయుట వలన కొంత తొలగిపోవును
- ఊరకే కాలక్షేపం చేయుట మంచిది గాదు. ప్రతీ క్షణము ఆయువు క్షీణించుచున్నది. యమధర్మరాజునకు కరుణ వుండదు. అందు వలన హరికీర్తన చేయవలెను.
- 84 లక్షల జీవరాశులలో మనుష్యజన్మ లభించుట, అందులోనూ పురుషుడై జన్మించుట, అందులోనూ వేద వేదాంగాలను అభ్యసించుట సదాచార సంపత్తి కలిగి యుండుట, సాధన చతుష్టయ సంపత్తి కలిగియుండుట, వీటన్నిటిని అర్థ, జ్ఞానం కలిగియుండుట, ఇవన్నియు కలిగిన ధర్మము నందే ధృఢమైన బుద్ధి కలుగుట చాలా దుర్లభ మైనదని చెప్పారు.
- ఆకాశమున సంచరించువాడు, చీకటిని తొలగించువాడు, వేయి కిరణములు కలవాడును, గ్రహ నక్షత్రముల మధ్య సంచరించు వాడునూఅగు చంద్రుడు దైవయోగము చేతను రాహువుచే మ్రింగబడుచున్నాడు. నొసటి వ్రాతను

తప్పించుటకు ఎవరి తరము కాదు.

- సుఖము తరువాత దుఃఖము, దుఃఖము తరువాత మరల సుఖము ఈ విధముగ బండి చక్రము వలె, వరుసగా తిరుగు చుండును. సుఖమునకు సంతోషించుట, దుఃఖము వచ్చినపుడు బాధపడరాదని భావము.
- అడవియందును, యుద్ధమునందును, శత్రువుల మధ్యను, నీళ్లలోను అగ్నిలోను, మహా సముద్రముననూ, కొండ చివరనూ, నిదురలో  ఒడలు తెలియని వానిని, ఆపదల యందున్నవానిని గాని, పూర్వజన్మయందు చేయబడిన పుణ్యములు రక్షించును.
- చేసిన కర్మ అనుభవించనిదే కోటి సంవత్సరాలకైననూ నశించదు. తప్పనిసరిగా శుభకర్మ అయిననూ, అశుభకర్మయై ననూ అనుభ వించవలసినదే.
- పూర్వజన్మలో చేసిన పాపము వ్యాధి రూపములో, ఈ జన్మలో బాధించుచున్నది. దీని శాంతి కొరకు, మందుల చేతను, దానము చేతను, జప, హోమాదులు, అర్చనాదులచేతను తొలగించు కొనవలెను.
- పాతాళం వరకూ భూమిని త్రవ్వుచూ పోయిన, ఆకాశ మండల మంతయూ తిరుగుచూపోయిన, భూతలమందు తిరుగాడిననూ, పూర్వపుణ్యము లేని వారికి ఒకింతైననూ సంపద లభించ నేరదు.
- ప్రాణము అస్థిరము, యౌవనము ధనము కూడా అస్థిరములే. భార్య పుత్రాదులు కూడా అస్థిరమైనవారే ధర్మము కీర్తి స్థిరములు.
- విదేశములందు విద్యయే స్నేహితుడు. ఇంటియందు భార్యయే స్నేహితురాలు. రోగికి ఔషధమే (మందు). మృతునకు ధర్మమే మిత్రము కనుక ధర్మముగా మెలగవలెనని భావము.



- ఈ శరీరము అనిత్యము. ఐశ్వర్యము శాశ్వతము కాదు. ఎల్లప్పుడు మృత్యువు మనలను కనిపెట్టియుండును. కావున యేకొద్దియైనను ధర్మమును సంపాదించుకొనవలెను.
- మనుష్యులకు తను సంపాదించుకొనబడిన ధనము భూమి యందు, పశువులు గోశాలలోను, భార్య గృహద్వారమందును, బంధువులు శ్మశానము వరకును, దేహము చితి యందు నిలిచిపోవును. ఈ సత్యము నెరిగి, పుణ్యలోకప్రాప్తికై ధర్మము తప్పక నడచుకొనుచు, మంచి కార్యక్రమములు చేయవల యును.
- సకల జనులకు పశువులు, పెండ్లాము, కుమారులు, ఇండ్లు జన్మాంతర సంబంధముచేత గలిగినవి. ఋణములు తీరగానే నశించుచున్నవి. కాబట్టి వాటి గురించి ఆవేదనయేల.
- ఆపదలు వచ్చినపుడు ధైర్యము, ఐశ్వర్యము వచ్చినపుడు ఓర్పు, సభయందు వాక్పాటవము, యుద్ధమునందు శౌర్యమును చూపుట, కీర్తియందాశక్తి, వేదశాస్త్ర అభ్యాసమునందు చింత, ఇవి మహాత్ములకు స్వభావ గుణములు.
- ధర్మాన్ని గురించి మృధువుగా మాట్లాడడము దానగుణము, దేవతాపూజ, అతిధుల పూజ ఈ నాలుగు స్వర్గము నుండి భూలోకము వచ్చిన వారి గుర్తులు.
- అభ్యాసము లేనందువలననే సజ్జనులకు బహిర్ముఖత్వము కలుగుచున్నది గాని అవివేకము వలన గాదు. కేవలము శ్రద్ధాభక్తుల వలననే బ్రహ్మ నిష్ట సిద్ధించుచున్నది. సర్వత్రా అభ్యాసమే బలవత్తరమైనది. అభ్యాసము ద్వారా, దృఢమైన పరిపక్వమైన జ్ఞానముగలవాడై నరుడు సమభావము బడయుచున్నాడని స్మృతి వచించెను. ఇట్లు చిరకాలము నిత్య నిరంతరము బ్రహ్మ నిష్టయందే నిలకడ నొందిన, ఆ యతి, సమస్తమును బ్రహ్మముగానే చూచును.

- ఏ కొందరో ఎన్నో జన్మల పుణ్య విశేషము వలన సద్గురువును పొంది దైవకృపతో, శాస్త్ర పరిచయముతో, అంతఃకరణ శుద్ధితో, తీవ్ర పురుషప్రయత్నముతో, ఆత్మజ్ఞానముతో ఎన్నో జన్మల నుండి పాతుకొనిపోయిన సంసార వృక్షమును కూకటి వేరులతో పెకలించి వేసి మోక్షమును పొందుచున్నారు. అందుకే శ్రీకృష్ణ పరమాత్మ "నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే" అని చెప్పినారు. జ్ఞానమునకు సమానమైనది, పవిత్రమైనది. మోక్షసాధనమైన సాధనము యింకొకటి లేదు. అట్టి జ్ఞానమును సద్గురువులను ఆశ్రయించి, వారిని ప్రసన్నులను జేసుకొని వారి నుండి తెలుసు కొనవలెను. ఇట్టి జ్ఞానమును జెప్పు గురువు శ్రోత్రియ బ్రహ్మనిష్టుడై వుండవలెను.
- ఎవరికి దేవునియందు, గురువు యందు పరాభక్తికలదో వారికి వేదరహస్యార్థములన్నియు గోచరములగును. కావున గురువు నందు మనుష్యభావము నుంచక, ఈశ్వర భావముతో భక్తి పూర్వకముగ సేవించువారికి భగవంతుని దయ, గురు కృప ప్రాప్తించుచున్నది.
- సేవవలన ఆచార్యడెప్పుడు ప్రసన్నుడగునో, అప్పుడు జిజ్ఞాసువు తన స్వరూపమును సాక్షాత్తుగా తెలియుచున్నాడు. ఇది కేవలము సద్గురు సేవవల్ల లభ్యము కాగలదు.
- త్రికాలమందు వుండునది బ్రహ్మవస్తు ఒక్కటే నిత్యమైనది. సుఖ స్వరూపమైనది. తత్‌భిన్నమగు దృశ్య ప్రపంచమంతయు అనిత్యము. దుఃఖరూపమునైయున్నది అని విచారించి, అనిత్యము నుండి, నిత్యమును వేరుపరచి తెలుసుకొనుటయే నిత్యా నిత్య వస్తు వివేకము.
- ముముక్షువునకు వైరాగ్యము అవశ్యకముగా నుండవలెను. వివేకము వైరాగ్యము కలిగియున్నను, శమదమాదులు లేనిచో, కోపతాపములుగలవాడై, శాస్త్రశ్రవణములో పాల్గొనడు.



కనుక మూడవ సాధనము కూడా కావలెను. ఒకవేళ వివేక వైరాగ్యము శమ దమాది, షట్క సంపత్తి అను ఈ మూడు సాధనలు సంపాదించిన వాడైనను, మోక్షాపేక్ష లేనిచో సద్గురుని సన్నిధికి వెళ్ళి శాస్త్ర శ్రవణము చేయజాలడు. అందుచే ఈ నాలుగు సాధనలు కలవాడే శాస్త్ర శ్రవణము చేయుటకు ముఖ్య అధికారియగును.

- అజ్ఞానముతో వున్నవాడు దేహమే తాననుకొనును. శాస్త్రజ్ఞాన పండితుడు జీవుడే తాననుకొనును. ఆత్మజ్ఞాని పరబ్రహ్మమే తానని దృఢనిశ్చయముతో నుండును. దేహ జ్ఞానముగలవాడు బంధమును పొందుచున్నాడు. జీవజ్ఞానముగలవాడు భగవత్ జిజ్ఞాస కలిగి వుంటాడు. బ్రహ్మజ్ఞానముగలవాడు బ్రహ్మ స్వరూపము తానై వుంటాడు. ఇట్టి పరమ సుఖమును అనుభవించుచున్నాడు.
- కృతయుగమునకు మనుమహర్షి వ్రాసిన స్మృతి. త్రేతాయుగమున గౌతమ మహర్షి వ్రాసిన స్మృతి. 3) ద్వాపరమున శంఖ లిఖిత మహర్షి వ్రాసిన స్మృతి. 4) కలియుగమునకు పరాశర మహర్షి వ్రాసిన స్మృతి అనుసరించుచున్నారు.
- ముక్తులు నాలుగు విధములుగా వున్నవి. 1) సాలోక్యముక్తి : రాజుగారి నగరములో నివశించునట్లు తన యిష్ట దేవతా లోకముచేరి నివశించుట సాలోక్యముక్తి. 2) సామిష్యముక్తి : రాజు గారి సన్నిధిలో సన్నిహిత పరిచారకుని వలె తన యిష్ట దేవతా సమీపములో ఉండుట సామీప్యముక్తి. 3) సారూప్య ముక్తి : ఇష్ట దేవతతో సమానమైన రూపాన్ని ధరించి వుండుట సారూప్య ముక్తి. 4) సాయుజ్యముక్తి : రాజు గారి పట్టపు కుమారునివలె పరమేశ్వరునితో సమానముగా సత్య సంకల్పాది సర్వ విభూతులను పొందియుండుట సాయుజ్య ముక్తి. ముందు చెప్పిన అన్నిటికంటె సర్వశ్రేష్టమైనది జన్మమునకు తిరిగిరానిది, భగవత్ స్వరూపములో ఐక్యమైనది సాయుజ్యముక్తి.

◆ బుద్ధి ఒకసారి సత్త్వ ప్రధానంగాను, మరొకసారి రజః ప్రధానంగాను వుంటుంది. కాని బుద్ధిమంచిదైతే మంచి నిశ్చయం చేస్తుంది. రాజతామసమో అయితే, తప్పు త్రోవలో పయనింపజేసి జీవుని నరకయాతనలలో పడద్రోస్తుంది. అందుకనే మనస్సును శుభమార్గములో పురుషప్రయత్నంలో మళ్ళించాలి. (శ్రీవిద్యానందస్వామి)

◆ జన్మాంతర కర్మలు అంతః కరణములో సంస్కార రూపంలో వుంటాయి. సంస్కారాన్ని వాసన అంటారు. అదే జన్మకు హేతువైనది. ప్రారబ్ద కర్మ పుణ్య పాప మిశ్రమమైన జన్మ. తప్పు త్రోవనుండి బుద్ధిని మరల్చడానికి ప్రయత్నించాలి. ప్రయత్నం చేత ప్రారబ్దాన్ని మార్చు కోవచ్చు. విశ్వామిత్రుని స్వప్రయత్నంతో ప్రారబ్దాన్ని దూరంగా వదలి బ్రహర్షిత్వాన్ని పొందాడు. అందువలన ప్రారబ్దం ఎలా వుంటే అలాగున జరుగుతుంది అని వూరకుండరాదు అని భీష్ముడు ధర్మరాజుతోయనెను.

◆ మనస్సు పగ్గమువంటిది. ఇది బుద్ధిచేతిలో వుంటుంది. మనస్సుకు ఇంద్రియాలకు సంబంధమున్నది. ఇంద్రియాలు గుఱ్ఱాలు వంటివి. గుఱ్ఱాలు కళ్లెము, సారధి అన్యోన్య సంబంధము కలిగివున్నట్లు మనో బుద్ధీంద్రియములు పరస్పరం కలిసి వుంటాయి. కర్మేంద్రియాలు అయిదు, జ్ఞానేంద్రియములు అయిదు. ఈ పది యింద్రియాలతో పూన్చిన రధములో పయనిస్తున్నాము. కాబట్టి ఈ రధము శబ్ద స్పర్శాదులనే రోడ్డుమీద పయనిస్తుంది. ఆత్మ శరీరాదులతో కలసి ఆయా విషయాలను అనుభవిస్తుంది. స్థూల శరీరా దులనాశ్రయించి ఆత్మ సుఖ దుఃఖాలను అనుభ విస్తుంది. అందుకే బుద్ధి జాగ్రదవస్థలో వున్నప్పుడే రాగేచ్ఛా, సుఖదుఃఖాదులుంటాయి. అదే నిద్రావస్థలో వున్నప్పుడు అవిలేవు. కాని స్వరూప స్థితికి సంబంధించిన సుఖము మాత్రము వుంటుంది. జాగ్రదవస్థలో బుద్ధిరూపమైన ఉపాధి వుండటము వల్ల జీవాత్మ -



పరమాత్మ వేరుగా భాసిస్తాయి. సుషుప్తిలో అవి రెండూ ఐక్యమవటం వల్ల ఆనందం లభిస్తుంది.

◆ సమస్త దుఃఖాలకు అజ్ఞానమే మూలం. అజ్ఞానాన్ని పోగొట్టుకున్నప్పుడే మనుషత్వం సార్ధకమవుతుంది. జ్ఞానానికి సాధనము చిత్తశుద్ధి. చిత్తశుద్ధి వలన ఏకాగ్రత లభిస్తుంది. ఇది సిద్ధించిన వానికి జ్ఞాన సిద్ధి సులువు అవుతుంది. సత్కర్మలను నిష్కామముగా చేసినవానికి అంతఃకరణ శుద్ధి కలుగుతుంది. దేహము నుండి ఆత్మ వస్తువును వేరుపరచు కొనుట జ్ఞాన స్వరూపము. గత జన్మల పుణ్యఫలము వలన ఈశ్వరకృపతో శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు లభించును. ఆ సద్గురువు మనకు పరమాత్మను చేరుటకు ధ్యాన, జపములను, అర్చన, నామ సంకీర్తనలను, మార్గములను తెలుపును.

◆ ముందుగా నిష్కామ కర్మమార్గమును, భగవంతుని యందు అనన్య భక్తిని ఆ తదుపరి ఆత్మ నాత్మ విచారణ ద్వారా పరమాత్మ దర్శనము కలుగునని పెద్దలు చెప్పుదురు.

◆ పరమాత్మను పొందుటకు ముఖ్య సాధనము ప్రణవోఛ్ఛారణల తోనే పొందవలెను. (ఓంకార ధ్యానము)

◆ ధ్యానము, యోగము వలన మనోదోషములును, ప్రార్థనా పారాయణాదుల వలన వాక్కుదోషమును, పుణ్యకార్యములు - ధర్మకార్యములు - మానవసేవ చేయుటవలన శరీర దోషములు పోవును.

◆ శుద్ధాహారమైనను మితిమీరి తినుటయు, అధిక శరీర పరిశ్రమ చేయుటయు, అధిక భాషణము, మూర్ఖపు పట్టుదల కలిగి యుండుటయు, విషయ లోలత్వము కలిగి యుండుటయు ఇవి యోగమునకు విఘ్నములు కలుగజేయును.

◆ మానవుడు పుట్టినపుడు ఒక్కడే పుట్టుచున్నాడు. మరణించునపుడు కూడా నంతియే. తను చేసిన పుణ్యమును,

పాపమును తానొక్కడే అనుభవించవలసియున్నది.

◆ పరలోకమున సహాయము కొరకు తల్లీ, దండ్రీ ఉండరు, భార్యపుత్రులుండరు, జాతి యుండదు కేవలము ధర్మము మాత్రమే వుండును.

◆ పురుగులు పుట్టకొరకు మట్టిని సమకూర్చుకొనునట్లు మానవుడు పరలోక సహాయము కొరకై ధర్మమును నెమ్మదిగా సమకూర్చు కొనవలెను. ఏ ప్రాణిని బాధపెట్టకుండా సమకూర్చు కొన వలయును. కావున ఎల్లప్పుడును సహాయము కొరకై ధర్మమును సంపాదించు కొనుచుండవలయును. ధర్మమనెడు సహాయము చేత దుస్తరమైన అజ్ఞానమును మానవుడు దాటివేయగలడును.

◆ తపస్సు చేత ధర్మ ప్రధానుడైనట్టి పురుషుని అతని ధర్మమే దివ్యలోకములకు తీసుకొనిపోవును. ధర్మము మానవుని ఉద్ధరించుట ఎంత సత్యమో, అధర్మము మానవుని ముంచి వేయుట అంత సత్యము. ధర్మపదములోనే యీ అర్థము కలదు.

◆ మరణాంతరమున కూడా విడిచిపెట్టకుండా వచ్చునది ధర్మము. అది ఒక్కటియే నిజమైన మిత్రుడు. మిగిలిన ధన, వస్తు, వాహ నాదికమే కాక బంధువర్గము కూడా శరీరముతో పాటే మానవుని విడిచిపెట్టిపోవును. కావున ధర్మమొక్కటియే సర్వకాలములోను తోడ్పడు మిత్రుడు.

◆ పుణ్య కర్మలు, జపధ్యానములు, ప్రార్థనలు ఇవి కేవలము పుణ్య లోకములనే కలిగించును గాని భవసాగరమును దాటించ లేవు. భవసాగరమును దాటవలయునన్న ధ్యాన, సమాధి, ఆత్మ సాక్షాత్కార నిష్ఠ కలిగియుండవలెను.

◆ పరీక్షిత్తు మహారాజు కలికి నాలుగు స్థానము లిచ్చెను. జూదము, మద్యపానము, ప్రాణిహింస, పరస్త్రీ వ్యసనము అని



ఈ నాలుగు స్థానములయందు నీవు సంపూర్ణముగా పాలన చేసుకొన వచ్చునని చెప్పెను.

◆ సాధకులు పూజాదులు ఎక్కువసేపు చేయువారు దానిని కొంత తగ్గించి, ప్రార్థన, స్మరణాదులు ఎక్కువ చేయునట్లు చూడవలెను. అలాగున ప్రార్థన కీర్తనాదులు ఎక్కువగా చేయువారు అవి కొంచెము తగ్గించి జపములో ప్రవేశింపవలెను. జపము ఎక్కువగా చేయువారు క్రమముగా ధారణ ధ్యానములలోనికి చేరవలెను. ధ్యాన ధారణలు గలవారు ధ్యేయములోనికి అనగా సమాధిలోనికి ప్రవేశింపవలెను. ఈ అయిదు అంతస్థులలో ఒక్కొక్కటి వెయ్యిరెట్లు అధిక ఫలము కలిగియుండును. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)

◆ ఓంకారమైన ప్రణవమును ముముక్షువులందరు ధ్యానము చేయవలసినదనియు, విద్యా తపస్సులు రెండును కలిగి అనుష్ఠించువారికి ఆత్మజ్ఞానము కలుగును. విద్యా తపస్సుల వల్లనే జీవులు పునీతులగుదురనియు, ఓంకారమును ధ్యానము చేసి యేసనక సనందనాదులు బ్రహ్మఋషులైరి, ప్రకృతిని జయించి పరబ్రహ్మ స్వరూపులైరి. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)

◆ ధ్యానము ప్రార్థనాదులు సలిపినవారు పరమాత్మ స్వరూపులై అవసాన కాలములో దుఃఖములేకుండా దైవ భావముతో ఆనందముగా శరీరమును విడిచెదరు. విష్ణు సాయుజ్యము పొందెదరు. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)

◆ ముముక్షువగువాడు సద్గురువు సన్నిధికి వెళ్ళివారి సేవ చేయుచు వారి వద్ద ఉపదేశమును గ్రహించినచో, చీకటింటిలో దీపముంచిన ఎట్లు ఆ చీకటి పటాపంచలై పోవునో అట్లే హృదయాంతరాళమున వుండు అజ్ఞానమనెడు తమస్సు మాయమై పోవును.

- ఆనందము కావలసియుండిన అహంకారమును విడువ వలయును. పుణ్యము కావలసిన కోపమును దరిజేరనీయ రాదు. మోక్షము కావలెననిన సమస్త బంధములను త్రెంచివేయవలెను.
- ఏకాదశిరోజున నిరాహారముతోను, నామస్మరణతోను కాలము గడిపినవారికి భక్తి అభివృద్ధికి వచ్చును. వెంటనే వైరాగ్యము జ్ఞానము పట్టుబడును.
- దేహమునందును, దేహ సంబంధ బంధువులయందును అభిమానమును విడిచి, ఆత్మయందును ఆత్మ సంబంధ ముల యందును అనగా పరమ భక్తులు జ్ఞానులు మొదలగు వారి యందును స్నేహభావము కలిగియుండవలెను.
- అసూయ యను మహావ్యాధికంటే అసహ్యమగు రోగము వేరొకటి లేదు. ఈ ఘోర వ్యాధిని ప్రేమయనే ఔషధముచే నిర్మూలించ వలయును.
- ప్రతివ్రతా ధర్మాన్ని అవలంభించిన పడతులు పతియే దైవ ముగా భావించినవారై భర్త విధించు కార్యములు అతిశ్రద్ధతో జేయుచు, పతి యిష్టమే తమ యిష్టమనియు యింత కన్నా వేరుగా తనకొక కర్తవ్యము లేదనియు భావించ వలయును. యిట్టి దృఢ నిశ్చయము గలిగిన స్త్రీలకు సంసారము బాధగా తోచదు.
- భక్తి, శాంతము, దయ, సహనము, ఆనందము, వైరాగ్యము, ఇంద్రియ నిగ్రహము, సత్యవ్రతము, నిర్విషయ సుఖము, నిస్సంగము, తపస్సు మొదలగు కళలు విజ్ఞానికి సహజ లక్షణములు.
- లోకములో నున్న మంచిని తీసుకొనడము, తనలో నున్న చెడ్డను తీసివేయడము సాధు ధర్మము.
- సత్యములేని సంభాషణ, శాంతములేని సేవ నిష్ప్రయోజనము.



ప్రేమగల వారిని అందరూ ప్రేమించెదరు. సత్యముగలవారిని అందరు నమ్మెదరు.

- మనపై నేరము మోపినవారిని మనము ద్వేషించరాదు. దైవ పరీక్షయని తలంచవలయును.
- సుఖము కొరకు, గౌరవము కొరకు ప్రయత్నము చేయడము నిష్ఫలము. ప్రతిప్రాణి దైవ స్వరూపమైనదేయని నమ్మి సేవిం చిన సమస్త సుఖములు గౌరవము లభ్యపడును.
- గర్వముతో చేయు ధర్మము, కోపముతో చేయు సేవ, ప్రేమలేని చోట చేయు భోజనము వ్యర్థము.
- ఎల్లప్పుడు యింద్రియములను స్వాధీనమందుంచుకొన వలయును. ఒక్క నిమిషము యింద్రియములను వాని యిచ్చానుసారముగ పోనిచ్చినచో మరల వానిని స్వాధీన మందుంచుకొనుట ప్రయాసము.
- సముద్రము నుండి కెరటములు సహజముగానే బయలు దేరునట్లు అజ్ఞాని నుండి అతి భాషణము సహజముగానే బయలు దేరును. మాటలు తగ్గితేనే గాని మనసు నిలువదు. మనస్సును స్వాధీనమందుంచుకొనుటయే మాయను త్యజిం చుట.
- పరుల సొమ్ము నాశించుటకన్న పస్తులుండటము మేలు.
- స్వధర్మమును బోధించుచు అధర్మముగా నడవకూడదు.
- కాలముపోతుంది. ఆయువు తరుగుతుంది. ఆశ పెరుగు తుంది. కావున ఆశ పెరుగనివ్వక ఆత్మజ్ఞానాన్ని, పుణ్యాన్ని పెంచుకో అది నీ చేతిలో పని. నీవు ఎక్కడ వున్నను నీవు చేసుకొన్న పుణ్యమే నీకు రక్ష, నీ పాపమే నీకు శిక్ష
- ఇతరులపై ఆధారపడకుడు, మీ పనులన్నియు మీరే చేసికొనుడు. దీని వలన ఆత్మ విశ్వాసము పెరుగును.

- నీవు కష్టపడియైనను ఇతరులకు సుఖమును కలిగించుము.
- త్యాగము లేని వారికి పుణ్యము కలుగదు. అపరిగ్రహ వ్రతము లేనివారికి కీర్తి నిలువదు. ఆశలు కలవారికి తపఃశక్తి నిలువదు. విచారణ చేయనివారికి యదార్థము తెలియదు. జపము చేయువారికి పాతకము లేదు. (శ్రీ త్రినాధ్ గురూజీ)
- భార్యాపుత్రులు, పుత్రికలు, తల్లిదండ్రి, తోబుట్టువులు, బంధువులు వీరందరూ ఋణానుబంధములే కాని చివరకు ఎవరికి వారే.
- క్షణికమైన సుఖముల కొరకు మనస్సునకు అవకాశమిస్తే ఇంద్రియ వృత్తుల వైపు పరుగులెత్తుతాది. అదే మనస్సును దైవ కార్యములకు, ధర్మ కార్యములకు వినియోగించిన శాంతిని, సుఖమును పొందును.
- జీవితములో మంచి విషయములు ఎవరికైనా బోధిస్తే, బోధించినది ఆచరణలో చూపించు. నీవు అనుభవించి మరి కొంతమందికి మార్గదర్శకుడవు కమ్ము.
- సర్వశక్తిమంతుడైన భగవంతుడు మన అందరి హృదయములలో వున్నాడని తెలుసుకోవడమే జ్ఞానం.
- జరిగిపోయిన దానిని గురించి విచారించకు. జరగవలసిన దానిని గురించి ఆలోచించు, జీవితములో పోయిన సమయము తిరిగిరాదు. నీవు ఎంత ఖర్చుపెట్టినా (ఎంత తపస్సు చేసినా)
- దీపము లేకపోతే వెలుతురు లేదు. పువ్వు లేకపోతే వాసన లేదు. విత్తనము లేకపోతే మొక్కలేదు. సంచిత కర్మ లేకపోతే జన్మ లేదు. (శ్రీత్రినాధ్ గురూజీ)
- భక్తి లేకపోతే శ్రద్ధ వుండదు. భక్తి శ్రద్ధ లేని యెడల బ్రహ్మజ్ఞానం కలగదు. బ్రహ్మజ్ఞానం లేనియెడల చావు పుట్టుకలు తప్పవు.



- ఎవరు నిత్యము తృప్తిగలిగి వుందురో, ప్రశాంతమయిన చిత్తము గలవారో వాసనా రాహిత్యముగలవారో, కోరికలు లేనివారో వారే ఆత్మజ్ఞానాన్ని పొందగలరు. (శ్రీ త్రినాద్ గురూజీ)
- దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన అని వాసనలు -3 1) శాస్త్రవాసన : సర్వశాస్త్రములు తానే చదవాలని ఏదైనా మిగిలి వుంటే అది ఎప్పుడు పూర్తిచేస్తానన్న అభిలాష, పుస్తకాల పురుగులాగ అన్ని గ్రంథములు తన దగ్గరే వుండాలను కొంటాడు. అదే శాస్త్రవాసన. ఆవిధముగా సర్వము చదువుచూ కూర్చుంటే చదివినది ఎప్పుడు అనుభవమునకు తెచ్చుకుంటాడు. అందుకే శాస్త్రవాసనను కూడా పరిత్యజించు.
- తెల్లవారుఝామున 4-5 గం.ల మధ్య చేయు స్నానము ఋషిస్నానము. 5-6 గం.ల మధ్య చేయు స్నానం దైవస్నానము. 6-7 గం.ల మధ్య స్నానము మానవ స్నానము. 7 గం.లు దాటిన తరువాత చేయు స్నానం రాక్షస స్నానం. మధ్యాహ్నం చేయునది బ్రహ్మరాక్షసి స్నానం. కావున ఏ వేళకు ఏది చేయాలో చూచుకొనండి. (అవకాశాన్ని బట్టి)
- లోకవాసన : ఎప్పుడూ తన కొరకు ఎవరు ఏమను కొంటున్నారో, మెచ్చుకొంటున్నారో ఎప్పుడూ యిదే తపన - ఇదే లోకవాసన. మంచి స్థితికి రావాలనుకుంటున్నావా లోకవాసన కూడా త్యజించు.
- నీ కంటే దీనులను చూసి జాలిపడుము. వారిని ఆదరించుము., వారిని ప్రేమింపుము. అప్పుడే నిన్ను భగవంతుడు మెచ్చుతాడు.
- తల్లిదండ్రులు ఎటువంటి వారైనను గౌరవించు, వారు మరీ దుష్టప్రవర్తన గలిగి వుండి నీకు నచ్చని పక్షమున నీవు దూరముగా వుండైనా వారిని గౌరవించుగాని విమర్శించకు.

ఎందుకంటే నీకు ఈ శరీరమును యిచ్చినది వారే గనుక, అందుకని వారిని ప్రేమించు.

- నీకున్న చదువు, నీకు తెలిసిన జ్ఞానము పదిమందికి పంచి పెట్టడములో ఉపయోగిస్తే నీవు తరించి మిగిలినవారిని తరింప జేసిన వాడవవుతావు. విద్యాదానమునకు మించిన దానము లేదు. అది ఎవరూ దొంగిలించలేరు. ఎక్కడకు వెళ్ళినా స్నేహితుడులాగా కాపాడుతుంది.
- నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది అంటారు. అందుకే నీవు ఏమి మాట్లాడినా ఆలోచించి మాట్లాడు. మనస్సుతో ఆలోచించు నోటితో మాట్లాడు, చేతల్లో చూపించు. అప్పుడే మనషికి విలువ వుంటుంది. నోటి మాట మధురంగా వినయంగా వుంటే వారి యింట్లో లక్ష్మీదేవి వుంటుంది. అందరూ మిత్రులవుతారు.
- సాత్వికాహారమువలన మనస్సుకి శాంతము, జ్ఞాపకశక్తి పెరుగు తుంది. భగవంతుని దగ్గరకు, మహాత్ముల దగ్గరకు, చంటి పిల్లలు వున్నవారింటికి, రోగుల దగ్గరకు వట్టి చేతులతో వెళ్ళవద్దు.
- వ్యాయామము దేహబలమును పెంచితే, నామస్మరణము ధ్యానము మానసిక బలమును పెంచుతుంది. నీకు ఎన్ని తెలిసినా తెలియని వాడిలావుండు. నిన్ను చెప్పమని అడిగి నప్పుడు చెప్పు, భక్తి శ్రద్ధలు కలిగినవాడికి చెప్పు. పండ్లతో వున్న చెట్టు క్రిందికి వంగును. సర్వము తెలిసివుండి నిరహంకారముగా, వినయముగా వుండు. (శ్రీ త్రినాధ్ గురూజీ)
- పాలలో వెన్న కనబడదు. నువ్వు గింజలలో నూనె కనబడదు. వాటికి చేయవలసిన ఉపచర్యలు చేసిన బయటకు వస్తాయి. అదే విధముగా భగవతత్వాన్ని తెలుసుకోవాలంటే సాధన ముఖ్యము.



- భయము, నిద్ర, ఆహారము, మైధునము ఇవి మనకి జంతువులకు సమానమేగాని భగవంతుడు మనకు మాటను బుద్ధిని యిచ్చాడు. వాటిని మనము సద్వినియోగము చేసుకొని మానవుడు మాధవత్వాన్ని పొందాలి.
- వయస్సు పెరుగుతుందని ఆనందపడకు, ఆయుష్షు తరిగిపోతుందని విచారించి సాధన ప్రారంభించు. సాధన చేయుట మొదట కష్టమనిపించినా అభ్యాసముచే సులభమవుతుంది. (త్రినాధ్ గురూజీ)
- వయస్సు అయిపోతే కామముండదు. అట్లే జ్ఞానము కలిగితే సంసారములో వున్నా - సంసారమంటదు. నీకు పరిపూర్ణ వైరాగ్యము కలిగితే ఇ,క దేని కొరకు ఎవరి కొరకూ ఆలోచించే పని వుండదు.
- ప్రవచనము చేయాలని పరుగులు తీయకు. ముందు నీవు బాగుగా సంస్కరించుకో. ఆపైన పదిమందిని తరింపజేయగలవు. (శ్రీ త్రినాధ్ గురూజీ)
- సజ్జన సాంగత్యము, శాస్త్ర పఠనము, సత్ప్రవర్తన ఇవియే నిన్ను ఊర్ధ్వస్థితికి తీసుకొని వెళ్తాయి.
- భగవధ్యానం లేకుండా తీసుకొన్న ప్రతిశ్వాస వ్యర్థమయినట్లే, అందుకే శ్వాసము గమనిస్తూ ప్రశాంతముగా కొంత సమయము కూర్చోవడము కూడా ఒక ధ్యానమే.
- ప్రేమ అనే జ్యోతిని భగవంతుడు ఎవరికి వెలిగిస్తాడో వారు అందరికన్నా గొప్పవారవుతారు. చికాకులతో, చింతలతో అలమటించే వారికి సత్సంగమము ఒక శాంతినిలయము కాగలదు. అందుకే తప్పనిసరిగా సత్సంగివై శాంతిని పొందుము. సత్సంగ సమయము చాలా విలువైనది. ఎన్ని బాధలున్నా వాటన్నిటిని మరిపించగల శక్తి ఒక సత్సంగ సమయానికున్నది. కావున తప్పనిసరిగా సత్సంగములో

పాల్గొని తరించు. (శ్రీ త్రినాధ్ గురూజీ)

- పాలలో వెన్న మాదిరి, నువ్వులలో నూనె మాదిరి. కొయ్యలో అగ్నిమాదిరి, భూమిలో నీరు మాదిరి, పువ్వులలో వాసన మాదిరి, పూలదండలో దారం మాదిరి, సమస్త ప్రాణులయందు ఆత్మవసించి యున్నది. అందుకే నీవు కూడా ఆత్మ స్వరూపుడవే.

- సంతానము లేనివారికి : ఏడు విధముల సంతానము గలదు. 1) దేవాలయము కట్టించుట 2) అన్న సత్రములు కట్టించుట 3) సద్గురువులకు ఆశ్రమము కట్టించుట 4) బ్రహ్మవేత్తలకు అగ్రహారములు 5) చెరువులు, బావులు త్రవ్వించుట 6) ధర్మకార్యములకు నిధిని ఏర్పాటుచేయుట 7) సత్పురుషులు వ్రాసిన గ్రంథములను అచ్చు వేయించుట.

- అసూయకు మించిన రోగము లేదు. ప్రేమకు మించిన ఔషధము లేదు. తృప్తికి మించిన ధనం, సత్యమునకు మించిన తపస్సు, ఆత్మజ్ఞానానికి మించిన జ్ఞానం, నిర్విషయమునకు మించిన ఆనందం, శాంతికి మించిన సుఖం, అప్పుకు మించిన దుఃఖం లేదు. (శ్రీ త్రినాధ్ గురూజీ)

- భక్తిలేనిపూజ, నీరులేని బావి, గురువు లేని బడి, దేవుడు లేని గుడి, స్త్రీ మూర్తిలేని యిల్లు, వాడిపోయిన పువ్వు, పాచిపోయిన పదార్థం, కపటి స్నేహం, నీటి మీద వ్రాత, అర్థం కాని చదువు, దానం లేని డబ్బు సద్గుణములు లేని విద్య వ్యర్థములు. (శ్రీ త్రినాధ్ గురూజీ)

- శుద్ధిలేని ఆచారం, భూతదయలేని తపస్సు, సత్యము పలుకని వాక్కు, నామము చెప్పని నోరు, ధ్యానము చేయని మనస్సు, జ్ఞానము లేని బ్రతుకు అనవసరము. (శ్రీ త్రినాధ్ గురూజీ)

- సత్సంగము లేని వ్యక్తి, సత్పురుషులు లేనిరాజ్యం, సద్గురువు లేని ఆశ్రమము, సిద్ధాంతము లేని రాజకీయము, త్యాగము లేని కర్మ, మానవత్వము లేని విజ్ఞానము అనవసరము. (శ్రీ



త్రినాధ్ గురూజీ)

- విచక్షణాజ్ఞానం లేని పని, శాంతి లేని మనిషి, అర్హతలేని అధికారం, వినయము లేని శిష్యులు, మాధుర్యము లేని సంగీతం, శ్రోతలు లేని సభను రంజింపచేయలేని ఉపన్యాసం, ఉప్పు లేని కూర, పప్పులేని భోజనం వున్నా లేనట్లే. (శ్రీ త్రినాధ్ గురూజీ)

- దీనవృత్తి, తన వారిని నిందించుట, చినిగిన మాసిన దుస్తులను ధరించుట అధములను సేవించుట, అధిక కోపము, కఠినమైన మాట మాట్లాడుట ఇవియన్నియు నరకము నుండి వచ్చిన నరుని లక్షణములు.

- ప్రాతః కాలమునందు భారతము చదువుట చేతను, మధ్యాహ్నమందు రామాయణము చదువుటచేతను, రాత్రి భాగవతము చదువుట చేతను, బుద్ధిమంతులు కాలము గడుపుదురు.

- మూర్ఖులు జూదము మొదలైన వ్యసనములచేతను, నిద్ర చేతను, కలహము చేతను కాలము గడుపుదురు.

- చేతికి దానము చేయడమే భూషణం. కంఠమునకు సత్యము పలకడమే ఆభరణము. చెవికి వేద శాస్త్రములను వినడమే భూషణము. ఇక యితర అలంకారముల వల్ల ప్రయోజనమేమిటి?

- మంచి స్వభావముతో దానము చేయువానికి ధనము గడ్డిపరకతో సమానము (తృణప్రాయము). దానము చేయుట, ప్రియముగ మాట్లాడుట, ధైర్యము కలిగియుండుట, ఇది మంచి, ఇది చెడు అని తెలిసి తెలివిగా మాట్లాడుట ఈ నాలుగు లక్షణములు పుట్టుకతో వచ్చినవే గాని నేర్చుకొనుట చేరావు.

- వందమందిలో శూరుడు ఒకడు పుట్టును. వేయిమందిలో పండితుడు ఒకడు పుట్టును. లక్షమందిలో వక్త ఒకడు

జన్మించును. దాత అనేవాడు కొన్ని లక్షలమందిలో ఒకడైనా పుడతాడా?

- ప్రాణము పోవునంతటి సంకటము ప్రాప్తమైనను చెడ్డపనిని చేయకూడదు. మంచి పనిని విడువరాదు. ఇదియే ప్రాచీన కాలము నుండి మానవజాతికి ఏర్పడిన ధర్మకర్తవ్యము.
- మృగములు, పశు పక్షాదులు తింటున్నవి. సంతోషించు చున్నవి. వాటివలె తినుచు సంతోషించుచు యున్నప్పుడు వాటికి మానవులకు విశేషమేమిటి? ఏమియులేదు. మానవుడుగా జన్మించినందుకు ధర్మాచరణము, సత్యవా క్పాలనా, పరోపకారము వుండాలని భావము.
- శాంతముతో సమానమైన తపస్సు లేదు. సంతోషము కన్నా మించిన సుఖము లేదు. దురాశకు మించిన రోగము లేదు. దయతో సమానమైన ధర్మం లేదు.
- కృషిచేయువానికి ఎప్పుడూ లోటుండదు. జపము చేసుకొను వానికి పాపము చేరదు. మౌనముతో వుండువానికి ఎవరి తోను కలహములు రావు. మేల్కొనియుండువాని దగ్గరకు భయం చేరదు.
- ఆహారము, నిద్ర, భయము, సంతానము సామాన్యముగా, పశువులకు మనుష్యులకు సమానమే గాని, పశువులకంటె మనుష్యులకు జ్ఞానము, తెలివి విశేషముగా వున్నది. అందువలన మనుష్యులు ధర్మముగా మెలగవలెను.
- పరుల అభివృద్ధిని చూసి అసూయపడువాడు, దయలేని వాడు సంతుష్టిలేనివాడు, కారణము లేక ఊరక కోపించు స్వభావము కలవాడు, అన్నింటికీ శంకించువాడు, పరుల సొత్తుపై ఆధారపడి జీవించేవాడు అను ఈ ఆరుగురు చిక్కుల్లో పడి విచారించవలసి వచ్చును.
- చీమలు సంపాదించిన ధాన్యములు, తేనె టీగలు సంపాదిం



చిన తేనె, లోభి సంపాదించిన ధనము సమూల ముగ నశించును.

- ధైర్యం లేకుంటే లక్ష్మీరాదు. శౌర్యం లేకుంటే కీర్తిరాదు. జ్ఞానం లేకుంటే మోక్షం రాదు. దానం చేయకుంటే పుణ్యంరాదు. అందుకే ధైర్యే సాహసే లక్ష్మీ అన్నారు.
- సర్పమునకు దంతమందు విషముండును, ఈగకు తలయందు, తేలుకు తోకయందు, దుష్టులకు శరీరమంతటను వుండును.
- మంచివారితో స్నేహము వలన అల్పుడు కూడా గౌరవము పొందుచున్నాడు. పుష్పముల యొక్క సాంగత్యము చేతను దారము కూడా శిరసునందు ధరింపబడుచున్నది కదా.
- మూర్ఖులైన వందమంది కొడుకులకంటే గుణవంతుడైన వాడు ఒక్క కొడుకు వుంటే చాలు. ఎన్ని చుక్కలు వున్నా చీకటిని పోగొట్టేది చంద్రుడే కదా.
- గంగానది పాపములను మాత్రమే పోగొట్టును. కల్పవృక్షము కోరికలను దీర్చు దేవతావృక్షము. ధనము దరిద్రమును పోగొట్టును. కాని సత్పురుషుల స్నేహము (సజ్జన సాంగత్యము ఒకటియే విశేషమైనది). కావున దానినే కోరుట మంచిది. సజ్జన సాంగత్యము వలన సందేహ నివారణ దైవభక్తి, భక్తిద్వారా జ్ఞానము కలుగగలదు. (అనగా మోక్షము).
- బుద్ధి పొరపాటు వల్ల సంపదపోవును అధిక గర్వము వల్ల స్నేహము చెడును. దురభ్యాసము వలన వినయము నశించును. దుఃఖము వలన ధైర్యము చెడును. కనుక బుద్ధి పొరపాటు, గర్వము, దురభ్యాసము, దుఃఖము కూడనివి.
- విద్యను నేర్వకపోవుట చేతను, జ్ఞానులతోటి సాంగత్యము (స్నేహము) లేక పోవుటచేతను, ఇంద్రియములను అరికట్టకపోవుట చేతను గొప్ప దుఃఖము సంభవించును. కనుక మానవుడు విద్యనేర్చి, పెద్దలతో సాంగత్యము చేసి,

ఇంద్రియ నిగ్రహము కలిగి యుండ వలెను. అట్లు లేకున్నచో మిక్కిలి దుఃఖము కలుగును.

- ఉత్తములైన వారికి చేసిన ఉపకారము ఏ కొంచెమయినను, వారు కృతజ్ఞులై వుందురు. నీచులకు ఎంత సహాయము చేసినను అది నీటిలోని వ్రాసిన వ్రాతవలె అప్పుడే నశించును. వారు కృతజ్ఞత చూపరని భావము.
- ఎవరి ముఖము నిత్యము ప్రసన్నముగా నుండునో, హృదయ మున దయాగుణముండునో, వాక్కులు మధురముగా పలుకు చుండునో వారు చేయు కార్యములు పరోపకారముగ నుండునో అట్టి సత్పురుషులను నమస్కరించిన గౌరముగా చూతురు.
- సకల సద్గుణ సంపన్నుడు అయిన పుత్రుడొక్కడే చాలును. చంద్రుడు దయించిన లోకమంతయు ప్రకాశించును. ఆ చంద్రుడు లేక నక్షత్రములు ఎన్ని వున్నను ఏమి ప్రయోజనము.
- పరకాంతలను తల్లివలెను, పరద్రవ్యములను మట్టివలెను, సకల భూతములను తనవలెను ఎవడు చూచునో అతడు బ్రహ్మ జ్ఞానియని నకులుడు చెప్పెను.
- ఎవరు నిత్యము పరస్త్రీలను తల్లివలెను, సోదరివలెను చూతురో వారు స్వర్గమును పొందెదరు.
- పెద్దపులివలె ముసలితనము భయపెట్టుచున్నది. మృత్యువు కూడా సమయము కోసం ఎదురుచూచుచున్నది. ఓటి కుండలోని నీరువలె ఆయువు తరిగిపోవుచున్నది. అయినను లోకమున మనుష్యులు తప్పుదారిని వీడకున్నారు. ఏమి చిత్రము.
- కోరికలను అనుభవించుచున్నంత మాత్రాన ఆ కోరికలు ఏనాటికిని అణగిపోవు. ఏలయనగా అగ్నిలో నేయిపోసిన హెచ్చుగా మండునే గాని తగ్గదు గదా. (మనుస్మృతి)



- బాల్యమునందు విద్యయు, యౌవనమునందు ధనమును, వృద్ధాప్యమున పుణ్యమును సంపాదించనివాడు అంత్యకాల మున ఏమిచేయగలడు. కావున ఆయా దశలలో వాటిని సంపాదించ వలెను. 25 సం.ల వరకు విద్య, 25 నుండి 50 సం.ల వరకు ధన సంపాదన. 50 సం.ల నుండి 75 సం.ల వరకు పుణ్యము సంపాదించుకొనవలెను. 75 సం.ల తరువాత మనిషి ఏమి చేయగలడు (ఏమియు చేయలేడని భావము).
- మంచి కార్యాలను ఆచరించటం, నిందించదగిన పనులు చేయకపోవడం, నాస్తికుడు కాకుండటం, పెద్దలయందు వేదములయందు శ్రద్ధ కలిగియుండటం అనేవి పండితుని లక్షణాలు.
- తనకు గౌరవం కలిగినప్పుడు సంతోషంతో పొంగిపోడు. అవమానం జరిగినపుడు పరితాపం చెందడు. అనగా కలత చెందకుండా వుండేవాడు పండితుడనబడును.
- ఓర్పు అనేది లోకములో అన్నిటిని వశం చేస్తుంది. క్షమ చేత సాధించరానిది ఏముంటుంది.
- ప్రతీకారానికి సమర్థుడై కూడా ఓర్పుకలిగి వుండేవాడు, పేదవాడైనప్పటికిని దానం చేయాలనే స్వభావం కలవాడు, వీరిద్దరు స్వర్గలోకాని కంటే పై స్థానమున నిలిచివుంటారు.
- ఇతరుల సొమ్మును అపహరించడం, పరుల భార్యతో సంపర్కం పెట్టుకోవడం, మంచి మిత్రుణ్ణి వదలుకోవడం ఈ మూడు దోషాలు నాశనకారణాలవుతాయి.
- ఆత్మనాశనానికి కారణమైనవి, నరకప్రాప్తికి ద్వారం అయిన కామము, క్రోధము, లోభము అనే రూపాలలో వున్న ఈ మూడింటిని విడువవలెను.
- మనిషి లోకంలో దేవతలను, పితృ దేవతలను, మనుష్యులను, భిక్షువులను, అతిథులను ఈ అయిదుగురిని పూజించి

నట్లయితే కీర్తిని పొందుతాడు.

- అతి నిద్ర, సోమరితనము, భయము, క్రోధము, అలసిపోవుట. పనులను చాలాసేపు నిదానముగా చేయుట అనే దోషాలను విడిచిపెట్టాలి.
- సత్యము, దానము, సోమరితనం లేకపోవుట అసూయ లేకుండుట, సహనము ధైర్యము అనే గుణాలను ఎప్పటికి విడువరాదు.
- ధనం రాబడి, ఎల్లప్పుడు ఆరోగ్యముగా వుండుట, ప్రియముగా మాట్లాడే ఇష్టమైన భార్య, తనకు విధేయుడుగా వుండే కొడుకు, ప్రయోజనాన్ని సాధించే చదువు ఈ ఆరూ లోక ములో ప్రాణులకు సుఖాన్ని కలిగిస్తాయి.
- కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గ ములను జయించిన అనగా యింద్రియాలను వశంలో వుంచుకొన్న వానికి పాపాలు దరికిజేరవు.
- ఆత్మజ్ఞానమునకు నాలుగు ఆటంకములు గలవు. 1) విద్యా గర్వము 2) ధన గర్వము 3) కుల గర్వము 4) అధికార గర్వము ఈ గర్వములు గలవారు దైవమును చేరజాలరు.
- పాదములు, చేతులు, మనస్సు, చిత్తము, ఇంద్రియము లన్నియు స్వాధీనమైనవారలు మాత్రమే బ్రహ్మవిద్యకు అర్హులు. అదియు శిష్య లక్షణములు కలిగియుండవలెను. శమము, దమము, సత్యశౌచ ధర్మానుష్టానములు కలిగినవానికే బ్రహ్మ జ్ఞానము సిద్ధించును. (కాళిదాసు)
- యజ్ఞములన్నింటికంటె జపయజ్ఞము ముఖ్యమైనది. జప యజ్ఞము నా స్వరూపమని భగవంతుడు చెప్పెను. జప యజ్ఞము చేయుటకు అందరకు సాధ్యపడును. జపము వలన సర్వపాపములు నశించి ఆత్మశుద్ధమై జ్ఞానము కలుగును. మంత్రములు జపించి భావించు శక్తివలన అట్టి



వారికి దైవశక్తి బోధపడును. దైవమును దర్శించుటకు శరీరము ముఖ్యము.

- జపము, ధ్యానము, పూజపారాయణ, స్తోత్రము, సహస్రనామ ములు మొదలగు వాటివలన పుణ్యము ఒక్కటే లభించును. భగవద్గీతకు రెండు ఫలములు గలవు. పారాయణము వలన పుణ్యమును, తాత్పర్యము చదివి, భావమును గ్రహించుట వలన ఆత్మానాత్మ విచారణ జ్ఞానము కలుగును.
- ప్రతి యొక్కరికి అనుష్టానము చాలా ముఖ్యమైనది. అను ష్టాన వంతులు చెప్పిన వాక్యములు, విన్నవారి హృదయ ములకు హత్తుకొనిపోవును. అనుష్టానవంతుల వాక్యము మొలకవచ్చు విత్తనమువంటిది. అనుష్టానములేనివారు ఎలుగెత్తి ఎన్ని ఉపన్యాసములు చెప్పినప్పటికిని అవి గింజలేని టెంక వంటివి. పొల్లు వంటివని గ్రహించవలయును. కావున అనుష్టానము ముఖ్యము. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)
- ఆత్మ స్వప్రకాశమైనది, అది అజ్ఞానముచే మాయబడియున్నది. ఆ అజ్ఞానము తొలగుటకే జప, ధ్యాన, పారాయణాదులు, జపధ్యాన ములవల్ల అంతఃకరణ శుద్ధి కలిగి, ఆత్మయొక్క ఆవరణ పోయి నివారణ కలుగునని తెలుసుకొనవలసియున్నది.
- ఓంకారమును రోజుకు వెయ్యి జపము భావనా పూర్వకముగ దైవదృష్టితో మూడు మాసములు నియమ ప్రకారము జపించినచో దైవము యొక్క గొప్పశక్తి వారికి కలుగును. అట్టివారు మనస్సులో ఇతర సంకల్పములు కలుగకుండ దైవమును జపించవలెను. పరిశుద్ధ హృదయము, పరిశుద్ధ వాక్కు, కలిగి చాలా జాగ్రత్తగా మాట్లాడవలయును. శరీర ముతో ఎక్కువ అలసట లేకుండా పుణ్యకార్యములను చేయు చుండవలయును. ఉదయము సాయంకాలము మహనీ

యులందరు ధ్యానము చేయు సమయము కనుక మనము కూడా ఆ సమయములో జపధ్యానములు చేయుచున్న యెడల వారి యొక్క ఆశీర్వాదము ఈఅనుష్టానపరులకు సిద్ధించును. వారు దైవానుగ్రహమును కలిగి యుందురు. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)

- ఒక నిమిషకాలము కోటి రూపాయల కంటె విలువగలది. అందువలన యెల్లప్పుడు హృదయములో ప్రణవధ్యానమును చేయండి. శరీరముతో పుణ్యకర్మలు చేయండి. శరీరమును లొంగదీయవలెను గాని శరీరమునకు మనస్సునకు మనము లొంగకూడదు. (మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు)
- ధర్మమనగా యే సమయమున యే కార్యము చేయవలెనో అట్లు చేయుటయే ధర్మము. జ్ఞాన తపస్సనగా ఉపనిషత్తులు, భగవద్గీత, యోగ సూత్రాలు పఠించుటయే తపస్సు, త్రికరణ శుద్ధియే తపస్సు.
- మూడు సంవత్సరములు కదలకుండ ఒకే స్థలమున యుండి బ్రహ్మనిష్ఠ చేసినచో అప్పటికి భక్తియను పుష్పము వికసించును. ఆరు సంవత్సరములయినచో కాయలు కాచును. పన్నెండు సంవత్సరములకు జ్ఞానమను ఫలము లభించును. (శ్రీశుకమహర్షి)
- ధర్మార్థ కామములు మూడును కోరికతో చేయు కార్యములు. ఇవి రజో గుణముతో కూడినవి. ఆత్మను వచించకూడదు. ధర్మార్థ కామములను విడిచిపెట్టి మోక్షమును కోరువారు సత్యబుద్ధితో ఇంద్రియములన్నిటిని అణచి, ధైర్యముతో కష్టములను సహించి, ధ్యానమును చేయవలయును. ఇట్టి వారే మోక్షమును పొందగలరు. దేవతా జన్మగల వారికి పూర్వజన్మ సుకృతము వలన సత్య ధర్మములు హృదయము నుండి స్ఫురించును.



- రోగాలు లేకుండా వుండుట, అప్పులు లేకపోవడం, పరదేశ వాసం చేయకుండుట, మంచివారితో సహవాసము చేయడం, భయముతో గడపని జీవితం ఇవి మనిషికి లోకంలో సుఖాన్ని కలిగించేవి.
- దోషాలు-స్త్రీ వ్యసనము, జూదము, వేట, మద్యపానము, కఠినముగా మాట్లాడుట, ధనాన్ని దుబారాగా ఖర్చుపెట్టుట. యివి దోషముతో కూడుకున్నవి.
- బుద్ధి, బలము, గొప్పవంశములో జన్మ, ఇంద్రియ నిగ్రహము, పాండిత్యము, పరాక్రమము, మితముగ మాట్లాడుట, శక్తి కొలది దానము చేయుట. చేసిన మేలు మరువక పోవడం అనేవి పురుషుని ప్రకాశింపజేస్తాయి.
- ధర్మాన్ని తెలియనివారు, మత్తులో వున్నవాడు, పొరపాటు పడేవాడు, పిచ్చివాడు, అలసిపోయినవాడు, కోపము కలవాడు, ఆకలితో వున్నవాడు, తొందరపాటున్నవాడు, ఎక్కువ ఆశకలవాడు, భయముతో వున్నవాడు, కాముకుడు, వీరితో సహవాసము చేయకూడదు.
- పనిలేకుండా ఇల్లు వదలిదేశాలవెంట తిరగడం, పాపాత్ములతో ఒప్పందం, ఇతరుల భార్యలతో సంపర్కం, గర్వము, దొంగతనము, పిసినారితనము, మద్యపానము అనే వాటి జోలికి పోనివాడు సుఖంగా వుంటాడు.
- తనకు సుఖం కలిగినప్పుడు పొంగిపోనివాడు, ఇతరుల దుఃఖానికి సంతోషించనివాడు, దానం చేసిన తరువాత బాధపడనివాడు సత్పురుషుడని పెద్దలు చెప్పుదురు.
- ఒకానొక సమయములో సజ్జనులు ఏదో పని విషయములో దుర్జనులను సహాయమడుగుతారు. అందువలన వారికి కొంచె మయినను ప్రయోజనముండదు. అయినప్పటికి దుర్జనులుగా పేరు పొందినవారు తమను సత్పురుషులని

భావించు కుంటారు.

- ఆత్మ విశ్వాసము కలవారికి సత్పురుషులే ఆధారము. సజ్జనులకు కూడా సజ్జనులే ఆధారము. దుర్జనులకు గూడా సజ్జనులే ఆధారము. సత్పురుషులకు మాత్రం దుర్జను లెప్పటికిని గతికారు.
- ఎవడు ధర్మార్థాలను వదిలిపెట్టి, ఇంద్రియాలకు వశుడై సంచరిస్తాడో, వాడు ప్రాణాలను, సిరి సంపదలను, భార్యను శీఘ్రంగా పోగొట్టుకుంటాడు.
- సన్నని రంధ్రాలున్న వలను కొరికివేసి, పెద్ద చేపలు బయటపడే విధంగా కామక్రోదాదులు, మనుజుని వివేకాన్ని హరించి వేస్తాయి.
- ఆత్మజ్ఞానము, స్థిరబుద్ధి, సుఖదుఃఖాదులను సహించే ఓర్పు, ధర్మం తప్పకపోవడం, ఇచ్చినమాటను నిలుపుకోవడం, దానము అనే గుణాలు నీచులలో వుండవు.
- చక్కగా మాట్లాడిన వాక్కు అనేక శుభాలను కలిగిస్తుంది. చెడ్డగా పలికిన వాక్కు కీడును కలిగిస్తుంది.
- బుద్ధి మలినంగా మారినప్పుడు వినాశకాలము ప్రాప్తమయి నప్పుడు, నీతివలె కనిపించే అవినీతి హృదయములో చేరి తొలగకుండా వుంటుంది.
- మనుష్యుడు, పుణ్యముచే సంపాదించుకొన్న కీర్తి ఎంతకాలం ఈ లోకములో పొగడబడుతుందో అంతకాలమతడు స్వర్గములో వెలుగొందుతాడు.
- భర్త ఆదరాన్ని కోల్పోయిన స్త్రీ. జూదంలో ఓడిపోయిన పురుషుడు. బరువు మోయడంతో అలసిన శరీరం కలవాడు ఏవిధంగా నుంటారో అసత్యము చెప్పేవాడు అటువంటి బాధనే పొందుతారు.



- మత్తు పదార్థములను త్రాగుట, కయ్యము, విరోధం, స్త్రీ పురుషులకు వివాదం పెట్టుట, భార్యాభర్తల కెడబాటు కలిగించడం, బంధువులలో విరోధము కలిగించడం ఇవి దుష్టమైన మార్గము. వీటిని విడువదగినవని పెద్దలు చెప్పుదురు.
- ముసలితనము అందాన్ని, ఆశ, ధైర్యాన్ని, మృత్యువు ప్రాణాలను, అసూయ ధర్మ ప్రవర్తనను, కోపము సంపదను, దుష్టులసేవ శీలాన్ని, కామము సిగ్గును ఇవి అన్నిటిని హరించివేస్తాయి.
- మంచితెలివి, గొప్పవంశము, ఇంద్రియ నిగ్రహము, పాండిత్యము, ఎక్కువగా మాట్లాడకపోవడం, శక్తికొలది దానము చేయుట, ఇతరులు చేసిన ఉపకారాన్ని గుర్తించు కొనుట అను ఈ గుణాలు మనుష్యుణ్ణి ప్రకాశింపజేస్తాయి.
- చేసిన పుణ్యము తెలివిని పెంచును. మరల మరల పుణ్యాలు చేసి తెలివి పెంచుకున్న నరుడు తరువాత ఎల్లప్పుడూ పుణ్య కార్యాలు చేయడానికి పూనుకుంటాడు.
- పుణ్యకర్మలు చేయుచు మంచికీర్తిని సంపాదించిన మనుష్యుడు పుణ్యలోకాన్ని పొందుతాడు. అందువలన మానవుడు సావధా నుడై పుణ్యాన్నే ఆశ్రయించి వుండవలెను.
- అసూయకలవాడు, కఠినముగా మాట్లాడేవాడు, పగపెట్టు కునే వాడు, మోసగాడు వీరు పాపాలు చేయుచు వెను వెంటనే గొప్ప దుఃఖాన్ని పొందుతారు.
- అసూయలేనివాడు, తెలివిని పెంచుకున్నవాడు, ఎల్లప్పుడు మంచి పనులు చేయువాడు గొప్ప సుఖాన్ని పొందుతాడు. అతడు అందరికి యిష్టుడవుతాడు. .
- ఇతరులు తనను నిందించుచున్నప్పటికి మరల నిందించవద్దు. సహనం వహించినట్లయితే అతని కోపమే అతనిని దహించును. తిట్టిన వాని పుణ్యము సహించినవానికి దక్కుతుంది.

- ఇతరులను నిందించవద్దు, అవమానించవద్దు, మిత్రులకు ద్రోహము చేయకూడదు. నీచులను సేవించవద్దు. తనను గొప్పవాడుగా తలచవద్దు. చెడు ప్రవర్తన కలిగియుండ కూడదు. పరుషమైన మాటలను పెంచకూడదు.
- మాతాపితరులు ఎవరి వలన బాధను పొందరో, నిర్మలమైన మనస్సుతో ఎవరు ధర్మాన్ని ఆచరిస్తారో, ఎవరు వంశములో గొప్ప కీర్తి కోరతారో, అసత్య మార్గాన్ని విడిచిపెడతారో అటు వంటి వారే ఉత్తములు.
- నడవడికను ప్రయత్నపూర్వకముగా కాపాడుకొనవలెను. డబ్బు వస్తుంది, పోతుంది. ధనము పోయినవాడు అల్పుడు కాదు. శీలము పతనమైనవాడు అన్ని విధాలా చచ్చినవానితో సమానుడు.
- చంచలమైన మనస్సుకలవాడు, పెద్దలను సేవించనివాడు, బుద్ధి నిలకడ లేనివాడు మిత్రులను సంపాదించుకున్న వారు స్థిరంగా వుండరు.
- శోకము వలన కోరినది పొందలేము. శరీరము తాపానికి గురి అవుతుంది. శత్రువులు సంతోషిస్తారు. అందువలన మనస్సును శోకం వైపునకు త్రిప్పకూడదు.
- మనషి మరల మరల పుడుతూ, మరణిస్తూ వుంటాడు. హాని పొందుతూ మరల వృద్ధిని పొందుతూ వుంటాడు. ఇతరులను యాచిస్తూ తాను ఒకరికి యిచ్చుచూ వుంటాడు. తాను ఒకరికొరకు దుఃఖిస్తూ వుంటాడు. అతని కొరకు యితరులు దుఃఖిస్తారు. ఇవన్నీ చక్రంవలె వెంట వెంట తిరుగుతూ వుంటాయి.
- విద్య, తపస్సు ఇంద్రియ నిగ్రహము, దురాశను విడిచిపెట్టుటే శాంతికి మార్గము.
- మనిషి తన బుద్ధి బలముచేత భయాన్ని తొలగించు కుంటాడు.



తపస్సు చేత గొప్పతనాన్ని పొందుతాడు. గురువుల సేవలో జ్ఞానాన్ని, యోగసాధనలో శాంతిని పొందుతాడు.

- బాగుగా నేర్చుకున్న విద్య, సక్రమముగా చేసిన పని, నియమ బద్ధముగా చేసిన తపస్సు, ఇవి పూర్తిగా ముగిసిన తరువాత గొప్ప సుఖాన్ని కలిగిస్తాయి.
- భేద దృష్టికలవారు అనగా విరోధ భావమున్నవారు ఎప్పుడూ ధర్మాన్ని ఆచరించరు. వారు సుఖాన్ని గాని, గౌరవాన్ని గాని పొందలేరు. శాంత స్వభావము వారికి రుచించదు.
- ముసలితనము అందాన్ని తొలగిస్తుంది. ఆశ ధైర్యాన్ని, మృత్యువు ప్రాణాలను, అసూయ ధర్మాచరణమును, కామము సిగ్గును, చెడ్డవారి సేవ శీలాన్ని కోపము సంపదను, మొండి పట్టుదల సమస్తాన్ని నశింపజేస్తాయి.
- ఎక్కువ గర్వము, అతిగా మాట్లాడుట, మహా పాపాలు చేయడం, క్రోధము తన సుఖాన్ని మాత్రమే చూసుకొనుట, మిత్రులకు ద్రోహము చేయుట అనేవి, పదునైన కత్తులులాగా వుండి మనిషిని అధోగతి పాలుచేస్తాయి.
- పాప బుద్ధిగలవారు ఇతరులలోని దోషాలను గూర్చి తెలుసుకో గోరినట్లు ఇతరుల మంచి గుణాలను తెలుసుకోవాలని కోరరు. ఎదుట వారి గుణాలను, తనలోని దోషాలను చూడటం ఉత్తముల లక్షణం.
- గొప్ప ప్రయోజనాల సిద్ధిని కోరేవాడు ముందుగా ధర్మాన్నే ఆచరించాలి. స్వర్గ లోకం నుండి అమృతము ఎడబాయని విధంగా, అర్థము కూడా ధర్మం నుండి తొలగిపోదు. ఆ రెండింటికిని అవినాభావ సంబంధమున్నదని భావము.
- ఎవని మనస్సు పాపము నుండి తొలగి, పుణ్యకర్మలపై స్థిరముగ నుండునో, అతనికి ప్రకృతి వికృతి రూపమైన సమస్తము కూడా తెలియబడుతుంది.

- ఎవడు తీవ్రముగా వచ్చే కోపమును, సంతోషమును ఎవడు అదుపులో పెట్టుకుంటాడో, ఆపదల సమయములో ఎవడు కలత చెందడో, అతడు సంపదలకాశ్రయమవుతాడు.
- అభ్యాగతుడు వచ్చినపుడు బుద్ధిమంతుడు కూర్చోవటానికి ఆసనమిచ్చి, నీళ్ళిచ్చి, క్షేమ సమాచార మడిగి, తన పరిస్థితిని తెలియ పరచిన తరువాత సావధానంగా ఆహారము పెట్టవలెను.
- నమ్మరాని మనిషియందు నమ్మకముంచవద్దు, నమ్మదగిన వానిపై కూడా అతిగా అవిశ్వాసముంచకూడదు. నమ్మకం వలన కలిగిన భయము వేరులతో కూడా నిర్మూలిస్తుంది. అనగా నమ్మినవారు ద్రోహం చేస్తే అది చాలా హానికారక మవుతుందని భావము.
- కామికి సిగ్గువుండదు. పిసినారికి అభిమానముండదు. అప్పు చేయుట నేర్చుకొన్నవారికి హద్దుండదు. నాస్తికునికి దేవుడుండడు. భక్తునికి శాపముండదు. (శ్రీనాధ్ గురూజీ)
- వితంతువు అయిన స్త్రీ విషయ భోగాలనుండి విరక్తిచెంది, భక్తితో, వినయముతో, సద్గుణములతో, సదాచారములను పాటిస్తూ, నిస్వార్ధ భావముతో అందరినీ సేవించడం సర్వోత్తమ ధర్మమై వుంది. (శ్రీ మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వామి)
- నీకు చిన్న ఉపకారము చేసిన వ్యక్తికి, నీవు ప్రత్యుపకారం ఎంత చేసిన, నీవు ఎంత గొప్పవాడివైనా ముందు ఉపకారం చేసిన వ్యక్తిని మరువరాదు.
- చేతులకు అలంకారం త్యాగం, శిరస్సుకి అలంకారం పెద్దలకు చేయు వందనం, ముఖమునకు సత్యవాక్కు, హృదయమునకు సత్ ప్రవర్తన, చెవులకు సచ్ఛాస్త్ర శ్రవణం, కన్నులకు అలంకారం దైవం, గురుదర్శనం, కాళ్ళకు అలంకారం సత్సంగ ప్రవేశం. (శ్రీ త్రినాధ్ గురూజీ)



- ఉత్తముని కోపం నీటి మీద వ్రాతవలె క్షణకాలం, మధ్యముని కోపం ఇసుకపై వ్రాతవలె కొన్ని గంటలు, అధముని కోపం పలకపై వ్రాతవలె యిరువది నాలుగు గంటలు. అధమాధముని కోపం శిలపై చెక్కిన వ్రాతవలె మరణాంతము వరకు వుండును.
- జన్మములన్నిటిలో మానవ జన్మము ఉత్తమమైనది. కనుక ఈ జన్మ విలువ తెలుసుకోలేక ప్రవర్తించినచో, విత్తును బట్టి మొక్క అన్నట్లుగా నీ కర్మను బట్టి తరూత జన్మ ఆధారపడి వుంటుంది. కావున పాపం చేస్తే అధోజన్మ, పుణ్యం చేస్తే గొప్ప జన్మ. పాప పుణ్యాలు దాటి జ్ఞానివయితే మోక్షం. ఏది చేసుకొన్నా నీ యిష్టమే.
- కుమారులు 3 రకములు : 1) శత్రు రూపపుత్రులు 2) ఋణదాత పుత్రుడు 3) సేవకా పుత్రుడు
- **శత్రురూపపుత్రుడు** : పూర్వజన్మలో మనకు శత్రువై వుండి కక్ష తీర్చుకోలేక ఈ జన్మలో కొడుకుగా పుట్టి తల్లిదండ్రులను బాధిస్తూ, కొడుతూ, పగతీర్చుకొనేవాడే శత్రురూపపుత్రుడు. 2) ఋణదాత పుత్రుడు : పూర్వజన్మలో ఎవరయినా మనకు ఋణం యిచ్చి, ఆ ఋణం తిరిగి రాబట్టలేనివాడు ఈ జన్మలో కొడుకుగా పుట్టి, గడి గడికి డబ్బులివ్వమని వేధించడం. ఎక్కడయినా డబ్బులు, మంచి మంచి వస్తువులున్నా పట్టుకెళ్ళిపోవడం చేస్తుంటాడు.
- **సేవకా పుత్రులు** : పూర్వజన్మలో మనం ఎవరికైనా మహాత్ములకు నిస్వార్ధ సేవచేస్తే ఈ జన్మలో సేవకాపుత్రులు లభిస్తారు. వారి సుఖం కన్నా తల్లిదండ్రుల సుఖమే మిన్న అనుకొని, మంచి స్వభావముతో వారిని ప్రేమిస్తూ, వారిని కనిపెట్టుకొని చూస్తూ వృద్ధాప్యములో వారికేమి కావాలో అది సమకూర్చగలరు. వీరే అసలైన సేవకా పుత్రులు.

◆ ధనమధం, కులమధం, గుణమధం, రూపమధం, తపో మధం, యవ్వనమధం, విద్యామధం, రాజ్యమధం, ఈఅష్ట మద ములలో ఏ మధం వున్నా నీవు ఉన్నత స్థితిని పొందలేవు.

◆ దైవ కార్యములు, ధర్మకార్యములు చేయనివాడు, పిలవ కుండా వచ్చేవాడు, ప్రశ్నించకుండా మాట్లాడేవాడు. నిత్యము దోషాచారములో నిమగ్నమయినవాడు, ఎప్పుడూ ఎదుటివారి తప్పులు పట్టేవాడు. అనవసరంగా కోపగించు కొనేవాడు, లోభులను ఆశ్రయించేవాడు. వీరందరూ బలహీనులే. (శ్రీ త్రినాథ్ గురూజీ)

◆ తల్లిని, తండ్రిని, అగ్నిని, గురుదేవుని, దైవమును (ఆత్మను) పంచాగ్నులుగా భావించి సేవించాలి. దైవకార్యములు చేయుచూ అతిథి, అభాగ్యులను ఆరాధించువాడు కీర్తిశాలి అవుతాడు. (శ్రీ మహర్షి శ్రీ మలయాళ స్వామి)

◆ పువ్వులకు నష్టం లేకుండా తుమ్మెద మకరందం త్రాగినట్లు, చెట్టుకు నష్టం లేకుండా తోటమాలి పువ్వులు కోసినట్లు, మంచి కార్యాలకు భక్తులద్వారా కొంత సొమ్ము గ్రహించి, దైవకార్యాలు చేస్తూ, పుణ్యాత్ములుగా మార్చాలి. ఎదుటివారిని యిబ్బందిపెట్టి పెద్ద కార్యాలు చేయడము కంటే, ఎదుటి వారి మనస్సు నొప్పించకుండా చేయుచున్న కార్యమే శుభదాయకం. (శ్రీ త్రినాథ్ గురూజీ)

◆ మంచి ప్రవర్తన లేనివానికి, తెలివి తక్కువానికి, ఈర్ష్య కలవానికి, ధర్మ స్వభావుడు కానివానికి, పరుషంగా మాట్లాడేవానికి, కోప స్వభావముగలవానికి అనేక అనర్థాలు వచ్చి చేరుతాయి.

◆ ఇతరులను మోసగించనివాడు సమర్థుడు, చేసిన మేలు మరువనివాడు బుద్ధిమంతుడు, సరళ స్వభావుడు కాల మహిమచే సంపదను కోల్పోయినప్పటికిని అండదండలు కలిగి వుంటాడు.



◆ ధైర్యము, మనోనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, పరిశుద్ధత, దయాగుణము, కఠినము కానివాక్కు, మిత్రులకు ద్రోహము చేయకుండుట అనునవి ఐశ్వర్యమును పెంచుటకు సమిధల వంటివి.

◆ మనుష్యులలో పరస్పరం బేధం కలిగించే స్వభావం కలవారు, తమ లాభమే ప్రధానంగా కలవారు, సిగ్గులేనివారు, మంకు పట్టు కలవారు పాపాత్ములుగా లోకములో ప్రసిద్ధిని పొందు తారు. అట్టివారితో సహవాసము వదలవలెను.

◆ బీదవాడు, దీనుడు, రోగముతో బాధపడుతున్నవాడు అగు తన బంధువును ఎవడు దయతలచి సహాయపడునో వాడు పశువులతో, పుత్రులతో అభివృద్ధి పొంది అనంతమైన శ్రేయస్సు పొందుతాడు.

◆ తన మేలు కోరేవారిని, జ్ఞానులతో విరోధము కూడదు, బంధువులతో కలసి సుఖమును అనుభవించుట, కలిసి భుజించుట, చక్కగా సంభాషించుకొనుట ఒకరిపై ఒకరు ప్రేమగా నుండుట అనేవి బంధువులు పరస్పరము చేయదగి నవి. ఈ లోకములో మంచి ప్రవర్తన కలవారు తరింప జేయగా చెడు ప్రవర్తన గలవారు ముంచివేయుదురు.

◆ వినయము, అపకీర్తి రాకుండా చేయును. పరాక్రమము కీడును తొలగించును, ఓర్పు ఎల్లప్పుడు కోపాన్ని అణచి వేయును, ఆచారము, చెడునడతను నిర్మూలించును.

◆ గర్వము కలవారితో, మూర్ఖులతో, కోప స్వభావం కలవారితో, తొందరపాటు స్వభావం కలవారితో, ధర్మ మార్గము నుండి తొలగినవారితో, బుద్ధిమంతుడు స్నేహము చేయకూడదు.

◆ చేసిన మేలు గుర్తించేవాడు, ధర్మ స్వభావంకలవాడు, నీచత్వం లేనివాడు, స్థిరమైన భక్తికలవాడు, ఇంద్రియాలను జయించిన వాడు, సంకట సమయాల్లో వదలివెళ్ళనివాడు మంచి

మిత్రుడు, వారితో స్నేహము లాభదాయకము.

- ప్రాణులన్నిటియందు దయ, అసూయలేకుండుట, సహనము, ధైర్యము, మిత్రులను అవమానించకపోవడం అనేవి ఆయుస్సును పెంపొందించుతాయని పండితులు చెప్పుదురు.
- దుఃఖముతో పీడింపబడుతున్నవారి యందు, మత్తులో మునిగిన వారియందు, దైవాన్ని నమ్మనివారియందు, సోమరులయందు, ఇంద్రియ నిగ్రహములేనివానియందు, ఉత్సాహము లేనివారి యందు సంపద నిలువదు.
- మునులకు తపస్సే బలము, బ్రహ్మతత్త్వము నెరిగినవారికి బ్రహ్మజ్ఞానమే బలము. దుర్జనులకు ఇతరులను హింసించుటయే బలము. గుణవంతులకు సహనమే బలము.
- ఎల్లప్పుడు పెద్దలకు నమస్కరించే స్వభావంకలవారికి, వృద్ధులను, సేవించువానికి, మంచిపేరు ఆయుస్సు, ఆత్మ సౌందర్యము, శరీర బలము అనే నాలుగు వృద్ధి పొందుతాయి.
- మంచివారిచేత గౌరవింపబడినప్పటికి, నేను గొప్పవాడను అని భావించక శక్తి వున్నంతవరకు కార్యాలను సాధించే సత్పురుషుని దగ్గరికి కీర్తి శీఘ్రంగా వచ్చి చేరుతుంది.
- ఎందరో మహానుభావులు, గొప్ప బలముగలరాజులు, ధన ధాన్యములతో నిండిన భూమిని పరిపాలించి, చివరకు తమ రాజ్యాలను, అధికములైన భోగాలను కూడా వదిలి యమధర్మ రాజుకు వశులై వెళ్ళినారు. చాలా కష్టపడి పెంచిన తన కుమారుడు చనిపోతే తమ యింటి నుండి లేవనెత్తి బయటకు తీసుకొని వెళ్తారు. అతనిని చూసి బోరుమని ఏడుస్తూనే పాడెమీద ఒక కట్టెవలె పడవేస్తారు. మరణించిన వాని ధనాన్ని మరియొకడు అనుభవిస్తాడు. శరీరములో ధాతువులను, అగ్ని, పక్షులు, భుజిస్తాయి. జీవుడు చేసిన పుణ్య పాపములే తనను వెంబడిస్తాయి. వాటితో తను పయనమై



వెళ్ళుతాడు. ఆ విధముగా అగ్నిలో వేయబడిన పురుషుణ్ణి అతడు చేసిన కర్మ వెంబడిస్తుంది. అందువలన మనిషి ప్రయత్నపూర్వకముగా ధర్మాన్ని ఆచరించాలి.

- ఇతర విద్యల్లో చేసిన పరిశ్రమ అల్పమైన ఫలమును యిస్తుంది. బ్రహ్మ విద్యా పరిశ్రమ బ్రహ్మ దగ్గరకు చేరుస్తుంది. జీవుడు జీవత్వాన్ని వదలి బ్రహ్మత్వాన్ని పొందటానికి బ్రహ్మవిద్య నాశ్రయించక తప్పదు.
- సంపూర్ణ దైవభక్తి కలిగినవారికి విఘ్నములు కలుగవు. దైవ సన్నిధి సులభమగును. (శ్రీ మలయాళ స్వామి)
- గ్రహము పట్టినవానికి, భూత వైద్యుడు వచ్చి మంత్ర ప్రభావముతో వెడలగొట్టి రక్షరేకు కట్టినట్లు మయా ఆవరించిన జీవునకు సద్గురువు ఆత్మతత్త్వమును బోధించి, అజ్ఞానమనే మాయను తొలగించును.
- విద్యుచ్ఛక్తి మనకంటికి కనిపించకపోయిననూ లైట్లు, ఫాన్లు, మిషన్లు అన్నిటిని నడిపించేది విద్యుచ్ఛక్తియే అయినట్లు సృష్టియావత్తును నడిపించేది ఆత్మశక్తియే. భగవశ్శక్తి ఒకటియే.
- సాధ్యమైనంతవరకు నీ యొక్క ప్రాపంచిక అవసరములను తగ్గించుకొనుటకు ప్రయత్నించుము. నీవు మాట్లాడే మాట మధురముగాను, సంక్షిప్తముగా నుండుటకు ప్రయత్నించుము. ఇంతవరకు పోయిన జీవితమునకు పశ్చాత్తాపపడి, ఇక వున్న జీవితాన్నైనా భగవత్ సేవకు, గురుసేవకు అర్పింపుము. అందరికి భగవంతుడే దిక్కని గట్టిగా నమ్ముము.
- భగవంతుడు అంతటా నిండియున్నాడని తెలుసుకొని బంగారమునందెట్టి ప్రీతియో దైవమందు అట్టి ప్రీతియు కలిగి యుండవలెను.
- నిప్పును తాకుటకు ఎట్టి భయమో, పాప మందట్టి భయ

మును, బంగారమునందెట్టి ప్రీతియో దైవమందు అట్టి ప్రీతియు కలిగియుండవలెను.

- జీవితకాలము స్వల్పమైనది. మృత్యువెప్పుడు వచ్చునో తెలియదు. కావున ఆధ్యాత్మిక సాధనయందు తీవ్రనిష్ఠ కలిగి యుండుము.
- ఎక్కువకాలము జీవించుట గొప్పగాదు, ఎక్కువగా పుణ్యము సంపాదించుకొనుట గొప్పది.
- భజనలు చేయుట గొప్పది కాదు, భ్రాంతులను వదలుట గొప్పది.
- ధనమును సంపాదించుట గొప్పకాదు. న్యాయమార్గమును విడువ కుండుట గొప్పది.
- భక్తిరుచిని పొందిన మనస్సు ఇతర రుచులను మరచును, వైరాగ్య సుఖము నొందిన మనస్సు దేహేంద్రియ సుఖమును కోరదు.
- కులములలో గురుకులము గొప్పది. జన్మలలో నివృత్తి మార్గము గల జన్మయే గొప్పది. దానములలో నిదానము గొప్పది. విద్యలలో బ్రహ్మవిద్య గొప్పది.
- కామ, క్రోధ, లోభములు మోక్షమార్గమునందు పోనీయ కుండా అడ్డగించు ప్రబల శత్రువులని తెలిసికొని, వెంటనే వాటిని విడువ వలయును, అట్లు తొలగించనిచో అవి జ్ఞానమును నశింప జేయును.
- ఒకరి మనస్సునకు బాధకలుగునట్లు భుజించిన ఆహారము గోమాంసముతో సమానము. ప్రాప్తించిన దానితో తృప్తి పొందిన ఆహారము దైవ ప్రసాదముతో సమానమైనది.
- ధర్మ ప్రవర్తనగలవానిని ధర్మదేవత తన నీడవలె తోడై సదా రక్షించుచుండును.



- పక్వము కాని కాయలను ఊదరతో పండవేసిన పైకి మంచి రంగు కనిపించును. కాని తినునప్పుడు రుచిలేనట్లు, పైకి సాధువేషము వేసినవారు చెప్పే వాక్యములు, అనుష్ఠానము లేనివారగుటచే వినుటకు శ్రోతలకు యిష్టముండదు.
- గృహస్థ స్త్రీలు భర్తను పూజ్యభావముతో చూచుచు, తనను తన భర్తను భరించేవాడే భర్త పరమాత్మయని మరువకూడదు.
- పునాదిలేని యిల్లు ఎన్ని అంతస్థుల భవనమైనను, ఎంత అందమైన భవనమైనను ఎట్లు కూలిపోవునో అలాగే ధ్యానములేని జ్ఞానము గూడ పతనానికి హేతువగును.
- సత్సంగము ఆత్మసాక్షాత్కారమునకు తాళపుచెవి వంటిది.
- సత్పురుషులతోటి సహవాసమే సమస్త దుఃఖములను నిర్మూలించు టకు మూలకారణమైయున్నది.
- ఇతరుల సహాయమును సేవను, ధనమును, కోరిన కోరిక ఇతరులను బాధపెట్టును. ఇది కోరికతో కూడిన హింస (పాపము) యగును.
- తన స్వార్థము, తన సుఖము కొరకై చేయు కర్మ జీవుని బంధించును.
- మనము చేసిన పాపము, పుణ్యము మనకే తిరిగివచ్చును.
- లోక కళ్యాణార్థమై నిస్వార్థముగా చేయు కర్మ జీవుని బంధనము నుండి విడిపించును.
- నిత్యానిత్య వివేకియగు మానవునికి ప్రపంచ మనిత్యము గాను, మిధ్యగాను తోచును.
- సత్యము ఘనమైనది. దాని మాధుర్యమనుభవించియే తీర వలెను. సత్యము కంటె రక్షించునది ప్రపంచమున ఏదియు లేదు.
- భక్తియోగ మొక్కటియే యీ కలియుగ మానవులకు సులభ

సాధ్యమగు ముక్తి సాధనము.

- భగవత్సాక్షాత్కరమునకై సదా నీ హృదయమునందు ఆవేదన కలిగి యుండుము.
- ఈశ్వర ధ్యానమునకు, ఆత్మ విచారణకు, పరోపకారమునకు కొంత సమయము ఏర్పాటు చేసుకోవాలి.
- స్వార్థం కొరకు చేసే ధనార్జన వలన మనకు శాంతి నివ్వ డము లేదు. అట్లే ఇంద్రియాల తృప్తికోసం చేసే కార్యాలు చివరకు అశాంతి కరంగా వుంటాయి.
- మన మనస్సు భగవంతునిలో ఐక్యమగునట్లు చూడాలి. ఒక్క క్షణమయినా మరుపులేక వుండాలి. మనుజుడై పుట్టినందుకు సత్యం తెలుసుకోవాలి. అదే నిజమైన మోక్షం. సత్యం తెలుసు కోకుండానే మరణిస్తే ఈ శరీరము మనకు భగవంతుడిచ్చి నందుకు సార్థకము చేసుకోవాలి. ఏ చింతనా లేకుండా భగవచ్చింతనమే లక్ష్యంగా చిత్తవృత్తి గలిగి వుంటే అదే నిజమైన భక్తి. కావున సత్యవస్తువే పరమాత్మ.
- నదులన్నీ సముద్రములో కలిస్తే తమ తమ రూపము వదలి, ఏ విధముగా సముద్రముగా మారిపోవునో, అదే విధముగా జీవాత్మ పరమాత్మ లోకలిస్తే తాను బ్రహ్మమే అవుతుంది. అప్పుడే నేను అనే అహంకారము తొలగిపోతుంది.
- జీవించియున్నంతకాలములో మన మీ దేహాన్ని ఆధారముగా జేసుకొని పరమాత్మ స్వరూపంలో ఐక్యం కావడానికి ప్రయత్నం చేయాలి. అప్పుడే మానవజన్మ సార్థకమైనట్లు.
- మనం ఉపదేశం పొందిన మంత్రాన్ని అవిరామంగా జపం చేస్తూ వుంటే ఇష్టదేవతా అనుగ్రహం తప్పకుండా సిద్ధిస్తుంది. ఆ మంత్ర దేవత మనలను ఆవహించి, ఈ శరీరాన్ని వదిలే సమయములో కూడా మనలను వదలిపెట్టదు. ఆ ధ్యానం



లోనే మనము ఉండిపోగలము.

- భగవంతుడు ప్రేమ స్వరూపి, జ్ఞాన స్వరూపి. ఆయన యను గ్రహ ముంటేనే గాని మనకు ప్రేమ జ్ఞానము లభింపవు.
- స్వకర్మనుష్టానమే భగవత్పూజ భగవదారాధన, భగవదనుగ్రహ మునకు ద్వారము. అందుచే మన కర్మలను చక్కగా చేసి, ఆ కర్మలను భగవంతునకు అర్పించి శ్రేయస్సును పొంద వలయును.
- భక్తికి సులభమార్గము, గురువునకు దైవమునకు నమస్క రించి వారియందు విశ్వాసముంచి, వారి పాదములను ఆశ్రయించి వారి సేవచేయుటయే.
- పుణ్యకార్యములు, ధర్మకార్యములచే పాపము పోగొట్టుకొని సత్సాంగత్యము అలవర్చుకో.
- కర్మలను నిష్కామముగా ఆచరించు కర్మఫలములపై కోరిక మాత్రము వుండకూడదు.
- నిష్కామకర్మవలన చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి కలగ గానే రాగ ద్వేషములు తగ్గుతాయి. అప్పుడు ధ్యానమునకు కావలసిన ఏకాగ్రత లభిస్తుంది.
- హృదయములో గల కోరికలన్నియు నశింపగా మానవుడు అమరుడై ఇచ్చటనే జీవించియుండగనే బ్రహ్మత్వమును పొందు చున్నాడు.
- పాపకర్మలు పోగొట్టుకొనుటకు పుణ్యకర్మలు చేయాలి. పాపాలో చనలు పోగొట్టుకొనుటకు దైవచింతన భగవచ్చింతనము వృద్ధిచేయాలి. పుణ్యకర్మలలో లగ్నమైన మనస్సు నందు పాపా నికి చోటు లేదు. అవి చిత్తశుద్ధికి, మనశ్శాంతికి సహాయ పడతాయి.
- దానం, ధర్మం, సత్కర్మనుష్టానం, భగవన్నామోచ్చారణ, ఆలయ

దర్శనం మొదలైన పుణ్యకర్మలను ఆచరించి, పాపక్షాళనం చేసుకోవాలి. దానితో జ్ఞానోదయమై ఆనందానుభూతి లభిస్తుంది.

- బాహ్య వస్తువుల నుంచి పూర్తి ఆనందమెప్పుడు లభించదు. ఆనందమనేది మనలోనే యున్నది. ఆశలనే పంజరములో బంధీలైయున్నాము. ఆ పంజరములో నుంచి బయటపడ్డా మంటే మాయ తొలగుతుంది.
- కష్టాలన్నిటికి, దుఃఖములకు, సుఖములకు మూలము మనస్సే మనము లెక్కలేనన్ని కోరికలతో మనస్సునకు స్థిరత్వం యివ్వడము లేదు. ఆశలను అన్నిటిని వదలిపెట్టు అని మనస్సుకు దృఢముగా చెప్పాలి. చిత్తవృత్తులను నిరోధించి, మనస్సును ఏకాగ్రం చేయడమే యోగం అంటారు.
- సేవ కుటుంబమునకే పరిమితము కాకూడదు. ఇతరులకు, సంఘానికి దేశానికి కూడా మనమందరము సేవ చేయ వలసియున్నది. పరోపకారము పుణ్యముగా మారి, భగవదను గ్రహమునకు దారిచూపి అహంకారము తగ్గి, చిత్తశుద్ధి ఏర్పడి ఆత్మానందము కలుగుతుంది.
- స్థూలదేహముతో ఎట్లు దేవతార్చనలు, యజ్ఞములు చేసు కొనుచున్నామో అట్లే సూక్ష్మమగు మనస్సును, బుద్ధిని పరిశుద్ధ పరచవలెను. స్థూల దేహముతో దైవ కార్యము, దైవసేవ చేసినట్లు సూక్ష్మమగు మనస్సు, బుద్ధులను ధ్యాన, తపస్సుల ద్వారా శుద్ధపరచి, విశుద్ధ సత్త్వమగు ఆత్మలో జీవా త్మను లయపరచవలెను.
- స్థూలదేహము స్థూలాగ్నితో దహింపబడును. అట్లే సూక్ష్మ దేహము వైరాగ్యముతో దహింపబడును. కారణదేహము జ్ఞానముచే దహింపబడును. కాబట్టి మనుజులు భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో, స్థూల, సూక్ష్మ, కారణదేహములను దగ్ధము



చేయవలెను. అప్పుడే బీజము నశించిన విత్తులాగా, దేహ నిర్యానంతరము మరల జన్మకు రాడు. ఎందుకనగా బీజము నకు పై పూక, పొట్టు వుండిననే కదా మొలకెత్తి వృక్షమగును. పై బెరడు తీసివేసిన మొదలవదు కదా.

- ఆత్మ ఒకానొక వస్తువువలె చూడబడునది కాదు, వినబ డునది కాదు, చెప్పబడునది కాదు. అది యింద్రియ ముల ద్వారా తెలుసుకోలేనిది. సూక్ష్మాతి సూక్ష్మమైన హృదయ కుహరమున దాగియున్నది. దీనిని నిష్కామకర్మ, భక్తి, ధ్యాన, జ్ఞానముల ద్వారా, సద్గుణముల ద్వారా తెలియవలెను.
- శరీరము ధర్మమయమై వుండవలెను. మనస్సు భక్తిమయమై యుండవలెను. హృదయ జ్ఞానమయమై యుండవలెను.
- ఎంతటి జ్ఞానియైనను జీవించియున్నంతవరకు వ్యవహార దశలో ఈశ్వరుని, గురువుని, వేదాంత శాస్త్రమును సేవించ వలసినదే. (శ్రీ శంకరాచార్యులవారు)
- ఎంతటి గాఢాంధకారమైనను, దీపమును చేతబట్టుకొనిన యెడల ఆ వెలుగులో చీకటి నిలబడనట్లు, గీతను చేబట్టు వానిని, గీత తత్త్వమును స్మరించువానిని ఎట్టి పాపములు స్పృశించలేవు. అజ్ఞానవశమున చేసిన పాపములన్నియు నశించిపోవును.
- తీర్థక్షేత్రములు సేవించువారిని, అవితాత్కాలికముగా పవిత్రము చేయుచున్నది. గీతయే తనను సేవించువారిని శాశ్వతముగా పవిత్రము చేయుచున్నది. విష్ణు పాదముల నుండి పుట్టిన గంగ త్రిలోక పావని అనబడినది. మరి శ్రీ మహావిష్ణువు యొక్క ముఖతః ప్రవహించిన ఈ గీతాగంగ ఎంత పావనమైనదో వాక్కులతో వర్ణించలేము.
- కోరిక గలవాడైనందున జ్ఞానము లేనివాడగుచున్నాడు. జ్ఞానము లేకపోవుటవలన ఇంద్రియములను నిరోధించి

నను, బుద్ధి యొక్క నిలకడ కలుగదు. కాబట్టి మౌనము చేత, ఇంద్రియ నిగ్రహము చేత, వ్రతాదుల చేత ముందుగా మనో నైర్మల్యము ఏర్పడవలెను. ఇట్లు మనో నైర్మల్యసిద్ధిని ప్రయత్నముతో పొందినప్పుడు, శ్రవణాదులచే జ్ఞానము కలుగగా, ఆ జ్ఞానము ద్వారా పరబ్రహ్మము అద్వితీయముగా గుర్తించి, ఈ బ్రహ్మమే నేను అని తన స్వరూపమునే సాక్షాత్క రించుకొనును. ఇట్లు కలిగినవారికి కోరికలు, విషయము లందలి అభిలాష వెడలిపోవుచున్నది.

- విషయ భోగముల నిత్యములనియు, బంధమును కలుగ జేయునని ధివేకము ద్వారా నిశ్చయించుకొని, రాగ ద్వేషము లనే కోరికల నుండి విడివడిన తన వశములో వున్న గుఱ్ఱ ములవలె ఇంద్రియముల శ్రేయోమార్గమునే నడువ గలవు. ఇట్టివాడు శీఘ్రముగనే మనోనిర్మలత్వమును పొందును.
- సమ్యజ్ఞానము లేనిదే ముక్తి లభించదు. అట్టి సమ్యజ్ఞానము సమాధి నిష్టలేనివారికి సిద్ధించదు. సమాధి నిష్ట ఇంద్రియ నిగ్రహము లేనిదే కలుగదు. అట్టి యింద్రియ నిగ్రహము రాగ ద్వేషములు వున్నవానికి కలుగదు. కనుక రాగద్వేషాలను పరిత్యజించవలెను.
- సర్వేంద్రియములను తీవ్ర వైరాగ్యము చేత ఆయా విషయ ముల నుండి నిగ్రహింపబడినవగునో, అప్పుడు మాత్రమే సమాధి స్థితి సిద్ధింపగలదు.
- నూరు అశ్వమేధయాగములు ఒక్క ధ్యానయోగము యొక్క పదునారవ వంతుకు పోలవు.
- కోటి అశ్వమేధక్రతువుల కంటెను, ఒక్క ధ్యానయోగమే మహత్తర పుణ్యకార్యముగా స్మృతి చెప్పియున్నందువలన, ధ్యానయోగము పరమతపసై యుండుటచేత, ఇట్టి పుణ్యకర్మ మహిమ చేతనే అశ్వమేధాధి మహాక్రతువులను జేసినవారికి గలిగెడు ఉత్తమ లోకములను బొంది అచ్చట పెక్కు సంవత్సర



ములు నివసించి అచ్చట భోగములను అనుభవించి, ఆ భోగములు పూర్తికాగా, మరలానీ లోకమునందు పరిశుద్ధమై, కులాశీలముగలవారును, భాగ్యవంతులుగాను అయిన గృహస్థుల గృహమున జన్మించి మిగిలిన అనుష్ఠానమును పూర్తిచేయుదురు.

- వాసుదేవునికి వ్యక్తమని, అవ్యక్తమని రెండు రూపములు గలవు. అందు బ్రహ్మము అవ్యక్తమనియు అనగా కనబడని స్వరూపము. ఈచరాచర ప్రపంచము వ్యక్తము అనగా కనబడు స్వరూపము. ఈ వ్యక్తము కార్యరూపముగా వున్న ప్రపంచము మాయో పాధియగు అపరబ్రహ్మము

రెండు విధములుగ నున్న నన్ను వారి వారి సంస్కారముల బట్టి కర్మయోగముగా, సాకారముగా కొలుచువారిని ఆ విధముగనే అనుగ్రహించుచున్నాను. అట్లుగాక జ్ఞానయోగ ముచే నిర్గుణపరబ్రహ్మమైన నన్ను సర్వత్రా వీక్షించువారిని, నాకంటె అణువు కూడా లేదు. అండ, పిండ బ్రహ్మాండమంతా వ్యాపించి వున్నానని ధ్యానించువారిని నాలోనికి చేర్చుకుం టాను అని శ్రీకృష్ణ పరమాత్మ ఉపదేశము.

- ఓ అర్జునా ఎవడు అహంకార రహితుడై నన్ను శ్రవణ మననా దులచే ఏర్పడిన విజ్ఞాన బలముచేత, ఎవడు తన స్వరూపము గానే తెలిసికొనుచున్నాడో అతడు కర్మలచేత బంధింపబడడు అని కూడా చెప్పియున్నారు.
- అనేకవేలసార్లు శ్రవణము చేసినను, సమాధి అనునది లేనిచో సాధకునకు సమ్యక్ జ్ఞానము కలగదని యర్థము. ముముక్షు వునకు సమాధిచేతనే సమ్యక్ దృష్టిచే జ్ఞానము మోక్షమును సిద్ధించును.
- స్వర్గాది ఫలములనొసగెడి యజ్ఞములకంటె, నిత్యానంద రూపమగు మోక్షము నొసగెడు జ్ఞానయజ్ఞము శ్రేష్టమైనది.

శ్రేయస్సును ప్రాప్తించునదైయున్నది.

- నడచి నడచి సముద్ర తీరమును జేరువానికి ఇక నడక ఆగిపోవునట్లే జ్ఞానము పొందినవానికి ఇక చేయవలసిన కర్తవ్య మేమి యుండదు. అట్టి బ్రహ్మజ్ఞానము ఎవరికి కలిగినదో వాని సంచితము, ఆగామి కర్మయంతయు మిగిలి వుండకుండా పరి సమాప్తిచెందుతుంది. సూర్యదేవుని కాంతి చే చీకటి తొలగునట్లు జ్ఞాన ప్రభావముచే సమస్త కర్మము నిర్మూలన మగుచున్నది. పుణ్యాత్ములు యజ్ఞ, దాన, తపోవ్ర తాది రూపముల ద్వారా ఏ పుణ్యము పొందుచున్నారో, అట్టి పుణ్యములన్నిటిని జ్ఞానప్రాప్తిచే అతడు పొందుచున్నాడు. ఇట్టి జ్ఞాని సమస్త పుణ్యకర్మలు అనుష్టించిన వాడేయగు చున్నాడు. దీపము తీసుకొని రాగానే చీకటిపోయి వెలుగు వచ్చినట్లు జ్ఞానమనే అగ్నిలో దీర్ఘకాల పాపములు కూడా దగ్ధమగును.
- బ్రహ్మమేనేననెడి జ్ఞానము ఎప్పుడైతే కలిగినదో, అంతకు ముందున్న అజ్ఞానము వలన దేహమేనేననెడి భావము తొలగును. ఎట్లనగా మసక చీకటిలోతాడును చూసి పాముగా భ్రమించినను, దీపకాంతిలో యదార్ధము తెలిసి కొన్న తరువాత పాము భ్రమ తొలగినట్లు, జ్ఞానము కలిగిన తరువాత అజ్ఞానము మటుమాయ మగును.
- భుజించిన అన్నమును ఎట్లు త్యజించలేమో అట్లే సంచిత, ఆగామి కర్మలను జ్ఞానాగ్నితో నిర్మూలించగలము. కాని భుజించిన అన్నములాగా ప్రారబ్ధకర్మను తొలగించలేము. అది అనుభవించ వలసినదే.
- నిష్కామముగా పుణ్య కర్మలు భగదర్పితముగా చేయువారు బంధముల యందు తగుల్కొనరు. నిష్కామ కర్మ ఒకింతైనను శ్రేయస్సును చేకూర్చును. అట్లే ఔషధము కొంచెమైనను రోగమును ఎట్లు నిర్మూలించునో అట్లే నిష్కామ దైవ, పుణ్య



కార్యములు ఎంతో మేలుచేసి జ్ఞానమును కలిగించును.

- మోక్ష సంపాదనకు యోగ్యమైన దేహమును పొందియు కామక్రోధములకు లొంగి పతితుడైనచో మరల ఇట్టి దేహము దొరకదు. కావున ముముక్షువైనవాడు వివేక వైరాగ్యముల ద్వారా యుక్తవయస్సునందే కామాది శత్రువులను బాగుగా జయించి, ప్రయత్నపూర్వకముగా ఇప్పుడే ఈ దేహ వియోగము కలుగక ముందే మోక్షమును పొందవలెను.
- వినబడునది, చూడబడునది, స్పృశించునది, భావించినది, గ్రహించినది ఇంకను ఈ సమస్త ప్రపంచము తాము, సకల భూతాలు బ్రహ్మమే అని నిశ్చయించి, పూర్వవాసనాకృతమైన నామరూప భేద కల్పనను సంపూర్ణముగా పరిత్యజించి, తమ యందును, సమస్త ప్రపంచమందును బ్రహ్మదృష్టినే ప్రయత్న పూర్వకముగా సంపాదించవలెను. ఇదియే సమాధి, బుడగలు, తుంపరులు, అలలు అన్నియు సముద్రముకంటే వేరు కానట్లు, సకల నామరూపములు బ్రహ్మముకంటె వేరుగాలేవు. సకల జగత్తు బ్రహ్మముకంటే అణువు కూడా వేరుగా లేదు.
- బ్రహ్మ సాక్షాత్కారమునకు దైవ, గురు, కృప, శాస్త్ర పరిచయము అంతః కరణశుద్ధి సంపాదించవలెను.
- ఇంద్రియములకు లోబడిన జీవుడు మరణకాలమున ఎట్టి మనస్సు గలవాడుగా నున్నాడో, అట్టి మనస్సుతోనే వేరొక గర్భములో ప్రాణముగ ప్రవేశించుచున్నాడు. ప్రాణము తేజస్సుతోను, అంతఃకరణముతోను గూడినదై, వీని సంకల్పమునకు తగినట్లు ఆ యా లోకములకు వెళ్ళుచున్నా డని శ్రుతిచెప్పుచున్నది. కావున కడు జాగ్రత్తతో అంత్యకాల మున బ్రహ్మ భావముతోనే వుండుచు, దృశ్యభావమును దరిజేరనీయ కూడదు.
- బ్రహ్మము అంతటా వ్యాపించియున్నది. బ్రహ్మ ప్రకాశముతోనే

జగుత్తంతయు ప్రకాశించుచున్నది. కాబట్టి ప్రకాశమైన బ్రహ్మ తేజస్సుతోనే, జగత్తు సకల భూతములు, ప్రకృతిలో బయట లోపలా అంతా బ్రహ్మ ప్రకాశమేయని అనుభవమునకు వచ్చును.

- మట్టికంటె కుండలు వేరుకానట్లు, దూది కంటె వస్త్రములు వేరుకానట్లు, అల, తుంపర, సముద్రము కంటె వేరుకానట్లు ఈ బ్రహ్మము కంటే జగత్తు వేరుగాలేదు అను యదార్థ అనుభవ జ్ఞానమునకు వచ్చును. విచారణ ద్వారా ఎవరైతే ఓమ్ అను ఏకాక్షరము చేత పరబ్రహ్మమును ధ్యానించు చున్నారో అట్టివారు బ్రహ్మమునే పొందుచున్నారు.
- పరమాత్మ సర్వభూతములందును ప్రకాశరూపముగనున్నను, మేఘములచేత సూర్యుడు కప్పబడియున్నట్లు, అవిద్యచేత ఆత్మ కప్పబడియున్నది.
- నేను కర్తను, భోక్తను, బాలుడను, యవ్వనుడను, ముదుసలిని, మూఢుడను నేను చెవిటివాడిని, నేను గ్రుడ్డివాడిని, నేను కుంటిని, నేను ధర్మాత్ముడను, సుఖిని అని అన్నియు దేహానికి సంబంధిం చిన వేయగును.

  దేహములోని మనస్సు, యింద్రియములన్నిటిని నేను లోపల వుండి ప్రకాశింపజేయుచున్నాను. నేను ఈ దేహమునుండి తప్పుకున్నప్పుడు పైన చెప్పినవి ఏమియు వుండవు. దేహమే జడమై స్మశానమునకు వెడలునపుడు నేను అనుకున్న భ్రమలన్నీ పటాపంచలగును. క్రితజన్మనుండి, ఈ జన్మకు వచ్చినది, బాల్య యవ్వనాదులలో, వృద్ధాప్యములో వున్నది, జాగ్రత్త, స్వప్న సుషుప్తావస్థలలో ఏ మార్పు వికారాలు లేకుండా వున్నది బ్రహ్మ చైతన్యమే అని తెలుసుకొన వలసియున్నది.
- ఆకాశాది ప్రపంచ సకల దేవతలు ప్రకృతి, సకల చరాచరములు మూల బ్రహ్మమునుండియే పుట్టినవి. ప్రకృతిని నేనే,



మాయోపాధికుడైన ఈశ్వరుడను నేనే, పోషకుడను నేనే, తెలుసుకొనబడునట్టి శబ్ద, స్పర్శాది రూపమైన వస్తువులనెల్లా నేనే. పరబ్రహ్మల పేరుగా నుండు ఓంకారము నేనే. చతుర్వేదములను నేనే. కర్మద్వారా పొందబడునట్టి స్వర్గాది రూపమగు కర్మఫలము నేనే. ప్రభువు - నియామకుడను నేనే. జగత్తును భరించు (ధరించిన) ఆదికూర్మము నేనే. ప్రాణులు చేయునదంతయు, చూచునట్టి సాక్షిని నేనే. సకల భూతములకు నివాసమైన భూమిని నేనే. ఆర్తుల ఆర్తిని పోగొట్టువాడిని నేనే అని శ్రీకృష్ణ భగవానులు గీతలో చెప్పిరి.

- ప్రాణులకు ఉపకారము చేయు సూర్య, చంద్రుడు, మేఘము, వాయువు నేనే. సకల జగసృష్టి కారణమును నేనే. సకల ప్రళయ కారకుడను నేనే. సర్వమునకు కార్యకారణము నేనే. ప్రయత్నము ద్వారా సంపాదింపదగిన నా యొక్క జ్ఞానమే (బ్రహ్మజ్ఞానమే) ముక్తి కారణమైయున్నది. అది లేకపోవుటయే బంధమునకు కారణము. నేను బ్రహ్మమును అని ఏకాగ్ర మనస్సుతో చేసిన, పాపము నంతటిని దాటిపోవు చున్నాడు అని శ్రీకృష్ణ భగవానులు చెప్పిన దివ్యసందేశము.
- ఎవడు జాగ్రత్తను అనుభవించునో, ఎవడు స్వప్నమును గనునో, ఎవడు సుఖముగ నిద్రించునో, ఈ మూడు అవస్థలలో వున్నను నిర్వికారముగ సాక్షిభూతముగ ఎవరు వుండి నడుపుచున్నారో వాడే ఆత్మ. ఈ శరీరమే క్షేత్రము. ఈ క్షేత్రమును తెలుసుకొనినవాడే క్షేత్రజ్ఞుడు. దేహములోని ఆత్మను వేరుపరచి చూడవలెను. క్షేత్రజ్ఞుని పరమాత్మ పరబ్రహ్మముగా తెలుసుకొనము. అట్లే అన్ని దేహములలో వున్న ఆత్మ కూడా ఒక్క పరమాత్మ స్వరూపమే. సమస్త జగత్తు బ్రహ్మమే. ఆ బ్రహ్మమే సర్వములో వ్యాపించియున్నది. బ్రహ్మ చైతన్యము లేనిది జగుత్తులో ఏదీ లేదు. కావున జ్ఞానము ప్రయత్న పూర్వకముగా సంపాదించవలెను. ఎందుకనగా జ్ఞానము సిద్ధించి

ననే మోక్షము.

- ఒక్క సూర్యుడే బ్రహ్మాండమంతటిని ప్రకాశింపజేస్తూ అనేక ఘటములలో అనేకముగా కనిపించినను ఒకే సూర్యుడు అయినట్లు, బ్రహ్మము ఏకమే అయినను ఉపాదులను బట్టి బ్రహ్మాండమంతటను వ్యాపించి ప్రకాశింపజేయుచున్నాడు.
- ఆత్మ సర్వము నిండియుండుటచేత శుద్ధ స్ఫటికమునందు వలె నిర్మలమైన బుద్ధియందే లభ్యమగుచున్నది. కాబట్టి బ్రహ్మమునే తెలుసుకొనవలసియున్నది.
- ఆత్మసర్వసాక్షి నిర్వికారము ఎట్లనగా మన యింటిలో చీకటి పడగానే దీపము వెలిగించి, ఆ దీపపు కాంతిలో మంచి చెడు కర్మలు ఏమి చేసినను ఆ దీపమునకు అంటనట్లు, దేహేంద్రియ ములతో చేయు పనులేమియు ఆత్మకు అంటవు. దేహేంద్రియ ములు వాటి పని అవి చేసుకొనుచున్నవి. నేత్రేంద్రియము చూచుచున్నది. కర్ణేంద్రియము వినుచున్నది. మనస్సేంద్రియము మననము చేయుచున్నది. వాగేంద్ర యము మాట్లాడుచున్నది. బుద్ధి యింద్రియము నిశ్చయించు చున్నది. ఇంద్రియములు లేని ఆత్మ మాత్రము కాదు అకర్తము గానే చూచుచున్నది. సాక్షిమాత్రముగా నుండునది ఆత్మ. ఆత్మకు ఏ కర్మలు అంటవు అని అర్థము.
- బాల్యంలో అజ్ఞానం వల్ల భగవత్ చింతన కలుగదు. యౌవన ములో స్త్రీలపై కోరికచేత తత్త్వచింతన కుదరదు. ముసలి తనములో రోగాల బారినపడి మోక్షమార్గము పట్టదు. ఇక మనిషి ప్రయత్నం ఎప్పుడు చేస్తాడు. నరజన్మ ఎత్తినందున పరమాత్మను తెలుసుకోవాలి. ఆ విధముగా చేయక పాప బుద్ధితో చెడు పనులకు పూనుకొంటే అధోగతే. నీటి బుడగ నీటిలోనే పుట్టి మరల ఆ నీటిలోనే పేలిపోతుంది. కలలో ఎంత సిరి కనిపించినా దక్కదు. అలాంటిదే ఇహలోక భాగ్యం.



దొరికినట్లే వారికి దొరికి మాయమవుతుంది. సంతృప్తిని కలిగించేదీ, కోరికను నెరవేర్చేదీ శాంతరూపమైనది ఆత్మ జ్ఞానం, దానిని సంపాదించాలి.

- కోరికలు కోరనివాడు, విషయాసక్తి లేనివాడు, కామమును జయించినవాడు మాత్రమే శాంతిని బొందగల్గును.
- ప్రారంభమున ప్రతివారు నిష్కామకర్మను ఆశ్రయించిననే, తుట్ట తుదకు ఆత్మానుభవమును పొందగలుగుచున్నారు.
- తమస్సు నుండి రజస్సులోనికి, రజస్సు నుండి సత్వములోనికి, సత్వము నుండి విశుద్ధ సత్వములోనికి లేక గుణాతీత స్థితికి జీవుడు క్రమముగా చేరుకొనవలెను.
- ఇంద్రియములకు స్వతః విషయములను అనుభవించు శక్తి గాని, తెలుసుకొను శక్తిగాని లేదు. మనసు వాటితో జేరినపుడే తెలుసుకొనగలవు. కావున మనస్సుతో సహా, ఇంద్రియము లను నిగ్రహించుటవలన, ప్రయోజనము కలదు. ఇంద్రియ ములతో బాటు మనస్సుని గూడా అదుపులో నుంచుకొనవలెను.
- ప్రతి జీవి యొక్క హృదయమందు ఆత్మదేదీప్యమానముగా ప్రకాశించుచున్నది. కాని కామాదులచే ఆవరింపబడుట వలన అనుభూతము కాకయున్నది.
- మెత్తటి ఆసనముపై కూర్చొని, చిత్తము యొక్కయు, ఇంద్రియ ముల యొక్కయు, క్రియలనుజయించి, మనస్సు శమించు నంతవరకు ఓంకారము నుచ్చరింపవలయును. అటు పిమ్మట అంతః కరణ శుద్ధి కొరకు, ప్రాణాయామమును ఆచరించవలెను. అనంతరము ఇంద్రియములను, విషయ ముల నుండి మెల్లమెల్లగ తొలగించవలెను.
- మోక్షప్రాప్తికి మూడు ఉపాయములు కలవు : 1) శాస్త్రార్థ గ్రహణము 2) జ్ఞానులతోటి సాంగత్యము 3) ధ్యానము. వీటిలో ఒక దానికంటె మరొకటి శ్రేష్టమైన ఉపాయములు.

- గురువాక్యము, శాస్త్రబోధ, స్వానుభవము అను మూడును యేకార్థము గలిగియుండుటయే, యదార్థ తత్త్వానుభవము యొక్క చిహ్నమని భావము.
- శరీరమునకు భోజనము ఏవిధముగా అవసరమో, ఆత్మకును ఆధ్యాత్మిక ప్రబోధము అంతకుమించిన అవసరము. శరీరము కనబడుతుంది. ఆత్మ కనబడదు. కనబడునది నశించును. కనబడని ఆత్మ నశించదు. దాని కొరకు సాధనచేయవలసి యున్నది.
- శరీరముతో చేయునది పూజ. షోడషోపచారపూజ. అది తాత్కాలిక ఆనందము నిచ్చును. మనస్సుతో చేయునది ధ్యానము. ఆత్మ అదృశ్యము, మనస్సు కనబడదు. కనబడని ఆత్మను, కనబడని మనస్సుతో మధించవలెను, (ధ్యానము చేయవలెను). అందుచే మహర్షులు అరణ్యములో తపస్సు, ధ్యానము చేసిరి.
- మాయకు లోబడినవానికి మృత్యువంటే భయం. మాయను అవలీలగా జయించినవానికి (జ్ఞానికి) మృత్యువు ఎప్పుడు వచ్చినా ఆహ్వానిస్తాడు. మనిషిగా పుట్టినవాడు పరోపకారం చేయాలి. మానవుడు భ్రమను వీడనంతవరకు బ్రహ్మమును దర్శించలేడు.
- 1) దొంగతనము చేయకుండుట 2) భూతదయ కలిగి యుండుట 3) ఇతరుల మనస్సును నొప్పింపకుండుట 4) ఉన్నదానితో తృప్తిపడుట 5) ఇతరులను చూసి ఈర్ష్య పడకుండుట, 6) ఎల్లప్పుడు భగవంతుని ధ్యానించుట 7) కోపాన్ని విడిచిపెట్టుట. ఇవి భగవంతుని చేరుటకు మార్గము చూపుతాయి.
- రోగ బాధలు కుటుంబ బాధలు, వార్ధక్య బాధలు మీద పడక ముందే దైవచింతన దైవ ధ్యానము చేసుకొనవలెను.



- చిత్తశుద్ధి అనేది ముక్తికి మూలాధారం. చిత్తశుద్ధకి సంస్కారం మూలం. చిత్తశుద్ధి సరిలేక కాషాయము కట్టినా ఒరిగేది ఏమీ లేదు.
- ద్వేషంతో ద్వేషాన్ని శాంతింపజేయడం అనేది జరగనే జరగదు. ద్వేషాన్ని ప్రేమచేతనే శాంతింపజేయాలి. మన జీవితము నిత్యము గాదు. శాంతిగా జీవించడము నేర్చుకోవాలి.
- శాశ్వతమైనదేదో, అశాశ్వతమైనదేదో, చక్కగా తెలుసుకొని, శాశ్వత మార్గాన ప్రయాణము చేయాలి. అప్పుడే సత్కార్యాలు చేయాలని అనుకుంటావు. అప్పుడే నీ జీవన యాత్ర ఆనందముతో నడుస్తుంది. ఇహపర సుఖాన్ని పొంద గలుగుతావు. పాప కార్యాలు పైపైకి సుఖాన్ని కలిగిస్తాయని పిస్తుంది. కాని అది అంతా మాయ. ఆ మాయలో పడ్డావా నీ గొయ్యి నీవు త్రవ్వుకున్నట్లే.
- సంసారమనే సముద్రములో, ఇంద్రియ నిగ్రహం అనే తెప్పలతో అవతల వున్న ద్వీపాన్ని చేరుకో. అందులో శాంతియనే ఇల్లు కట్టుకో. జ్ఞానంయనే భార్యతో అందులో నివసించు.
- బాణాలు తయారుచేయువాడు. ఆ బాణాన్ని వంకర లేకుండగా తిన్నగా వుండేటట్లు తయారుచేయడములో తీర్చిదిద్దుకుంటాడు. అదే విధముగా బుద్ధిమంతులు తన మనస్సును వక్రమార్గము పట్టకుండా తీర్చిదిద్దుకోవాలి. చిత్తాన్ని యిష్టం వచ్చినట్లు తిరగ నీయక, చంచలత్వం లేకుండా వుండేటట్లు ప్రతిక్షణం జాగరూకతతో వుండాలి.
- స్నేహితునకు ద్రోహము తలపెట్టువాడు, చేసిన మేలు మరచువాడు, నమ్మించి మోసము చేయువాడు. మహాపాపితో సమానము (అనగా వీరు నకరమునపడుదురు)
- చెరువులో నుండి గట్టుపైన పడిన చేప, గట్టు మీద గిలగిల కొట్టుకొంటూ వుంటుంది చెడుమార్గాన్ని విడచి, ముక్తి

పొందాలంటే చిత్తం కూడా, అదే విధముగా భగవంతుని కొరకు పరితపించాలి. అప్పడే ముక్తిమార్గం గోచరిస్తుంది.

- మనస్సు ఎక్కడికి బడితే అక్కడికి వెళుతుంది. దానికి శరీరము అవసరము లేదు.
- నీయనుకూలముననుసరించి నియమముగా, నెలకొకసారి లేక ప్రతిదినము నీ ఆదాయముననుసరించి ఒక రూపాయికి 6 పైసలు చొప్పున (16వ వంతు) దానము చేయుము.
- ప్రతిదినము అరగంట లేక ఒక గంట వరకు క్రమబద్ధముగా భగవద్గీత రామాయణము, భారతము, భాగవతము, విష్ణు సహస్ర నామస్తోత్రము, లలితా సహస్త్ర నామ స్తోత్రము, ఆదిత్య హృదయము, ఉపనిషత్తులు మొదలగు సద్గ్రంథములను పఠింపుము.
- నిత్యము సత్సంగమమే కలిగియుండుము. చెడు సహవాసము వదలిపెట్టుము.
- ఏకాదశిరోజునగాని, సోమవారముగాని ఉపవసింపుము. లేక పండ్లు పాలను మాత్రము సేవింపుము.
- వారమునకొక రోజున మౌనము నవలంభింపుము.
- ఎట్టి సమయమునందైనను సత్యమునే పలుకుము. మాట్లాడే మాట మధురముగా, వినయముగా మాట్లాడుము.
- నిత్యము సంతృప్తి మరియు సంతోషకరమైన జీవితమును గడుపుము. అనవసరమైన చింతనలను విడనాడుము. మరియు దైవభావము గలిగియుండుము.
- ఎట్టివారినైనను బాధింపకుము. క్షమ, దయ, ప్రేమల ద్వారా కోపమును జయింపుము.
- ప్రతిదినమునందును మృత్యుదేవత నిన్ను కబళించుటకై కాచుకొని యున్నదని జ్ఞాపకముంచుకొనుము. నీ కర్తవ్య



కర్మలను సక్రమముగా నొనర్చుకొనుము. సదాచారవంతుడై యుండుము.

- నిదురించుటకు ముందు, మరియు నిద్ర నుండి మేల్కొన్న తరువాత భగవంతుని ప్రార్థన మరువకుము. ఎల్లవేళలా దేవుని చింతన వుండుట చాలా మంచిది.
- సాధు సన్యాసులను, రోగులను, పేదలను సేవింపుము. ఇదియే భగవంతునికి పాదసేవవంటిది.
- దైవచింతనము, సద్గ్రంధపఠనము, సత్త్వవర్తనము, సత్కర్మలు చేయుట, సత్సంగము కలిగియుండుటయనునవి దైవ సన్నిధికి మార్గములు.
- దేవుని పూర్ణభక్తితో ప్రేమించుము.
- దృఢమగు భక్తి విశ్వాసములను, నిశ్చలమగు ధ్యాన నిష్టను నాకిమ్మని దేవుని ప్రార్థించుము.
- ఇతరులయందు నూరు తప్పులు వెదకుటకంటే నీయందు రెండు తప్పులను కనుగొనుము.
- వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత మున్నగువానిని పఠించి అనుష్టించుట. చిత్తశుద్ధికై తపస్సు చేయుట, బ్రహ్మతత్త్వమును తెలుసుకొనుట, ఇంద్రియనిగ్రహము కలిగియుండుట, హింసలు చేయకుండుట, గురుసేవయనునవి అద్భుతము లగు మోక్షసాధనములై యున్నవి.
- ఒక పాదమందు నిలచి అనేక వేల సంవత్సరములు చేసిన తపస్సు ధ్యానయోగమందలి పదునారవ భాగమునకు సమానము గాదు.
- ఒక ముహూర్తకాలము ఏకాగ్రమనస్సుతో నాసాగ్రదృష్టిని చెదరనీయక, తత్త్వజ్ఞానము కొరకు ఎవరు ధ్యాన సాధనము చేయునో వానికి నూరు జన్మముల నుండిచేసిన పాపము

నశించును.

- ధనము కంటె పుత్రుడు. పుత్రుని కంటె దేహము. దేహము కంటె ఇంద్రియములు, ఇంద్రియముల కంటె బుద్ధి. బుద్ధి కంటె ప్రాణము (ఆత్మ) ప్రియములు. కావున సదా ఆత్మనే అన్వేషింప వలెను.
- ఎన్ని ఆచారములు చేసిన, ఒక మణుగు బంగారము దానము చేసిన స్వయముగ ఆత్మ తత్త్వమును తెలుసు కొన్నను, గురు కృప లేకపోయినచో ఆత్మ జ్ఞానము కలుగదు. ఆత్మజ్ఞానము కలుగకున్న మోక్షము కలుగదు.
- త్యాగము, ధ్యానము, ఆత్మసాక్షాత్కారము లేని జీవితము వ్యర్థము.
- మనో నిగ్రహమే ఆధ్యాత్మిక జీవితమునకు పునాది.
- భగవన్నామమనెడి జలముతో నీ మనస్సును బాగుగా కడిగి, ద్వేషము కోపము, అసూయయనువానిని తుడిచివేయుము.
- దైవసాధనకు సమయము లేదని యనకుము, నీ నిద్రను, అధిక ప్రసంగములు తగ్గించుకొని, బ్రహ్మముహూర్తముననే నిద్ర నుండి లెమ్ము.
- సుఖ సంతోషాలకు మూలము సద్గుణమే. అందువలన సద్గుణ వంతుడైయుండుము.
- ఎవరైతే సర్వకామ వర్జితుడో, ఆత్మ నిగ్రహము కలవాడో, ప్రసన్న హృదయముకలవాడో, నిశ్చలత్వము కలవాడో అతడే ఆత్మ సాక్షాత్కారము నొందును.
- ఓర్పునకు సమమైన తపస్సు లేదు. సంతుష్టికి మించిన సుఖము లేదు. ఆశతో సమానమైన రోగము లేదు. దయకు మించిన ధర్మము లేదు.
- సత్యము, దానము, సోమరితనము లేకుండుట, అసూయా



రాహిత్యము, ఓర్పు, ధైర్యము, ఈ యారు గుణములను ఎప్పుడూ విడువరాదు.

- సన్యాసులకు యింద్రియ నిగ్రహము, వానప్రస్థులకు నియమ పాలనము గృహస్థులకు దానము, బ్రహ్మచారులకు గురు శుశ్రూష అనునవి ప్రధానములు.
- జ్ఞానులకు సత్యమే తల్లి, జ్ఞానమే తండ్రి, ధర్మమే సోదరుడు, దయయే స్నేహితుడు, శాంతియే భార్య, క్షమయే పుత్రుడు, ఈ యారుగురు నా బంధువులు.
- ఇంద్రియములను జయించినవాడే శూరుడు. ధర్మముగ ప్రవర్తించినవాడే పండితుడు, హితమైన వాక్యములను పలుకు వాడే వక్త. పరులను ఆదరించువాడే దాత.
- కోరికలకు అంతులేదు. ఒక కోరిక తీరిన కొలది, మరల క్రొత్త క్రొత్త కోరికలు పుట్టుచుండును. భార్య లేనప్పుడు భార్యను, భార్య వచ్చినతోడనే, పుత్రులను, పుత్రులు కలిగిన తోడనే, పౌత్రులు (మనుమలును) కావలెనని కోరుచుండును.
- కృషివలన కరువు, జపమువలన పాపము, మౌనము వలన కలహము, ధైర్యము వలన భయమును కలుగవు.
- తండ్రి చేసుకొన్న కర్మ తండ్రియనుభవించవలసినదే. కుమారుని కర్మ కుమారుడు యనుభవించవలసినదే. ఒకరి కర్మతో ఒకరికి సంబంధము లేదు. ఎవరి దారి వారిదే. ఎవరు చేసుకొన్న కర్మ వారే యనుభవించవలసి వచ్చును.
- అధిక నిద్ర, అజాగ్రత్త, భయము, క్రోధము, సోమరితనము, అశ్రద్ధ, ఇవి మనుజులకు వినాశకరములు. కావున వీటిని వర్జింప వలయును.
- ఈ లోకమున ఆత్మహత్య చేసుకొనువారు, జ్ఞానహీనులు, శరీరమును వదలిన తరువాత గాఢాంధకార బంధురములైన, రాక్షసులు నివశించునట్టి పాప లోకమున కేగుదురు.

- మంచివారి సొత్తు సాధుసత్పురుషులకే ఉపయోగపడుచుండును. దుష్టుల ధనము దుర్మార్గుల కొరకే వినియోగపడును. మామిడిపండ్లు చిలకలకు ఉపయోగపడును. వేపపండ్లు కాకులకు ఉపయోగపడుచుండును.
- కన్నతండ్రి, ఉపనయనము చేసినవాడు, విద్యనేర్పినవాడు, అన్నము పెట్టినవాడు, భయమునుండి రక్షించినవాడు ఈ అయిదుగురు తండ్రులే.
- నీచులకు ఉపకారము చేసినను అది అపకారమేయగును. పాములకు పాలుపోసి పెంచినను విషము వృద్ధి చెందుచునే యుండును.
- దుర్మార్గురాలగు భార్య, నమ్మించి మోసము చేయు స్నేహితుడు, గర్వముతో మాట వినని సేవకుడు, వీరు తప్పక అపాయమును కలిగించును.
- వేద, శాస్త్ర, పురాణములు, దైవచింతన, విచారణాదుల యందు మహాత్ములు కాలము గడుపుదురు. ఇక అజ్ఞానుల యొక్క కాలము వ్యసనములందును. నిద్రయందును, కలహము లందును గడిచిపోవును. కావున మహాత్ముల ననుసరింప వలయును.
- అరణ్యమందుగాని, జలమందుగాని, మహా సముద్రము నందు గాని, పర్వత శిఖరమందుగాని, నిద్రించునపుడు గాని, ఏమర పాటుగా వున్నప్పుడు గాని, ప్రమాద పరిస్థితి యందు న్నప్పుడుగాని, పూర్వము చేసిన పుణ్యములు రక్షించుచుండును.
- విద్య, వయస్సు, గౌరవము మొదలైనవానిలో, తనకంటె శ్రేష్టులుగా నున్నవారికి నమస్కరించుట వలన ఆయుర్దాయము, విద్య, కీర్తి, బలము వృద్ధియగును.
- గురువులను సత్కరించవలెను. వారి ఆజ్ఞ ప్రకారము నడుచు



కొనవలెను. విపరీత సంభాషణ చేయరాదు. గురువుల దోషమును బైటపెట్టగూడదు. గురువు కోపించిన యెడల శాంతింపజేయవలెను. గురువును నిందింపగూడదు.

- ఇతరుల మనస్సును నొప్పించెడి వచనములు పలుకకూడదు. కోపము, లోభితనము వదలిపెట్టవలెను. ఎవరినీ వేళాకోళము చేయరాదు. కపటము డాంబికము వదలివేయవలెను.
- పేదవానికి దానము చేయుము. దిక్కులేని శవమును దహనము చేయుటకు సహాయపడుము, సహకరించుము. పాడుబడ్డ దేవాలయమును ఉద్ధరించవలయును. ఈ మూడిలో ఏదిచేసినా అది అశ్వమేధయాగముతో సమానము.
- ధర్మమును దృష్టిలో పెట్టుకొని మాట్లాడుము. సత్యమును తప్పకుండా మాట్లాడుము. పదిమందికి ఉపయోగపడే మాటలే మాట్లాడుము. పూర్వజన్మమునగాని, ఈ జన్మమున గాని, అనుష్టించిన కర్మయోగముచే జ్ఞానము ప్రాప్తించును.
- పూజింపదగినవారు - తల్లి, తండ్రి, పిమ్మట గురువు, ఆ తదుపరి దైవము.
- మంచి అలవాట్లు, క్రమశిక్షణ, బాలురకు పసితనము నుండే అభ్యసింపవలెనే గాని, పెరిగి పెద్దయిన తరువాత క్రమశిక్షణ అభ్యసింప దలచుట కష్టసాధ్యము.
- ఎవరికి ఎంత లభింపవలెనని వుండునో. ఆ సమయమున వారికి అంతమాత్రమే భగవంతుడు లభింపజేయును.గాని అధికముగా పొందవలెనని ఎంత శ్రమపడినా లభింపదు. ఇది గుర్తెరిగి లభించిన దానితో తృప్తిచెందుట మంచిది.
- మనము ఎవరికి ఏమైనా పెట్టునది ఊరకనే పోదు. అట్లే ఒకరిని బాధ పెట్టిననూ వూరకనే పోదు. ఇతరులకు మనమేది చేసినా, దైవము వేరొకరిద్వారా తిరిగిమనకు, ఆ మేలు, కీడులను ప్రాప్తింపజేయును.

- నీవు చేయదలచిన మంచి పని, ఎవరితోను ఆలోచింప కుండా వెంటనే చేయుము.
- ఒకరు నీకు చేసిన ఉపకారము మహాగొప్పదిగా భావించి, వారి యెడల సదా కృతజ్ఞుడవై వుండుము.
- ఇతరులు నీకు చేసిన అపకారము చాలా స్వల్పముగా భావించి మరచిపొమ్ము.
- నీవు ఇతరులకు చేసిన ఉపకారమును చాలా స్వల్పముగా భావించి, వెంటనే మరచిపొమ్ము.
- నీవు యితరులకు ఏ కొద్ది అపకారము చేసిన, అది చాలా పెద్దదిగా భావించి సదా జ్ఞప్తియందుంచుకొని, బాధపడి, ఉపకారము చేయుటకు ప్రయత్నించుము.
- బ్రతికియుండగా తనవారియందలి, మంచి గుణములను గ్రహించక వారి సంరక్షణ చూడక, చనిపోయిన పిదప అతనిలోని మంచిని గొప్పలుగా చెప్పుకొనెదరు. శరీరములో ప్రాణముండగా తన వారి యోగక్షేమములను చూడక, తన కిష్టమైన వాటిని సమకూర్చి సంతృప్తిజేయక, అతడు మరణించిన పిదప, అతని శవం వద్ద, నానా రకముల వంటకములు తయారు జేసిపెట్టి, వారి ఫోటోలకు దండలు వేసి, ఆరాధించుట వలన ఏమి ప్రయోజనము. కావున ప్రాణముండగనే ఎవరిని ఏవిధముగా చూడవలయునో, వారిని ఆ విధముగా చూడ వలయును.
- భగవద్భక్తులను, గురువులను నిందించి, అవమానింప జూచిన, వారికేమీ చలనముండదుగాని, నష్టపోయేది నిందించినవారే అని తెలుసుకొనవలెను. దైవభక్తులను నిందజేయువారు, అంత్య జాతులుగా పుట్టి చెడిపోవుదురు.
- ప్రతీ వ్యక్తిలోనూ మంచి, చెడులు రెండూ వుండుట సహజము. ఎదుటివారిలో గల మంచిని గ్రహించి, చెడు విడిచి



వేయుము. వారు చెప్పిన మంచిని మాత్రముసదా జ్ఞాపకముంచుకొనుము.
- బంగారముతో చేసే నగలు వేరువేరుగా ఉన్నప్పటికిని బంగారం ఒక్కటే. ఇదే విధముగా పరమాత్ముని రూపాలు, వేరు వేరుగా రాముడు, కృష్ణుడు, శివుడు ఈ విధముగా కనిపించినా తత్వరూపంగా మాత్రం పరమాత్మ ఒక్కడే.
- మనస్సు రెండు రకాలు. 1)శుద్ధ మనస్సు 2) అశుద్ధ మనస్సు. రోజూ ఉదయం పెందలకడనే లేవడం, దైవ ప్రార్థన, జపధ్యాన, కీర్తనాదులు ఆచరించడం, ఎల్లప్పుడు సత్యమే పలకడం, దొంగతనము చేయకపోవడం, ఇటువంటివి శుద్ధమనస్సు యొక్క ఆలోచనలు.
- ప్రతిరోజూ మూడుసార్లు సంధ్యావందనం చేయాలి. ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం, ఈ మూడు సమయాలలో సంధ్య వార్చుకోవాలి. సంధ్యలో హరిఓమ్ ఉచ్ఛారణ, ప్రాణాయామము, జపము, ధ్యానము వంటివి ఆచరించాలి. శ్రీరాముడు, శ్రీకృష్ణ భగవానుడు కూడా సంధ్యావందనం చేసేవారు.
- హిందూధర్మం యొక్క పవిత్ర గ్రంథం శ్రీ మద్భగవద్గీత ఎందు వలననగా అది భగవంతుని శ్రీ ముఖం నుంచి వెలువడిన జ్ఞానగంగ. గీత చదవడం మూలంగా ఆత్మ విశ్వాసము పెరిగి మన పాపాలన్నీ నశిస్తాయి. జీవితములోని అన్ని ప్రశ్నలకు జవాబు మనకు గీతలోనే లభిస్తాయి. అందువలన మనము రోజూ గీతా పారాయణము చేయాలి.
- మన జీవితములో సుఖ-దుఃఖాలు, మానావమానాలు, లాభనష్టాలు వంటివి ఎన్నో వస్తాయి. కాని మనుష్య జన్మ సార్థకము చేసుకోవడానికి నేను ఈశరీరము కాదు. చైతన్య వంతమైన ఆత్మను యని అనుభూతి పొందితేచాలు.
- గీతాశ్లోకముల పారాయణము వలన శ్రీకృష్ణ భగవానుని

స్మరణ వలన, సాధు దర్శనము చేతను కోటి తీర్థముల ఫలం లభిస్తుంది.

- సాహసం, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమములనబడే లక్షణ ములు ఎవరిచెంత ఉంటాయో, వారికి దేవతలు సహాయ పడగలరు.
- ఎవనియందు గురుభక్తి దైవభక్తి వుంటుందో, వాని తల్లి దండ్రులు, ధన్యులు. అతడి గోత్రము ధన్యము. అతని వంశ ములో జన్మించిన వారు ధన్యులు. మొత్తం ధరణీ మాతయే ధన్యురాలు.
- అజ్ఞానమనే మాలిన్యమును పోగొట్టి, అనేక జన్మల పాపాలను నశింపజేసి, జ్ఞాన, వైరాగ్యములను సిద్ధింపజేసే గురుచరణా మృతమును స్వీకరించవలెను.
- నిర్భయత్వం, అంతఃకరణ శుద్ధి, జ్ఞాన, యోగ, నిష్ఠ, దానము, ఇంద్రియ నిగ్రహము, యజ్ఞం, స్వాధ్యాయనం, తపస్సు ఇవన్నీ సత్పురుషుని లక్షణములు.
- నిత్యము పెద్దలసేవ, వారికి నమస్కరించుటయనునవి ఆచరించే పురుషునిలో ఆయువు, విద్య, యశస్సు, బలం, వృద్ధిచెందుతవి.
- ఈ ప్రపంచములో నీవు తలలోని నాలుకలాగా వ్యవహరించాలి. నిత్యము, నేయి, నూనె పదార్థములు తింటున్నా నాలుకకు జిడ్డు అంటదు గదా.
- మన భారతీయ సంస్కృతి యొక్క మహత్తు అపారమైనది. ఈ సంస్కృతిలో ఆదికాలము నుంచి వస్తున్న సంప్రదా యాలు వెనుక గొప్ప తాత్త్విక, వైజ్ఞానిక రహస్యాలు దాగివున్నవి.
- ప్రాతఃకాలములో బ్రహ్మ ముహూర్తములో శుభ సంకల్పము చేసినందువలన మనం అనుకున్నది అనుకున్నట్లు జరిగి తీరుతుంది.



- దైవ ప్రార్థన చేయడము వలన హృదయం పవిత్రమవుతుంది. పరోపకార భావన వలన వికసిస్తుంది.
- ఓంకారాన్ని దీర్ఘంగా ఉచ్చరించడము వలన - చంచలమైన మనస్సు శాంతించి, ఆత్మబలము పెరుగుతుంది.
- ధ్యానం చేసినందువలన - ఏకాగ్రత పెరుగుతుంది.
- మౌనం పాటించడము వలన - అంతర్గత శక్తులు వికసించి మనలో దైవబలం ధృడమవుతుంది.
- కాలమును వ్యర్థము చేయక, వ్యర్థమైన చింతలను హృదయం లోనికి రానీయక, సమాధినిష్ఠలో కాలమును గడు పుము. ఇట్టి ధ్యానము వలన అనేక జన్మలలో చేసిన పాపములు గూడా నశించును.
- విధి ప్రకారము తన యొక్క అనుష్ఠానము చేయకపోవుట చేతను నిషిద్ధ కార్యములలో ప్రవేశించుటచేతను, ఇంద్రియ ములను నిరోధించకపోవుటచేతను మానవుడు పతితుడగు చున్నాడు.
- శాస్త్రోక్తములైన జప, ధ్యాన, తపము ఈశ్వరార్పణబుద్ధితో చేయు నపుడు సమస్త పాపములు నశించి, ప్రకృతి వికృ తులు క్షయించి, నిర్మల హృదయముగలవారై పరమ శాంతు లగుదురు. తదుపరి రాగద్వేషములు నశించి విషయ విరక్తి గలిగి వైరాగ్యమును బొందుదురు. పిమ్మట మోక్షమందు తీవ్రతర విచారణ గలుగును. ఇదియే మోక్షమార్గము. ఆత్మశుద్ధి గలుగక పోవుటచే అనేక విఘ్నములు గలుగుటకు కారణమగుచున్నది.
- హృదయమందున సమస్త సంకల్పములు, సంస్కారములు నశించినపుడు శరీరముతో గూడియుండినను ఈ లోక ములో అతడే ముక్తుడు. అతడే బ్రహ్మానందమును యనుభ వించును.

- ఇంద్రియములు పూర్వ సంస్కారముచే, ప్రపంచ విషయములపై బోవునపుడు, అట్లుపోనీయక అడ్డగించి, ధ్యానమందు నిలుపవలయును.
- ఏవిధముగా మథించిన దుష్టగజము అంకుశముతో స్వాధీన మవుతుందో, అదే విధముగా విషయములో ప్రవర్తించు మనస్సు వైరాగ్యపరమగు ధ్యాననిష్ఠాభ్యాసము ద్వారా స్వాధీన పడగలదు.

అనగా మనోనిగ్రహమునకు వైరాగ్యము, ధ్యానయోగమే ముఖ్య సాధనము.

- ఏవిధముగా అగ్నియందు వేయించిన విత్తనమునకు మొలక యుండదో నశించునో, ఆలాగున జ్ఞానాగ్నియందు దగ్ధమైన సంస్కారముగల ఆత్మజ్ఞానికి ప్రపంచ విషయ వృత్తులు భస్మము లైయుండును.
- మలినమైన అద్దములో, తన రూపము ఏ విధముగా కనుపించదో ఆలాగున పరిపక్వముగాని హృదయముగల వారికి, తనలో తానై వెలుగుచుండు దైవ స్వరూపము గోచరింపదని భావము.
- కల్మషముగల మనస్సుతో గూడినవాడు సమస్తతీర్థముల యందు స్నానము జేయుట చేత పాప విముక్తుడుగాడు. ఎట్లనగా బొగ్గును తెల్లని గోక్షీరములో ఎంత కడిగినను ఎట్లు నలుపు బోయి తెలుపురాజాలదో, ఇతని యొక్క స్థితియు ఈలాగున వుండును.
- అగ్నిహోత్రుడు కట్టెలచేత, నెయ్యిచేతను, ఎట్లు వృద్ధిని బొందు చుండునో ఆలాగున విషయ భోగములచేత ఆశ మరల, మరల వృద్ధినొందునే గాని శాంతి నొందదు.
- పాపక్షయమునకును, ఆత్మశుద్ధికిని, తగిన పుణ్యకర్మలు జేసెడి, ఏజనుల యొక్క పాపము నశించినదో, అట్టివారు



రాగ ద్వేషము వలన, గలిగిన మోహము నుండి విడువబడినవారై అచంచలమైన వ్రతనిష్ఠగలవారై నన్ను ధ్యానించు చున్నారు. (అనిగీత)

- ఆత్మశుద్ధిలేనివారికి అనేక విధములగు యజ్ఞములుగాని, వ్రతములుగాని, దానములు గాని, తీర్థయాత్రలుగాని, అవి ఫలమును గలుగజేయజాలవు. అవియన్నియు బూడిదయందు హోమించిన హవిస్సువలె వ్యర్థములగును.
- జ్ఞానసిద్ధికొరకు యత్నించుచున్న ధ్యానయోగానుష్ఠానపరులు తమయందున్నట్టి పరమాత్మను దర్శించు చున్నారు. ఆత్మ సంస్కారములేని వారు మనఃశుద్ధిలేని వారు (అంతః కరణ శుద్ధిలేనివారు) ప్రయత్నించినవారుగా కనబడినను ఈ యాత్మను చూడజాలరు.
- ఎవడు నిర్మలభక్తితో దైవమును ఆరాధించలేదో, ఎవరికి సద్గురు కృప కలుగలేదో, ఎవనికి మనస్సు స్వాధీనముగాలేదో, వారికి ఆత్మశాంతి (జ్ఞానసిద్ధి) గలుగనేరదు అని సర్వఉపనిషత్తుల సారము.
- శివ, విష్ణు వాదిదేవతలను, బ్రహ్మనిష్ఠులను, గురువులను, జ్ఞానులను, పూజించుటయు, దేహశుద్ధియు, సత్యము, దయ, హృదయశుద్ధియు, సన్మార్గములో నడచుట, బ్రహ్మచర్య వ్రతము, జీవహింస చేయకుండుట యనునవి శరీరముచే జేయదగిన తపస్సని ఋషులు తెలిపిరి.
- బ్రహ్మదేవుడు ఇంద్రియములను బహిర్ముఖముగా సృజించెను. కావున సర్వజీవులు బాహ్యమునేగాంచుచున్నారు గాని, అంతరాత్మను చూడటము లేదు. ఎవడో అంతఃకరణ శుద్ధిగల ధీరుడు మాత్రమే ఆత్మను దర్శింపగోరి, అంతర్ముఖుడై తుదకు సాక్షాత్క రింపగలుగుచున్నాడు అని కఠోపనిషత్.
- శుద్ధమైన అహారమైనను మితిమీరి తినుటయు, అధిక

పరిశ్రమ చేయుటయు, అధికముగా మాట్లాడుటయు, మూర్ఖపు పట్టుదల గలిగి యుండుటయు, ప్రాపంచిక జనులతో కలిసి యుండుటయు, విషయలోలత్వము గలిగి యుండుటయు, అను ఈ యారు యోగమునకు విఘ్న ములు కలుగునని హఠయోగ ప్రదీపిక.

- అష్టాంగ యోగసాధనములకన్న, కేవల ఈశ్వరార్పణ హృదయ ముతో పరమేశ్వరుని ధ్యానించువారికి, నిర్వికల్పసమాధియు, కైవల్యప్రాప్తియు కలుగును (ఉపనిషత్తులు).
- బ్రహ్మదేవుడు రెండు విధములగు మాయలచేత జీవులను సృష్టించెను. 1) కాంతము 2) కనకము. ఈ రెండింటి నుండి విముక్తిని బొందిన నరుడు నారాయణుడగును.
- ఇంద్రియములకు స్వభావముగ విషయములందు సంచ రించుట వాటి నైజగుణము. ఆ యింద్రియములను ధ్యాన బలముగల బుద్ధిచే, బ్రహ్మనిష్ఠయందు నిలుపుట ప్రత్యాహారమని చెప్పబడును.
- విఘ్నములు తొలగుటకు, పాపదోషములు క్షయించుటకును, బ్రహ్మభావముతో గూడిన, ప్రణవముతో గూడిన, జపము, ధ్యానము చేయవలయును. దీని వలన సర్వవిఘ్నములును, పాపములును నశించును. ఈవిధముగా అనుష్టానము చేయువారు పరమపదమయిన మోక్షమును పొందగలరు.
- ఎప్పుడు ధ్యాన, జప, తపస్సులచే పాపకర్మలన్నియు నశించునో, అప్పుడు బుద్ధి నిర్మలమగును. విఘ్నములు తొలగును. అట్టి దోష రహితమైన విశుద్ధ బుద్ధియేదిగలదో, అట్టి బుద్ధియే జ్ఞానమును కలుగజేయునని మహర్షులు చెప్పిరి.
- ఎన్ని ధ్యానానుష్టానములు చేయువాడైనను, ఎంతవరకు దేహములో పాపము నశించలేదో, అంతవరకు దైవజ్ఞాన సిద్ధి యేమియుకలుగదు. ధ్యాన జపాదులచే పాపములు



నశించి నపుడు, సమస్త సాధనా ఫలమును కలుగజేయును.

- భయము, క్రోధము, సోమరితనము, అతిజాగరణము, అతి నిద్ర వీనిని ధ్యాననిష్టగల యోగి ఎల్లప్పుడు విడువవలయును.
- రాగద్వేషములు గలవాడు, వనమునందుండినను దోషములే గలుగుచుండును. గృహస్థాశ్రమమందుండినను, పంచేంద్రియ నిగ్రహముగలవాడు తాపసుడేయగును. శాస్త్ర సమ్మతముగా కర్మ చేయువాడెచ్చటనుండినను ముక్తుడే యగును. కోరికలు లేని వానికి, గృహము తపోవనము వంటి పుణ్యభూమి యగును.
- ఆసక్తి, సాహసము, ధైర్యము, సూక్ష్మబుద్ధి, ఆత్మశక్తి, కార్యదీక్ష యను ఈ యారుగుణములు ఎవనియందు గలవో వానికి దైవ సహాయము గలుగును.
- యోగియైనవాడు ప్రతిదినము, సోమరితనము లేక ఒక జాము యోగమునభ్యసించిన యెడల, వానికి వివిధములగు దివ్య అనుభూతులు కలుగును.
- ఎవనియందు శాంతి, శమము, శౌచము, సత్యము, సంతోషము, ఆర్జవము దీనత్వము లేకుండుట, డంబము లేకుండుటయను గుణములుగలవో వాడు మోక్షమున కర్హుడగును. (మైత్రేయోపనిషత్తు)
- మనస్సు నశించి పరబ్రహ్మస్థితి గల్గుటకై నాలుగు సాధనములు, ముముక్షువులకు అవసరమైయున్నవి. 1) సత్పురుషుల సహవాసము 2) విషయవాసనా త్యాగము 3) ఆధ్యాత్మిక విద్యా విచారణము 4) ధ్యానయోగాభ్యాసములు ముముక్షు వులకివి ముఖ్యముగా నుండవలయునని యోగవాసిష్టము తెలుపు చున్నది.
- మనోజయము కొరకు దీనియందు కొంత ప్రాణాయామము

కూడా విధించడమైనది. స్వల్ప ప్రాణాయామము అందరికిని అత్యవసరము. శరీరదార్ఢ్యము, మనోనిర్మలత్వము, పాపక్షయ మున్ను దీనివల్ల త్వరలో సిద్ధించును. అయితే బ్రహ్మచర్యము, శుద్ధాహారము, ఏకాంతవాసము, ప్రాణాయామమునకు ముఖ్యముగా నుండవలిసినవి.

- ఏకాంత ప్రదేశమున నుండువాడును, ధ్యాననిష్టకు భంగము రాకుండుటకై సాత్వికమైన శుద్ధాహారమును మితముగా భుజించువాడును, వాక్కును మనసును శరీరమును స్వాధీనములో నుంచినవాడును, ధ్యానయోగ మందాసక్తి గలవాడును, దృఢమైన వైరాగ్యముగలవాడును, ఎవడుగలడో వానికి విఘ్నములు కలుగవు. శీఘ్రకాలముననే జీవన్ముక్తి సిద్ధించును (అని భగవద్గీత)
- ఎల్లప్పుడును భగవంతుడనగు, నాయందు ఏకాగ్ర చిత్తము గలిగి, ప్రీతిపూర్వకముగ భజించునట్టి ధ్యానపరులకు పరమేశ్వ రుడనగు నన్ను పొందుటకు ఏ జ్ఞానము కలుగ వలయునో అట్టి జ్ఞానమునే నేను వారికి కలుగజేయు చుందును. పరమభక్తితో, సర్వేశ్వరుని ధ్యానించువారికి, ఏ జ్ఞానము వల్ల మోక్షము సిద్ధించునో, అట్టి జ్ఞానమును భగవంతుడే కలుగజేయు చున్నానని చెప్పుచున్నారు.
- బియ్యము యొక్క పైనున్న పొట్టును దంచుటవలన, ఆ పొట్టు ఏ విధముగా వదిలిపోవునో, స్పుటము చేత రాగి యొక్క చిలుమెట్లు నశించి సువర్ణమగుచున్నదో, అట్లే యోగము చేతను, జ్ఞానము చేతను జీవుని యొక్క అజ్ఞాన రూపమగు మలినము నశించుచున్నదియని (యోగవాసిష్టము)
- మనుజుడు భుజించెడు అన్నపానాదులు జఠరాగ్నిచే మూడు విధములుగ మారుచుండును. స్థూలభాగము మలమూత్ర



ములుగాను, మధ్యమభాగము రసమై, రక్తమై, మాంసాది సప్త ధాతువులుగాను మారుచుండును. కనిష్ఠ భాగము మనస్సుగ మారును అని సుశ్రుతము.

- మనిషి జీవించియున్నంతకాలము మూడు ధర్మములను ఆచరించు చుండవలయును. 1) గురుభక్తి 2) దైవభక్తి 3) వేదాంత శాస్త్ర విచారణము. వీటివల్లనే మొదట జ్ఞానము కలుగును.
- పరమేశ్వరుని యందు అనన్య భక్తి కలుగుటచేతను, సమస్త కర్మలు ఈశ్వరార్పణము చేయుటచేతను, నిర్విఘ్నముగా నిర్వికల్ప సమాధి బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కలుగునుయని (యోగ దర్శనము)
- పరమభక్తుడైనవాడు ఏలాగున తన యిష్టదైవమందును, మరియు గురుదేవునియందును, సర్వోత్కృష్ణమైన భక్తి గలిగి యుండునో అట్టి మహాత్మునికి మాత్రమే వేదాంతార్థము స్పష్టముగా గోచరమగును (అని శ్వేతాశ్వతరోపనిషత్తు)
- ధర్మము ఒక్క ఉన్నతిని గోరువారు సదా సత్యమునే పలుక వలెను. మనస్సు శుద్ధముగను, స్వాధీనముగనుండునో అతడే సమస్త వేదాంతాధ్యానానుష్టానములయొక్క ఫలమును పొంద గల్గును.
- ఉపనిషత్తులు గాని, వేదములలో కొన్ని భాగములు గాని, ప్రణవము, గాయత్రీ, శ్రీరామ, శివ, నారాయణాది మంత్ర జపములు గాని, గీతాపారాయణము గాని, ఇవియన్నియు అధ్యయమునకు సంబంధించినవనియు, వీనిలో ఏదైన ఒకదాని యనుష్టానము వలననే, మానవుల పాపములు నశించి ఆత్మశుద్ధి కలుగుననియు బ్రహ్మవేత్తలు వచించిరి.

- పదకొండు ద్వారములు గల ఈ శరీరములో, విజ్ఞాన స్వరూపుడైన ఈశ్వరునికి నివాసగృహము. అట్టి సర్వేశ్వరుని, ధ్యానయోగానుష్టానముచే పొందువాడు మరల సంసార దుఃఖమును పొందడు. వాడు ముక్తుడే. మరలా మోహము నొందడు (అని కఠోపనిషత్తు).
- తొమ్మిది ద్వారములు, అందరకు సమానము ఒకటి బ్రహ్మరంధ్రము 2)కుండలి అను రెండు విశేష ద్వారములు గలవు. ఈ రెండు ద్వారములు తెరువబడినప్పుడే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కలుగును. జీవ గుణములు నశించి, దైవగుణములు ఉత్పన్నములగును.
- మనము తిను ఆహార పానీయములు వలన 1) రసము 2) రక్తము 3) మాంసము 4) మేధస్సు 5) ఎముకలు 6) మజ్జ (క్రొవ్వు) 7) శుక్రము అని సప్తధాతువులుగా పరిణామము పొందుచుండును. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే అంతఃకరణ చతుష్టయము. ఈలాగున ఆహారము యొక్క సూక్ష్మాంశముగా మారుచుండును. కావున వీటిని సూక్ష్మేంద్రి యములుయని చెప్పిరి. అందువల్ల మనో, బుద్ధి, చిత్త, అహంకారములు శుద్ధము కావలసి యుండిన శుద్ధాహారము తప్పక యుండి తీరవలయును.
- ముముక్షువులు, ఉదరమున సగభాగము అన్న పదార్థముల చేతను, పాతిక భాగము జలముచేతను, పాతిక భాగము వాయు సంచారార్థమై కాళీగా వుంచవలయును. ఇది ఆహార నియమము. దీనికే యుక్తాహారమని పేరు. వీరు నిరంతరము బ్రహ్మనిష్టయందు వుందురు.
- జీవులకు పూర్వజన్మ సంస్కారము ననుసరించియే యోగమునందుగాని, జ్ఞానమునందుగాని, భక్తియందు గాని, నిష్కామ



కర్మయోగమందుగాని, ప్రవృత్తి గలుగు చుండును. ఆయా సంస్కారము ననుసరించి అభిరుచి పుట్టును. ప్రకృతి గుణములు నశించిన ఎవ్వరైనను ముక్తులగుదురు.

- ధ్యానయోగమున కంటెను శ్రేష్టమైన పుణ్యము మరొకటి కనబడదు. ధ్యానయోగము కన్న శాంతిని, కలుగజేయునది వేరొకటి లేదు. దైవ సన్నిధికి చక్కని రాజబాట చూపిస్తుంది.
- శ్రవణముచే అజ్ఞానము, మననముచే సంశయము, నిధిధ్యాసముచే భ్రాంతియు నశించును. బ్రహ్మ విద్య యొక్క సాధనత్రయము దీనివలన నిరూపించడమైనది.
- భర్తలేని స్త్రీయు, తల్లిలేని శిశువు ఏవిధముగా నుందురో, ఆ విధమున గురువులేని మానవునిజన్మ నిరర్థకము.
- అనేక జన్మలలో చేసిన నిష్కామ పుణ్యకర్మలచే జీవులకు వైరాగ్యము జనించును. అట్టి వైరాగ్యము లేకయే జీవునికి జ్ఞానమే కాలమందును కలుగదు.
- ఓంకారమునందు సాధకుడు మనస్సును లయపరచవలెను. ప్రణవమే శబ్ద బ్రహ్మము. ప్రణవము నందు ఎల్లప్పుడు మనస్సును లయము గావించి ధ్యానము జేయువానికి ఎచ్చటను భయముండదు. వానికి ఎల్లప్పుడును శుభములే కలుగును. విఘ్నములుండవు. సాధకుడు తాను జపించు మంత్రార్థమును, ఆ మంత్ర అధిష్టానదైవమును భావన చేయక, నూరుకోట్ల జపమొనర్చినను దానియందు చెప్పబడిన సిద్ధిని బొంద జాలడు. జపము, ధ్యానము చేయువారు ఈ సత్యమును గుర్తులో నుంచుకొనవలెను.
- పాలలో నేయివలె సర్వత్ర జగత్తులో వ్యాపించియున్న ఆత్మను ఆత్మజ్ఞానముచేతను, తపస్సుచేతను తెలిసికొని ముక్తిని బొందుము.

- ముసలితనము లేకుండుట, దాహము లేకుండుట, సుగంధము వాసించుట, మొదలైనవి కలిగిన యోగసిద్ధి ప్రారంభించినదని తెలిసి యోగమందు నిలకడగలవాడుగానుండుము.
- మానవుడు శాస్త్ర విహితములగు అనగా శాస్త్రము చెప్పబడిన అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మల ఆచరించకపోయినను, భగవచ్ఛింతనము, ఇంద్రియ జయము, ప్రణవజపము, ఉపనిషదాది పారాయణము, వీనియందైనను ప్రయత్నము కలిగియుండవలయునని మనువు (ఉపదేశము)
- అనన్య భక్తియనగా, హృదయములో ఒకే దైవ చింతనము దప్ప, దైవభావముదప్ప ఇతర సంకల్పములుగాని, ఇతర భావములు గాని జనింపగూడదు. ఇట్టివారికి భగవత్ప్రాప్తి గలుగుటకు గల విఘ్నములన్నింటిని తొలగించి భగవానుడే మోక్షముగలుగ జేయును.
- ఆత్మయనియు, జీవాత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు పేరుగల ఈ యాత్మ వస్తువు ప్రకృతి గుణములను సత్వ, రజస్తమస్సులచే బద్ధుడై జీవుడను పేరు గలిగియుండును. అట్టి ప్రకృతి సంబంధ త్రిగుణములనుండి బ్రహ్మానిష్టా అనుష్టానముచే శుద్ధుడై విడుదల పొందునపుడు పరమాత్మయని చెప్పబడుచున్నదియని (విష్ణుపురాణము)
- జీవుడెప్పుడు మాయా రూపమైన నిద్రనుండి మేలుకొనుచున్నాడో అప్పుడే జన్మాదులు లేని అధ్వయ స్వరూపమైన, స్వయం ప్రకాశమగు ఆత్మను తెలుసుకొనుచున్నాడు.

మానవుడు అజ్ఞానమనే నిద్రయందు ఎంతవరకు వున్నాడో అంతవరకు తానెవ్వడు, ఎచ్చట వుంటున్నాడు. దేనికై వచ్చినాడు యను మూడు విషయములను తెలిసికొన జాలడు.



అజ్ఞానమనే నిద్రనుండి మేల్గొన్న వెంటనే తానెవ్వడు, ఎచట వున్నాడు, ఎందుకై వచ్చినది తెలుసుకొనుచున్నాడు. ఆలాగున మాయా మోహముండువరకు ఆత్మ స్వరూపమిట్టి దనియు, జన్మమునకు గారణమును జన్మాంతర స్థితియును తెలిసికొనలేడు. ఆత్మ ప్రబోధ జ్ఞానోదయము గలుగువరకు ఎవరును తన నిజ స్వరూపమును ఎరుంగజాలరు.

- మానవుడు ప్రప్రథమమున కొంత ఆత్మశుద్ధిగలుగునప్పుడు పాపకర్మలన్నిటిని మానును. పుణ్య కర్మలను ఫలాసక్తితో జేయును. అధిక ఆత్మశుద్ధి గలుగునపుడు ఫలాశక్తిని విడిచి, ఈశ్వరార్పణ బుద్ధితో సత్కర్మలు జేయుచుండును. అందువలన మనస్సు శుద్ధమయి ఆత్మోదయమగును. ఇకచేయు పుణ్య కర్మములన్నియు నిష్కామముగా జేయుటవలన పునర్జన్మమును కలుగజేయవు. మహనీయులందరు ఈలాగునే చేయుదురు.
- నియమ పూర్వకముగ వేద వేదాంతములను చదివిన వారికన్నను, యజ్ఞములన్నిటిని ఆచరించినవారికన్నను, తపములు చేయుటచేతను, సమస్త దానములు చేసిన వారికన్నను (ఆచరించుట) వలనను కలిగెడు పుణ్యమేది గలదో, ఒక ధ్యానయోగి వీటన్నిటి వలన గలిగెడు ఫలముకన్న అధిక మైన ఫలమును బొందుచున్నాడు. (అని భగవద్గీత). కావున బ్రహ్మప్రాప్తికి ధ్యానయోగమే మార్గము. ధ్యానమునకు విద్యగాని ధనముతోగాని, జాతితోగాని, ఏలాంటి సంబంధమును లేదు. కేవలము ధ్యానయోగమొకటే చాలును. ఇది అందరకును శులభమైనది. ఆచరణ చేయదగినదైయున్నది.
- బ్రహ్మదేవుడు సమస్త చరాచర ప్రాణికోటులన్నిటిని సృష్టించిన తదుపరి వాటికేటికిని ఆత్మజ్ఞాన స్వరూపమును తెలిసికొనెడి

శక్తి లేకపోవుటచేత తన సృష్టి నిరుపయోగమైనదిగదాయని తలంచి విషాదపడెనట. తరువాత మరింత తపస్సు చేసి ఆత్మశక్తిని కేంద్రీకరించి, బ్రహ్మ స్వరూపమును తెలుసుకొను లాగున మానవుని సృష్టించెను. అతనిని పరీక్షించి, బ్రహ్మైవ లోకమును చేయదగిన బుద్ధిగలవాడని తలంచి, ఇప్పుడు తన సృష్టి సార్థకమైనదని తలంచి, ఆనందభరితు డాయెను యని (కఠోపనిషత్తు). జంతూనాం నరజన్మ దుర్లభమ్ యని (శ్రీ ఆదిశంకరాచార్యుల వారి సూక్తి). దుర్లభోమాను షోదేహః ప్రాణినాం క్షణభంగురః (అని భాగవతము)

- బ్రహ్మాత్మైక్య జ్ఞానము గలుగు వరకు, శమము, దమము, అనే ధర్మములతో గూడినవాడై, వేదాంత శ్రవణ, మనన, నిధి ధ్యాసములను తప్పక అభ్యసింపవలయును.
- కీటకము ఎడతెగక భ్రమరమును భావము చేయుటచే తుమ్మెదయై మారునట్లు, జీవుడును ఎడతెరపిలేక బ్రహ్మ భావన జేయుచుండవలయును.
- భూమి యొక్క అగాధ భాగమునందుండు నిక్షేపమును తీయుటకు గడ్డపారచే త్రవ్వుటగాక, మరియొక ఉపాయ మెట్లు లేదో అలాగే బుద్ధిగుహయందుండు జ్ఞానధనము లభించుట కొరకు, తదేక ధ్యానము, దైవచింతనము కన్నా వేరు ఉపాయము లేదని (ఆత్మగీత)
- ఏకాంతవాసియై, కోరికలులేనివాడై, మౌనము, ఆత్మమనన శీలుడగు ధ్యానయోగికి ఏ యొక్క బ్రహ్మానందముగలదో అట్టి సుఖము దేవేంద్రునికి గాని, చక్రవర్తులకు గాని కలగనే కలుగదు (గురుగీత). ఇంకను సమస్తమైన కామాది విషయ ములను వదిలినవాడై, నిస్సంగుడైనవానికి ఏ బ్రహ్మానంద ముగలదో, దానికి సరియైన మరియొక సుఖము మూడు



లోకము లందును లేదు (గురుగీత).

- అనేక జన్మలనుండి వచ్చిన సంస్కారబీజములన్నియు జ్ఞానాగ్నియందు దహించిపోయినందుచే, జ్ఞానులకు ప్రకృతి గుణములుండవు. వుండినచో వేగని విత్తనములవలె జ్ఞానాగ్ని యందు కర్మబీజములు దహించబడలేదని గ్రహించుకొన వలయును.
- దేనియందును ఆశలేనివాడును, మనోనిగ్రహము గల వాడును, పరవస్తు పరిగ్రహము లేనివాడును, దేహధారణకు మాత్రము విధిననుసరించిన కర్మను జేయువాడును పాప మును బొందడుయని (భగవద్గీత)

పరవస్తు పరిగ్రహము చేత పుణ్యము నశించి, దాతయొక్క పాపము తనలో చేరుచుండును.

క్షీరములో నవనీతము నిగూఢమైయుండినను చిలుకుటచే వెన్న బయలుదేరునట్లు, ఆత్మలో పరమాత్మయు, ధ్యానమనే మధనము వలన తెలియబడును.

- ప్రణవమును బ్రహ్మానుసంధానముగా జపమాచరించువాడు సర్వపాపముల నుండి విముక్తులగుదురు. అట్టి ప్రణవాభ్యా సముతో గూడినవారు మోక్షమును బొందుచున్నారు. సర్వము ప్రణవ స్వరూపమని వేదము పలుకుచున్నది. కావున అందరును ఈ ప్రణవ స్వరూపమును ఈశ్వర స్వరూప ముగా తెలుసుకొనవలసియున్నది. ఇదియే వేదము లలో నిగూఢమైన రహస్యము. సమస్తమును దీనియందు గలదు యని సూత సంహిత యందు మహేశ్వరుండు సనకాది ఋషులకు పదేశించెను.
- పరలోక ప్రయాణం తప్పదు - పరోపకారం తప్పకు

◆ శ్వాసైనా వదులుకో - భగవంతునిపై విశ్వాసము వదలకు

◆ రాముడైనా, రహీమైనా, యేసైనా, ఈశ్వరుడైనా - పూజలు కాదు ముఖ్యం సత్ప్రవర్తనమే అంటారు.

◆ మృత్యువు జ్ఞాపకమురానంతవరకే ఈ ప్రపంచమునందలి భోగములు రుచించును. అది జ్ఞాపకము వచ్చిన అన్ని చప్పబడి పోవును.

◆ ఓ జనులారా మృత్యువు దూరముగా వున్నదని భ్రమింపకుడు. అది సమీపములోనే యున్నదని శాస్త్రవాక్యము. అందుకే పుణ్య కార్యాలు చేయుటకు త్వరపడాలి.

## శ్రీ విద్యా శ్రీ ప్రకాశానందగిరి స్వామి వారి సూక్తులు.

◆ పడకను కొనగలము గాని - నిద్రను కొనలేము.

◆ వైద్యుని కొనగలము గాని - ఆరోగ్యమును కొనలేము.

◆ కంటి అద్దమునుకొనగలము గాని - కంటి చూపు కొనలేము.

◆ మందులను కొనగలము గాని - ప్రాణమును కొనలేము.

◆ గడియారమును కొనగలముగాని- పోయిన సమయమును కొనలేము.

◆ దేవుని పటమును కొనగలము గాని - దేవుని అనుగ్రహ మును కొనలేము.

◆ దుర్గుణములను పారద్రోలుటయే మోక్షమునకు సూటిబాట

◆ పవిత్రత, సహనము, పట్టుదల - జీవిత ప్రధాన సూత్రములు

◆ నీవు పవిత్రుడవైనచో-భగవంతుడు నీ యందు ప్రత్యక్షమగును.

◆ మంచిపనులకు వాయిదా వేయరాదు - రేపు అను దానికి రూపు లేదు.



◆ దానమందు నిదానము పనికిరాదు, దానము చేయుట పుణ్యము. మీ ఖాతాలో డిపాజిట్ చేయబడుటవంటిది. లోగడ చేసిన పుణ్యం అనే డిపాజిట్ నేడు అనుభవిస్తున్నాము. నేటి పుణ్యం అనే డిపాజిట్ భవిష్యత్‌లో ఉపయోగపడుతుంది.

◆ తన సుఖమును కోరక, ఇతరులను సుఖపెట్టువాడు అత్యుత్తముడు

◆ తన సుఖమును కాపాడుకుంటూ - ఇతరుల సుఖమునకు సహకరించువాడు ఉత్తముడు.

◆ తన సుఖము కొరకు, ఇతరులకు కీడు చేయువాడు- అధముడు

◆ అనవసరముగా ఇతరులకు కీడుచేయువాడు అధమాధముడు

◆ కోపాన్ని అణచివేయి, ఆవేశాన్ని అరికట్టు

◆ లోభాన్ని వదిలేయి - ఈర్ష్యను పూడ్చివేయి అసూయను అంతము చేయి - ద్వేషాన్ని తృణీకరించు ఆశను అణగద్రొక్కు, అప్పుడు నీలోనున్న అజ్ఞానమనే రోగాలు వదలిపోతాయి.

## అలంకారములు :-

చేతులకు - దానము - అలంకారము
శిరస్సునకు మహాత్ములకు వందనము అలంకారము
ముఖమునకు సత్యవాక్కు అలంకారము
హృదయమునకు దయ "
కన్నులకు దైవదర్శనము "
కష్టాల వల్ల విసుగు కలుగును "
విసుగువల్ల - తెంపు కలుగును
తెంపువల్ల - సుఖము కలుగును.
పవిత్ర దృష్టే దైవానికి దీపం
పవిత్ర వాక్కే వేదమంత్రం
పవిత్ర మనస్సే దేవునికి పుష్పం
ఆశ వలన వినాశము
భోగము వలన రోగము

యోగము వలన మోక్షము కలుగును
యోగులకు ధ్యానము
త్యాగులకు - దానము
భక్తులకు - గానము
భోగులకు - పానము
రోగులకు - వైద్యము
చేయి కాలితే మందుంది- చేసిన తప్పులకు మందులేదు
శరీరములు అనేకములు - ఆత్మ ఒక్కటే
నక్షత్రములు అనేకములు - ఆకాశము ఒక్కటే
దేశములు అనేకములు - భూమి ఒక్కటే
మతములు అనేకములు - సత్యము ఒక్కటే
ప్రాణులు అనేకములు - ప్రాణము ఒక్కటే
అనేకమందు ఏకత్వమును వీక్షించుము.

- యూనిఫారంలో ఉన్న ఆఫీసరును అందరూ గౌరవించినట్లు, సన్యాసులు కాషాయధారులై వుండుట మన భారతీయ సాంప్రదాయం.
- తాను అనుభవించక, తనను నమ్ముకొన్నవారి కోసం ఖర్చు చేయక సత్కార్యములకు ఉపయోగించక, వుంచుకున్న లక్షలాది ధనం వలన ఉపయోగమేమి? చివరకు దుఃఖమే మిగులుతుంది.
- వాక్కును నియమించుకోవడము వలన మనో నిగ్రహము నకు చాలా సహాయపడుతుంది. కనుక వారానికి ఒకరోజు మౌనంగా వుండుట చాలా మంచిది. మౌనం రోజున పాలు, పండ్లు, ఆహారం చాలా మంచిది. కేవలము వాక్కు నియ మమే కాకుండా, మనో నియమం కూడా వుండాలి. మనస్సు నిగ్రహం లేని వాఙ్మనం వలన ఫలితమును పొందలేరు.
- సూర్యోదయ సూర్యాస్తమయ సమయములలో నిద్రపోవుట మంచిదికాదు. సూర్య భగవానుని అవమానపరచినట్లే.



- కష్టాలను కలసి పంచుకొన్నవారే నిజమైన భార్యాభర్తలు.
- పంచభూతాలతో తయారైన శరీరం, పంచభూతాలలో కలిస్తే ఏడుస్తారెందుకు? ఈ ప్రపంచము ఒక పెద్ద నాటకము. ఎవరి నటన పూర్తి అయితే వారు స్టేజీ దిగిపోవసినదే. అదే మరణం.
- చినిగిన వస్త్రం విడిచిపెట్టి, కొత్త వస్త్రం కట్టుకున్నట్లు, అనుభ వించవలసిన ప్రారబ్ధం నశించిన తరువాత జీవుడు ఇంకొక శరీరములోనికి మారడమే మరణం.
- పరమ పవిత్రమైన దేవాలయములలో నున్న అద్భుతశక్తిని పొందాలంటే కనీసం 5 నిముషములైన కళ్ళు మూసుకొని ధ్యానం చేయాలి.
- ఏ మానవుడు తల్లిదండ్రులను అనరాని మాటలు అని వారికి భోజనాది సౌకర్యములు చూడడో, వారిని దుఃఖపెట్టి అనేక యిబ్బందులకు గురిచేస్తాడో వానికి మరుజన్మలో తల్లిదండ్రులు చిన్నప్పుడే దూరమవుతారు.
- అన్యాయముగా సంపాదించిన ధనం పది సంవత్సరాలలో తన ప్రభావాన్ని తప్పకుండా చూపుతుంది. సమూలముగా తనకు వున్న ధనాన్ని కూడా తీసుకొనిపోతుంది.
- పుణ్యమైనా, పాపమైనా మూడు సంవత్సరములలోపు అనుభ వించ వలసినదే ఇంకా తీవ్రమైతే మూడునెలలలో, ఇంకా తీవ్రమైతే మూడు పక్షములలో, చెప్పలేనంత తీవ్రమైతే మూడు దినములలో ఈ లోకములో వుండగనే అనుభవించ వలసివచ్చును.
- నిత్యము అధిక ప్రమాణములో పూజాదులు, జప, హోమా దులు జరుగుచున్నచోట అనుష్ఠానపరులగు మహాత్ములున్న

చోట వాస్తు దోషములు కూడా ఏమీ చేయజాలవు.

- డబ్బు సంపాదించడమే ముఖ్య లక్ష్యమని చాలామంది భ్రమ పడతారు. ఎందరో ధనవంతులు ఒక్కపైసా కూడా శవ యాత్రలో తమతో తీసుకొని వెళ్లలేదుగదా.
- ఎంతో పూర్వ పుణ్య సంపదవుంటేనే సాధు సజ్జనుల సేవా భాగ్యం లభిస్తుంది. వినయవంతులే సేవా భాగ్యానికి అర్హులు. తల్లిదండ్రుల సేవ సర్వదేవతల సేవయనబడుతుంది.
- అనిత్యమైన సంసారముపై భ్రాంతిని విడనాడి, నిత్య సత్య స్వరూపుడగు పరమాత్మయందు భక్తికల తల్లిదండ్రులు ఎన్నో జన్మల పుణ్యం చేసుకుంటేనే గాని లభింపరు.
- తల్లిదండ్రులలోను, గురువులలోను దోషాలు చూడక, వారి త్యాగాలను గ్రహించు వారి అనుభవాలను సంపాదించు. వారి ఆశీర్వాదాలను పొంది ఇహ పర సుఖాలను అనుభవించు.
- తనకు కలిగిన సంతానమును పెంచే విధానం ఋషీశ్వరులు ఇలా సెలవిచ్చారు. 5 సంవత్సరముల వయస్సు వరకు మహారాజు లాగా, 6 నుండి 15 సం.ల వయస్సు వరకు దాసుడిగా (పని మనిషిగా) అన్ని పనులు చేయిస్తూ నేర్పించాలి. 16 సంవత్సరముల వయస్సు దాటితే స్నేహితుడుగా చూడాలి. ఈ విధముగా పెంచిన యెడల భవిష్యత్తులో ఆనందించగలరు.
- తల్లి, తండ్రి, గురువు వీరికంటే మించి నీ మేలు కోరేవారు ఎవరూ వుండరు. కనుక వారి వలన ఏమైనా పొరపాట్లు జరిగినా, వాటినే తలచుకొంటూ వుండక, వారిని దూరము చేసుకోవద్దు. చేసుకున్నావా నీ జీవితములో గొప్ప లాభాన్ని పాడుచేసుకున్నవాడివౌతావు.



- ధనముతో అన్నీ సమకూర్చుకొనవచ్చును. కాని సాధు సత్పురుషులను సంపాదించుకోలేరు. ధనముతో భక్తిని, జ్ఞానమును కొనలేము. ధనబలముతో, జనబలముతో, అధికార బలముతో యౌవన బలముతో భక్తి, జ్ఞాన, మోక్షములు రావు. తలమెరవడము మొదలయిందంటే మృత్యువు దగ్గర పడిందని తెలుసుకొని, దైవ కార్యములు శీఘ్రముగా చేయాలి.
- ఎన్ని పూజలు, నోములు చేసినా మనశ్శాంతి లేదని బాధపడవద్దు. దివ్యమంత్ర జపము, ధ్యానం ద్వారా శాంతిని పొందగలుగుతారు.
- జీవించడానికి ఆహారము, శరీర సంరక్షణకు బట్ట, వుండడానికి యిల్లు వుంటే చాలు. అధికమైన మోజులోపడి, అబద్దాలు ఆడి, మోసాలు చేసి ధనం సంపాదించి, చివరకు నరకానికి పోతావ్. అబద్ధం మోసం లేని సంపాదన, బుద్ధిని శుద్ధంగా వుంచి, మంచి కార్యాలు, దైవకార్యాలు చేయడానికి ప్రేరణ కలిగిస్తుంది.
- భార్యయనగా బానిసకాదు. అర్ధాంగిని, సమస్త కష్టసుఖాలలో పాలుపంచుకొనే హక్కు ఆమెకున్నది. కనుక ఆమె కష్ట సుఖాలు అడిగి తెలుసుకోవాలి. ఇంటిని స్వర్గంలాగా మార్చుకోవాలి. శరీరాన్ని సంతోషపరచడములో భార్యకు మించిన వస్తువేదీ లేదు. ఇంకను శరీర పోషణలో తల్లికి మించిన వారెవరూ లేరు అనవచ్చును.
- తల్లిదండ్రులను వృద్ధాశ్రమంలో పెట్టి, తాను ఐశ్వర్యమద మత్తుడైన వాడు పరమనీచుడు. తమ జీవితములను ధారపోసి, పెంచి, పోషించిన వారిని, తనకు భారముగా నెంచి, అనాధులను జేసిన వానికంటే పరమపాపి ఇంకొకడు వుండడు. తల్లిదండ్రుల శుక్ర శోణితములతో శరీరము పొంది, వారి

కష్టార్జితమును తిని, వారికి అపకారము చేయు మూర్ఖుని కంటే కృతఘ్నుడు లేడు. తన అమ్మ నాన్నలవలె అత్తమామలను కూడా చూసు కుంటూ తన సేవలతో సంతోషపరచునదే నిజమైన కోడలు.

- ధైర్యవంతులు, ధర్మనిష్టులు, దైవబల సంపన్నులు, ధర్మాన్ని స్థాపించగలుగుతారు. అధర్మాన్ని ఎదిరించగలరు. అట్టివారి ద్వారానే లోకంలో శాంతి.
- పాత్రశుద్ధంగా లేకపోతే పాలన్నీ విరిగినట్లు అంతఃకరణం శుద్ధంగా లేకపోతే, ఎంత వేదాంతసారము శ్రవణము చేసినా ఫలితము పొందలేరు.
- విద్యకు మించిన ధనం లేదు. విద్యకు మించిన మిత్రుడు లేడు. ఖర్చుపెడుతున్న కొలదీ పెరిగే ధనం విద్యాధనం మాత్రమే. బంధువులు విద్యను పంచుకోలేరు. దొంగలు అపహరించ లేరు. దూరదేశములో విద్యయే మంచి బంధువు. అదే ఆత్మ విద్య (బ్రహ్మవిద్య).
- మోక్షప్రాప్తికి కేవలము వైరాగ్యమే చాలదు. జ్ఞానం సాధుజన సాంగత్యం కూడా వుండాలి. జ్ఞానియైనప్పటికిని,దేహమున్నంత వరకు శ్రీ సద్గురు దేవుని భగవంతుని, వేదాంతమును సేవించాలి.
- ఆత్మహత్య మహా పాపము. ఆ విధముగా చేసుకోవాలని అనిపించినప్పుడు తన కష్టాలను ప్రాణ స్నేహితులకుగాని, సద్గురువులకు గాని, తల్లిదండ్రులకు గాని చెప్పి, తనకు కలిగిన భారాన్ని దించుకోవాలి. పుట్టినవాడు గిట్టవలసినదే. బలవంత ముగా ప్రాణాలు తీసికొని, ఇతరులను చిక్కులలో పెట్టకు, ఈ మానవజన్మ అతివిలువైనది. మానవజన్మ మళ్లీ రాదు. అశాంతిగా ప్రాణాలు వదలకు. ప్రశాంతంగా వదలు.



అందుకే నిరంతరం భగవన్నామాన్ని జపించు, దైవాన్ని స్మరించు.

- జ్ఞాని ఎవరిపైనా ఆసక్తినుంచుకోడు. తనలో తాను ఆత్మా నందం అనుభవిస్తాడు. జ్ఞాని అసంగుడైనప్పటికిని అంతులేని తల్లి ప్రేమ కలిగివుంటాడు.
- కొందరు తల్లిదండ్రులు పిల్లలను అతిగారాబముగా పెంచి సోమరులుగా తయారుచేస్తున్నారు. భవిష్యత్తులో అట్టివారు జాగ్రత్త పడకపోతే కష్టాలు తప్పవు. పిల్లల ద్వారా తల్లిదండ్రులు బాధలకు గురికావలసినదే.
- ఈ లౌకిక ధనముతో బాహ్యమైన సుఖములు పొంద వచ్చునేమో గాని మనశ్శాంతి మాత్రం ఆత్మవిద్యతో మాత్రమే పొందగలము. దీనిద్వారా అంతులేని ఆనందం పొంద గలుగుతాము.
- ప్రతిజీవి తన పుట్టుకతో ప్రతిక్షణం మరణాన్ని వెంటబెట్టుకొని జీవిస్తాడు. తన మరణాన్ని చూస్తానికి తానుండడు, తాను న్నంత కాలం మరణభయంతో జీవించక మరణం సహజం అనే విషయాన్ని సర్వకాల సర్వావస్థలయందూ జ్ఞప్తిలో ఉంచుకొని జీవించాలి.
- ఉదయమున నిద్రలేవగనే దేవుని ప్రార్థన చేయవలెను.
- ప్రియముగను మితముగను మాట్లాడవలెను.
- కష్టసుఖములందు సమబుద్ధి కలిగియుండవలెను
- రాత్రిపరుండుటకు ముందు మరల దైవప్రార్థన చేయవలెను.
- చేసిన తప్పులకై పశ్చాత్తాపపడి, ఇక మీదట వానినిచేయరాదు.
- దానము చెయ్యని డబ్బు నిరుపయోగము
- భగవన్నామము చెప్పని నాలుక నిరుపయోగము

- తన తోటి మానవులను హృదయపూర్వకముగ ప్రేమించ వలెను.
- దేవుని చేరుటకు మార్గము అపవిత్రతను, అవినీతిని, దుర్గుణములను హృదయము నుండి తొలగించుటయే
- గుణహీనుడు ఎంత అందగాడైనను వ్యర్థమే
- నీవు పవిత్రుడవు అయినచో, భగవంతుడు నీకు ప్రత్యక్షమగును
- ద్వేషరాహిత్యమే భగవంతునికి ప్రీతికరమైన పూజ.
- పుణ్యముచే సుఖము, పాపముచే దుఃఖము. జ్ఞానముచే మోక్షము. ఇది దైవశాసనము, అందుచేత? పాపకార్యములను వదలివేసి, పుణ్యకార్యములను చేపట్టవలెను.
- దైవము కొరకు పరితపించకుండా ఎవరు దైవమును పొందలేరు.
- సద్గుణములు లేని విద్య వ్యర్థము
- శాంతి సంపదలలో లేదు, సంతృప్తిలోనేఉన్నది
- తన తప్పును ఇతరుల మంచిని వెతకువాడు ఉత్తముడు
- జ్ఞానము లేని బ్రతుకు వ్యర్థము
- అన్నిటికంటె సులభమైనది ఎదుటివాని దోషములు వెదకుట.
- అన్నిటికంటె కష్టమైనది తనలోని దోషములు వెదకుట
- మానవ శరీరము ధరించిన వారందరూ మానవులు కారు. మానవత్వం వున్నవారే మానవులు.
- విద్యనేర్పిన వారిని వెక్కిరించకు.
- పాపము పాముకంటే ప్రమాదము
- కాలం విలువైనది. రేపు అనుదానికి రూపు లేదు కావున



మంచి పనులను వాయిదా వేయకూడదు.
- భోగాలకు ఖర్చుచేసి రోగాలను కొనితెచ్చుకోకు. మంచి పనులకు ఖర్చుచేసి పుణ్యాన్ని సంపాదించుకో. ఆ పుణ్యమే నిన్ను కాపాడగలదు.
- నిదానముగా ఆలోచించి మాట యివ్వుము - ఇచ్చిన మాటను పాటించుము.
- ఎవరి హృదయము బీదవారి కొరకై పరితపించునో అతడే మహాత్ముడు.
- గుణమును గుర్తించుము - కులమును విస్మరింపుము
- దురాశ దుష్ఫలితముల నిచ్చును.
- అత్యాశ అధోగతికి చేర్చును.
- చిరిగిన వస్త్రమును సరిచేయవచ్చును. విరిగిన మనస్సును సరిచేయుట కష్టము.
- అపకారము చేయకుండుట, ఒక విధముగా ఉపకారము చేసినట్లే.
- మతములు వేరు - మార్గము ఒక్కటే.
- కోరికలు లేనివాడు కోటీశ్వరుడు.
- ఆవేశములో ఆలోచించవద్దు.
- అందము కొరకు పరితపించకు - ఆనందము కొరకు పరితపించు
- పదవుల కొరకు ప్రాకులాడుటకంటే పరమాత్మ కొరకు ప్రయత్నించు
- శరీర సౌందర్యము లేదని బాధపడవద్దు

మనోబలము కావాలని మనసారా ప్రార్థించు

- లేనిదానికి ఆరాటపడవద్దు - ఉన్నదానితో తృప్తిపొందు
- జ్ఞానము వలన మిత్రులు పెరుగుదురు. వైరము వలన శత్రువులు పెరుగుదురు.
- పోయిన సమయము రాదు, ఉన్న సమయమువృధా చేయకు
- దుర అలవాట్లను ఆదిలోనే అరికట్టనియెడల అవి అవసర ముగ మారిపోవును.
- అంతా మన మేలు కొరకే అని తలంచువానిని ఎటువంటి కష్ట పరిస్థితులలో కూడా అతడు కలత చెందడు.
- కష్టపడి పనిచేయుట నేర్చుకోవాలి. కష్టాల వలన హృదయ పరిశుద్ధత, సహనము అలవడుతాయి.
- నిజాయితీ పరులు ఎవరినీ చూచి భయపడరు.
- దేవుడు విశాలహృదయుడు, నీవు దుఃఖము పొందినపుడు భగవంతుని శరణుపొందు. నిత్యము భక్తి కలిగియుండుము, అప్పుడు పూర్ణశాంతిని పొందగలవు.
- అందరిని గౌరవించుట సజ్జనుల స్వభావము
- మధురవాక్కు కోపాన్ని చల్లబరుస్తుంది.
- కఠినమైన వాక్కు కోపాన్ని రెచ్చగొడుతుంది.
- ధనము, ప్రాపంచిక వస్తువులు పోయినచో వాటిని తిరిగి సంపాదించవచ్చును. కానిపోయిన సమయమును తిరిగి సంపాదించలేము.
- ఆపదలలో ఆదుకొనువాడే - ఆత్మబంధువు.
- ధర్మప్రవర్తనమే, దైవమును చేరుటకు మార్గము - సద్గుణ ములే సకల సంపదలు.



- నిందవేయడం అబద్ధం చెప్పడం కంటే మిక్కిలి ఘోరం.
- సేవకు మించిన సుగుణం మరొకటి లేదు.
- దయ మనిషికి ఒక వరము వంటిది.
- నీ బాధకు కారణమేమైనా ఇతరులను బాధించరాదు. (ఇతరుల మనసునకు బాధ కలిగించరాదు)
- సత్యంవద ధర్మంచర, సత్యమును పలుకుము. ధర్మమును ఆచరింపుము.
- దయకు సమమగు పుణ్యము లేదు.
- భక్తికి సమమగు భూషణము లేదు
- జ్ఞానమునకు సమమగు సుఖము లేదు.
- మానవసేవయే మాధవ సేవ.
- అన్నిటియందు భగవంతుడున్నాడని అందరిని అన్ని జీవ రాసులను ప్రేమించుము.
- ఆశగలవాడు ధనవంతుడైనను దరిద్రుడే
- సంతోషము మంచినుండి గలుగుచున్నది.
- దుఃఖమునకు కారణము పాపము.
- సుఖమునకు కారణము పుణ్యము.
- నీవలెనే నీతోటి జీవులను ప్రేమించుము.
- మనము చేయు మంచిచెడ్డలు నీడవలె మన వెంట అంటి యుండును.
- ఫలమును గోరక భక్తిశ్రద్ధలతో దేవుని పూజ ాపుము.
- నిర్మల హృదయము చేతను, పరిశుద్ధ మనస్సు చేతను దైవ సాక్షాత్కారము లభ్యము కాగలదు.

◆ కష్టములు మానవునికి నీతి ధర్మములు బోధించును.

◆ క్షమకు మించిన హితకారియైన గుణము లేదు.

◆ అంతా నా మేలునకే వచ్చినదని తలచుచూ కష్టాలను ఓరిమితో అనుభవించుము.

◆ ఈర్ష్యను కూకటి వ్రేళ్లతో సహా పెళ్లగించుము.

◆ ఎంతటి కష్టము కలిగినను దేవుని నిందించకు

◆ పాపము వలన పుణ్యము తరిగిపోవును. కావున పాప కార్యము చేయవద్దు.

◆ కరుణామూర్తులగు తల్లిదండ్రులను దైవముతో సమానముగా చూడుము.

◆ బీదలకు, రోగులకు, తల్లిదండ్రులకు సేవచేయుము.

◆ భగవంతుడు నీకు యిచ్చినది చాలు అనుకొనుటయే జీవితములో తృప్తికి యేకైక మార్గము.

◆ చీకటికంటెను నలుపైనది కల్మష మనస్సు, రాతికంటెను కఠినమైనది కఠోర హృదయము.

◆ తీర్థము లన్నిటిలో మహాపవిత్రమైనది నిర్మల హృదయము

◆ మనస్సు శుద్ధముగా వుండినచో, వారు వచించువాక్కులు, మంత్రములవలె శక్తివంతములుగా వుండును.

◆ సంతోషమునకు మించిన అలంకారము వేరొకటి లేదు.

◆ అసూయ నీచమైన దుర్గుణము. దానిని మానవుడు ఏ కాల మందును దరికి చేర్చరాదు.

◆ భగవంతుని దయను పొందుటకు ప్రార్థనకంటే ఉత్తమమైన ఉపాయము లేదు.



◆ చెడును చూడకుము. వినకుము వర్ణించకుము.

◆ క్షమాగుణము అమూల్యమైన రత్నము, తృప్తికిదియే మూలము

◆ తల్లిదండ్రులు, గురువులు ఇచ్చు ఆజ్ఞలను పాటించుము.

◆ గర్వముండిన పరుల సహాయము లభింపదు.

◆ ప్రార్థించకపోయినను, సత్యపథము ననుసరించువానిని దేవతలు రక్షించెదరు.

◆ ఒక్కమారు త్రికరణ శుద్ధితో చేసిన ప్రార్థన భగవంతుని కదిలించును. ఇలాంటి ప్రార్థన వలననే నీకు భగవదనుభూతి కలుగును.

◆ వేయిమైళ్లు నడిచి వెళ్లి పూజచేయుట కంటె, ఇంటి దగ్గరుండి ఒక మంచి పని చేయుటయే గొప్ప.

◆ మానసిక ఆరోగ్యము లేకుండా ఎన్ని పుస్తకములు చదివినను వ్యర్థము.

◆ తనకు అండగా భగవంతుడున్నాడని తలంచువాడు ఏ కార్య మందును నిరుత్సాహమును పొందడు.

◆ దేవుని పేరు సత్యము, ప్రేమయే దేవుడు. ప్రేమకలవాడు దేవు నితో జీవించువారేగదురు.

◆ సత్యమునకు, సన్మార్గమునకు మించిన మతము లేదు.

◆ దానధర్మములు లేని ధనము, సద్గుణములు లేనివిద్య, మానవ త్వము లేని విజ్ఞానము, త్యాగము లేని క్రియలు వ్యర్థములు.

◆ ప్రారంభించిన శుభకార్యము నెరవేరువరకు పట్టువిడువ రాదు.

◆ దుర్గుణములు లేని హృదయములో భగవంతుడు చోటు ఏర్పరచుకొనును.

- జీవునకు తన పాపకర్మలే తనకు అపకారము చేయును.
- ప్రపంచములో ఏ స్థానమునకు వెళ్లినను తాను చేసిన కర్మ యొక్క ఫలితము నుండి ఎవరును తప్పించుకొనలేరు.
- అగ్నిని నీటితో చల్లార్చునట్లు, కోపాన్ని సహనం, ఓర్పునేర్పు అను నీటితో చల్లార్చుట మంచిది.
- శక్తిచేత సాధించలేనిది యుక్తిచేత సాధించవచ్చును. సత్య మునకు సమానమైన సంపద లేదు. నీ మంచితనమే నీకు గొప్ప అండ.
- మన సుఖదుఃఖాలకు కష్టసుఖాలకు మన కర్మయే మూల కారణం.
- ఆత్మజ్ఞానము మరణమును జయించును. అమరత్వమును సిద్ధింపజేయును.
- జ్ఞాని సంసారములో ఉన్నను, నీటికాకిని నీరంటనట్లు తాప త్రయ ములు అతనిని అంటవు.
- దిగులుపడకుండా, ఉత్సాహము కలిగి యుండుటయే ఐశ్వర్య మునకు మూలము. ఉత్సాహమే వాస్తవమగు సుఖము.
- పొలములో రైతువలె శ్రమపడిననే కాని, ఏ కార్యమందును సిద్ధి కలుగదు. సాధన ద్వారా ఆత్మ దర్శనమునకు మార్గము తెలియ బడుతుంది.
- మొక్కను బట్టి భూసారము తెలుసుకొనవచ్చును. అట్లే మాటను బట్టి మనుజుని స్వభావమును తెలుసుకొనవచ్చును.
- ఇతరులకు సహాయపడుచు ఆనందముగ జీవించు కళను అభ్యసించవలెను.
- ప్రపంచములో ఏదియు శాశ్వతము కాదు. ఐశ్వర్యము అధికారము అన్నియు అంతరించిపోవును. సత్కార్యములు



మాత్రమే చేసిన (మంచిపనులు) శాశ్వతముగ నిలిచిపోవును.
- తన దురలవాట్లే తనకు శత్రువులు
- స్త్రీలకు నగలకంటే ఉత్తమమైన ఆభరణము భర్త.
- క్రోధము రాకుండా నిరోధింపగలిగినవాడు ఉత్తముడు.
- బాగుగా పరిశీలించు, మితముగా మట్లాడు. అందుకే రెండు కళ్ళు ఒక నాలుక ఏర్పాటు చేయబడినది.
- ద్వేషము ప్రేమచే నశించును. ఇది సనాతన ధర్మము.
- ఆశలకు తావొసంగక ఉన్నదానితో తృప్తినొందుట శ్రేయస్కరము
- ఆనందానుభూతిని పొందని జీవితము నిరర్థకము.
- మానవులకు అలంకార మొసంగునది ఆభరణము కాదు హృదయ సౌందర్యము.
- ఆశ రోగముతో సమానము. కావున ఆశారాహిత్యమును పొంది, ఆరోగ్యమును చేకూర్చుకొనవలెను.
- ఉపకారము చేసిన వారియెడల సదాకృతజ్ఞత కలిగి యుండుట మానవత్వము.
- ఉపకారం చేయలేకపోయినా, అపకారం తలపెట్టకు.
- ఇతరులకు ఏదియో ఒక ఉపకారము చేయుటకై ప్రయ త్నించుము.
- గంగానదిలో స్నానము చేస్తే పాపాలు పోతాయి అంటారు. జ్ఞానిని దర్శిస్తేఆ పాపము చేసే బుద్ధి పోతుంది.
- హితమును గోరువాడే బంధువు
- విశ్వాసము గలవాడే స్నేహితుడు.
- సుఖింపజేయునట్టిదే భార్య

- బుద్ధిమంతుని మనస్సు జ్ఞానమును వెదకును.
- జ్ఞానము గల కుమారుడు తండ్రిని సంతోషపెట్టును.
- లోభి తన యింటివారిని బాధపెట్టును.
- తన కష్టము వలన సంపాదించిన సొమ్ము వృద్ధియగును.
- మోసము చేత సంపాదించిన సొమ్ము క్షీణించిపోవును.
- గర్వము వలన జగడము పుట్టును.
- నిజమైన స్నేహితుడిని విడువక ప్రేమించుము.
- కీడుకు ప్రతి కీడు చేసెదనని అనుకోవద్దు.
- నీవు ఆనందంగా సంతోషంగా వుండాలంటే ఇతరులకు సంతోషము కలిగించు. నీవు కోపగించుకుంటే నీకే అపకారం కలుగుతుంది.
- క్షమించి మన్నించడం నేర్చుకో, ద్వేషం పొందకు
- గొడ్డలితో నరికిన మోడైనా చిగురించును గాని, మాటల చేత విరిగిన మనస్సు కుదుటపడనేరదు.
- తప్పుచేసి దేవునికి మ్రొక్కి దేవుని వంచించే మోసకారి ముక్తిని పొందలేడు.
- అన్నీ తెలిసి మోసపోవడం అవివేకం.
- మంచివానికి చెడు జరిగినా మంచికే జరుగుతుంది.

  చెడ్డవానికి మంచిజరిగినా చెడుకే జరుగుతుంది.
- ఫలితము సాధనను బట్టి వుంటుంది.
- ఆత్మసాక్షాత్కారానికి అత్యంత ఉపయుక్తమైనది మానవజన్మ.
- పాప పరిహారమైతేనే పరమాత్మను దర్శించే జ్ఞానం కలుగుతుంది.
- అహాన్ని జయించినవాడే ధన్యజీవి.



- అందరితో సమరస భావంగా మెలగడమే మానవధర్మము.
- చెడుభావాలను, చెడు తలంపులను, చెడు చింతలను దూరము చేసుకొని, దైవానుగ్రహం పొందాలి.
- ఎవరికైనా విశ్వాసము అవసరము. ఎవరి విశ్వాసము వారికి ఆనందమునిచ్చును.
- మనలో మాలిన్యము వుంచుకొని, రామా రామా అని స్మరించినా ప్రయోజనము లేదు. కావున మాలిన్యము తొలగించుకొనుటకై ప్రయత్నించాలి.
- దైవకార్యము చేయుటకు మంచి మనసుతో పనిని ప్రారంభించాలి.
- సర్వం నీవే అని పవిత్రభావముతో దైవమును ఆరాధించడమే నిజమైన భక్తి.
- స్వార్థము, అసూయ, పరదూషణ మొదలగు అల్పబుద్ధుల వలన మానవులు తమలోని దైవత్వమును పూర్తిగా కోల్పోవుతున్నారు.
- మానవ ప్రయత్నం ఫలించాలంటే, దైవానుగ్రహం కూడా ఎంతో అవసరము.
- సుఖదుఃఖములు పౌర్ణమి అమావాస్యలవంటివి.
- బంధమునకు మోక్షమునకు మనస్సే కారణము. మనస్సును అరికట్టడానికి, ఆధ్యాత్మిక మార్గము తప్ప వేరు మార్గము లేదు.
- మనలను ఎవరు, ఏ తీరుగా గౌరవించవలెనని ఆశించుచున్నామో ఆ విధముగానే వారిని గౌరవించవలెను.
- దైవమును చేరుటకు మార్గము సత్ ప్రవర్తన, దైవ చింతన అందరికి సహాయము చేసే మంచి స్వభావము వుండాలి.

- దైవమును నిర్మలమైన పవిత్ర భావముతో పూజించిన దైవము సదా మీ సమీపమునే వుండును.
- అంతులేని కోరికల వలన మానవుడు దుఃఖమునకు గురి యగుచున్నాడు.
- పవిత్ర భావముతో దైవమును స్మరించిన దుఃఖము తొలగును.
- దైవమును మంచి భావముతో స్మరించిన, హృదయము పవిత్ర మగును.
- సత్యం, ధర్మము, శాంతి, ప్రేమ అనే మోక్షమార్గముల నడవండి. అప్పుడు దైవం సదా మీ సమీపమునే వుంటాడు.
- సేవచేయుట వలన లభించిన ఆనందము పవిత్రత మరెక్కడ లభించదు. సేవా భావము వలన అహంకారము తరిగిపోవును.
- జీవితము క్షణికము. మంచి పనులు చెయ్యండి. మంచి తలపులు కలిగివుండండి.
- సత్సాంగత్యము చెయ్యండి. సన్మార్గమున సదా పయనించండి.
- నిరాధారులైన వారికి అన్నము పెట్టండి. గ్రుడ్డివారికి చేయూత నివ్వాలి. ఇవి దైవానుగ్రహమునకు సాధనములు.
- భీతి నరకము వంటిది. సంతోషము స్వర్గము వంటిది అని గుర్తించుకోండి.
- సత్వగుణము రావాలంటే సాత్వికాహారము భుజించవలెను.
- భక్తిని అభివృద్ధి చేయుటకు, మంచి కార్యములకు, ధనమును వినియోగించుట ఉత్తమమార్గము.
- సత్సంగములో చేరినపుడు, సద్భావములు మనలో ఆవిర్భవించును. ఇది నిత్యసత్యము.
- మానవుని హృదయము ఆశతో కూడినదయితే, అది



ఎప్పుడూ పతనమార్గమునే చూపుతుంది.

- మనము చేసే పని మంచి పని అయినప్పుడు, ఎవరెంత బాధపడినా నష్టము లేదు.
- దానము చేయునపుడు శ్రద్ధతో చేయవలయును. సంపదననుసరించి చేయవలయును. ప్రత్యుపకారము కోరక దానము చేయుట మంచి లక్షణము.
- నిరంతర భగవన్నామ స్మరణలో ఆత్మానందము తప్పక లభిస్తుంది. ప్రయత్నించి ఫలితము సాధించండి.
- మనస్సు స్వాధీనములో లేకపోయినను స్మరణ మాత్రము మరువకండి.
- అనుకూలవతియైన భార్య, చక్కని దేహారోగ్యమే పురుషునికి విలువైన సంపద.
- ఎక్కువగా వినండి. తక్కువ మాట్లాడండి.
- సంతృప్తిగల హృదయమునందు లక్ష్మి స్థిర నివాసము ఏర్పరచుకుంటుంది.
- మన శరీరానికి వ్యాయామం మంచిది. అలాగే మనస్సుకు గ్రంథపఠనం మంచిది.
- ఏది సత్యమో దానిని కనుగొని, ఏది మంచిదో దానిని నిత్యం ఆచరించాలి. అప్పుడే జీవితము ధన్యము కాగలదు.
- ధనము మిక్కిలి కష్టముచే పొందబడుచున్నది. మూఢులు తృప్తిరహితులై దొరికిన దానితో సంతసించరు. జ్ఞానులట్లు గాక లభించిన దానితో సంతోషించెదరు.
- గృహస్థుడు అతిథిని జూచి, మంచి దృష్టిగలిగి, మంచి మనసు గలిగి మంచి మాటలు చెప్పిలేచి, ఆసనము నియ్యవలెను. ఇది గృహస్థులకు సనాతనమైన ధర్మము.

◆ భగవంతుని దర్శించడం రెండువిధాలుగా వున్నాయి. సద్గుణం, 2) నిర్గుణం. మార్గాలు వేరైనా భగవంతుని తెలుసు కొనుటయే అందుగల ప్రధాన విషయము.

కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మమనే బహిరేంద్రియాలకు భగవంతుని చూడగల్గు శక్తి తక్కువ. అవి బాహ్య ప్రపంచాన్ని చూడగలవేగాని, అంతర ప్రపంచాన్ని చూడలేవు. కాబట్టి అంతరేంద్రియమైన మనస్సుకు ఆత్మను దర్శింపగల అపరి మితమైన ప్రభావం కలదు. కాని మనస్సు చంచలత్వాన్ని పొందివుంది. ఎందుకని? అది లౌకిక బంధాల్లో చిక్కుకొని వుంది. మనసు ఎల్లప్పుడూ ఒకే పరిధిలో వుండదు. క్షణ క్షణం మార్పుచెందుతూ వుంటుంది. లౌకిక జగత్తులో పరిపరి విధాల పరుగెత్తుతుంది. అట్లు పరిగెత్తే మనస్సును బంధించి, నిలకడగా నిలిపి, అఖండ త్వాన్ని కలుగజేసే మార్గమే యోగం. యోగమనగా ఈశ్వరుని సంయోగం పొందు ప్రక్రియ. ఈ యోగ విధానం హైందవ మతములో ఒక ప్రత్యేకస్థానాన్ని ప్రాచీన కాలము నుండి పొంది వుంది. యోగం మోక్షానికి సాధనమైవుంది.

◆ తపస్సనగా :- జపము, ధ్యానము, అధ్యాత్మిక సాధనకు మెట్లు. ఇంద్రియాలు మనస్సు, బుద్ధి ఎప్పుడు బాహ్య ప్రపంచము లోనికి పరుగులు పెట్టుతుంటాయి. వాటిని అటువైపు వెళ్ళనీయకుండా నిలుపడమే తపస్సన్నారు పెద్దలు.

◆ సాధకుడైనవాడు తనలోని దుర్వాసనలను మార్చుకోవాలి. వదిలించుకొని బాగుపడాలి. లోపల దుర్వాసనలు వుంటే అదే స్వభావం ఆ వ్యక్తికి కలిగి, అతనిలో నుంచి ఉదాత్తమైన మంచి ఆలోచనలు, సత్కర్మలు చేద్దామని వుండదు. కర్మ యోగం చేయునపుడు, నిష్కామంగా చేసినపుడు చిత్తశుద్ధి



కలుగు తుంది. చెడ్డవాసనలు కలిగినవాడు ఆ వాసనలను ఒకటి రెండు రోజులలో వదిలించుకొనలేడు. కొంతకాలము సాధన చేసిన క్రమముగా దుర్వాసనలు తగ్గి సద్వాసనలు అలవడతాయి.

సత్ కార్యక్రమములు, సత్ గ్రంథ పఠనము సత్ భావనలు, సత్ సంగము, సదాచారము, సత్యం ధర్మం అనే వాటిని పాటించాలి. అప్పుడే మనస్సు దైవమార్గములో ప్రయాణము సాగించగలదు.

◆ మానవులకు ధనము, కామము, పదవులు వీటి కోసమై జీవిత మంతయు వాటి కొరకై ప్రాకులాడుతూ వుంటారు. ఇవి అనిత్యములు. వీటినే ధ్యానిస్తూ వుంటారు. శాశ్వత ఆనందాన్ని యిచ్చేది ఆత్మధ్యానం. అది మొదట కష్టముగా తోచినను తరువాత అనంత సుఖమునిస్తుంది. విషయ ధ్యానము మొదట సుఖముగా వుండి తరువాత దుఃఖమునే కలుగజేయును.

◆ కర్మబంధము నుండి తప్పించుకోవడానికి, జనన మరణాల నుండి విడివడడానికి, పరమశాంతిని పొందడానికి ఆత్మ జ్ఞానం ఎంతో అవసరము. ఏ క్షణమందుమానవుడు, తన యదార్థ స్వరూపమైన ఆత్మను గూర్చి తెలుసుకుంటాడో, ఏ క్షణమందు వానికి బ్రహ్మానుభూతి కలుగుతుందో అప్పుడే కర్మరాశి అంతా భస్మమైపోతుంది.

◆ మనము జీవించులోకము స్థిరమైనది కాదు. యవ్వనము మధ్యలోనే వచ్చి, మధ్యలోనే పోవునది. ధనము స్థిరమైనది కాదు. దారాపుత్రాదులు మధ్యలోనే ఆవరించి, మధ్యలోనే విడిపోవు వారే. పెండ్లికి పూర్వము భార్య ఎవరు? భర్త ఎవరు? ఎవరికి తెలియదు. మధ్యలో వచ్చి మధ్యలోనే

ఒకరికొకరికి వియోగం సంభవిస్తుంది. బిడ్డలూ అంతే పుట్టుక పూర్వకము తల్లి ఎవరు? బిడ్డ ఎవరు? పుట్టిన తరువాతనే ఈ విధమైన సంబంధ బాంధవ్యాలు కలిగి వుంటాయి. ఇవన్నీ అస్థిరములే. మరి స్థిరమైనది ఏమిటి? ధర్మము, కీర్తి ఇవి రెండే మానవునికి స్థిరమైనవి.

- ఏకాంత ప్రదేశమున ఆధ్యాత్మిక సాధనలు చేయుట ముఖ్యము. మొక్క లేతగా వున్నప్పుడు కంచె అవసరము. కాని అది పెరిగి పెద్దదయిన తరువాత, పశువులు దానిని పాడుచేయలేవు. ఆ విధముగానే కొన్ని సంవత్సరములు ధ్యానము చేసి స్థిరచిత్తము ఏర్పడిన తరువాత నీవు ఎచ్చట వున్నను, ఎవరితో తిరిగినను, నీ మనస్సులో మార్పుండదు. (శ్రీశారదాదేవి)
- ఇతరుల శ్రేయస్సు కొరకై మన జీవితములో కొంత భాగ మును త్యాగము చేయవలెను. ఆత్మను గూర్చిన దివ్యసందేశ మును ప్రచారము చేయుట జ్ఞానియొక్క లక్షణమైయున్నది. ఈ జీవితము వచ్చును, పోవును. ధనము,కీర్తి, విషయ భోగములు మున్నాళ్ళ ముచ్చట్లు. ప్రాపంచిక కీటకమువలె చనిపోవుటకంటే సత్యమగు భగవంతుని గూర్చి ప్రచారము చేయుట నుండ వలయును. (శ్రీ వివేకానందస్వామి)
- భౌతిక సంపదలను, యవ్వన బలమును, బంధుజాలమును జూచి అజ్ఞాని మహదానందపడుచుండును. కాని అవియ న్నియు మున్నాళ్ళ ముచ్చట్లేయగును. కడకు అతనిని దుః ఖముల పాలు చేయుచున్నది. చిల్లికుండలోని నీరువలె ఆయువు క్షణక్షణము క్షీణించిపోవుచున్నది. దృశ్య సంపద నంతటిని కాలము ఒక్క క్షణములో గ్రహించి వేయుచున్నది. ప్రపంచము యొక్కయు, శరీరము యొక్క నశ్వరత్వమును



చక్కగా గుర్తెరిగి జనులు వివేక వంతులై దుఃఖరాహిత్య మును, పూర్ణశాంతి సుఖములను పొందవలెను.

- మానవులకు సువర్ణాది నిర్మిత ఆభరణములు, అలంకార ములు గావు. వారి సత్ ప్రవర్తన, వారి త్యాగశీలత్వము, వారి నిర్మల దైవభక్తి, వారి పరోపకార భావన, ఇవియే వాస్తవము లైన అలంకారములు. ఇవి జీవునకు పరిపూర్ణమైన శాంతిని, ఆత్మానందమును జన్మరాహిత్యమును కలుగజేయును. కావున ఇట్టి సుగుణములను సంపాదించుకొని, సర్వేశ్వరుని యొక్క అనుగ్రహమును పొందవలసియున్నది.
- ఒక చిన్న రంధ్రము పెద్ద పడవను ముంచివేయును. ఒక చిన్న దుర్గుణము మానవుని జీవితమునకు కళంకము తెచ్చును.
- దైవముయెడల పెద్దల యెడల, గురువు యెడల వినయ విధేయతలు కలిగి, అందరినీ ప్రేమతో చూస్తూ చేతనయి నంత వరకు పరప్రాణికి ఉపకారము చేస్తూ ఆధ్యాత్మిక నియ మాలు ఏర్పాటు చేసుకొని, వాటిని చక్కగా ఆచరిస్తూ జన్మను సార్థకము చేసుకొనవలసియున్నది.
- ఈ లోకానికి వచ్చినపుడు పుట్టుకతోపాటు చావు అనునది కూడా వెంట వచ్చినదే. చనిపోతామని అందరికి తెలుసు. దానిని గురించి, దిగులు దుఃఖం అనవసరం. మనము చేయవలసినది పుట్టినందుకు ఏదో ఒక మంచిపని చేయాలి. భగద్భక్తి, గురువునందు దేవునియందు విశ్వాసము గలిగి దైవ కృపకై పాటుపడాలి.
- దేవాలయమును ప్రతిరోజు కడిగి శుభ్రము చేయుచు పవిత్రముగ వుంచునట్లు శరీరమును మనస్సునూ గూడా నిర్మలముగా వుంచుకోవాలి. రాగద్వేషాలకు, కామక్రోధా

దులకు హృదయములో చోటీయరాదు.

- మోక్ష సాధనమునందు భక్తి చాలా ప్రధానమైనది, సులభమైనది. భక్తియను తైలముండిన, జ్ఞానమను జ్యోతి ప్రకాశించును. భగవంతుని యెడల అనన్యమైన భక్తిగల వారికి, ఆ భగవంతుని దివ్య అనుగ్రహముచే మాయ పటాపంచలై పోవును.

- అమూల్యమైన మానవజన్మను పొందిన జీవుడు తన భౌతిక సంపదలను చూసి మురిసిపోక, ఆధ్యాత్మిక సంపదయను, సుగుణములను, పుణ్యమను ధనమును జ్ఞానమను ధనమును సంపాదించుటకు కృషి సలుపవలసియున్నది.

- దుర్గుణములలో ఆశ చాలా చెడ్డది. ఆశకలవారికి అశాంతి కలుగుచుండును. ఆశకలవాడు అందరి కంటె గొప్ప దరిద్రుడనియు, ఆశలేనివాడు అందరికంటే గొప్ప ధనవంతు డనియు శ్రీ శంకరాచార్యులవారు పేర్కొనిరి. ఎక్కువ ఆశకలిగి యున్నచో మనస్సు చంచలత్వము కలిగియుండును. చంచల మనస్సు కలవానికి, ఆత్మజ్ఞానముదయించదు. ఆత్మజ్ఞానములేనివారికి పూర్ణ శాంతి లభించదు. కాబట్టి శాంతిని కోరువారు, ఆత్మానుభూతిని పొందగోరువారు ఆశను వదలవలయును.

- ఆధ్యాత్మిక మార్గములో సోమరితనానికి తావే లేదు. సాధకుడు గురు వాక్యాన్ని, శాస్త్రవాక్యాన్ని చక్కగా పరిపాలిస్తూ, ఆయా బోధలను ఆచరణయందుంచుతూ సత్ఫలితాలను పొందాలి. ఊరకే కూర్చుంటే కొంతకాలానికి మృత్యువు వస్తుందేకాని మోక్షం రాదు. కాబట్టి వివేకవంతుడు భగవద్భక్తి గలిగి వైరాగ్యము శమదమాధి సాధనలను పట్టుదలతో ఆచరించి, ఆత్మానుభూతి పొంది జీవితాన్ని ధన్యము చేసుకోవాలి.



- మానవుడు సర్వదా సుఖదుఃఖాలతో ముడిపడివుంటాడు. ఈ శరీరం పాప పుణ్యమిశ్రమ కర్మవలన వచ్చింది. కాబట్టి సుఖదుఃఖాలు అనుభవించి తీరవలసిందే ఎవరికైనా సుఖం తరువాత దుఃఖం, దుఃఖం తరువాత సుఖం కలుగుతుంది రాత్రి పగలు మాదిరి. జీవులకిది తప్పదు. కాబట్టి సాధకుడు వాటికి జంక కుండ ఆధ్యాత్మిక సాధనలో ముందుకు పయనించాలి తప్ప వెనుకంజ వేయరాదు.

- మహాత్ముల యొక్క సాంగత్యము వలన ప్రపంచము యొక్క వాస్తవస్థితి జీవునకు గోచరమగును. ఏది సత్యమో, ఏది అసత్యమో తెలియబడుతుంది. కాబట్టి ముముక్షువు పెద్దల యొక్క సాంగత్యము చేయుచు వారి సన్నిధానమున తత్త్వమును బాగుగా తెలుసుకొని దైవముయెడల తీవ్రతర ఆసక్తి గలవాడై పవిత్రమైన మానవ జీవితమును సార్ధక మొనర్చుకొనవలెను. పెద్దల యొక్క సాంగత్యమున తన హృదయములో వెలగుచున్న పరమాత్మను గూర్చిన విజ్ఞానము గలవాడై మనస్సును బహిర్ముఖమునుండి మరల్చి అంతర్ము ఖము చేసుకొని, ఆత్మయందులయింపజేయవల యును. మోక్షమున కిదియే ఏకైక మార్గము.

- పూజలలో కెల్ల ఉత్తమపూజ యితరులకు ఉపకారము చేయుట, నీకున్నది నీవు తిను, కాని దానిలో కొంతభాగము ఒక ప్రాణికి సహకరించుటకు ఉపయోగించు. లోభత్వము వదలిపెట్టు. ఒకరి బాధ నీ బాధగాతలంచు. నీవు సుఖముగా, సంతోషముగా ఆనందముగా, శాంతిగావుండాలనుకొంటావు. ఎదుట వ్యక్తి కూడా అలాగే వుండాలని కాంక్షించు. ఈ విధముగా సద్గుణాలనే పూలతో పూజించు. అదే ఉత్తమ పూజ. విశేష పూజ. దానికే అధిక పలితం. అట్టి సద్గుణాలనే పూలతో

భగవంతని పూజించు.

దుర్గుణాలనే ధూళిని దులిపి, దేహమనే దేవాలయమును పవిత్రముగా ప్రశాంతముగా వుంచుకోవాలి. ఇట్టి పరమ పవిత్రమైన సద్గుణాలను అవలంభించుట ద్వారా పరమాత్మను పొందగలుగుతాము.

- కష్ట సమస్యలు వచ్చినపుడు బాగా ఆలోచించి, సజ్జనుల సలహాలు తీసుకొనిన తరువాత నిశ్చయముగా పరిష్కరించుకొనుము. నీ తల్లిదండ్రులు, గురువుల, పెద్దల యొక్క సలహాలను, సూచనలను పాటించుము.
- పూలమాలతో చేరడం వల్ల దారం కూడా గౌరవం పొందినట్లు సజ్జన సహవాసము వల్ల గౌరవింపబడతారు.
- సూర్యుడు ప్రతిరోజూ ఉదయిస్తూ అస్తమిస్తూ వుంటాడు. కాని జ్ఞానసూర్యుడు ఒక్కసారి ఉదయిస్తే మరల హస్తమించడు. పరమాత్మ జ్ఞానము శాశ్వతమైనది. అది ఎన్నటికి నశించదు.
- చేసిన ఉపకారము మరచేవాడు, ఇచ్చిన దానితో తృప్తిపడనివాడు, శక్తి వుండి కూడా ఇవ్వనివాడు పాపకర్ములవుతారు.
- భోగాలకు ఖర్చుచేసి రోగాలను కొనితెచ్చుకోకు. మంచి పనులకు ఖర్చుచేసి పుణ్యాన్ని సంపాదించుకో. ఆ పుణ్యమే నిన్ను కాపాడగలదు. నిదానముగా ఆలోచించి మాట యివ్వుము. ఇచ్చిన మాటను పాటింపుము.
- పదవుల కొరకు ప్రాకులాడుటకంటే పరమాత్మ కొరకు ప్రయత్నించు శరీర సౌందర్యము లేదని బాధపడవద్దు. మనో బలము కావాలని మనసారా ప్రార్థించు.
- దేవుని పేరు సత్యము, ప్రేమయే దేవుడు. ప్రేమగలవాడు దేవునిలో జీవించువారే యగుదురు.



- మానవుడు అజ్ఞానిగా పుట్టినా జ్ఞానిగా మరణించాలి. ఏడుస్తూ జన్మించినా, నవ్వుతూ శరీర పరిత్యాగం చేయాలి.
- శ్రీ ఆదిశంకరాచార్యులవారు తన ఎనిమిదవ సంవత్సరములోనే నాలుగు వేదాలు పూర్తిచేశారు. 12వ ఏట వేదాంగాలన్నిటిని తెలుసుకున్నారు. 16వ ఏట భాష్యాలరచన పూర్తి చేశారు. 32వ ఏట శివసాయుజ్యం పొందారు.
- ధర్మాన్ని ఆచరించేవారు దీర్ఘాయుష్షును, కోరిన కోరి కలను, ధన సంపత్తిని కలిగి వుంటారు. ఆచారం అన్ని అవలక్షణాలను, దోషాలను పోగొడుతుంది.
- ఇక్కడనుండి ఏదో ఒక రోజున పోకతప్పదు. పోయేనాటికి కొంత మంచిని మూటగట్టుకొనిపో, పరలోకములో సహాయపడుతుంది. ఇక్కడ నీవెన్ని మూటలు గట్టినా ఇందులో చిల్లి గవ్వకూడా నీ వెంటరాదు.
- ఈ ప్రపంచములో ఏది మనది అని ప్రాకులాడు తున్నామో అది మన స్వంతం ఏనాటికి కాదని మన వారే మనకు గుర్తు చేస్తారు. ఈ జీవుడు పోయేటప్పుడు నా వారు అనుకునే వారు వెంటరారు. యమదూతలు ఎప్పుడు ఎలా వచ్చేది, ఎక్కడికి తీసుకొని వెళ్ళేది ఎవరికి తెలుసు, ప్రాణం పోయిందని ఏడవడం తప్ప బంధువులు, స్నేహితులు, భవనాలు సంపదలు, కీర్తి ప్రతిష్టలు అన్నీ మరణంతో మనలను విడిచి పోతాయి. మనము చేసిన పాపపుణ్యాలే మనలను వెంబడించును.
- కర్మ కారణంగా ఈ శరీరం ఏర్పడింది. పూర్వజన్మ సుకృత, దుష్కృత కర్మవలన సుఖదుఃఖములు ఏర్పడతాయి. జన్మాంతర సంస్కారమును బట్టి జీవునికి సుఖదుఃఖాలు ముందే నిర్ణయ మౌతాయి. దేవతలైనా ఈ కర్మ గతిని తప్పించు

కోలేరు. జీవుడు దేహాన్ని ఆశ్రయించుకొని వుంటాడు. దేహము కాలానికి కట్టుబడి వుంటుంది. గుణకర్మలకధీనుడైన దేహ ధారి విధిచేత కీలుబొమ్మలవలె తిరుగుతూ వుంటాడు. అందుకే యిది పెద్ద మాయ.

◆ తల్లికి పిల్లల మీద వుండే వాత్సల్యం. భార్యకు భర్తమీద వుండే అనురాగం. పిసినారికి ధనం మీద వుండే వ్యామోహం. ఈ మూడు ఆకర్షణలు కలిస్తే ఎంత ప్రేమ వుంటుందో అంత ప్రేమ భగవంతుని మీద చూపాలి. అప్పుడే భక్తివున్నట్లు. (శ్రీరామకృష్ణ పరమహంస)

◆ ధనాశ పెరిగే కొద్దీ మంచి గుణాలు తరిగిపోతూ వుంటాయి. ధనము పెరిగే కొద్దీ కూడబెట్టుకోవాలనీ బుద్ధి కూడా పెరుగుతుంది. ధనముతోపాటే హృదయము కూడా గట్టిపడి పోతుంది. కావున భగవంతుడిచ్చిన దానితో తృప్తిని పొందాలి. అప్పుడే నీకు శాంతి కలుగుతుంది. (యోగవాసిష్ఠం)

◆ నిత్య జీవితములో ధనం కొరకు ప్రాకులాడుతూ ఆలయానికి వచ్చినప్పుడు మాత్రం మోక్షం కోరడం ఆత్మ వంచనే. (శ్రీ షిర్డి శాయిబాబా)

◆ 1) నిష్కామకర్మాచరణ 2) నిర్మల హృదయము 3) మనస్సును జయించడము 4) ఇంద్రియాలను అదుపులో వుంచుకొనుట 5) అన్ని జీవులను సమముగా చూచుట. ఇవి జ్ఞాన లక్షణాలు. ఈ అయిదింటిని ఆచరిస్తే కర్మ విముక్తి అవుతుంది. (భగవద్గీత)

◆ నీకు యితరులు యిచ్చిన దానిని పంచుతుంటే మరల నీకు యితరులు యిస్తూ వుంటారు. పదిమందికి పంచవలసిన దానిని దాచుకుంటే ఇక నీకు దాచుకొనటకు ఏమీ మిగలదు.



◆ మానవ జీవితము శాశ్వతమైనది కాదు. కనుక ఎప్పుడో వృద్ధాప్యమున ధర్మము ఆచరించవచ్చునని వాయిదా వేయకు. ఎవరికెప్పుడు మృత్యువాసన్నమగునో ఎవరికి తెలుసు?

◆ ధర్మాన్ని గురించి మృధువుగా మాట్లాడుము. దాన గుణము, దేవతా పూజ, అతిథుల పూజ ఈ నాలుగు స్వర్గముల నుండి భూలోకము వచ్చినవారి గుర్తులు.

◆ ఏకొందరో ఎన్నో జన్మల పుణ్య విశేషము వలన సద్గురువును పొంది, దైవకృపతో, శాస్త్ర పరిచయముతో అంతఃకరణ శుద్ధితో, తీవ్ర పురుష ప్రయత్నముతో, ఆత్మజ్ఞానముతో, ఎన్నో జన్మల నుండి పాతుకుపోయిన సంసార వృక్షమును కూకటి వేరులతో పెకలించి వేసి మోక్షమును పొందుచున్నారు. అందుకే శ్రీకృష్ణ పరమాత్మ నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే అని చెప్పినారు. జ్ఞానమునకు సమానమైనది, పవిత్రమైనది. మోక్షసాధనమైన సాధనము ఇంకొకటి లేదు. అట్టి జ్ఞానమును సద్గురువులను ఆశ్రయించి, వారిని ప్రసన్నము జేసుకొని, వారి నుండి తెలుసుకొనవలెనను.

◆ ముముక్షువగువాడు సద్గురు సన్నిధికి వెళ్ళి వారి సేవ చేయుచు, వారి వద్ద ఉపదేశమును గ్రహించినచో చీకటింటిలో దీపముంచిన, చీకటి ఎట్లుపటాపంచలైపోవునో అట్లే హృదయాంత రాళమున వుండు అజ్ఞానమనే తమస్సు మాయమై పోవును

◆ నీకున్న చదువు, నీకు తెలిసిన జ్ఞానము పదిమందికి పంచిపెట్టడములో ఉపయోగిస్తే, నీవు తరించి, మిగిలిన వారిని తరింపజేసినవాడవవుతావు. విద్యాదానమునకు మించిన దానము లేదు. అది ఎవరూ దొంగిలించలేరు. ఎక్కడకు వెళ్ళినా స్నేహితుడు లాగా కాపాడుతుంది.

- ఆత్మజ్ఞానమునకు నాలుగు ఆటంకములు కలవు. 1) విద్యాగర్వము 2) ధన గర్వము 3) కులగర్వము 4) అధికార గర్వము. ఈ గర్వములు గలవారు దైవమును చేరజాలరు.
- చేసిన పని మంచిదైనా, చెడ్డదైనా దాని ఫలితము తప్పక అనుభవించతీరవలసిందే. కొన్ని వందల సంవత్సరాలైనను, కొన్ని జన్మలకైనను కూడా తాను చేసిన కర్మఫలమును అనుభవింపక తీరదు. ఎన్ని సంవత్సరములకైనను కర్మఫలము అనుభవించిన తరువాతనే నశించును. పాపకర్మగాని పుణ్యకర్మగాని ఫలితము తప్పక అనుభవించతీరవలసిందే. ప్రతి పనికి తగిన ఫలితము దైవము నిర్ణయించియుండును. అనుభవించక ఎవరు తప్పించుకొనలేరు.
- ఆశకు అవధి వుండదు. సుఖమునకు మూలము సంతోషమే. అందుచేతనే జ్ఞానులు, పండితులు, సంతోషమునందే దృష్టి గలిగి యుందురు. అనగా దుఃఖమునకు మూలము దురాశ. సుఖమునకు మూలము సంతోషము.
- ధైర్యము, ఓర్పు, శాంతి, దొంగతనము చేయకుండుట, పరిశుభ్రత ఇంద్రియ నిగ్రహము, బుద్ధి పటిమ, విద్య, సత్యము, క్రోధము లేకుండుట ఈ పది గుణములు ధర్మగుణములు. వీనిని గల్గినవాడుధర్మాత్ముడు.
- హోమము లేక యజ్ఞము, నూతన గృహము, పుణ్యక్షేత్రము, మిత్రుడు, శిశువు రాజు, దేవత, గురువు - వీరి వద్దకు వెళ్ళునపుడు వట్టి చేతులతో వెళ్ళరాదు. అనగా ఏదైనాతన శక్తి కొలది, పూవుగాని, పండుగాని తీసుకొనివెళ్ళవలెను.
- వాగ్ధాటితో సమయస్ఫూర్తిగా మాట్లాడలేని వాని విద్యయు, లోభి వాని ధనము, పిరికివాని బాహుబలము భూమియందు వ్యర్థములు.



- మహామేధావియైన వ్యక్తికి అల్ప ఆయువు గాని, కఠిక పేదరికము గాని, సంతానము లేకుండుట గాని ఏదో ఒకటి తప్పని సరి. మహా మేధావుల జీవితాలు పరిశీలించినచో, చిత్ర విచిత్రముగా అంతమగుచుండును. ఊహింపలేని సంఘటనలతో లేక పేదరికముతోనో లేక మానసిక వ్యధల తోనో ముగియు చుండును.
- పొగరబోతులు, మూర్ఖులు, కోపిష్టులు, తొందరపాటు స్వభావము గల వారు ధర్మమును పాటించనివారు మొదలైన వారితో తెలివిగలవాడు స్నేహముచేయగూడదు.
- పసిపిల్లవాడు తనచేతి బొటనవ్రేలిని నోటిలో పెట్టుకొని, లాలాజలమును సప్పరిస్తూ, తల్లిపాలు త్రాగుచున్నట్లుగా భ్రమిస్తాడు. అట్లే మానవులు సారము లేని సంసారమున ఏదో సుఖమున్నదని భ్రాంతిపడతారు. మానవ జీవితము అంతా ఒక మిధ్య లేక కల లాంటిది. సగం జీవితం నిద్రలో గడిచిపోతుంది. మిగిలిన సగం జీవితం ఏదో సాధించాలని కలలు కంటాడు. వృద్ధాప్యంలో దైవచింతనపై ఆలోచనగల్గి, ముక్తి మార్గమును పొందుటకు ప్రయత్నించనిచో ముక్తిని పొందలేడు.
- వేయి యాగములు చేసిన ఫలము, వందవాజపేయీ యజ్ఞముల ఫలితము, లక్ష పర్యాయములు భూప్రదక్షణ చేసిన ఫలితము, ఒక పర్యాయము కుంభమేలా సమయమున స్నానము చేసిన పొందగలడని విష్ణు పురాణమునందు తెలుప బడినది. కుంభమేల 12 సంవత్సరములకు ఒక పర్యాయము వచ్చును. జీవనదుల యందు మాత్రమే కుంభమేల జరుగును. మధ్య ప్రదేశమందుగల క్షిప్రానది యందును, ఉత్తరప్రదేశ్ అలహాబాద్ నందుగల (గంగ, యమున, సరస్వతి కలిగియున్న స్థలమున) త్రివేణి సంగము నందును మరియు హరిద్వార మున గంగానదియందును నాసిక

యందుగల గోదావరి నది యందును కుంభమేలా జరుగును. ఉత్తరదేశమున కుంభమేలా యనియు, దక్షిణ దేశమున పుష్కరమనియు చెప్పబడును.

- ఎప్పుడు సంపద కలిగియుండుట, ఎల్లప్పుడు ఆరోగ్యముగా నుండుట. యిష్టమైన భార్య, ప్రియముగ మాట్లాడు భార్య, తల్లిదండ్రుల మాట జవదాటని కొడుకు, అర్ధవంతమైన విద్య (అనగా ధన సంపాదనకు అనువైన విద్య మరియు మోక్షమున ఉపయోగకరమగు విద్య, ఈయారును నిరంతర సుఖదాయ కములు.
- శాస్త్రములు అనేకములు, తెలిసికొన విషయము అనంతము. కాలము చాలా తక్కువ. విఘ్నములు అధికము. కావున సారవంతమైన విషయములను మాత్రమే మనము గ్రహించవలెను. హంస నీళ్లతో కలిసిన పాలను మాత్రమే గ్రహించి నీటిని వదలి వేయునట్లు, ముఖ్యమైన వానిని మాత్రమే గ్రహించి జీవితమును సార్థకము చేసుకొనవలెను.
- విద్వాంసుడు స్థిరమైన సంపదను, లేక కీర్తిని పొందవలెనంటే అగ్ని శేషమును, ఋణశేషమును, శత్రుశేషమును మిగల్చరాదు. అగ్నిని నిర్లక్ష్యముగా వదిలినచో ఆ చిన్న నిప్పురవ్వయే మహా అగ్నిగా తయారై సర్వమును నాశనము చేయును. అట్లే అప్పు కొలదిగానైనను మిగిలినచో వడ్డీకి వడ్డీ అధికమై సర్వమును హరించును. శత్రువు కూడా క్షుద్రుడు వీడేమి చేయునని నిర్లక్ష్యముగా వదిలినచో, వాని వలన ప్రాణహాని కలుగును. అందుచే పెద్దలు, అగ్నిశేషము, ఋణశేషము, శత్రు శేషము వుండకూడదని చెప్పుదురు.
- పరిశుద్ధ జలముచే శరీర అవయవములు శుద్ధినొందును. సత్యముచే మనస్సు శుద్ధియగును. విద్యా తపస్సులచే అంతః కరణము శుద్ధియగును. జ్ఞానముచే బుద్ధి పరిశుద్ధమగును.



- వృద్ధులకు (పెద్దలకు) నమస్కరింపవలెను. స్వయముగా ఆసనమునిచ్చి కూర్చుండబెట్టవలెను. పెద్దల వెనుకనే అనుసరించి వెళ్లవలెను. పెద్దల పాదములకు నమస్కరించి సేవింపవలెను. ఇట్లు ఆచరించినవాడు అభివృద్ధిని పొందును.
- యాచింపకయే సర్వద్రవ్యములు వచ్చును. కాని అన్నముగాని, విద్యనుగాని కన్యనుగాని యాచింపనిచో ఈయకూడదు.
- పెద్దలు కనబడిన వెంటనే నమస్కారము చేయు అలవాటు గల వారికి, మరియు నిత్యము వృద్ధులకు సేవచేయు స్వభావము గలవారికి, ఆయువు, విద్య కీర్తి, బలము ఈ నాలుగు వృద్ధి పొందును.
- తన యింటికి అతిథిగా వచ్చిన శత్రువునైనను ఆదరించవలెను. వృక్షము తనను నరుకుటకువచ్చిన వానికి సైతం నీడ నిచ్చు చున్నది గదా.
- ధన నాశమును, మనోవ్యధను, గృహము నందలి చెడు ప్రవర్తనను వంచనమును, అనగా మోసగింపబడుటను, అవమానమును, తెలివిగలవాడు ఇతరులకు చెప్పరాదు.
- విష్ణువు అలంకారము చేతను, శివుడు అభిషేకము చేతను సూర్యుడు నమస్కారము చేతను ప్రీతినొందుదురు.
- ఆరోగ్యము, పాండిత్యము, సజ్జన సాంగత్యము, గొప్ప వంశమున జన్మించుట, ఇంద్రియ నిగ్రహము. ఇవియున్న వాడు డబ్బు లేకున్నను గొప్ప ఐశ్వర్యవంతునితో సమానము.
- కాళ్లు కడుగుకొని శుద్ధుడై భుజించిన నూరు సంవత్సరములు జీవించును. కావున తడికాళ్లతో భుజింపవలెను. కాని తడికాళ్లతో పరుండరాదు.
- ఆరోగ్యము కొరకు సూర్యుని, సంపద కొరకు అగ్నిని, లక్ష్మీదేవిని జ్ఞానము కొరకు ఈశ్వరుని, మోక్షము కొరకు విష్ణువును

ధ్యానింపవలెను.

- ఆశకు దాసులైనవారు అందరికి దాసులగుదురు. ఆశ ఎవరికి దాసియగునో వారికి అందరు దాసులగుదురు.
- ఆయువును, ధనమును, ఇంటి కలతను, మంత్రమును, తపస్సును అవమానమును తెలివిగల వ్యక్తి ఇతరులకు చెప్పరాదు. అనగా చెప్పదగిన వారికే చెప్పవలయును.
- ఇంద్రియ నిగ్రహముచేతను రాగద్వేషములు లేకుండుట చేతను, ప్రాణిహింస చేయకుండుట చేతను మానవుడు మోక్షము పొందగలడు.
- యాగములు చేయుట, వేదాధ్యయనము, దానము, తపస్సు సత్యము, ధైర్యము, ఓర్పు, లోభము లేకుండుట. ఈఎనిమిది ధర్మ మార్గములని చెప్పబడుచున్నవి.
- ప్రయత్నము, సాహసము, ధైర్యము, బుద్ధి, శక్తి, పరాక్రమము ఈ ఆరు ఎచటవుండునో అచట దేవుడు సహాయపడును.
- ఉద్యోగము వలనను, ఏదైనా జీవనాధారమునకు వ్యవసాయము, వ్యాపారము ఏదైనా చేసిన యెడల భోజనమునకు లోటుండదు. జపము వలన పాపమును, మౌనము వలన కలహమును, జాగ్రతవలన భయమును నివారింపవచ్చును.
- నీచులకు ఉపకారము చేసినను, వారు అపకారమే చేయుదురు. సర్పములకు పాలుపోసినను, వానిలో విషమేగదా అభివృద్ధియగును. నీచులకు అపకారము చేయుటయే వృత్తి. ఉపకారము చేయుట ఎరుగరు. పాము ఏ ఆహారము తిన్నను దానిలో విషమే అభివృద్ధియగును.
- క్షణకాలము కోపముగలవాడు ఉత్తముడని, రెండు ఘడియలు కోపముగలవాడు మధ్యముడని, రాత్రి పగలు అనగా 24 గంటలు కోపము గలవాడు అధముడని, జీవితాం తము



కోపము గలవాడు చండాలుడని చెప్పబడుదురు.

- అప్పు చేయు తండ్రి, వ్యభిచారిణియైన తల్లి, దుష్ప్రవర్తనగల భార్య, విద్యాహీనుడగు పుత్రుడు శత్రువులుగా పరిగణింప బడుదురు.
- మధుర పదార్థములను ఒక్కడే భుజింపరాదు. అందరు నిద్రించు సమయమున ఒక్కడే మేల్కొనియుండరాదు. ఒంటరిగా దూరప్రయాణము చేయరాదు. ప్రముఖ కార్యములను గూర్చి ఒక్కడే ఆలోచింపకూడదు.
- మానవుడు ఒంటరిగా జన్మించుచున్నాడు. ఒంటరిగానే మరణించుచున్నాడు. పుణ్యమును ఒక్కడే అనుభవించును. పాపమును ఒక్కడే అనుభవించును. ప్రతిప్రాణికి ఒంటరిగా పుట్టుట, మరణించుట జరుగును. అట్లే పుణ్యముగాని, పాపము గాని, చేసినవాడే అనుభవించును.
- గురువు భార్య, రాజు భార్య, అన్న భార్య, తన తల్లి, భార్య తల్లి (అత్త) ఈ అయిదుగురు తల్లులుగా స్మరింపబడుదురు.
- మహాత్ములైనవారలు దూరమునందున్నను వారి గుణములు సర్వత్ర వ్యాపించి పూజింపబడుచున్నవి. ఎట్లనగా మొగలి పుష్పము యొక్క సువాసనకు దూరము నుండి తుమ్మెదలు వచ్చుచున్నవి గదా.
- గోవులచే, బ్రాహ్మణులచే, వేదవిద్యచే, పతివ్రతలచేతను, సత్యవంతులచేతను, దురాశలేనివారి చేతను, దానగుణము గలవారి చేతను, భూమి నిలిచియున్నది.
- గుఱ్ఱమునకు వేగము అలంకారము. స్త్రీకి సిగ్గు అలంకారము. తపోధనులకు కృశించుట అలంకారము. బ్రాహ్మణునికి విద్య అలంకారము. రాజునకు ఓర్పు అలంకారము. శస్త్ర బలముచే జీవించువారికి (అనగా యోధులకు) పరాక్రమము అలంకారము.

- జన్మనిచ్చినవాడు (తండ్రి) ఉపనయనము చేసినవాడు, విద్యను దానముచేయువాడు (గురువు), అన్నదానము చేయువాడు, భయము నుండి రక్షించువాడు ఈ అయిదు గురును తండ్రులుగా పిలువబడుదురు.
- పరోపకారము వలన ప్రాప్తించు పవిత్రత అనేక పుణ్య తీర్థాలలో స్నానము ఆచరించినను ప్రాప్తించదు. పరోపకారము వలన ప్రాప్తించు పుణ్యఫలము అధిక దానధర్మాదులు చేసినను, ఉగ్రత తపస్సు చేసినను కలుగదు.
- మానవులు చేయబడు పుణ్యముగాని, పాపము గాని, దాని తీవ్రతననుసరించి, మూడు సంవత్సరములలోగాని, మూడు మాసములలో గాని, మూడు పక్షములలోగాని, మూడు దిన ములలో గాని, ఫలితమును ఈ లోకమునందే అనుభవింతురు.
- దయలేని ధర్మమును, విద్వాంసుడు కాని గురువును, కోపముగల భార్యను, ప్రేమలేని బంధువులను వదలవలెను.
- ఇంద్రియనిగ్రహము లేనివాడు ఎంతటి విద్యావంతుడైనను పవిత్రుడు కాడు. వేదములు, వేదాంగములు చదివినను, సాంఖ్య శాస్త్రమునుగాని యోగ విద్యను నేర్చినగాని, ఉన్నత వంశమున జన్మించినను, సర్వతీర్థయాత్రలు చేసినను, సర్వ దేవతాభిషేకములు చేసినను పవిత్రుడు కానేరడు.
- దానము చేయుట, ప్రియముగ మాట్లాడుట. ధైర్య గుణమును, సమయస్ఫూర్తిని గల్గియుండుట అను ఈనాలుగు పుట్టుక తోడేలభించు గుణములు. అభ్యాసము వలన లభింపవు.
- దానము చేయుటచే హస్తములు ప్రకాశించును గాని బంగారు కడియములు ధరించుట వలనప్రకాశింపవు. శరీ రము స్నానముచే పరిశుద్ధమగును గాని, చందన సుగంధ ద్రవ్యములు పూయుటచే శుద్ధికాదు. గౌరవముచే లేక కీర్తిచే



తృప్తి ఏర్పడును. భోజనముచే గాదు. జ్ఞానముచే ముక్తి గలుగును. కాని తలవెంట్రుకలు తీసి గుండుగీసుకొన్నంత మాత్రాన ముక్తి లభింపదు.

- దానముతో సమానమగు ధర్మము మరియొకటి లేదు. భూమి యందు దురాశకు మించిన మరియొక శత్రువు లేదు. మంచి నడవడికకు మించిన అలంకారము మరియొ కటి లేదు. సంతోషమునకు సమానమగు ధనము మరియొ కటి వుండదు.
- దూరముగా నున్నవానికి, జలమధ్యభాగములో నున్నవానికి, పరుగెత్తువానికి, ధనగర్వము గలవానికి, కోపముగలవానికి, అహంకారముతో కూడినవానికి నమస్కారము కూడా చేయ రాదు.
- దేవుని దగ్గరకు గురువు వద్దకు భార్య చెంతకు, వైద్యుని దగ్గరకు, జ్యోతిష్కుని యొద్దకు వెళ్ళునపుడు వట్టి చేతులతో వెళ్లరాదు. అట్లు వెళ్లినచో కార్యము సిద్ధింపదు.
- ధనము ఇచ్చి పుచ్చుకొను విషయములోను, ధాన్యము అమ్ముట కొనుటలోను, విద్యాభ్యాస సముపార్జన యందును, ఆహారము నందును, వ్యవహారము నందును, సిగ్గు, బిడియము వదలి, ఖచ్ఛితముగా ప్రవర్తించినచో సుఖమును పొందగలడు. మొగమాటమును వదలి, నిఖచ్ఛితముగా మాట్లాడవలెను. లేనిచో నష్టపడగలడు. విద్యనేర్చుకొను సమయమందు సందేహములను గురువును గాని,లేక తోడి విద్యార్థులను గాని అడిగి సందేహనివృత్తి చేసుకొనవలెను. సిగ్గుపడిన విద్య రాదు. అటులనే ఆహార విషయమున సిగ్గు పడిన కడుపును మాడ్చుకొ నవలసి వచ్చును.
- దానము చేయని ధనము వ్యర్థము. ధర్మమును ఆచరింపని

వాని యొక్క శాస్త్రజ్ఞానము నిరుపయోగము. ఇంద్రియ నిగ్రహము లేని వానియొక్క ఆత్మజ్ఞానము వ్యర్థము.

- ధీరులకు విద్య అలంకారము. మంత్రులకు రాజు అలంకారము. స్త్రీలకు భర్త అలంకారము. శీలము అన్నిటికి అలంకారము.
- శిరస్సున వెంట్రుకలు నెరసినవాడు వృద్ధుడుకాడు. పిన్న వయస్సు కలవాడైనను, విద్వాంసుడగు జ్ఞానే వృద్ధుడని దేవతలు పిలిచెదరు.
- మొసలి తన నివాస స్థానమైన నీటిలోనున్నప్పుడు ఏనుగును కూడా బంధించును. ఆ మొసలి తన స్థానమును వదలి గట్టుమీదకు లేక భూమి మీదకు వచ్చినచో కుక్కచే పరిహసింపబడును. ఎవరికి గూడా తన స్థానమున నున్న పట్టు మరియొక చోటవుండదు.
- కామముతో సమానమైన వ్యాధి మరొకటి లేదు. మోహము అనగా అవివేకము లేక అజ్ఞానము. మోహముతో సమాన మగు అగ్ని గూడా మరొకటి యుండదు. జ్ఞానము కంటే సుఖము నిచ్చునది వేరొకటి లేదు. అనగా మానవులకు కామమే వ్యాధి. మోహమే శత్రువు. కోపమే అగ్ని. జ్ఞానమే - సుఖము.
- ఋషి కానివాడు కావ్యమును రచించలేడు. రుద్రుడు కాని వాడు వేదపాఠకుడు కాజాలడు. దైవాంశ సంభూతుడు కాని వాడు అన్నదాత కానేరడు. విష్ణువు యొక్క అంశలేనివాడు రాజు కాజాలడు.
- ఆశను వదలనివాడు సుఖమును పొందలేడు. ఆశను వదలనివాడు శాంతిని పొందలేడు. ఆశగలవాడు నిర్భయ ముగా నిదురింపలేడు. ఆశను వదలి సర్వత్ర సుఖమును పొందుము.



- తమకు దగ్గరగా వున్న గొప్పవారియొక్క గొప్పతనమును మానవులు గుర్తింపరు. పవిత్రమైన గంగానది దగ్గర వున్నను జనులు గంగా మహాత్మ్యమున ఎరుగక నమస్కరించుట లేదుగదా.
- సూర్యుని ఉదయించు సమయమున, అస్తమించు సమయ మునను గ్రహణ సమయమున, నీటియందును, ఆకాశ మధ్య యందున్న సమయమునను చూడరాదు.
- చీమలు ఎంతో దూరము నుండి మోసికొని వచ్చి, రంధ్ర ములో ధాన్యమును కూడబెట్టగా వాటిని ఎలుకలు తిని పోవును. అట్లే తేనెటీగలు ఎంతో దూరము తిరిగి తిరిగి పుష్పముల నుండి మకరందమును తెచ్చి, తేనెతెట్టలో నిల్వచేయును. ఆ తేనెను బోయివాళ్ళు కొట్టి తెచ్చుకొందురు. అట్లే లోభియైనవాడు తాను తినక యితరులకు దానము చేయక, సంపాదించిన ధన మంతయు రకరకాల ఖర్చులు వచ్చి ఖర్చు చేయడమో, దొంగలు తీసుకొని వెళ్ళడమో జరిగి అంతులేని ఆవేదనతో బాధపడుట జరుగును. తాను ఎంత సంపాదించినను, తాను తినుచు, నలుగురికి యిచ్చినచో, ఆ సంపద సద్వినియోగము చేసినట్ల గును. అప్పుడు ఇహపర సుఖములను పొందినవాడగును.
- ఎల్లప్పుడు తల్లిదండ్రులకు, గురువులకు సేవచేయుచు, క్షేమ సమాచారములను విచారించుచు, వారి మనస్సులను బాధ పెట్టక, ప్రేమగా చూచుచు, వారికి ప్రియమైన కార్యము లను ఆచరించుచు, ఆ ముగ్గురుని సంతోషపెట్టినచో, తపశ్చర్య ముగిసిన తరువాత ఎంత ఫలితమును పొంద గలడో అంత ఫలితమునే పొందగలడు.
- చీమలు పెట్టిన పుట్టలు పాములకు నిలయమగును. అట్లే లోభి తాను తినకుండా ఇతరులకు దానము చేయక దాచిన

ధనము చివరకు వదలిపెట్టి పోవలసినదే - ఇతరులకు.

◆ వెంట్రుకలను విరబోసికొనునట్టిదియు, విచారింపక, ఆలోచన లేక తనకు యిష్టమగు రీతిలో ప్రవర్తించు నట్టిదియు, ఎల్లప్పుడు భర్త మాటకు ప్రతికూలముగ మాట్లాడునట్టిదియు, పరుల యిండ్లలో తిరుగు స్వభావము కల్గినదియు, సిగ్గులేనిదియు, చెడు గుణములు గల స్త్రీని భార్యగా స్వీకరింపరాదు.

◆ ప్రతి నిత్యము మనము తిను భోజన పదార్థములను ముందుగా దేవునికి సమర్పించి భుజించినచో శక్తి సామర్థ్యములు అభివృద్ధి యగును. దేవునికి సమర్పింపక తిన్నచో, మనలోని శక్తి సామర్థ్యములు నశించి రోగగ్రస్తుల మగుదుము.

◆ ఈ శరీరము మనకు తెలియకనే క్షణ క్షణము క్షీణించుచున్నది. నీళ్ళు గల పచ్చికుండ ఏవిధముగా తెలియకనే శిథిలమై పోవునో ఆ విధముగా శరీరము క్షీణించును.

◆ మానవుడు మొదటిదియైన బ్రహ్మచర్యాశ్రమమున విద్యనభ్యసించవలెను. రెండవదియైన గృహస్థాశ్రమమున ధనమును సంపాదించవలెను. మూడవదియైన వానప్రస్థాశ్రమమున పుణ్యమును సంపాదించవలెను. ఈ విధముగా మూడు ఆశ్రమముల యందు ఆచరించినచో నాల్గవదియైన సన్యాసా శ్రమమున సంపాదించ వలసినదేదియునుండదు.

◆ మానవుడు పొందదగిన సంపదను తప్పక పొందగలడు. దేవుడు గూడా దానిని తప్పించజాలడు. అందుచే మానవుడు ఏదైన నష్టపడినచో దుఃఖించుటగాని, లాభము కలిగినచో ఆశ్చర్యపడి సంతోషపడుటగాని చేయరాదు. నాదియనునది యితరులది కాదు కదా. ప్రాప్తియున్నచో ఫలము తప్పక లభించును. లాభముగాని, నష్టముగాని, సుఖము గాని,



దుఃఖముగాని జరుగవలసినది జరిగితీరును. రావలసినది రాకమానదు. పోవలసినది పోకమానదు యని పెద్దలంటారు.

◆ ప్రాణహాని చేయకుండుట, పరుల ధనము అపహరించుటలో నిగ్రహము కలిగియుండుట. సత్యము పలుకుట. శక్తికొలది దానము చేయుట. పరస్త్రీల విషయమున మౌనము పాటించుట. ఆశను విడనాడుట. గురువులయందు వినయమును పాటించుట. సర్వప్రాణులయందు దయాభావము పాటించుట ఇదియే శ్రేయోవంతుల మార్గము.

◆ దానం, ధర్మం, సత్కర్మనుష్టానం, భగవన్నామోచ్ఛారణ ఆలయ దర్శనం మొదలైన పుణ్యకర్మలను ఆచరించి పాపక్షాళనం చేసుకోవాలి. దానితో జ్ఞానోదయమై ఆనందాను భూతి కలుగుతుంది.

◆ దేవతలను, తల్లిదండ్రులను, మహాత్ములను, సన్యాసులను, అతిధులను పూజించువాడే కీర్తిని పొందగలడు.

◆ బాలునితో సహవాసము, కారణములేని నవ్వు, స్త్రీలతో విరోధము దుర్జనుని సేవ, గాడిద మీద ప్రయాణము, సంస్కారము లేని మాట, ఈ ఆరింటిలో ఏ ఒక్కటియున్నను మానవుడు యితరులకు చులకనకాగలడు.

◆ బాల్యదశయందే తల్లిని పోగొట్టుకొన్నవాడు. ముసలితనమున కుమారులను పోగొట్టుకున్నవాడు, యౌవన వయస్సున భార్యను పోగొట్టుకొన్నవాడు పాపము చేసిన వారితో సమానముగా మిక్కిలి దుఃఖమును అనుభవించినవాడగును.

◆ మానవులు పూర్వజన్మలో చేసిన పుణ్యకార్యములచే, బుద్ధిమంతులు, రూపవంతులు, గుణవంతులు, ఆయుష్మంతులు, విద్యా విశారదులగు కుమారులను పొందగలుగుచున్నారు.

- ఆరు పర్యాయములు భూప్రదక్షిణ చేయుట చేత, పదివేల పర్యాయములు కాశీయాత్ర చేయుటచేత, పెక్కు పర్యాయములు సముద్రస్నానము చేయుట చేత ఎంత పుణ్యము లభించునో అంతటి పుణ్యమును భక్తితో నిత్యము తల్లికి నమస్క రించినచో పొందగలడు.
- మహాత్ములు ఈశ్వరునియందే భక్తిని కలిగియుందురు. కాని ఐశ్వర్యమునందుకాదు. శాస్త్రమునందే వ్యసనము కలిగియుందురు కాని స్త్రీకి సంబంధించిన కామశాస్త్రమునకాదు. కీర్తిని గురించియే ఆలోచింతురు కాని శరీరమును గూర్చి ఆలోచింపరు. మహాత్ములలో ఈ గుణములు కనబడును.
- లోభము అనునది దురాశకు మరోరూపము. దురాశపరుడు ఎంతటి నీచకార్యము చేయుటకైనను వెనుకాడడు. దురాశ గలవాడు తన తల్లినిగాని, తండ్రినిగాని, కుమారుని గాని, సోదరుని గాని, మంచి మిత్రునిగాని లెక్కచేయక చంపుటకు గూడా వెనుకాడడు. దురాశపరుడు మంచి చెడ్డలను ఆలోచింపడు.
- ఉదయము నిద్రలేచిన వెంటనే తల్లిదండ్రులకు నమస్కరింపవలెను. తరువాత గురువునకు, ఆ తరువాత ఇతరులకు నమస్కరించువాడు దీర్ఘాయుష్మంతుడగును.
- పరస్త్రీలను తల్లితో సమానముగాను, పరుల ద్రవ్యములను మట్టితో సమానముగాను, సర్వప్రాణులను తన ప్రాణముతో సమానముగాను ఎవరు చూతురో వారే పండితులనబడుదురు. (పండితుడనగా జ్ఞానము కలవాడని అర్థం)
- తల్లి, తండ్రి మిత్రుడు ఈ మువ్వురు స్వభావ సిద్ధముగా మేలును కోరుదురు. ఇతరులు కార్య కారణముల ననుసరించి హితమును కోరువారుగానుందురు.



- శరీర పోషణకు తల్లితో సమానమైన వారు మరొకరు వుండరు. శరీరమునకు అలంకారము కలిగించుటలో విద్యకు మించిన మరొక భూషణము లేదు. శరీరమును సంతోష పెట్టుటలో భార్యకు మించినవారు లేరు. శరీరమును కృశింపజేయుటలో చింతకు మించినది మరొకటి లేదు.
- తన మాట ప్రకారము ప్రవర్తించు పుత్రుడు. తన అడుగుజాడలలో నడుచు భార్యయు, తనకు ఉన్నదానితో తృప్తిచెందువాడును, భూలోకమునందే స్వర్గసుఖమును అనుభవించునట్టివాడగును.
- తన జన్మధన్యము కావలసియున్నచో, ఏదో ఒక ప్రాణికి, ఏదో ఒక రీతిగా సంతోషమును కలుగు విధముగా సహాయము చేయగలిగినప్పుడే అతడు తెలివిగలవాడగును. ఆ పరోపకారమే నిజమైన దైవపూజ.
- ఎవడు హంసలకు తెల్లదనమును సృష్టించెనో, చిలుకలకు ఆకు పచ్చ రంగు సృష్టించెనో, నెమళ్ళకు చిత్ర విచిత్రములగు నానా విధములగు వర్ణములు గల ఈకలను సృష్టించెనో ఆదేవ దేవుడే పుట్టుకతోడనే ప్రతి జీవికి జీవనాధారమును నిర్ణయించి సృష్టించినాడు.
- ఎవనికి విద్య, తపస్సు, దానము, జ్ఞానము, శీలము, గుణము, ధర్మము వీనిలో ఏదో ఒక గుణమైనను లేదో వాడు భూమికి బరువు కాగలడు. అట్టి వ్యక్తి మానవలోకమునందు మనుష్య రూపమున సంచరించు మృగముతో సమానుడగును.
- తులసి చెట్టు మూలభాగమున, అనగా వ్రేళ్ళయందు సర్వ తీర్థములును మధ్యభాగమున సర్వదేవతలును, చివరి భాగమున (అగ్రభాగమున) సర్వవేదములును గల్గియున్నట్లు శాస్త్రములు చెప్పుచున్నవి. అటువంటి తులసిమాతకు నమస్కారము.

- కమలములకు ఎర్రదనము, సజ్జనులకు పరోపకారము, దుర్జను లకు నిర్దయ స్వభావ సిద్ధ గుణములు.
- ముసలితనము రూపమును, ఆశ సుఖములను, దుష్టుల సేవ పురుషుని యొక్క అభిమానమును, యాచించుట గౌరవ మును, తన్ను తాను పొగడుకొనుట మంచి గుణములను, చింత బలమును, నిర్ధయ లక్ష్మిని పోగొట్టును.
- పుత్రుని అయిదు సంవత్సరముల వరకు గారాబముతో రాజ కుమారునివలె పెంచవలెను. తరువాత 15 సంవత్సరముల వయస్సు వచ్చునంత వరకు దాసునివలె నిర్దాక్షిణ్యముగ శిక్షణ యివ్వవలెను. పదునారు సంవత్సరముల నుండి మిత్రునివలె భావించవలెను.
- మహాత్ములైన వారి మాట, మనస్సు, కర్మ అనువాటి మూడిం టిలో ఒకే విధముగా ప్రవర్తింతురు. దుర్మాత్ములైన వారలు, మాటలో వేరుగా, మనస్సులో మరొక విధముగా, కర్మ చేయునపుడు వేరే విధముగా ప్రవర్తింతురు.
- దేశాంతరమున విద్యయే మిత్రుడు. గృహము నందు భార్యయే మిత్రము, రోగికి ఔషధమే మిత్రము. మరణించినవానికి ధర్మమే మిత్రము.
- ఈ ప్రపంచమున విద్యయనే తీర్థమునందు పండితులును, సత్య మను తీర్థమున సాధువులును, గంగాతీర్థమున మలిన మనస్సు గలవారు మునిగి మాలిన్యమును ప్రక్షాళన గావించు కొనుచున్నారు.
- వందపనులున్నను వదలి ముందుగా ఆహారమును స్వీక రించవలెను. వేయి పనులున్నను వదలి స్నానము చేయ వలెను. లక్ష పనులున్నను వదలి దానము చేయవలెను. కోటి పనులున్నను వదలి హరిని స్మరించవలెను. ఆహారము



లేనిచో ఏ పని చేయ జాలడు. హరిస్మరణము ప్రధానమని భావము.

- వందమందిలో ఒకడు శూరుడువుండును. వేలమందిలో ఒకడు పండితుడుగాను, పదివేలమందిలో ఒకడు మంచి వక్తగా జన్మింపగలడు. కాని దాత జన్మింపగలడో లేదో చెప్ప సాధ్యము గాదు. అనగా దాన గుణముగల వ్యక్తి అరుదుగా జన్మించును.
- ఆపదకాలమున వెంట వుండి సహాయము చేయువాడే మంచి మిత్రుడగును. తల్లిదండ్రుల యందు ఎల్లప్పుడు భక్తిభావముతో మెలగువాడే పుత్రుడనబడును. యజమాని మాట ప్రకారము నడచుకొనుచు, యజమానిని కంటికి రెప్పవలె విధేయుడుగా నుండువాడే సేవకుడనబడును. భర్తను అన్ని వేళలలో దగ్గరుండి సుఖశాంతిని గల్గించి, సంతో షముతో సేవచేయు స్త్రీయే భార్య అనబడును.
- సర్వయజ్ఞములయందు చేయు దానము గాని, సర్వతీర్థ స్నానమువలన కలుగు పుణ్యము గాని, సర్వదానముల వలన గలుగు ఫలముగాని, అహింసావ్రత ఫలముతో సమానములు గానేరవు.
- దానము చేయుట వలన ధనవంతుడుగా పుట్టును. ధన మున్న ప్పుడు పుణ్యకార్యములు చేసి పుణ్యమును సంపాదించ వచ్చును. పుణ్యఫలముచే స్వర్గలోకమును పొందును. మరల ధనవంతు డుగా జన్మించి, పుణ్య కార్యములను చేసి సుఖిం చును.
- గుణవంతుల సహవాసముచే నీచుడు గూడా గౌరవింపబడు చున్నాడు. పూలమాలలో చేరియుండుట వలన దారము మహాత్ముల శిరస్సు నధిరోహించుచున్నది గదా.

- లోకమున గుణవంతులగు జనులే తరచుగా బాధలననుభవించుచున్నారు. గుణహీనులు సుఖముననుభవించుచున్నారు. చిలుకలు పంజరమున బంధించుచున్నవి. కాకులు స్వేచ్ఛగా విహరించుచున్నవి.
- అరగదీయుకొలది గంధపు చెక్క అధికముగ సుగంధమును వెదజల్లును. చెరకు ముక్కలు ముక్కలుగ గానుగలో వేసిన రసము తియ్యనగును. వేడిచేయగా చేయగా బంగారము యొక్క కాంతి అధికమగును. సజ్జనులగువారు ఎన్ని ఆపదలు సంభవించినను, ప్రాణము పోవు సమయమున కూడా స్వభావ సిద్ధమగు మంచితనమును వదలరు.
- సజ్జన సాంగత్యమును వదలుకుము. దుర్జన సహవాసము వదులుము పుణ్యకార్యములనే చేయుము. దైవమునే ఎల్లప్పుడు స్మరింపుము.
- దానముచే ఐశ్వర్యవంతుడుగాను, వృద్ధులకు సేవచేయుటచే మేధావిగాను, అహింసచే దీర్ఘాయువు గలవాడుగాను అగుదు రని బుద్ధిమంతులు చెప్పుచున్నారు.
- ధర్మమునందు ఆసక్తి, మాటలయందు తియ్యదనము. దానము నందు ఉత్సాహము. మిత్రుని యందు వంచన చేయకుండుట. గురువునందు వినయము, మనస్సునందు గాంభీర్యము, ఆచారమునందు పరిశుభ్రత, గుణముల యందు ఆసక్తి, శాస్త్రమునందు జ్ఞానము గలిగియుండుట, రూపమునందు సౌందర్యము గల్గియుండుట. విష్ణువునందు భక్తిగలిగి యుండుట అను ఈ గుణములు సజ్జనుల యందు మాత్రమే కనబడును.
- సజ్జనులు మంచివారని చెడ్డవారని భేదమును పాటింపక, అందరియందు సమానమగు దయను గలిగియుందురు.



చంద్రుడు తన చల్లని వెన్నెలను అందరియందును సమానముగ ప్రసరించును.

- హంస పాలలోని నీటిని వదలి పాలను మాత్రమే స్వీకరించునట్లు పండితుడు ఇతరుల మాటలలోని మంచి చెడ్డలను వివేచన చేసి అందులోని మంచినే స్వీకరించును.
- మూర్ఖజనుల సహవాసము మోహమునకు మూలమగును. సాధుజనుల సహవాసము ధర్మకార్యములకు మూలమగును. మోహమనగా అజ్ఞానము. దుర్జన సాంగత్యము అజ్ఞానికిని, సాధు సాంగత్యము ధర్మమునకు మూలము.
- సాధు జనులు మనసున తలచిన దానినే మాట్లాడుదురు. మాటలో చెప్పినదానినే క్రియారూపమున చూపింతురు. మనసు నందు మాటయందు, కార్యమునందు త్రికరణ శుద్ధి కలిగి యుందురు.
- న్యాయమార్గమున ప్రవర్తించువానికి పశుపక్ష్యాదులు కూడా సహాయపడును. అక్రమ మార్గమున ప్రవర్తించువానికి, తన సొంత సోదరుడు గూడా సహాయము చేయక దూరముగా పోవును.
- సూర్యుడు పద్మసముదాయమును వికసింపజేయును. చంద్రుడు కలువల సమూహమును వికసింపజేయును. మేఘములు యాచింపకనే నీటిని వర్షించుచున్నవి. సజ్జనులైన వారలు పరహిత కార్యములందు స్వయముగా కల్పించుకొని సహాయ పడుదురు.
- పామునకు కోరలయందు విషముండును. తేనెటీగకు శిరస్సున విషముండును. తేలునకు తోకయందు విషముండును. దుర్జనునకు అన్ని అవయవములలో అంతట విషముండును.

- దుర్జనుడు ప్రియముగ మాట్లాడినంత మాత్రమున అతని మాటలను నమ్మరాదు. దుర్జనుడు నోటితో తియ్యని మాటలు పలుకును. హృదయమున విషము నింపుకొని యుండును.
- కుక్కతోకను ఎంతవరకు నిలదీసి వెదురుబద్దతో కట్టినను, తోక వంకర మారదు, దుర్మార్గునికి ఎంత మంచిని బోధించినను, తన దుష్టగుణమును వదలడు.
- దుర్జనుడు సంపాదించిన ధనము దైవకార్యములకు గాని, ధర్మకార్యములకు గాని, బంధువులకు గాని, యాచకులకు గాని వినియోగము కాదు. చివరకు అంతా వదలి, వట్టి చేతులతో వెళ్ళి నరకమున పడును.
- మిత్రునకు ద్రోహము చేయువాడు, చేసిన మేలు మరచినవాడు. నమ్మించి మోసగించువాడును, వీరు సూర్యచంద్రులున్నంత వరకును నరకముననుభవింతురు.
- మహాత్ములకు అపకారము చేయదలచినవాడు తానే నాశనమగును. పూతన బాలకృష్ణుని చంపబోయి తానే చచ్చినది.
- ప్రియముగ మాట్లాడి చేయు దానము. గర్వము లేని జ్ఞానము. క్షమతో కూడిన శౌర్యము, త్యాగయుక్తమగుధనము. శ్రేయోదాయకములగు ఈ నాలుగు మానవులకు లభించుట దుర్లభము.
- విశిష్ట గుణములుగల మహాత్ముల కిచ్చు ధనము, ప్రతిదినము ఆహారమునకై వెచ్చించు ధనము నీ సొంత ధనముగా భావింప వలెను. దానమిచ్చినది, అనుభవించినది మాత్రమే నీ ధనముగా తలంపవలెను. మిగిలినది నీది కాదు.
- అన్నదానము మహాదానమనబడును. విద్యాదానము మిక్కిలి గొప్పది. అన్నదానము క్షణికమైన తృప్తిని కలిగించును. విద్యాదానము జీవితాంతము సుఖమునిచ్చును.



- కర్ణుడు తన చర్మమును కవచకుండలములు దానము చేసినాడు. శిబి చక్రవర్తి తన శరీరమాంసమును కోసి దానమిచ్చినాడు. జీమూత వాహనుడు తన ప్రాణమునే దానము చేసినాడు. దధీచి మహర్షి తన శరీరమునందలి ఎముకలను దానమిచ్చాడు. దీనిని చూసిన మహాత్ములకు ఈయకూడనిది ఏదియు లేదని తెలియుచున్నది.
- భూదానము, సువర్ణ దానము, గోదానము, అన్నదానము అనునవి మహాదానములంటారు. వీటికంటె అభయ ప్రధానము గొప్పదానము.
- సుక్షేత్రమున నాటిన మఱ్ఱి విత్తనము స్వల్పమైనదైనను మొలకెత్తి మహావృక్షముగా విస్తరించును. అదే విధముగా సత్పాత్రునికి చేసిన దానము చిరకాలము ప్రయోజనకారియై వర్ధిల్లును.
- ఆహారము, నిద్ర, మైథునము ఇవి పశువులకు మానవులకు సామాన్యమైనవి. ధర్మమే మానవులయందున్నట్టి విశేష గుణము. ఆ ధర్మగుణములేనివాడు పశుతుల్యుడు.
- యాగములు చేయుట, వేదాధ్యయనము, దానము, తపస్సు సత్యము, ధైర్యము, ఓర్పు, దురాశ లేకుండుట అను ఈ ఎనిమిది ధర్మమార్గములు.
- మానవునకు మేలును కలిగించునది తను చేసుకొన్న ధర్మమొక్కటే. శరీరమును వదిలిన తరువాత తన వెంట వచ్చును. మిలగినవన్నియు శరీరముతోపాటు నశించును.
- ధైర్యము, ఓర్పు, శాంతి, దొంగతనము చేయకుండుట, పరిశుభ్రత ఇంద్రియ నిగ్రహము, బుద్ధి పటిమ,విద్య, సత్యము, క్రోధము లేకుండుట, ఈ పది గుణములు ధర్మగుణములు. వీనిని గల్గినవాడు ధర్మాత్ముడు.

◆ అందరిని మరచినా, నీ తల్లిదండ్రులను మరవద్దు. వాళ్లను మించి నీ మంచి కోరేవారెవరూ వుండరని తెలుసుకో.

◆ నువ్వు పుట్టాలని రాళ్లకు పూజలు చేశారు వారు, రాయివై వారి హృదయాలను వ్రక్కలు చేయవద్దు.

◆ కొసరి, కొసరి గోరు ముద్దలతో నిన్ను పెంచారు వారు - నీకు జన్మనిచ్చినవారికి దుఃఖాన్ని కలిగించకు.

◆ ముద్దు మురిపాలతో నీ కోర్కెలు తీర్చారు వారు - ఆ ప్రేమ మూర్తుల కోరికలు నీవు నెరవేర్చాలని మరువవద్దు.

◆ నీవు ఎన్ని కోట్లు సంపాదించినా, అవి తల్లిదండ్రులకు సమాన మౌతాయా? అంతా వ్యర్థమే సేవా భావం లేక గర్వం పనికిరాదు.

◆ నీవు నడిచే దారిని పూలు పరిచారు వారు - ఆ మార్గ దర్శలకు నీవు ముల్లువై వారిని బాధించకు.

◆ డబ్బుపోతే మళ్లీ సంపాదించవచ్చు. తల్లిదండ్రులను మాత్రం సంపాదించలేవు. వారి సేవా భాగ్యం జీవితాంతం మరువవద్దు.

◆ తల్లిదండ్రులను, గురుజనులను, శాస్త్రములను, గౌరవించువాడు చిరకాలము ఆదరణీయుడు కాగలడు.

◆ కాలాన్ని వ్యర్థం చేసినవాడు, కాలపు విలువ తెలియనివాడుగు చున్నాడు.

◆ మనసా భగవచ్ఛింతన, భగవన్నామ జపం, సర్వులను నారాయణ భావంతో స్వీకరించి, కర్మణా నారాయణుని నిస్వార్థంగా సేవించడం. ఇదియే సర్వోత్తమ కార్యము.

◆ మాటలాడునపుడు సత్యముగాను, ప్రియముగాను, మితముగానూ హితముగాను శాస్త్రానుకూలంగా భాషించాలి.

◆ ఏ కారణముచేతనైనా, ఏ క్షణమైనా భగవచ్ఛింతనా రహి



తంగా గడిచిపోతే, పుత్రశోకం కన్నా మిన్నగా పశ్చాత్తాపము చెందవలెను.

◆ పరులద్వారా తన దోషాలను ఆలకించి, మనసా ప్రసన్నుడై వుండాలి.

◆ దోషాలను చూపేవారిని గురుతుల్యులుగా భావించాలి

◆ ఎవరితోనయినా నీకు పనిబడితే, అతణ్ణి నీ దగ్గరకు పిలువక నీవే అతని దగ్గరకు వెళ్ళు.

◆ సత్సాంగానికి మించిన మిత్రుడు లేడు. దుస్సాంగత్యానికి మించిన శత్రువు లేడు. దయకు మించిన ధర్మంలేదు. హింసకు మించిన పాపం లేదు. బ్రహ్మచర్యానికి మించిన వ్రతం లేదు. ధ్యానానికి మించిన సాధన లేదు. శాంతికి మించిన సుఖము లేదు. ఋణానికి మించిన దుఃఖం లేదు. భగవంతునికి మించిన యిష్టమైనది లేదు.

◆ కామికి లజ్జ ఉండదు. లోభికి అభిమానం ఉండదు. భక్తునికి శాపాలుండవు, నాస్తికునికి జపాది సాధనలు వుండవు.

◆ గంగతో సమానమైన తీర్థం లేదు. గోవుతోసమానమై సేవించ దగినది లేదు. భగవద్గీతతో సమానమైన శాస్త్రం లేదు. గోవిందునికి సముడైన దేవుడు లేదు.

◆ గంగాస్నానం, గోవిందునిసేవ, అర్థసహితంగా గీతాభ్యాసం, గాయత్రీ జపం, గోవిందుని ధ్యానం, వీటిలో వేటినైనా సరే నిష్కామ భావముతో శ్రద్ధాపూర్వకముగా సేవిస్తే శుభములు చేకూరుతాయి.

◆ జీవన్ముక్తులైన జ్ఞానులకు ఈ ప్రపంచమంతా స్వప్నతుల్యమైనదే. అందుకే వారు ప్రపంచములో వుంటూ కూడా దానిలో చిక్కుకోరు.

◆ జీవిస్తూ వుండగానే శరీరాన్ని మృతప్రాయంగా చూడగలవాడే

జీవన్ముక్తుడు. అనగా ప్రాణ రహితమైనప్పుడు శరీరంతో ఎట్టి సంబంధములేనివాడై వుంటాడో, అట్లే ప్రాణాలువున్నా శరీరంతో ఎట్టి సంబంధం లేకుండా సంచరించగలవాడే జీవన్ముక్తుడు.

- స్త్రీలకు పాతివ్రత్య ధర్మమే సర్వోత్కృష్టమైన సాధన. కనుక భగవంతుని స్మరిస్తూ భర్త ఆజ్ఞలను పాలించాలి. భర్త యొక్కయు, పెద్దల యొక్క చరణాలకు ప్రణమిల్లి యోగ్యమైన రీతి సేవించాలి.
- వితంతు స్త్రీ, విషయ భోగాలనుండి విరక్తియై భగవద్భక్తితో, సద్గుణ సదాచారములను పాలిస్తూ, నిస్వార్ధభావంతో సర్వులను సేవించడం సర్వోత్తమమైన ధర్మము.
- పరులకు ఉపకారముచేసి, ప్రతిఫలాన్ని ఆశించరాదు. ఎవరికీ చెప్పకొనరాదు. అలా చేస్తే చేసిన ఉపకారం క్షీణిస్తుంది. సర్వం భగవంతుడే చేయిస్తున్నాడనీ, తాను నిమిత్తమాత్రుడననీ గ్రహించాలి.
- ఎవరైనా మనకు ఉపకారం చేస్తే వారిని జీవితాంతం మరువరాదు. ఉపకారికి విశేషంగా మనము ప్రత్యుపకారం చేసినా, వానిని మరువకూడదు.
- మనవల్ల ఎవరికైనా అపకారం జరిగితే సదా వానికి హితాన్ని చేకూరుస్తూనే వుండాలి. తద్వారా అతడు మన అపరాధాలను మనసా విస్మరించాలి. అదియే దానికి యదార్థమైన ప్రాయశ్చిత్తము.
- భగవంతుడు జాతి మత భేదాలను చూడడు. కేవలం ప్రేమ భావాన్నే చూస్తాడు. కనుక మానవ మాత్రుడు భగవంతుని ప్రేమించాలి.
- తల్లి, తండ్రి, భర్త, జ్ఞానిని, మహాత్ములను, గురుజనులను, దైవమును శ్రద్ధతో నిస్వార్ధముగా సేవించడము వలన శీఘ్రమే



మోక్షప్రాప్తి కలుగుతుంది.

- నిష్కామ కర్మవల్ల, భగవన్నామ జపము వల్ల, ధ్యాన, ధారణవల్ల సత్సంగము, గ్రంధపఠనముల వల్ల దురితమైన ఆవరణలు తొలగి శీఘ్రమే భగవత్ ప్రాప్తి కలుగుతుంది.
- పరమాత్మ ప్రాప్తికోసం మానవమాత్రుడు అర్ధభావ సహితముగ శాస్త్రాలను పరిశీలించడం, ఏకాంతములో ఆశీనుడై ఆధ్యాత్మ విషయాలను గురించి యోచించడం నియమపూర్వకముగా నిత్యం చేస్తూ వుండాలి.
- తనను తాను పరమాత్మకు అర్పించుకున్నవాడు ఆ దేవదేవుని మీదనే ఆధారపడినట్టి వానిని, సర్వదా సర్వవిధములా ఆ భగవంతుడే రక్షిస్తాడు. అతడు శాశ్వతమైన మోక్షపదాన్ని అందుకోగలుగుతాడు.
- ప్రేమపూర్వకముగా భగవధ్యానము, శ్రద్ధతో సత్పురుషుల సాంగత్యము, వివేక పూర్వకముగ శాస్త్రాధ్యయనము, దుఃఖితులను, పూజ్యులను నిస్వార్థంగా సేవించడము వలన శీఘ్రముగా దైవ సన్నిధికి మార్గము చూపుతాయి.
- అన్ని విధముల ప్రేమకంటెను భగవంతుని ఎక్కువగా ప్రేమించుట మానవుని ప్రథమ కర్తవ్యము. అట్టి భవగత్ ప్రేమయే భక్తియగును. అదియే జీవితము యొక్క కర్తవ్యము.
- ఆత్మ సుఖమును అనుభవింపగోరువారు, విషయ సుఖములను కోరరాదు.
- శ్వాసలేని దేహమెట్లు నిష్ప్రయోజనమై కొద్ది సమయములోనే ఎట్లు దుర్వాసన కొట్టునో, అట్లే సత్యములేని జీవితము నిష్ప్రయోజనమై అశాంతి దుఃఖములతో అలమటించును.
- సత్య స్వరూపుడైన సర్వేశ్వరుడు సత్యవాక్యము, ప్రేమ, పవిత్ర హృదయ సంపన్నులకే కనిపించును.

- నాలుకతో చేయు నాలుగు పాపములు 1) అసత్యమాడుట 2) పరదూషణ 3) చాడీలు చెప్పుట 4) అమితముగ మాట్లాడుట. వీటిని అదుపులో పెట్టుటకు ప్రయత్నించుట ఉత్తమ మార్గము.
- దేహము చేయు అయిదు పాపములు :- 1) హత్య 2) వ్యభిచారము 3) దొంగతనము 4) మాంసభక్షణము, 5) సారాయి, కల్లు మొదలగు మత్తు పదార్థములు. ఇవి కూడా సాధ్యమైనంత వరకు దూరము చేసుకొనుట ఉత్తమజన్మ యొక్క పరమార్థము.
- మనసు చేయు పాపములు :- కామము, క్రోధము, లోభము, మోహము, మదము, ఓర్వలేమి, ద్వేషము, గర్వము.వీటిని దూరము చేయుటకు ప్రయత్నించుట మొదటి పని.
- చెడు కార్యములు చేయుటలో మానవ మనస్సు అతి వేగముగా సాగిపోవుచుండును. అట్లు పోనీయక ఆ సమయమున భగవన్నామ మును స్మరించుచూ, సత్కార్యములు చేయప్రయత్నించుము. అట్లు చేయువాడు భగవదనుగ్రహమునకు పాత్రుడు కాగలడు.
- కలిగివున్న వారిని చూచి ఓర్వలేక వారిని చెరుపు ప్రయత్నము మొదట మానవలెను. ఉన్నవారిని చూచి ఆనందించు, లేనివారిని చూచి పరితాపపడి వారి మంచిని కోరుము. అదియే భగవత్ ప్రేమ
- సంతోషమును కోరువాడు మంచిని చేయుచుండ వలయును.
- దుష్టులమాటలకు జవాబువద్దు, దూరముగా మెలగుట మంచిది. అట్టివానితో సంబంధమును మానుము.
- మంచివారి సహవాసమును మాన, ప్రాణములనైనను ధారపోసి సంపాదించుము. అయితే మంచి, చెడ్డల విచారణ చేయు వివేక మును ప్రసాదించుమని భగవంతుని కోరుము.



- మానవుడు మంచి, చెడ్డలు ఏమి చేసిననూ వాటి ఫలములు వెంటాడుచుండును.
- కుట్రబుద్ధి కూకటివ్రేళ్లతో నరికివేయుము. లేకున్న అది జీవితమునే నాశనము చేయును.
- శక్తి కొలది దరిద్రనారాయణుని బిడ్డలగు బీదవారిని తృప్తిపెట్ట ప్రయత్నించు. నీకున్నదానిలో, ఒక పూట వారికి భోజ నము పెట్టి సంతోషపెట్టు.
- తెలియకచేసిన తప్పులకు మనఃపూర్వకముగ పరితపించుచూ మరల అట్టి తప్పులు చేయకుండుటకు ప్రయత్నించు.
- మరొకరి తప్పులు వెతుకక నీలోని దోషములను వెతికి పారవేయి. పరుల తప్పులు పదిమార్లు వెతుకుటకన్న నీ తప్పును వెతుకుకొని తెలుసుకొన్ననూ చాలు.
- మౌనంగా వుండే జ్ఞానికన్నా, జనానికి ఉపదేశం చేసే జ్ఞాని ఉత్తముడు.
- దానం చేయాలనే కోరికకలవానికి, భగవంతుడు మరింత సంపదను ప్రసాదిస్తాడు (ఋగ్వేదం) 2-14-210)
- ఇహమందు ప్రాణికోట్లకు ఉపకారము చేయుటయు, పరమునందు పరమాత్మను పొందుటయు మనుష్య జన్మ యొక్క లక్ష్యమని మరువ కూడదు.
- పుణ్యమును పొందవలయునని ఆసక్తిగలవారు ప్రతిజీవిని ప్రేమించ వలయును. తప్పులు జేయువారిపై కరుణ జూపించ వలయును. పుణ్య కార్యములను జేయవలయును. బీదలైన సాధువులను పోషించ వలయును.
- సద్గురు కటాక్షమువలన మన ముధన్యులము కాగలము. గురుభక్తికి సాటియైనది మరొకటి లేదు. గురువనగా త్రిమూర్తి స్వరూపుడు.

- సాధువనగా అఖండగౌతమీ నదితో సమానమని తెలియండి. గోదావరి నది సర్వులకు సమానముగా జలము నొసంగుచున్నది. అట్లే సాధుపుంగవులు అంత్యజుడైనైననూ తిరస్కరించరాదు. వారిపై కరుణ చూపవలెను. ఇదియే గురుధర్మము.
- భక్తి రుచిని పొందిన మనస్సు ఇతర రుచులను మరచును. వైరాగ్య సుకము నొందిన మనస్సు దేహేంద్రియ సుఖములను కోరదు.
- ఓర్పే బలము, ప్రేమయే ఆనందము. ఆనందమే దేవుడు.
- కులములలో గురుకులము గొప్పది. జన్మములలో నివృత్తి మార్గము గల జన్మయే గొప్పది. దానములలో నిదానము గొప్పది. విద్యలలో బ్రహ్మవిద్య గొప్పది.
- సాధు పురుషులు పరులను నిందించరు. పరులు నిందించిన కోపించరు. నిందాస్తుతులు రెండును రాత్రింబవళ్ళు వంటివని వారు తలంచెదరు.
- కామ, క్రోధ, లోభములు మోక్షమార్గమును వెళ్ళనివ్వకుండా అడ్డగించు ప్రబల శత్రువులని తెలుసుకొని వెంటనేవాటిని విడువవలయును. అట్లువాటిని తొలగించనిచో అవి జ్ఞానమును నశింప జేయును.
- దైవికముగ ప్రాప్తించిన దానితో తృప్తిచెందిన ఆహారము దైవ ప్రసాదముతో సమానము. ఆహారము పెట్టువారు పూర్ణ ప్రేమ స్వభావముగా నుండవలెను. భుజించువారు పెట్టినదానితో తృప్తి చెందువారుగ నుండవలెను. అట్లుగాక పెట్టువారు ప్రేమరహితులు గను, భుజించువారు భోజన ప్రియులుగను నుండిన ఆయాహారము దోషపూరితమగును.
- దేహాభిమానమను తెరను తీసివేసినగాని, మనము ఆత్మ తేజమును దర్శింపజాలము.
- సాధువులు ఆచరించదగిన ముఖ్య ధర్మములు :- అహంకార



మును నశింపజేయవలెను. రోగములు సంభవించిన ఓర్చుకొనవలెను. నిందించినపుడు క్రుంగకయుండుటయు, స్తుతించినపుడు పొంగకుండుటయు కలిగియుండ వలయును. దేహము పైనున్నంత ప్రేమను దేవుని యందుంచ వలయును.

- సర్వసంగపరిత్యాగులైన సద్గురు సన్నిధికి ముముక్షువులగు వారు వెళ్ళి వారి ఉపదేశములను గ్రహించినచో, చీకటింటిలో దీప ముంచిన యెడల ఆ చీకటి యెట్లు దూరమైపోవునో, అట్లే హృదయాంతరాళమున వుండు అజ్ఞానమనెడి చీకటి మాయమై పోవును.
- ఆనందము కావలసియుండిన, అహంకారమును విడువ వలయును. పుణ్యము కావలసిన కోపమును దరిజేరనీయ రాదు. ముక్తిని పొందవలయునన్నచో సమస్త బంధములను త్రెంచివేయవలయును.
- ఏకాదశిరోజున నిరాహారముతోను, హరినామస్మరణతోను కాలము గడిపిన వారికి భక్తి అభివృద్ధిచెంది, వెంటనే వైరాగ్య జ్ఞానములు పట్టుబడును.
- దేహమునందును, దేహ సంబంధ బంధువులయందును అభిమానమును విడిచి, ఆత్మయందును, ఆత్మ సంబంధీకులు అనగా పరమభక్తులు, జ్ఞానులు మొదలగు వారి యందును స్నేహభావము కలిగియుండవలెను.
- అసూయయను మహావ్యాధికంటె అసహ్యకరమగు రోగము వేరొకటి లేదు. ఈ వ్యాధిని ప్రేమయనే ఔషధముచే నిర్మూలించవలయును.
- భర్తపోయిన తరువాత స్త్రీలు ఎల్లప్పుడు భక్తితో కాలము గడుప వలయును. భగవంతునినే భర్తగా వరించవలయును. (అనగా సర్వమును భరించువాడు భగవంతుడే)

- లోకములో నున్న మంచిని తీసుకొనడము, తనలోవున్న చెడ్డను తీసివేయడము సాధుధర్మము.
- సత్యములేని సంభాషణ, శాంతములేని సేవ, నిష్ప్రయోజనము. ప్రేమగల వారిని అందరూ ప్రేమించెదరు. సత్యముగలవారిని అందరూ నమ్మెదరు.
- అన్ని భాషలలో మితభాషణ మంచిది. యోగములలోకెల్ల సమరస యోగము మంచిది. దానములోకెల్ల నిదానము గొప్పది.
- మనపై నేరముమోపినవారిని మనము ద్వేషించరాదు. అది దైవ పరీక్షయని తలంచవలయును.
- గర్వముతో చేయుధర్మము, కోపముతో చేయుసేవయు, ప్రేమలేనిచోట చేయు భోజనమును వ్యర్థములు.
- ఎల్లప్పుడు ఇంద్రియములను స్వాధీనమందుంచుకొని, కాలమును నియమనిష్ఠలతో గడుపవలయును. ఒక్క నిమిషము యింద్రియములను వాని యిచ్ఛానుసారము పోనిచ్చినచో మరల వానిని స్వాధీనమందుంచుకొనుట ప్రయాసము.
- కాషాయ వస్త్రముగట్టి అహంకారము వదలకున్న ప్రయోజనము లేదు. రుద్రాక్షమాలలను, భస్మమును ధరించి శివనామస్మరణ చేయక, కర్ణ కఠోరవాక్యములను పలుకుచుండెడివారు. రుద్రాక్ష మాలలను ధరించుట, భస్మము పూయుట వ్యర్థమగును.
- కోపమును ఎన్నడు కోపించకుము. ఇతరులు కోపించిన శాంతము వహించియుండుము. శాంతముకన్నా ఘనమైనది మరియొకటి లేదు.
- సముద్రమునుండి కెరటములు సహజముగా బయలుదేరునట్లు అజ్ఞాని నుండి అతిభాషణము సహజముగానే బయలుదేరును.



- మాటలు తగ్గించుకొనిన గాని మనసు నిలువదు. మనస్సును స్వాధీనమందుంచుకొనుటయే మాయను త్యజించుటయగును.
- గాదెలో ఎలుకలుండిన ధాన్యము పొల్లుగాజేయును. అట్లే హృదయములో అహంకారముండిన ఆనందమును చెడగొట్టును.
- ఎట్టి దోషములు లేనివారే సద్గురువునకు నిజమైన భక్తులు కాగలరు. అట్టి సద్గురు భక్తులను దూషించిన వారికి వెంటనే దోషము లాపాదించును.
- కాలముపోతుంది. ఆయువు తరుగుతుంది. ఆశ పెరుగుతుంది. కావున ఆశను పెరగనివ్వక, ఆత్మజ్ఞానాన్ని, పుణ్యాన్ని పెంచుకో, ఇది నీ చేతిలో పని.
- ఏ పాటుదప్పినా సాపాటు తప్పదన్నట్లు యెన్నాళ్ళు బ్రతికినా మరణం తప్పదు. కావున మృత్యువు రాకపూర్వమే యదార్థము తెలుసుకొని కృతార్థుడవుకమ్ము.
- ఒకరు నీ మతమును, నీ సంఘాన్ని, నిన్ను దూషిస్తే నీకెంత బాధ కలుగుతుందో, నీవు కూడా యితరుల మతములను, సంఘాలను, వ్యక్తులను దూషిస్తే వారికి మాత్రం బాధ కలుగదా? కావున ఒకరి కొకరు దూషించుకొనక ఎవరి మతమును వారు పోషించుకొనుట యెంతో మంచిది.
- నీవు యెక్కడ వున్నను నీవు చేసుకొన్న పుణ్యమే నీకు రక్ష నీవు చేసుకొన్న పాపమే నీకు శిక్ష అది నీ చేతిలోపని.
- నీవు బాగుపడాలంటే దుర్జన సహవాసమును, దుర అలవాట్లను, మాంసమును మొదలగు దుష్ట ఆహారములను, కల్లు, సార, బ్రాంది మొదలగు మత్తుపదార్థములను, చుట్ట, బీడి, సిగరెట్లు మొదలగు ధూమపానములను, దొంగతనము, వ్యభిచారములను పూర్తిగా విసర్జింపుము.

- ఇతరులపై ఆధారపడక మీ పనులన్నియు మీరే చేసుకొనుట వలన ఆత్మ విశ్వాసము పెరుగును.
- ప్రతినిత్యము కనీసము ఉదయమొకగంట, సాయంత్రము ఒక గంట సేపైనను భగవధ్యానము, జపము చేయుచుండ వలయును.
- ప్రతినిత్యము భగవద్గీతలో ఒక అధ్యాయమైనను పారాయణము చేయుచు, తదర్థమును గూడా గ్రహించుచు, గ్రహించిన దానిని మననము చేయుచు, ఆచరణలో పెట్టుచుండ వలయును.
- సాధకులు పాటించవలసినవి :- 1) సజ్జన సహవాసము 2) సాత్విక ఆహారము 3) ఆత్మానాత్మ విచారణ 4) భగవచ్ఛింతన. ఇవి ఆచరించ దగినవి.
- పునాదిలేని యిల్లు ఎన్ని అంతస్థుల భవనమైనను, ఎంత అందమైన భవనమైనను ఎట్లు కూలిపోవునో ఆ విధముగానే ధ్యానములేని జ్ఞానము గూడా పతనానికే హేతువగును.
- సత్సంగము ఆత్మ సాక్షాత్కారమునకు తాళపుచెవి వంటిది. సద్గురు వాక్యము మోక్షమార్గమునకు బాటచూపును. సత్పురుషుల సహవాసమే సమస్త దుఃఖములను నిర్మూలించుటకు మూలకారణమై యున్నది.
- ఇతరుల సహాయమును, సేవను, ధనమును కోరిన, ఆ కోరిక ఇతరులను బాధపెట్టును.
- మనము చేసిన పాపముగాని మనము చేసిన పుణ్యముగాని మనకే తిరిగి వచ్చును.
- లోక కళ్యాణార్థమై నిస్వార్థముగా చేయుకర్మ జీవుని బంధనము నుండి విడిపించును.
- సత్యము ఘనమైనది. దాని మాధుర్యమును అనుభవించియే



తీరవలెను. సత్యముకంటె రక్షించునది ప్రపంచమున ఏదియు లేదు.
- దృఢమగు భక్తి విశ్వాసములు, నిశ్చలమగు ధ్యాననిష్ఠ, నాకిమ్మని దేవుని ప్రార్థించుము. భగవత్సాక్షాత్కారమునకై, సదా నీ హృదయము నందు ఆవేదన కలిగియుండుము.
- ఇంతవరకు పోయిన జీవితమునకు పశ్చాత్తాపపడి, ఇకవున్న జీవితాన్నైనా భగవత్ సేవకు, గురుసేవకు అర్పింపుము. అందరికి భగవంతుడే దిక్కని గట్టిగా నమ్ముము.
- జీవితకాలము చాలా స్వల్పము. మృత్యువెప్పుడాసన్నమగునో తెలియదు. కావున ఆధ్యాత్మిక సాధనయందు తీవ్రనిష్ఠ కలిగి యుండుము.
- నీవు మంచి మార్గములో నున్నపుడు ఇతరులనిందలను, పొగడ్తలను లెక్కచేయకుము.
- తాను చేసిన తప్పులను ఇతరులకు చెప్పి పశ్చాత్తాపపడిన యెడల పాపశాంతి కలుగును.
- విద్యయు, ధనము, కీర్తి, పరిజనము యెంతయుండినను నిన్ను మరణకాలమునందు రక్షింపవు.
- ఇతరులయందుగల తప్పులను వెదకుటకంటె, నీయందుండెడు తప్పులను కనుగొనుము.
- ప్రాపంచిక వస్తువులతోను, ఇతరులతోను అధిక సంబంధము పెట్టుకొనకుము.
- ప్రతిరోజు భగవంతుని శరణువేడుము. ఓ భగవంతుడా నేను నీ వాడను. నీళ్ళముంచినా, పాలముంచినా నీవే గతియని గట్టి నమ్మకముతో ప్రార్థించుము. తప్పక భగవంతుడు రక్షించును.
- భగవంతుడు కనబడనందున జనులు చెడిపోవుట లేదు.

ఆయనను భజింపక, నమ్మిక చెడిపోవుచున్నారు.

- కాశీలో నివశించే వారందరికి ముక్తి కలుగదు. కాశీ విశ్వనాధుని మరువక యున్నవారికే మోక్షము కలుగును.
- దేవుని సాకారమును నమ్మినవారే భక్తులు. నిరాకార నిర్గుణ పరమాత్మను ధ్యానించువారే జ్ఞానులు.
- ఓ భగవంతుడా ఈ శేష జీవితమును నీ సేవజేసుకొనుటకును, నీ చింతన, నీ స్మరణ చేసుకొనుటకు, నీ స్వరూప జ్ఞానప్రాప్తి కొరకు నాకు శక్తి సామర్థ్యములను ప్రసాదించి నన్ను నీ సన్నిధికి జేర్చుకొనుము యని భగవంతుని వేడుకొనవలెను.
- అర్చకుడు (పూజారి) అభగా భగవానుని తరువాత దేశములో సమస్త మానవకళ్యాణము కొరకు మానవజాతి పక్షాన ప్రతినిధిగా వుండి భగవంతునికి చేయు అర్చనలో ఏ లోపము లేకుండా నిస్వార్థంగా, ఏలాంటి పక్షపాతం లేకుండా, విశాలబుద్ధితో దైవభక్తితో దైవాన్ని సేవించి, తాను తరించి, ప్రజలందరిని తరింపజేయ వృత్తి అర్చన వృత్తి.
- తండ్రి వలన కలిగినది మొదటి జన్మ. ఉపనయనముచే కలిగినది రెండవజన్మ. సన్యాసము మూడవ జన్మ.





## భగవద్గీత- ఖురాన్-బైబిల్ దివ్య సందేశములు

మనము ధార్మిక గ్రంథాలకు దూరముగా వుండి, ఎంతో ముఖ్యమైన దేవుని విషయములో దేవుని శక్తి సామర్థ్యాల గురించి సరియైన అవగాహన లేకపోవడం, దేవుని గుణగణాలు మనకు తెలియని కారణంగా దేవుడు మనిషిలా అవతరిస్తాడని, భార్యాబిడ్డలు వుంటారని, మనిషికుండే బలహీనతలు వుంటాయని భావిస్తున్నాము.

యజుర్వేదం 40-8 మరియు 32-3 దేవునకు సాటి పోలిక ఎవరూ లేరు ఆయనకు పుట్టుకలేదు. కనుక పూజకు అర్హుడు.

శ్వేతాశ్వతరోపనిషత్ (4-19)న తస్మ ప్రతిమ ఆస్థి క్ష ఆయనకు సాటి సమాన రూపము ఏదీ లేదు.

శ్వేతాశ్వతరోపనిషత్ 4-20 క్ష దేవుని రూపం ఇంద్రియాల పరిధిలో నిలువదు. కన్నులతో ఆయనను ఎవరూ చూడలేరు.

శ్లో. మయాతతమిదం సర్వం - జగదవ్యక్తమూర్తినా
మత్థాని సర్వభూతాని - నచాహంతేష్వవస్థితః (భగ 9-4)

తా : ఈ సమస్త ప్రపంచము అవ్యక్తరూపుడనగు నాచే వ్యాపింపబడి యున్నది. సమస్త ప్రాణికోట్లు నాయందున్నవి. నేను వానియందుండుటలేదు నాకవి ఆధారములు కావు.

శ్లో. కవింపురాణమనుశా సితార - మణో రణీయాం సమనుస్మరేద్యః
సర్వస్యథాతార మచిన్త్యరూప-మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్
(గీత 8-9)

శ్లో. ప్రయాణకాలే మనసాచలేన - భక్త్యాయుక్తోయోగ బలేనచైవ,
భ్రూవూర్మధ్యేప్రాణ మావేశ్యసమ్యక్-సతంపరం పురుషముపైతిదివ్యమ్
(గీత 8-10)

తా : ఎవడు భక్తితో గూడుకొనినవాడై అంత్యకాలమునందు యోగబలముచే, ధ్యానాభ్యాస సంస్కారబలముచే ప్రాణవాయువును భ్రూమధ్యమున (కనుబొమ్మల నడుమ) బాగుగా నిలిపి, ఆ పిదప సర్వజ్ఞుడును, పురాణ పురుషుడును, జగన్ని యామకుడును, అణువుకంటె మిగుల సూక్ష్మమైనవాడును, సకల ప్రపంచమునకు ఆధారభూతుడును (సంరక్షకుడును) చింతింపనలవికాని స్వరూపముగలవాడును, సూర్యుని కాంతివంటి కాంతిగల వాడును, స్వయంప్రకాశ స్వరూపుడును అజ్ఞానంద కారమునకు అవలనుండువాడును అగు పరమాత్మను నిశ్చల మనస్సుచే ఎడతెగక చింతించునో, అతడు దివ్య స్వరూపుడైన సర్వోత్తము డగు ఆ పరమాత్మనే పొందు చున్నాడు.

బ్రహ్మసూత్రం :-

ఏకం బ్రహ్మం ద్వితీయ నస్తేనన్ ననస్తే కించన్

దేవుడు సృష్టికర్త ఒక్కడే. ఆయన తప్ప మరొకడు లేడు.

ఖుర్ఆన్ :- దేవుడు ఒక్కడే. ఆయన కరుణామయుడు, కృపాకరుడు తప్ప మరొక దేవుడు లేడు (ఖుర్ఆన్ 2:163)

ఛాందోగ్యోపనిషత్ :- ఏకంమేవా ద్వితీయం క్ష్మనామరూపాలతో గూడిన ఈ జగత్తు ఉత్పన్నమగుటకు పూర్వము సత్తుగా, ఏకమై అద్వితీయమైయుండినది. ఆయనే భగవంతుడు; ఆయన తప్ప మరొకడు లేడు.

అర్జునా భగవంతుడు ఇలా చెబుతున్నాడు. సమస్త ధర్మమును విడిచిపెట్టి నన్ను ఒక్కనిని మాత్రమే శరణుబొందుము. అప్పుడు నేను సమస్త పాపముల నుండి నిన్ను విముక్తునిగా చేసెదను. (భగ 18-66)

భగవంతుడు చెబుతున్నాడు. అర్జునా అన్యదేవతారాధన చేయక నిత్యము ఎవడైతే నాయందు మనసు నిలిపి, నాయందే



భక్తిగలిగి, నన్నే పరమ ప్రాప్యముగా ఎంచుకొంటాడో, నాయందు చిత్తమును జేర్చిన అట్టివానియొక్క యోగక్షేమములను నేను విచారించుచున్నాను. (గీత 9-22).

మీరు భూమిమీద ఎవనికైనను తండ్రి (దేవుడు) అని పేరు పెట్టవద్దు. ఒక్కడే మీ తండ్రి (ఆయనే దేవుడు) ఆయన పరలోకమందున్నాడు

క్రొత్త నిబంధన గ్రంథములో యేసు స్వయముగా (మత్తయి 23:9)

ఈ విధముగా వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, బైబిలు ఖుర్ఆన్ గ్రంథాలు దేవుడు ఒక్కడే అని ఘోషిస్తున్నప్పటికిని అనేక దేవుళ్ళు వెలుగులోనికి రావటానికి కారణమేమిటి?

శ్లో. యేత్వక్షరమనిర్దేశ్య - మవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్ర గమచిన్త్యంచ-కూటస్థమచలంధ్రువమ్ భగవద్గీత 12-3

శ్లో. సంనియమ్యేన్ద్రియగ్రామం - సర్వత్ర సమబుద్ధయః,
తేప్రాప్నువన్తిమామేవ - సర్వభూత హితేరతాః భగవద్గీత 12-4

తా :- ఎవరు ఇంద్రియములన్నిటిని బాగుగా నిగ్రహించి, స్వాధీన పరచుకొని, ఎల్లెడల సమభావముగలవారై, సమస్త ప్రాణులకు హితమొనర్చుట యందు ఆసక్తిగలవారై, ఇట్టిదని నిర్దేశింప శక్యముకానిదియు, ఇంద్రియములకు గోచరము కానిదియు, చింతింపనలవికానిదియు, నిర్వికారమైనదియు, చలింపనిదియు, నిత్యమైనదియు, అంతట వ్యాపించియున్నది యునగు అక్షర బ్రహ్మమును ఎవరు ధ్యానించుచున్నారో వారు నన్ను పొందుచున్నారు.

## దేవుని గూర్చి వేద పండితులు :-

శ్లో. అవ్యక్తోక్షర ఇత్యుక్త - స్తమాహుఃపరమాంగతిమ్
యంప్రాప్యననివర్తన్తే - తద్ధామపరమంమమ (భ.గీత 8-21)

తా : ఏ పరమాత్మ ఇంద్రియములకు అగోచరుడనియు, నాశరహితుడనియు చెప్పబడెనో, అతనినే సర్వోత్తమమైన ప్రాప్యస్థానముగ వేదవేత్తలు చెప్పుచున్నారు. దేనిని పొందినచో మరల వెనుకకు తిరిగి ఈ సంసారమున జన్మింపరో అదియే నా యొక్క శ్రేష్టమైన స్థానము. (గీతలో శ్రీకృష్ణ భగవానులు)

దేవునికి పుట్టుక లేదు. ఆయన ఎవరికి జన్మించలేదు. ఆయనకు ఎవరూ జన్మించలేదు. (ఖుర్ఆన్ 112-3)

నతస్యకశ్చిత్ పతిరస్తిలోకేన చేశితానైవచ తస్యలింగమ్ స

కారణం కరణాది పోధిపోన చాస్యకశ్చిజ్జనితానచాధిపః

(శ్వేతాశ్వతరోపనిషత్ 6-9)

తా :-ఆయనకు తల్లిదండ్రులు లేరు. ఆయనకు ప్రభువు లేడు. ఆయనే ప్రభువు. ఆయనకు గురువు లేడు. ఆయనే మూలం. ఆయనకు సంరక్షకుడు లేడు.

శ్లో. యోమామజమనాదించ -వేత్తిలోక మహేశ్వరమ్

అసమ్మూఢస్సమర్త్యేషు - సర్వపాపైః ప్రముచ్యతే (భ.గీ. 10-3)

తా : ఎవడు నన్ను పుట్టుకలేనివానిగను, అనాది రూపునిగను సమస్త లోకములకు నియామకునిగను తెలిసికొనుచున్నాడో అతడు మనుష్యులలో అజ్ఞానములేనివాడై సర్వపాపముల నుండి విడువబడుచున్నాడు.

నాకు ముందుగా ఏ దేవుడు నిర్మింపబడలేదు. నా తరువాత ఏ దేవుడును వుండడు. నేను నేనే యెహోవాను. నేను తప్ప వేరొక రక్షకుడు లేడు.

(బైబిల్, యెషయా 43:10)

అల్లాహ్ సజీవుడు. ఎన్నడు మరణించనివాడు. (ఖుర్ఆన్ 25-58)

జననము, మరణము అనే దోషములు లేనివాడే శుభప్రదుడైన దేవుడు

(యోగశిఖోపనిషత్)



శ్లో. అవినాశితు తద్విద్ధి - యేనసర్వమిదం తతమ్

వినాశమవ్యయస్యాస్య - నకశ్చిత్కర్తుమర్హతి (భ.గీ. 2-17)

తా :- ఓ అర్జునా ఈ సమస్త ప్రపంచమున్ను ఏ పరమాత్మచేత వ్యాపింప బడియున్నదో అది నాశరహితమై యున్నదని యెరుగుము. అవ్యయమగు అట్టి ఆత్మకు వినాశము ఎవడును కలుగజేయజాలడు.

యెహోవాయే నిజమైన దేవుడు. ఆయనే జీవముగల (చావులేని) దేవుడు

(బైబిలు - యిర్మియా 10:10)

జీవముగల తండ్రి (దేవుడు) నన్ను పంపెను.(బైబిలు, యోహాను 6-57)

దైవ సందేశం అందజేసే నిమిత్తం దేవుడు తన దూతను అవతరింపజేస్తాడే తప్ప దేవుడు మాత్రం మానవ అవతారం ధరించి, ఇహలోకానికి రాడు అని స్పష్టమవుతున్నది.

శ్లో. అవ్యక్తం వ్యక్తిమాపన్నం - మన్యన్తే మామబుద్ధయః

పరంభావమజానన్తో - మమావ్యయ మనుత్తమమ్.(భ.గీ. 7-24)

తా : నాశరహితమైనట్టియు, సర్వోత్తమమైనట్టియు ప్రకృతికి పరమైవిలసిల్లు నట్టియు నా స్వరూపమును తెలియని అవివేకులు అవ్యక్తరూపుడనగు (ప్రపంచాతీతుడనగు) నన్ను పాంచభౌతిక దేహమును పొందినవానినిగా తలంచు చున్నారు.

నిశ్చయముగా దేవుడు ఈ లోకమందు (ప్రపంచములో) నివాసము చేయడు. (బైబిలు 1 రాజులు 8:27)

అల్లాహ్ మాత్రమే సర్వాధికుడు, సర్వోత్తముడు (ఖుర్ఆన్ 2-255)

కామము, క్రోధము, భయము, మోహము, లోభము, మధము, రజోగుణము, జననము, మరణము, శోకము, సోమరితనము, ఆకలి, దప్పిక, ఆశ, లజ్జ, దుఃఖము, విషాదము, సంతో

షము అను ఈ దోషముల బలహీనతలేని వాడే దేవుడు. (యోగశిఖోపనిషత్)

**మత్తఃపరతరం నాన్య - త్కించి దస్తిధనంజయ**

**మయి సర్వమిదంప్రోతం - సూత్రేమణి గణాఇవ** (భ.గీ. 7-7)

తా :- ఓ అర్జునా నా కంటె వేరుగ మరియొకటి ఏదియు లేనేలేదు. దారమందు మణులవలె నాయందే ఈ సమస్త ప్రపంచము కూర్చబడినది.

తండ్రి (దేవుడు) అందరి కంటే గొప్పవాడు

ఈ విధముగా దేవుని రూపాన్ని వివరించలేమని, ఆయనకు చావు, పుట్టుకలు వంటి బలహీనతలు లేవని, ఆయనే సర్వ శ్రేష్టుడని, గొప్పవాడు అయిన ఆ దేవుడు మానవునిగా అవతరించడని, కాలానుగుణంగా ధర్మ రక్షణ కొరకు ఒక్కొక్క ప్రవక్తను భూమి మీదకు పంపుతాడని తెలుసుకొనవలసియున్నది.

**అన్తవత్తుఫలం తేషాం - తద్భవత్యల్పమేధసామ్**

**దేవాన్‌దేవయజోయాన్తి - మద్భక్తాయాన్తిమామపి.** (భ.గీత 7- 23)

తా :- అల్పబుద్ధి కలిగినవారి యొక్క ఫలము నాశవంతమై యున్నది. ఏలయనగా దేవతలను పూజించువారు, దేవతలనే పొందుచున్నారు. నా భక్తులు, నన్ను పూజించువారు లేక నన్ను ఆరాధించువారు నన్నే పొందుచున్నారు.

చాలామంది అందరికి దేవుడు ఒక్కడేనని అంగీకరిస్తూనే మాదేవుడే గొప్పవారుయని బోధలు చేస్తున్నారు. వివిధ మార్గాలు బోధిస్తున్నారు. కాని అది సరికాదు. ఆది నుండి భగవంతుడు తనను చేరేమార్గము వేదముల ద్వారా, ఉపనిషత్తుల ద్వారా, భగవద్గీత మొదలైన ధర్మశాస్త్రముల ద్వారా తెలియపరచి యున్నారు.



జ్ఞానులు, ఋషులు, యోగులు తమ మనస్సులను, సర్వశ్రేష్టుడైన, ఆ దేవదేవునికి సమర్పించి ఆయన దయవలన ఆత్మజ్ఞాన సంపన్నులై ఆనందము అనుభవించి, వారు పొందిన జ్ఞానాన్ని లోకమునకు గ్రంథముల ద్వారా తెలియజెప్పినారు. (ఋగ్వేదం)

**శ్లో. తద్బుయస్తదాత్మాన - స్తన్నిష్టాస్తత్పరాయణాః**

**గచ్ఛన్త్య పునరావృత్తిం - జ్ఞాన నిర్ధూతకల్మషాః** (భ.గీ. 5-17)

తా :- ఆ పరమాత్మయందే బుద్ధిగలవారును, ఆ పరమాత్మ యందే మనసును నెలకొల్పినవారును, ఆ పరమాత్మయందే నిష్టగలవారును, ఆ పరమాత్మనే పరమ గతిగనెంచుకొన్న వారును, జ్ఞానముచే ఎగురగొట్టబడిన పాపముగలవారై పున రావృత్తి రహితమగు (పునర్జన్మవర్జితమగు) శాశ్వత మోక్షపదవిని బొందుచున్నారు.

ఓ అర్జునా ఎవరు సమస్త కర్మములను నాయందు సమర్పించి నన్నే పరమ గతిగతలచినవారై, అనన్య చిత్తముతో నన్నే ధ్యానించుచు ఉపాసించుచున్నారో, నాయందు చిత్తమును జేర్చిన అట్టివారిని మృత్యురూపమగు ఈ సంసార సముద్రము నుండి నేను శీఘ్రముగ లేవదీయుచున్నాను. (భ.గీ. 12:6-7)

**గురునానక్ :-** శిక్కు మత స్థాపకులు, ఒక్క దేవుడు తప్ప మరొకడు లేడు. ఆయన నిజమైన సృష్టికర్త, మానవ బలహీనతలకు అతీతుడు. చావు పుట్టుకలులేనివాడు, కరుణామయుడు.

**జోరాష్ట్రియన్ మతః :-** దేవుడు ఒక్కడే. ఆయనకు పోలికలేదు. ఆది అంతం లేదు. తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు లేరు. శరీరం లేదు. ఏ కనులు, ఏ శక్తి ఆయనను చూడలేవు. ఆయన యింద్రియాలకు అగోచరుడు.

**షిర్డీసాయిబాబా :-** సబ్‌కా మాలిక్ ఏక్‌హై - అందరి దేవుడు ఒక్కడే.

అల్లాహ్‌మాలిక్ - అల్లాహ్‌యే దేవుడు

అల్లాహ్‌భలాకరేగా - అల్లాహ్ మంచిచేస్తాడు. బాబా గారు అనుక్షణం ఈ మూడు మంత్రాలు అనేవారట.

శ్లో. తమేవశరణం గచ్ఛ - సర్వభావేన భారత,

తత్ప్రసాదా త్పరాంశాన్తిం - స్థానం ప్రాప్స్యసిశాశ్వతమ్. (భ.గీ. 18-62)

తా :- ఓ అర్జునా సర్వవిధముల ఆ హృదయస్థుడగు ఈశ్వరునే శరణు బొందుము. అతనియనుగ్రహముచే సర్వోత్తమ మగు శాంతిని శాశ్వతమగు మోక్షపదవిని నీవు పొందగలవు.

యేసు చెప్పెను :- మన దేవుడైన ప్రభువు అద్వితీయ ప్రభువు. (యెహోవా) నీవు నీ పూర్ణ హృదయముతో, నీ పూర్ణాత్మతో, నీ పూర్ణ వివేకముతో, నీ పూర్ణ బలముతో నీ దేవుడైన ప్రభువు (యెహోవా)ను ఆరాధింపవలెను (బైబిలు మార్కు 12:30-32)

నీవు ప్రార్థన చేయునపుడు నీ గదిలోనికి వెళ్ళి తలుపువేసి రహస్యమందున్న నీ తండ్రి యెహోవాకి ప్రార్థన చేయుము. అప్పుడు రహస్యమందు చూచు నీ తండ్రి యెహోవా నీకు ప్రతిఫల మిచ్చును. (మత్తయి 6:6).

మహమ్మద్ ప్రవక్త :- ఓ మానవులారా మీరు అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్య దైవం ఎవరూలేరని విశ్వసించండి. మీరు సాఫల్యం పొందుతారు.

దేవుడు ఒక్కడే. ఆయన్ని ఆరాధించడం తప్ప మరొకమార్గము లేదన్న సత్యాన్ని గ్రహించిన కారణంగా ప్రపంచములో అనేకమంది పుణ్యపురుషులు ఈ సత్యాన్నే బలపరిచారు. కాని దురదృష్టవశాత్తు ఆ మహనీయుల తదనంతరం అది ఆచరణలో కనుమరుగై పోయాయి.

ఈ విధముగా ప్రపంచములో ఎందరో పుణ్యపురుషులు,



మునులు, మహర్షులు, ప్రవక్తలు ఆ ఏకైక దేవునిగురించే బోధించి, ఆయనను మాత్రమే ఆరాధించమన్నారు. కాని ప్రజలు దురదృష్టవశాత్తు సందేశమిచ్చిన ఆ మహనీయులనే దైవాలుగా మార్చివేశారు. దీనికి కారణం వారిపై వుండే అమితమైన ప్రేమ, గౌరవం. కాని ఈ ప్రేమ గౌరవం అక్షరపరబ్రహ్మఅయిన సృష్టికర్త దైవం మీద చూపాలి. ఎందుకంటే మహనీయులు సహితం ఆయననే ఆరాధించినారు. మేము దైవాలమని, తమ్ము, ఆరాధించమనివారు ఏనాడు చెప్పలేదు. కాబట్టి పుణ్యపురుషు లను గౌరవించాలి. ప్రేమించాలి కాని వారినే దేవుడని భావించరాదు.

ఉదా :- యేసు తాను దేవుడనని చెప్పలేదు సరికదా ఎవరైనా అలా, అంటే స్వర్గంలోనికి రాలేరని హెచ్చరించేవారు. ప్రభువా, ప్రభువా అని నన్ను పిలుచు ప్రతివాడును పరలోకరాజ్యము (స్వర్గం)లోనికి ప్రవేశించడు, కాని పరలోకమందున్న నా తండ్రి (దేవుని) చిత్తప్రకారము చేయువాడే పరలోకరాజ్యములోనికి ప్రవేశించ గలడు. (బైబిలు మత్తయి 7:21).

నేనే అల్లాహ్‌ను. నేను తప్ప మరొక దేవుడు లేడు. కనుక నీవు నాకు దాస్యం చెయ్యి (ఖుర్ఆన్ 20:14)

శ్లో. తేషాం జ్ఞానీ నిత్యయుక్త - ఏక భక్తిర్విశిష్యతే,

ప్రియోహిజ్ఞానినూత్యర్థ - మహంసచమమప్రియః (భ.గీత 7-17)

తా : నిత్యము పరమాత్మతో గూడియుండువాడును ఒక్క పరమాత్మయందే భక్తిగలవాడునగు జ్ఞానిశ్రేష్టుడగుచున్నాడు. అట్టి జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టమైన వాడును. అతడున్ను నాకు మిగులు యిష్టుడే.

యేసు చెప్పెను :- నీ దేవుడైన ప్రభువు (యెహోవ)నకు మ్రొక్కి ఆయనను మాత్రమే సేవింపవలెను. (లూకా 4:8)

బైబిల్ పరిభాషలో యెహోవాగా, సంస్కృతములో సర్వేశ్వరునిగా, అరబ్బీభాషలో అల్లాహ్‌గా పరిచయమైన ఆ సృష్టికర్తను వివిధ భాషలలో, వివిధ పేర్లతో పిలిచినప్పటికీ ఆయన మాత్రం ఒక్కడే.

**శ్లో. సర్వభూతానికేన్తేయ - ప్రకృతింయాన్తిమామికామ్,**
**కల్పక్షయే పునస్తాని - కల్పాదౌవి సృజామ్యహమ్.** (భ.గీ. 9-7)

తా :- అర్జునా సమస్త ప్రాణికోట్లు ప్రళయకాలమున ప్రకృతిని (మాయను) జేరి అందు అణగియుండును. తిరిగి సృష్టికాలమున వానిని నేను సృజించు చుందును.

విశ్వసించి సత్కార్యములు చేసేవారు నిస్సందేహముగా సృష్టిలో అత్యంత శ్రేష్టులు. వారికి వారి ప్రభువు వద్ద లభించే ప్రతిఫలం శాశ్వత నివాస స్థలాలైన స్వర్గవనాలు. (ఖుర్‌ఆన్ 98:7-8).

మరణరహితమైన వెలుగులతో నిండిన శాశ్వత తేజస్సునిచ్చే పతనరహితమైన ఆలోకానికి నన్ను చేర్చు. (అధర్వణ వేదం ; 9:113-7)

**శ్లో. యశ్శాస్త్రవిధి ముత్సృజ్య - వర్తతే కామ కారతః,**
**నససిద్ధిమవాప్నోతి - న సుఖంన పరాంగతిమ్** (భ.గీ. 16:23)

తా : ఎవడు శాస్త్రోక్తమగు విధిని విడిచిపెట్టి తన యిష్టము వచ్చినట్లు ప్రవర్తించునో, అట్టివాడు పురుషార్ధసిద్ధినిగాని సుఖమును గాని, ఉత్తమగతియగు మోక్షమునుగాని పొందలేడు.

కలియుగం పుట్టినప్పటినుండి ఇప్పటివరకూ ఎంతోమంది ప్రవక్తలు వివిధకాలాలలో, వివిధ భాషలలో, వివిధ జాతులలో దేవుడు ఒక్కడే యనే సందేశాన్ని యిచ్చారు.





# మతములు - వాటి స్థాపకులు

__శ్రీరామచంద్రమూర్తి__ త్రేతాయుగములో అయోధ్యలో కౌసల్యా, దశరధుల పుణ్యదంపతులకు జన్మించెను. ఈయన భగవదవతారము. కారణజన్ముడు. ఆచరణచేసి చూపించిన ఆదర్శమూర్తి.

__శ్రీకృష్ణ భగవానుడు__ ద్వాపరయుగములో మధురయందు దేవకీ, వసుదేవులను పుణ్యదంపతులకు జన్మించెను. ఈయన భగవదవతారము. కారణజన్ముడు. ద్వాపరయుగాంతరమున వేదసారమగు భగవద్గీతను అర్జునునకు బోధించెను. అదియే కలియుగములో హిందువులకు ప్రామాణిక గ్రంథము. సర్వ శాస్త్రముల సారము.

భగవదవతారములలో రామ, కృష్ణ అవతారములు పూర్ణావ తారములు.

**__గౌతమ బుద్ధుడు :__** క్రీస్తు పూర్వం 563 సంవత్సరములో కపిలవస్తు నగరమునందు జన్మించెను. గృహస్థాశ్రమములో కొంతకాల ముండి తరువాత ఈయన బౌద్ధ మతమును స్థాపించెను.

**__యేసు :__** పుట్టుకతో నైష్ఠిక బ్రహ్మచారియై పాశ్చాత్య దేశమున, ఇజ్రాయిల్ దేశమున క్రీస్తు మతము స్థాపించెను.

**__హిందూమతము :__** (సనాతన ధర్మము) ఒకరు ఏర్పరచినది గాదు. ఇది భగవంతుడుగు సర్వేశ్వరుని సంకల్పముచే వేదము ద్వారా అనాదిగా ఏర్పడినది.

__శ్రీ కంకరాచార్యులవారు :-__ కేరళ దేశము. నైష్ఠిక బ్రహ్మచారియే వీరు అద్వైతమును స్థాపించిరి.

**శ్రీ మధ్వాచార్యులవారు** :- కర్ణాటక దేశము. నైష్ఠిక బ్రహ్మచారియే. వీరు ద్వైత మతమును స్థాపించిరి.

**శ్రీరామానుజాచార్యులు** :-ద్రవిడ దేశము. విశిష్టాద్వైత మతము స్థాపించిరి.

**శ్రీ గురునానక్ గారు** :- బంగాళా దేశము. కొంతకాలము గృహస్థాశ్ర మములో నుండియు, కొంతకాలమునకు సిక్కు మతమును స్థాపించిరి.

**శ్రీ మహమ్మదు** :- అరబ్బీ దేశము. క్రీస్తు సంవత్సరము 570 సంవత్సరములో జన్మించెను. అరబ్బీ దేశము. ముస్లిం మతము. ఈయన గృహస్థాశ్రమములో కొంత కాలముండి, తరువాత త్యాగమవలంభించెను. మహమ్మదు మతము.

**శ్రీకృష్ణ చైతన్యులు** : అనగా(గౌరాంగ ప్రభువు) బంగాళా దేశము బాల్యమున వివాహితుడైనను స్వల్పకాలములోనే సర్వసంగ పరిత్యాగియై శ్రీకృష్ణ భక్తిని లోకమునకు చాటెను.

**శ్రీదయానంద సరస్వతీ స్వాములవారు** :- నైష్టిక బ్రహ్మచర్యమునుండియే సన్యసించి, ఆర్యమతమును స్థాపించిరి.

**శ్రీరామమోహనరాయ్‌గారు** :- బ్రహ్మమతమును స్థాపించిరి.

**జైనమునియు**: పరమత్యాగమొనర్చి సన్యసించియే తన పావన మతమును బోధించగలిగిరి.

**శ్రీ గాంధీగారు** : కొంతకాలము గృహస్థాశ్రమములో నుండినను తరువాత సర్వసంగ పరిత్యాగియై లోకమునకు శాంతిని చేకూర్చిన త్యాగధనులు

**శ్రీ సద్గురు మహర్షి మలయాళ స్వాములవారు** : కేరళలో జన్మించి ఆంధ్రప్రదేశములో తిరుమల కొండపైన వున్న గోగర్భ గుహలో తపస్సుచేసి ఆత్మదర్శనము చేసుకొని, గీతాప్రచారము చేసిన పుణ్య పురుషులు.



# ప్రతి నిత్యము ఆచరించవలసిన ధర్మ సూత్రములు

ఇంటిలోని వారందరు సూర్యోదయమునకు ముందుగా నిద్రలేవాలి. కళ్ళు తెరవడముతోటే యిష్టదైవమును దర్శించి నమస్కారము చేయవలెను. స్త్రీలు మంగళసూత్రము నకు నమస్కారము చేసుకొనవలెను. ఇళ్ళు వాకిళ్ళు శుభ్రము చేసి, వాకిట్లో నీళ్ళు చల్లి ముగ్గువేయాలి. లక్ష్మీదేవికి స్వాగతము చెప్పినట్లు, నీళ్ళు చల్లిన తరువాత ముగ్గువేయకపోతే, అది మైలకొంపతో సమానము. స్నానముచేసి, పవిత్రమైన వస్త్రములు ధరించి, కుంకుమ బొట్టుగాని లేక తిలకమును గాని పెట్టుకొని పొయ్యి రాజేసుకోవాలి. అదే ఆడవాళ్ళు చేసే అగ్ని హోత్ర కార్యక్రమం. అగ్నిహోత్రుని మన యింటికి ఆహ్వానించడము జరిగినది. పరిశుద్ధమైన మనస్సుతో భగవంతుని స్తోత్రములతోగాని, భగవన్నాముతోగాని వంట చేయాలి. ఈ విధముగా చేసిన వంట భుజించినవారికి, సద్భావన, మనశ్శాంతి, సాత్వికబుద్ధి కలుగుతుంది.

వంటచేసే సమయములో ఏ రాగద్వేషాలు గాని, భయాందోళనలుగాని ఈర్ష్యాదులు గాని కలిగివున్నచో, భోజనము చేసిన వారికి కూడా ఆ స్వభావములే కలిగి వుంటారు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. అన్నము నుండే జీవరాశులు ఉద్భవించుచున్నవి. అన్నము మాడిపోకూడదు. నిలువవుండి క్రుళ్ళిపోకూడదు. అన్నమును కాలితో త్రొక్కరాదు. భోజనానికి ముందుగా అన్నప్రసాదమును కళ్ళకద్దుకొని భగవంతుని ప్రసాదముగా స్వీకరించాలి. పిల్లలతో గూడా ఈ భావన

కలుగజేయాలి. పాదరక్షలతో భోజనము చేయకూడదు. నిలబడి భోజనము చేయుట, భోజనము చేయునపుడు మధ్యలో లేవడము (భపే భోజనము) ఇది మన సాంప్రదాయము కాదు. ఇంటిలో ప్రతి రోజూ పూజా మందిరములో నిత్యము ధూపదీప నైవేద్యములతో ఆరాధన జరపాలి. ఆ విధముగా చేసిన కారణంగా, మనలోనే వున్న భగవంతునికి మనము దగ్గరైన వారమవుతాము.

ఏ రోజున భగవధ్యానము చేయక, భగవంతుని దర్శించకవున్నచో, మనలోనే వున్న భగవంతునికి మనము దూరమైనవారమవుతాము. మనలోనే వున్న భగవంతునికి మనము దగ్గరైనచో మనకు లాభము, జయము లభిస్తాయి. అవమానాలనేవి వుండవు. మన హృదయములో ఆత్మ రూపములో భగవంతుడు వున్నకారణంగా.

తల్లిదండ్రుల పాదములకు పిల్లలు సమస్కారము చేయునట్లుగా అలవాటు చేయవలెను. తల్లిదంత్రులకు మూడు సార్లు ప్రదక్షణము చేసి గణపతి ముక్కోటి దేవతలచే ముందుగా ఆరాధింపబడుచున్నాడు. అందుచే తల్లిదండ్రుల ఆశీర్వాదము వలన పిల్లలకు ఎంతో మేలు కలుగుతుంది. కావున పిల్లలకు మంచి సంస్కారము చిన్నతనము నుండే అలవాటు చేయాలి.

ప్రాతఃకాలముననే అనగా ఆరుగంటలకు ముందుగానే స్నానాది కార్యక్రమములను ముగించుకొనవలెను. ఆ సమయములో చేసిన స్నానము, దివ్యశక్తిని బలమునిస్తుంది. తరువాత చేసే స్నానం రాక్షసస్నానమవుతుంది. అనగా ప్రయో జనము లేనిదవుతుంది. తల్లిదండ్రులు లేనివారు పితృ లోకానికి అధిపతియైన సూర్యభగవానునికి నమస్కరించాలి. ఉపవాస మున్న రోజులలో, పితృదేవతల కర్మ చేసిన రోజులలో బ్రహ్మచర్య



మును పాటించాలి. గుడిలోనికి వెళ్లి దైవదర్శనము చేసుకొని తీర్థము తీసుకొనవలెను. అన్నముతో సంబంధముగల పులిహోర ప్రసాదమును గుడిలో పెట్టినచో దానిని తిరస్కరించ రాదు. తీసుకొని వాసన చూసి ప్రక్కవారికి లేదా చిన్న పిల్లలకు యిచ్చి నచో ప్రసాదము తీసుకొన్నంత ఫలితము లభించును (ఉపవాస మున్న రోజులో). విడిచిపెట్టిన దోషము రాదు. ఉపవాస భంగము కలుగదు.

మామూలురోజులలో ప్రసాదము తీసుకొనకుండా రాకూడదు. ప్రసాదమును తిరస్కరించుట, దైవమును అవమాన పరచుటయేయగును. ప్రసాదము యనగా భగవంతుని అను గ్రహముయని అర్థము. నీవు వెళ్లే సమయము ప్రసాదము పెట్టే సమయము కాకపోతే, స్వామివారి తీర్థము తీసుకొని స్వామికి సంబంధించిన విభూతినిగాని, కుంకుమను గాని, పుష్పమును గాని, ప్రసాదముగ భావించి తీసుకొనవలెను. శ్రీ సత్యన్నారాయణ స్వామివారి వ్రత కథలో అయిదవ అధ్యాయములో ప్రసాదము యొక్క మహిమ వర్ణింపబడినది.

భగవంతుని పూజా పుష్పములను అక్షింతలను, కుం కుమ, విభూతిని అవమానపరచరాదు, త్రొక్కరాదు. ఐశ్వర్యము కావలయునని కోరువారు, స్త్రీ పురుష బేధములేక అందరూ విభూతిని ధరించవచ్చు. విభూతి అనగా ఐశ్వర్యం. ఐశ్వర్యం ఈశ్వరాధీనం. ఈశ్వర ప్రాప్తిచే లక్ష్మిప్రాప్తి కలుగును. ఏకాదశి ఉపవాసమున్నవారు ద్వాదశి ఘడియలలో భోజనము చేయ వలెను. ద్వాదశి రాత్రికి భోజనము చేయరాదు. భగవంతునికి నివేదన చేసిన ఆహారమునే, ప్రసాదముగా తీసుకొనవలెను. ఏకాదశివ్రతము శ్రీమన్నారాయణునకు ప్రీతికరమైనది.

ఇంటిలో పాచిఊడ్చేటప్పుడు పాచి గడప మీద

పడకూడదు. ఎందుకనగా గడప లక్ష్మీదేవి. నిత్యము పసుపు కుంకుమలతో నిండి వుండాలి. గడప మీద తలపెట్టి పడుకో కూడదు. గడపను త్రొక్కరాదు. కూర్చోరాదు. ఇంటిలో పాలు, పసుపు, కుంకుమ, అక్షింతలు, పుష్పములు త్రొక్కరాదు. దీపమును వెలుగుచున్న క్రొవ్వొత్తిని, వెలుగుతున్న స్టవ్‌ను నోటితో ఊదరాదు. పుట్టిన రోజున క్రొవ్వొత్తిని ఆర్పడం మన సంప్రదాయం కాదు. మనలో జీవుడు జ్యోతి రూపముగా ప్రకాశిస్తూ వున్నాడు. కావున వెలుగుచున్న జ్యోతిని ఊది ఆర్పడం మన ప్రాణాన్ని మనమే నశింపజేసుకొనువాళ్ళమవుతున్నాం. ఇది చాలా అరిష్టము.

మనము యితరులకు చేసిన దానమే. ఇంతకు పదియింతలై తిరిగి మనకు లభిస్తుంది. అందుకే పెట్టినవారికి, పుట్టిందే సాక్షి. పరోపకారమే పుణ్యము. ఇతరులకు బాధ కలిగించడమే పాపము. ఇతరులకు చేసిన ఉపకారము వెయ్యి యజ్ఞములకంటే గొప్ప ఫలము నిచ్చును. సత్పురుషులు ఎప్పుడూ మనస్సులో వున్నవే చెపుతారు. చెప్పిందే చేస్తారు. మనస్సు, వాక్కు, కర్మ ఈ మూడు త్రికరణాలు శుద్ధిగా ఒకటిగా వుంటాయి. దుర్మార్గులకు విభిన్నంగా వుంటాయి. భక్తియనగా పరమప్రేమ. అంతకుమించిన ప్రేమ మరి ఎవరిమీద వుంటుందో, ఆ ప్రేమయే భక్తి. కావున భగవదనుగ్రహానికి, భగవంతునిపై గొప్ప ప్రేమ వుండాలి. గోపికల భక్తి మధుర భక్తి. ఆ గోపికలు పూర్వజన్మలో త్రేతాయుగములో జ్ఞాన సంపన్నులైన మహర్షులు. కావున శ్రీకృష్ణ పరమాత్మ యొక్క అనుగ్రహానికి పాత్రులైనారు.

శ్రీకృష్ణ భగవానుడు చెప్పినట్లుగా ధర్మాన్ని ఆచరించాలి. శ్రీరామచంద్రమూర్తి ఆచరించిన విధముగా, ధర్మాన్ని అనుసరించాలి. రామోవిగ్రహవాన్ ధర్మః; మూర్తిభవించిన ధర్మ



స్వరూపుడు శ్రీరామచంద్రుడు. ధర్మమంతా ఒకరాశిగా చేసినా, ఆ స్వరూపమే శ్రీరాముడు. శ్రీరామునిలో ఎక్కడా అధర్మమన్నది, మచ్చుకైనా కనిపించదు. శ్రీరాముడు మానవునిగా, ఆదర్శ మూర్తిగా రామాయణములో మనకు కనిపిస్తాడు.

ప్రతి గ్రామములో గల దేవాలయము, త్రికాల అర్చనలతో, నిత్యము భగవన్నామ సంకీర్తనలతో వేదఘోషతో, ఉత్సవ కార్యక్రమములతో దేదీప్యమానముగా వైభవోపేతముగా కూడి ఉన్నప్పుడు తిరిగి రామరాజ్యమవతరిస్తుంది. దేవాలయ ములో జరిగే పూజ, వేదపారాయణాది కార్యక్రమములతో కూడివున్న ఆధ్వని తరంగాలు గాలిలో వ్యాపించి, దేశ శుభిక్షతకు కారణమవుతుంది. దేవాలయములో విగ్రహ ప్రతిష్ఠ సమయ ములో పంచ భూతాత్మకంగా, ప్రాణముతో కూడిన మూర్తిని వారి పరివార ముతో, ఆయుధములతో, వాహనములతో కూడి స్థిర ముగా వుండునట్లుగా, ఆగమశాస్త్రము ననుసరించి ప్రతిష్ఠ మహోత్సవము జరుగును. భక్తులందరు కుల,మత, వర్గ భేద భావము లేక ప్రతినిత్యము ఆ స్వామిని దర్శించి, నామ సంకీర్తన చేస్తూ సేవించిన, భగవదనుగ్రహముచే సుఖ సంతోషములతో జీవనము సాగిస్తారు.

దేశము సుభిక్షమైపాడి పంటలతో వర్ధిల్లుతుంది. గ్రామాల్లో దేవాలయాలలో నిత్యము ధూప, దీప నైవేద్యములు లేక పాడుబడిన ధర్మ సత్రవుల్లాగ అరాచకములకు నిలయమైన గ్రామములకు, గ్రామస్తులకు గొప్ప కీడు సూచించును. నూతన దేవాలయ ప్రతిష్ఠల కంటే, పాడుబడిన దేవాలయములను ఉద్ధరించడం మహాపుణ్యం. గ్రామీణ ప్రాంతములో ప్రతి రైతు కుటుంబం తన పంటలో 10వ వంతు భాగం భగవంతునికి సమర్పించుకోవాలి. క్రొత్త వస్త్రాలు భగవంతునికి సమర్పించి, తరువాత తను ధరించాలి. తమ ఇళ్ళలో జరిగే శుభ కార్య

క్రమాలలో, దేవాలయముతో సంబంధము కలిగినవారై వుండాలి. నిత్య జీవితములో దేవాలయముతో, భగవంతునితో అవినాభావ సంబంధం కలిగి వుండాలి. అదే మనకు శ్రీరామరక్ష.

సూర్యదేవుడు కర్మసాక్షి అంటారు. లోక బాంధవుడు. త్రిమూర్తి స్వరూపుడు. ఏ రాముడు మనము దేవుడని పూజించు చున్నామో ఆ రాముడే తన వంశ మూల పురుషుడైన సూర్యభగ వానుని స్తుతించి, రావణాసురునిపై యుద్ధమునకు వెళ్లినట్లుగా అగస్త్యమహార్షి ఉపదేశము చేసినట్లుగా రామాయణము చెబు తుంది. కావున ఆరోగ్యము కావలసినవారు నమస్కార ప్రీతిపాత్రు లైన సూర్యదేవుని ఆరాధించవలెను. ప్రతిరోజూ నమస్కారము చేయవలెను.

**రావిచెట్టు :-** రావిచెట్టు అశ్వత్థ వృక్షము. బ్రహ్మవిష్ణు మహేశ్వర స్వరూపము. ఎవరైతే ఈ అశ్వత్థ వృక్షమునకు భక్తి శ్రద్ధలతో 108 పర్యాయములుగాని, 40 పర్యాయములుగాని, 21 పర్యాయములు గాని ప్రదక్షిణ చేసిన మనోవాంఛలు నెరవేరును. ప్రదక్షిణము చేయునపుడు, వేపచెట్టుతో కలసివున్నప్పుడు **లక్ష్మీనారాయణ స్వరూపాయ వృక్షరాజాయతేనమః** అని నమస్కరించుతూ ప్రదక్షిణ చేయవలెను. కాని శనివారము రోజున మాత్రమే తాకి నమస్కారము చేయవచ్చును. మిగతా రోజులలో తాకకుండగ నమస్కార ప్రదక్షిణలు చేయవచ్చును.

రావిచెట్టుకి అశ్వత్థ వృక్షమని, బోధి వృక్షమని పేర్లు ఉన్నాయి. దాదాపుగా దేవాలయాల్లో రావిచెట్టు లేదా వేపచెట్టు వుంటాయి. ఎక్కువ చోట్ల రావి, వేప కలిసి వుంటాయి. రావి చెట్టును విష్ణుస్వరూపంగాను, వేపచెట్టును లక్ష్మీ స్వరూపం గాను భావించి పూజలు, ప్రదక్షణలు చేస్తూ వుంటారు. ఈ జంట



వృక్షాలను పూజిస్తే దాంపత్య దోషనివారణ కల్గి సంసారం అన్యోన్యంగా ఉంటుందని హిందువుల నమ్మకం. రావి వృక్షం గురించి పద్మపురాణంలో వివరించబడింది.

రావిచెట్టులోని అణువణువూ నారాయణ స్వరూప మేనని ఆగమశాస్త్రాలు కూడా చెబుతున్నాయి. ఈ విషయాన్ని స్కాంద పురాణం కూడా చెబుతుంది. అందుకే శ్రీకృష్ణుని వటపత్ర సాయి అంటారు. పసిబిడ్డకు జోలపాడేటపుడు వటపత్ర సాయికి వరహాల లాలి అని పాడుతూ నిద్ర పుచ్చడం జరుగుతుంది.

జ్యోతిష్యశాస్త్రంలో రావిచెట్టుకి ఒక ప్రత్యేకత వుంది. శనిదోషం పోవాలంటే ప్రతిరోజూ రావిచెట్టు నీడన నిలబడాలి. నమస్కరించాలి. ఈవిధంగా కొన్ని రోజులు చేస్తే శనిదోషం తొలగిపోతుందట. రావిచెట్టు కొమ్మలతో యజ్ఞయాగాదులు చేస్తారు. సన్యాసులు రావిచెట్టు కర్రను దండంగా చేసుకొంటారు. రావిచెట్టు నీడను కాసేపు కూర్చుంటే మంచి మంచి ఆలోచనలు వస్తాయి.

శుద్ధోదనుని కుమారుడైన సిద్దార్థుడు ఎన్నో సంవత్స రాలు రావిచెట్టు క్రింద ధ్యానం చేసిన తరువాతనే మహా జ్ఞానోద యము కలిగి బుద్ధుడు అయ్యాడు. అందువల్లనే రావిచెట్టును బోధివృక్షము అంటారు. బౌద్ధమతస్థులకు ఈ చెట్టు మహా పవిత్ర మైనది. శ్రీకృష్ణుడు చివరి దశలో ఈ వృక్షం క్రిందనే విశ్రమించి ప్రాణత్యాగం చేశాడు.

**వేప చెట్టు:-** వేపచెట్టు కూడా ఎన్నో ఔషధ గుణాలు కలిగిన దివ్యవృక్షం. వేపవృక్షంలో ఎన్నో ఔషధ గుణాలు వున్నాయి. వేప ఆకును ఎన్నో రోగాలకు మందుగా వాడతారు. వేపచెట్టు గాలికి

ఎన్నో రోగ కారక క్రిములు నశించిపోతాయి. వేప ఆకులను నీటిలో వేసి కాచి త్రాగినా, స్నానం చేసినా, చర్మవ్యాధులు, సూక్ష్మ క్రిములు నశిస్తాయి. వేపచెట్టు వంటి దివ్య ఔషధ వృక్షం భూలోకములో మరొకటి లేదు.

దివ్యశక్తులున్న వృక్షాలు కాబట్టి రావిచెట్టునూ, వేపచెట్టునూ దేవాలయములో ప్రత్యేకముగా నాటి పూజిస్తారు. రావిచెట్టును యిండ్ల వద్ద నాటకూడదు. వేపచెట్టును యింటికి ముందు, ఇంటి వెనుక నాటితే మంచిది. ఈ రెండు చెట్లను లక్ష్మీనారాయణులుగా భావించి పెండ్లిళ్లు చేస్తూ వుంటారు.

చెట్లన్నియు కూడా పగలు ప్రాణవాయువును మనకు అందించుచున్నవి. రాత్రిపూట అవి ప్రాణవాయువుని తీసుకొను చున్నవి. కాని వేపచెట్టు రాత్రింబవళ్లు ప్రాణవాయువును యిచ్చు చున్నది. కావున చెట్లన్నిటిలో వేపచెట్టు విశేషమైనది.

**ఉసిరి చెట్టు -** ఉసిరిపండు అయిదు రుచులు కలిగినటు వంటిది. ఈలాంటి రుచులు కలిగినపండు సృష్టిలో మరొకటి లేదు. కార్తీక మాసములో ఉసిరి చెట్టుకు పూజలు చేసి ఈ చెట్టు క్రిందగాని, నీడలోగాని భోజనము చేయడము విశేషము. ఈ పంచ రుచులు పంచ జ్ఞానేంద్రియములకు గుర్తు. అవి **తీపి, కారం, పులుపు, వగరు, చేదు** అని పంచరుచులు కలిగినటు వంటిది ఉసిరిపండు. ఇది ఉప్పుతో కలిసిన షడ్రుచులు (6 రుచులు) అగును. ఇది మానవుని శరీర ఉష్ణోగ్రతను తగ్గించి శక్తినిచ్చును. ఇందులో 'సి' విటమిన్ లభించును. ఎముకలకు సంబంధించిన కాల్షియం దీనియందు మనకు లభించును. ఈ పంచ రుచులు అనగా పంచ జ్ఞానేంద్రియములు, మనస్సుతో కలసి ఏకోన్ముఖము చేసి దైవపరముగా నడపడమే. అనగా



పంచ రుచులు కలిగిన ఉసిరిపండు, మన శరీరమునకు ఏవిధ ముగా శక్తిని, ఆరోగ్యకరముగా ఉపయోగపడునో అదే విధముగా పంచ జ్ఞానేంద్రియములు మనస్సుతో కలిపి అంతర్ముఖము చేసి ధ్యానించిన ఆత్మ తెలియబడతాడు.

ఉసిరిచెట్టు అయిదు రుచులు కలిగివుండడము వలన దాని నీడలోగాని లేక ఆవరణములోగాని భోజనము చేయడము వలన దాని వెంబడి వచ్చు గాలి ఆరోగ్యమును కలుగ జేయును. శరీరమునకు అన్నము అవసరము. ఆ అన్నమును దేవునికి అర్పణము జేసి భుజించవలయును. అప్పుడది ప్రసాద ముగా మారును. ఆ అన్నము భుజించునపుడు భగవన్నామ ముతోగాని లేక మౌనముతోగాని భుజించ వలయును. ఆ విధముగా భుజించిన ఆహారము పవిత్రమై మనలో దైవశక్తి అణువులు ఉద్భవించును.

**తులసి -** తులసిచెట్టు మొదట్లో సమస్తమైన పుణ్యతీర్థములు కలవు. తులసి చెట్టు మధ్యలో దేవతలందరూ వున్నారు. చివరిలో వేదములన్నీ వున్నవి. అటువంటి విశిష్టమైన మహిమాన్వితమైన పుణ్యప్రదమైన తులసిచెట్టుకు ప్రతిరోజు నీళ్ళుపోస్తూ, ప్రదక్షణ నమస్కారములు చేస్తూ, వుండడము మంచిది. తులసి మాత సేవ సర్వసిద్ధి ప్రదాయకం. సర్వ అరిష్ట నివారకం. అందరి దేవత లకు తులసితో పూజలు చేయవచ్చును. ఒక్క గణపతికి మాత్రమే వినాయకచవితి రోజు మాత్రమే పూజ చేయాలి. మిగతా రోజులలో తులసీదళములతో పూజచేయరాదు. తులసి వెన్నులతో పూజిస్తే ముత్యాలతో పూజచేసినంత ఫలితం దక్కుతుంది.

శరీరమునకు ఆహారము ఏవిధముగా అవసరమో, మనస్సు పరిశుద్ధము కావడానికి ఆత్మబోధ ఎంతైనా అవసరము.

ఈ కనబడే శరీరము ఆహారమువలన వృద్ధిచెందును. కాని మనస్సు, ఆత్మ కనబడవు. ఈ కనబడే శరీరము కొంతకాలమునకు నశించును. కాని కనబడని ఆత్మ నశించదు. అదియే దేవుడని, భగవంతుడని, ఆత్మయని అందుము. ఈ శరీరమునకు ఆహారము ఎక్కడైనా దొరుకుతుంది. కాని మనస్సు కూడా ఆహారము తీసుకొంటుంది. ప్రకృతిలో విషయాహారము తీసుకొంటే బంధనము. అదే మనస్సు సద్గురు సన్నిధిలో ఆత్మ ప్రబోధము శ్రవణముచేస్తే పరిశుద్ధమైన దైవసన్నిధికి చేర్చును. మన శరీరమునకు ప్రతిరోజు సబ్బు, సున్నిపిండి, సికాయ మొద లగు వాటితో శుభ్రము చేసిన ఆరోగ్యముగ నుందుము. కాని, మనసు శుభ్రము కావడానికి సద్గురు బోధ శ్రవణము, భగవ న్నామ స్మరణ, సద్గ్రంథ పఠన, సత్కార్యక్రమములలో పాల్గొనుట నుండిన మనస్సు పరిశుద్ధమై పాపము తొలగి, దైవమార్గములో ప్రయా ణము చేయగలదు.

**పూజ :-** శరీరముతో చేయునది పూజ. షోడశోపచార పూజ. అది తాత్కాలిక ఆనందము నిచ్చును. బాహ్యపూజలో పరిపక్వదశ పొందినగాని ఆత్మపూజ, ఆరాధన చేయుట సులభము. నశించే శరీరములో ఆత్మ అదృశ్యరూపములో ఉన్నది. మన మనస్సును అంతర్ ముఖము చేసి ధ్యానించవలెను. మనస్సు గూడా అదృశ్య రూపముగానే యున్నది. అదృశ్యముగా వున్న ఆత్మను, అదృశ్య ముగా వున్న మనస్సుతో ధ్యానించవలసియున్నది. అప్పుడే ఆత్మ తత్త్వము పట్టుబడగలదు. అందుచే ముందుగా సాకార పూజలో పరిపక్వదశ పొందినగాని, నిరాకార పూజలో (మానస పూజలో) మనసు నిలువదు. అందుచే మహర్షులు అరణ్యములో ధ్యానించి (తపస్సు చేసి) ఆత్మసిద్ధిని పొందిరి. కాబట్టి ఋషులు చూపిన



మార్గములో మనము నడవడము ఉత్తమము. దేవతలను, పితరులను, దైవసేవకులను, సాధు సత్పురుషులను, అతిథులను ఈ అయిదుగురిని పూజించువాడు మహోన్నతమగు కీర్తని బడయగలడు.

**గోమాత :-** గోమాత సర్వదేవతా స్వరూపము. గో సేవ వలన దిలీపుడు సంతానమును పొందినాడు. గోవును అవమానించ రాదు, కొట్టరాదు, తిట్టరాదు. మనము వెళ్ళేటప్పుడు గోవుకు ఎడమప్రక్కగా వెళ్లరాదు. గోవులు, బ్రాహ్మణులు భూలోకదేవతలు, గోవు ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ వుండకూడదు. అన్ని వేళలా రక్షణ కలిగించవలెను. ఆహార పానీయములు, సదుపాయములు చేయవలెను. ఆవు కన్నీరు కార్చరాదు. స్త్రీ మూర్తి కూడా కన్నీరు కార్చరాదు. స్త్రీ గృహలక్ష్మి, కన్నీరు కారిస్తే ఆ యింట్లో లక్ష్మీదేవి వుండదు. స్త్రీమూర్తిని, గోమాతను కాలితో తన్నరాదు. చీపిరికట్టతో కొట్టరాదు. ఆ విధముగా కొట్టిన లక్ష్మీదేవి నిలువదు. గోపూజ చేయువారు ఆవు వెనుకభాగముననే చేయవలెను. ముందు భాగములో ముఖమునకు పసుపు కుంకుమలతో అలంకరణ మాత్రమే చేయవలెను. మెడలో పూలదండ వేయ వచ్చును. గోవు ప్రసవించుచుండగా దూడ తలకాయ కనిపించ గానే ఆవుకు మూడుసార్లు ప్రదక్షణ నమ స్కారము చేసినచో భూ ప్రదక్షణ చేసిన పుణ్యము లభించును.

హిందువులు గోవులను దేవతా స్వరూపంగా భావించి పూజిస్తారు. భారతీయుల శక్తి, భారతీయుల సంపద, భారతీయుల బలం, గోవుల మీదనే ఆధారపడియుండేది. గోవును పూజించి, ప్రదక్షణ నమస్కారములు చేస్తే సర్వ పాప ములు హరించిపోతాయని హిందువుల ప్రగాఢ నమ్మకం.

ఈ కాలపు శ్రీమంతుడు కోట్ల ఆస్తి కలిగి వుంటేనే శ్రీమంతునిగా చెలామణి అవుతాడు. అందరూ గౌరవించి మర్యాదలు చేస్తారు. పూర్వకాలంలో అలా కాదు. ఎన్నివేలు, లక్షల గోవులుంటే అంత శ్రీమంతునిగా గౌరవించేవారు. ఈనాటి భూస్వాములకన్నా ఆనాటి గోస్వాములకు విశేష గౌరవముండేది. రాజ గౌరవం లభించేది. పూర్వకాలములో గోస్వాములే మహా శ్రీమంతులుగా వుండేవారు. చంచలమైన ధనానికి ఆ రోజులలో విలువలేదు. గో ధనమే ధనముగా భావించేవారు. మహాభారతములో విరాట రాజు గో ధనాన్ని దుర్యోధనాధులు దౌర్జన్య పూరితంగా దోచుకొనిపోవాలనుకొని అర్జునుని చేతిలో పరాభవం పాలవటం ఉత్తర గోగ్రణ కథలో (విరాట పర్వంలో) వుంది. గో ధనం లేని రాజ్యం క్షీణించి పోతుందని, అరిష్టాల పాలౌతుందని దుర్యోధనుని ఉపాయం. ఆనాటి రాజులకు, శ్రీమంతులకు గోవులే ధనంగా వుండేవి.

పూర్వకాల స్త్రీలు బహు సంతానవంతులుగా వుండేవారు. పుట్టిన బిడ్డలకు తల్లిపాలు చాలేవి కావు. పసి బిడ్డల నుండి పెద్దవారి వరకు ఆవుపాలే సంపూర్ణ ఆహారంగా సేవించేవారు. పసితనములో ఆవుపాలు త్రాగినవారికి, రోగాలు రావు. ఎందుకంటే ఆవుపాలు త్రాగినవారికి ఎక్కువ రోగ నిరోధక శక్తి వుంటుంది. గో సంతానమైన ఎద్దులు పొలం దున్ని ఆహారోత్పత్తికి సహాయ పడేవి. అన్నదాత అయిన రైతు సోదరునికి అన్ని పనుల లోను సహాయపడేవి గో సంతతి. ఇటువంటి గోమాతను దేవతగా పూజించడం ధర్మమేగదా. కావున గోమాతను సేవించేవారికి లక్ష్మీ కటాక్షం సిద్ధిస్తుంది. గోవుల కాపరికి ఆరోగ్యం, ఆయుష్షు ఎక్కువగా వుంటుంది.



<u>మానవుడుగా జన్మించినవాడు సంపాదించుకొనవలసినవి</u>:- 1) ప్రేమ, దయ, కరుణ ప్రతిక్షణ, అమలుపరచాలి. 2) చాడీలు చెప్పుట, చాడీలు వినుట పూర్తిగా మానాలి. 3) సత్యమునే ఎల్లప్పుడు పలుకుటకు ప్రయత్నించాలి. 4) ప్రజలను బాధించే ఏ దుర్గుణము వుండకడూదు. 5) అహింసాతత్వమును పాటించాలి. 6) ఇతరులను తనవలెనే ప్రేమించాలి. 7) పర పీడనము, పరదూషణము వుండకూడదు. 8) అసత్యము, అధర్మములతో మానవ జీవితము దుఃఖమయమవుతుంది. ఇది నరకానికి దారితీస్తుంది. అహంకారము వుండకూడదు. తాను ముందుగా సంస్కరింపబడి, తన పరిధిలో నున్నవారిని లేక సమాజమును ఆదర్శవంతముగా జేయుట ఎంతో ముఖ్యము. అటువంటి మంచి మనస్సు, మంచి బుద్ధి, మనకు భగవంతుని ప్రసాదించమని కోరుకొందాము. అందరూ సత్కర్మనిష్టులై, భగవద్భక్తులై, సదాచార సంపన్నులై బ్రహ్మానందముతో విరాజిల్లు దురుగాక. జై గురుదేవ్.



# అమృతవాణి

ఈ ప్రపంచమున విచిత్రమైన విషయమును గమనించలేక సతమతమై విరామము లేక శ్రమించి, కలత చెందుచున్నాడు మానవుడు. ఈ భూమి మీదకు తాను వచ్చునప్పుడు ధనము ఒక్కపైసా కూడా తెచ్చుట లేదు. శరీరమును విడిచి వెళ్ళునపుడు పిడికెడు మట్టిగాని, ధనము గాని, వస్తు వాహనములు గాని తీసుకొనిపోవుట లేదు. ఒట్టి చేతులతో రావడము, మరల తిరిగి వెళ్ళునపుడు ఒట్టి చేతులతో పోవటము ఇదే సృష్టిలోని విచిత్రము. తాను సంపాదించిన ధన సంపద యేమగుచున్నదో తనకు తెలియవు. మానవుడు ఈ సత్యమును తెలుసుకొనలేక అధర్మపరాయణుడై, అధిక ధనమును సంపాదిం చుటయందు నిమిషము తీరిక లేక, అసూయతో ఎదుటివాని అంతస్తులను గురించి ఆలోచించుచు, చంచల మైన మనస్సుతో జీవించుచు, శరీరమును వదులుచున్నాడు. జీవుడు జగత్తులోని వస్తువులను ధన, ధాన్యములను ఏ మాత్రము తీసుకొని వెళ్ళుటకు వీలులేదు. కాని తాను చేసుకొన్న పాపపుణ్యములనే వాసన రూపముగా మాత్రము జీవుడు తీసుకొనిపోవుచున్నాడు. ఆ వాస నలే మరుజన్మకు కారణమగును. కనుకనే మరల జన్మించు చున్నాడు.

జీవునికి మోక్ష పర్యంతము, చావడము, పుట్టడము కలుగుచుండును. ఇదే సంసార సాగరము. ప్రతి జన్మ, జన్మమున తల్లిదండ్రులు తప్పక వుందురు. బంధుమిత్రాదులు, ఆలుబిడ్డలు తప్పక వుందురు. జ్ఞానమార్గమును తెల్పు సద్గురువు లభించుట చాలా కష్టము. అట్టి గురువు దైవానుగ్రహమునగాని లభించడు.

ఈ సృష్టిలో వివిధరకములైన జీవులున్నాయి. అవి వివిధ



రకములైన చైతన్య స్థితిలో వుంటాయి. ఒక రాయియందు నూటికి పదవవంతు మాత్రమే చైతన్యమున్నది. అందుచేత వేల సంవత్సరములకు పరిణితిచెందును. వృక్షములలో నూటికి ముప్పదివంతులు చైతన్యమున్నది. అందువలన వృక్షములు పుట్టుట, చిగురించుట, పుష్పించుట, ఫలించుట కలిగియున్నవి. సర్వప్రాణులకు ఆహారముగా ఉపయోగపడుచున్నవి. వృక్షము తాను జీవనము చేయుచు, ఇతరులకు ఉపయోగపడుచు, అంకితభావముతో సేవ చేయుచున్నవి. కొమ్మలు కొట్టినను, పుష్పఫలములు కోసినను వృక్షమునకు బాధలేదు. కాని వృక్షశాస్త్రవేత్త అయిన శ్రీ జగదీశ్ చంద్రబోస్ అవికూడా బాధపడుచున్నవని చెప్పియున్నారు. సంపూర్ణ చైతన్యవంతుడు మానవుడు. అట్టి మానవుని అనుభవముతో చూసిన పెరుగుచున్న కేశములు (తల వెంట్రుకలు), గోళ్ళు ఖండించినను మనకు బాధ ఏ మాత్రము లేదు. అదే విధముగా వృక్షజాతికి సంబంధించినవి అన్నియు పెరుగుచు వున్నవి. కనుక బాధలేదని మనకు స్పష్టముగా తెలియుచున్నది. ఆకులు, కాయలు, పండ్లు ఆహారముగా తీసుకొనవచ్చును.

క్రిమి కీటకాదులందు నూటికియాభై వంతులు చైతన్యము కలిగివున్నవి. అందువలన అవి ప్రాకుట, నడచుట, ఈదుట, సంతాన ఉత్పత్తి చేసుకొనుట కలిగియున్నవి. జలచర ములు, భూచరములు, ఆకాశ చరములు ఇవి మూడు రకములుగా వున్నవి. వీటిని చంపిన అవి బాధపడుచున్నవి. ఒక అవయమును ఖండించిన విలవిల తన్నుకొనుచు బాధపడు చుండుట మనము చూచుచున్నాముగదా.

పశువులకు, పక్షులకు నూటికి డబ్బది అయిదువంతులు అంతఃకరణము చైతన్యవంతమైవున్నది. పక్షులు ఆకాశములో విహరించును. పశువులు భూమిమీద సంచరించును. వీటికి

ఆహారము, నిద్ర, భయమైథునములు మానవునితో సమానముగ నున్నవి. మానవులకు పశువులకు తేడా ఏమిటి? దుర్మార్గుడు కొంతకాలమునకు సన్మార్గుడుగా మారగలడు. మనిషిలో మార్పు చెందు గుణము గలదు. కనుక మానవుడు నిరపరాధు లైన మూగజీవులను చంపి భుజించుట మహాపాపము. మాంసాహారము మత్తును కలిగించి మేధస్సును నశింపజేయును.

నేను భగవంతుని సేవకుడను, దాసుడను అను ద్వైత భావము ప్రాథమిక దశలో వుండుట మంచిది. దుర్గుణములు కలిగిన మానవుడు భగవంతుని సేవవలన, భక్తి లక్షణములు అభ్యసించుట వలన సజ్జనుడు (మంచివాడు)గా మారగలడు.

మానవుని శరీరము దుర్గంధయుతము. కడుపులోన మలము, ఎముకలతో కూడిన అస్థిపంజరము, రక్తమాంసములు మొదలగు పదార్థములతో కూడి, బయటకు కనబడకుండ సున్నితమైన చర్మముతో కప్పి సుందరముగ భగవంతుడు నిర్మించినాడు. దేహమునకు ఒక చిన్న దెబ్బ తగిలినా బాధ కలుగును. వ్యాధుల వలన అనేక బాధలు అనుభవించుచున్నాము. ఈ దేహముతో అల్ప సుఖము (తక్కువ సుఖము), అనంత దుఃఖము. ఈ దేహము వలననే సుఖదుఃఖములు కలుగుచున్నవి. మానవునకు దేహముపై వున్న ప్రీతి మరి దేనియందు లేదు. దేహమును శక్తివంతముగ, అందముగ నుంచుకొనవలయునని ప్రతి ఒక్కరు తాపత్రయ పడుచున్నారు. శరీరము బుద్బుద ప్రాయము (నీటి బుడగతో సమానము).

యౌవనము, ధనము ఆయుష్షు తామరాకు మీద నీటిబిందువువలె అతి చంచలమని గ్రహించి, భగవంతుని ఆశ్రయించుముయని శాస్త్రము తెలుపుచున్నది. భార్యాపుత్రులను, బంధుమిత్రాదులను, వస్తువాహనములను మరెన్నిటినో ప్రపంచ



విషయములను మానవుడెంతో మమతతో ప్రేమించుచున్నాడు. తనకు మరణము సంభవించిన, తనువు విడిచిపోవునపుడు తన వెంట ఒక్కరూ రారు. వారందరూ ఆవేదనపడి వాపోవుదురే గాని నీ వెంట వచ్చువారు కారు. ఇది సృష్టిలోని విచిత్రము. ఈ శరీరము విడిచి వెళ్ళే ప్రతి ఒక్కడు పిడికెడు మట్టి తీసుకొని వెళ్ళిన; ఇప్పటికి భూమి మీద మన్నే మిగిలి వుండదు. ఈ సత్యమును ప్రతి ఒక్కరు చూచుచున్నారు. దారాపుత్రాదులు, ధన, కనక, గృహ, వస్తు, వాహనములు తన వెంటరావు. తను చేసుకొన్న కర్మఫలములే తనను వెంబడించును. అందువలన ప్రతి ఒక్కరు సత్కర్మలు చేయుచు నుండిన, ఆ మంచి కర్మల ఫలితమే తన అవసాన దశలో తోడుగా వచ్చి, తనకు స్వర్గలోక ప్రాప్తిని కలుగజేయును. మరుజన్మలో ఉత్తమ కుటుంబములో జన్మించి మోక్షసాధనకు అనుకూలమైన మార్గము దొరకును.

పరస్త్రీ వ్యామోహము వలన (కోరిక వలన) కీర్తి ప్రతిష్టలు నశించును. తన ఆస్తిపాస్తులు పోగొట్టుకొని దరిద్రుడగుచున్నాడు. ఇంట్లో కలతలు చెలరేగును, రోగగ్రస్తుడగును. దేహము వదిలిన తరువాత నరకమున పడుదురు. ఇన్ని తెలిసియు పురుషులు పరస్త్రీ వ్యామోహము చేత, స్త్రీలు పురుష వ్యామోహము చేత చెడు నడవడిక కలిగి చివరి దశలో అనేక బాధలకు గురియైన తరువాత మహాత్ముల ప్రబోధము గుర్తు కొచ్చును. అంతా అయిన తరువాత బాధపడిన ప్రయోజనము వుండదు. పూర్వజన్మ ఫలితము ననుసరించి తన కనుగుణమైన భార్య లభించును. ఆమెను చక్కగా పోషించి ఆనందమయిన జీవితము గడుపుకొనుచు, అన్యోన్య ప్రేమతో కలసి మెలసి జీవించుటచే భూతల స్వర్గమని పెద్దలు చెప్పుచున్నారు.

మామిడిచెట్టు తాను జీవించుచు తన ఫలములను

తానుభుజింపక, ఆఫలములను ప్రజలకందించి, పరోపకారము చేయుచున్నవి. ఆవులు, గేదెలు తన పాలను ప్రజలకందించి పరోపకారము చేయుచున్నవి. నదులు, మేఘములు, సూర్య చంద్రాదులు, పంచ భూతములన్నియు పరోపకారముగా జీవించుచున్నవి. **వ్యాసభగవానుని సూక్తి** :- పరప్రాణులకు ఉపకారము చేయుట పుణ్యము. అపకారము చేయుట, పరప్రాణులను బాధించుట మహాపాపము.

పరులకు ఉపకారము చేయుట వలన తన పాపములు నశించును. పరులకు ఉపకారము చేయుట వలన స్వర్గ లోకము నకు మార్గము దొరుకును. ఈనాడు మానవుడు తనకు అందరు ఉపకారము చేయవలెనని తలంచుచున్నాడు. తాను మాత్రము ఎవరికి ఉపకారము చేయుటకు అంగీకరించడు. పైపెచ్చు అపకారము చేయుచున్నాడు. మానవుడు కొద్దిగానో, గొప్పగానో ఉపకారము చేయుటకు ప్రయత్నించవలయును.

ప్రాణికోట్లకు మోక్షప్రదమైనది భగవంతుని పాదసేవయే గాని మరొకటి గాదు. శివుని వలన మోక్షము పొందిన సాలెపురుగు వేదములు చదువలేదు. పాముకు శాస్త్రజ్ఞానము లేదు. ఏనుగు ఏవిధమైన విద్యలను నేర్చుకొనలేదు. కన్నప్ప చెంచువాడు. ఏ మంత్రమును ఉపాసన చేయలేదు. కేవలము వారి భక్తియే వారికి మోక్షము నిచ్చినది. కావున భగవంతుని యందు భక్తిముఖ్యముగా వుండాలి. ప్రతివానికి సుఖదుఃఖములు సహజము. కాని అవి అనుభవించేటప్పుడు మాత్రమే తెలియునుగాని ముందుగా తెలియవు. జ్ఞాని యిలా భావించును నా సుఖమునకు పూర్వజన్మలోని పుణ్య ఫలితమే కారణమని తెలుసుకొనును. నా దుఃఖమునకు పూర్వజన్మలోని పాప ఫలితమే కారణమని తెలుసుకొనును. పూర్వజన్మలో చేసిన పుణ్యపాపములు, జీవునిలో వాసన రూపముగా అంతర్గతమై యుండును.



అవి సమయము రాగానే మనసులో ప్రేరణను జరుగును. ఆ ప్రేరణ బట్టి కర్మలు చేయుచుండును. జ్ఞాని ప్రేరణ రాగానే తెలుసుకొని తన హృదయములో దానిని ఛేదించివేయును. కావున ప్రియాత్మబంధువులారా పుణ్యకర్మలు చేయుచూ (మంచి పనులు) చేయుచు, దాన ధర్మములు చేయుచు జీవించండి, సుఖ జీవితమును పొందండి. సజ్జన సాంగత్యము మంచి మంచి ఆధ్యాత్మిక గ్రంధములను చదువుట, పరోపకారము కలిగి వుండుట. ఇవి జీవితాంతము ఆచరించు మానవుడు మహాత్ముడు కాగలడు. మనలో భక్తి స్థిరముగ నిలువవలెనంటే నిరంతరము సాధు సాంగత్యము, శాస్త్ర పఠనము, మంచి పనులు చేయుట, భగవద్భక్తి, గురుభక్తి ఈ లక్షణములు ఎవరిలో సంపూర్ణముగా వుండునో వారిలో భక్తి స్థిరముగా నుండును.

అనేక జన్మములనుండి దేహభావముతోను, ప్రపంచ భావముతోను, అనుభవములతోను ముడిపడినవాడే జీవుడు. ఈ జీవుడు బందీకృతుడై సుఖదుఃఖములను అనుభవించుచు సంసార సాగరమున మునకలు వేయుచు కాలము గడుపుచున్నాడు. ఇట్టి మానవుడు సద్గురుని దర్శించి, వానికి శిష్యుడై వారి సేవ చేయుచు వారు చెప్పు ఆధ్యాత్మిక ప్రబోధములను శ్రద్ధగా వినుచు, సంపూర్ణ జ్ఞానమును పొందువాడు మోక్ష మార్గమును పయనించగలడు.

మథించగా, మథించగా కర్ర నుండి నిప్పు పుట్టును. పెరుగును చిలకగా చిలకగా వెన్న వచ్చును. అట్లే గురువు ద్వారా చెప్పిన వాక్యములను శ్రవణము చేయగా, తదుపరి మననము చేయగా, చేయగా ఆత్మ తత్త్వము తెలియును.

చదువుకున్న వానికైనను ప్రయత్నింపనిదే జ్ఞానము లభింపదు. పైరువేసి దానిని శ్రద్ధగా చూసినవానికే పంట

లభించును. పైరు వేయక ఊరకే యున్నవానికి పంట లభించదు. అదృష్టము మీద ఆధారపడకూడదు. అధిక ప్రయత్నం చేయు వానికే ఈ ప్రపంచములో అన్ని కార్యములు చక్కగా ఫలించును.

ధనాశ కలిగిన మానవుడు పూర్వకాలములో ధనమును సంపాదించి ఎవ్వరికి తెలియకుండా తన తోటలోగాని, పెరటిలో గాని త్రవ్వి ధనమును పూడ్చిపెట్టుదురు. కొంతకాలమునకు మరచిపోవుదురు ఈ రహస్యము తెలిసిన తన బంధువులు గాని, దొంగలు గాని తెలుసుకొని అపహరించుదురు. కొంతకాల మునకు దాచిన వ్యక్తి త్రవ్విచూచిన ఏమి వుండదు. అప్పుడతడు ఆవేదనపడును, ఆ సమయములో దాన ధర్మములు చేయు బుద్ధిపుట్టిన ప్రయోజనముండదు. కనుక ధనము సంపాదించి నపుడే అన్నదానము, గోదానము, భూదానము చేయవలయును. అంతేకాదు దేవాలయములను నిర్మించుట, దిగుడు బావులు (నూతులు) త్రవ్వించుట అనేక దైవకార్యములు, యజ్ఞయా గాదులు చేసినవానికి ఇహలోకములో కీర్తి, పరలోకములో సుఖము అనుభవించి, మరుజన్మలో అధిక ధనికుడై ఆరోగ్య వంతుడై సుఖమును పొందగలడని మహాత్ముల ఉపదేశము.

ప్రాప్తమున్న యెడల దైవము ఫలమునిచ్చును. ప్రాప్తము లేనిచో ఫలము లభించదు. ఆ ప్రాప్తము ఎలా కలుగుననగా పూర్వజన్మలో దానధర్మములు చేసినవానికి, యజ్ఞయాగాదులు చేసినవానికి, చెరువులు, బావులు, సత్రము, దేవాలయములు, అన్నదానము అను ఈ సత్కర్మల పుణ్యఫలప్రాప్తి వలన ఈ జన్మలో దైవము వానికి లభింపజేయును.

పరులను ధూషించుట వలన అది వూరకేపోదు. అది పాపమై నిన్ను చుట్టుముట్టును. ఆ పాప కర్మఫలము జన్మ జన్మాంతరములయందు కూడా అనుభవించవలసినదే. కనుక



జాగరూకులై ఇతరులను నిందించవద్దు. అది వాక్కుచేయు పాపము. దీనివలన తాను చేయు పుణ్యము నశించిపోవును. దూర్వాసుడు అంబరీషుని నిందించి, దురవస్థను పొందినాడు.

రత్నాకరుడను బోయవాడు రామనామముచే మహా ఋషి అయినాడు. గుణము ప్రధానముగా వుండాలి గాని కులము గాదు. వాల్మీకి బోయవాడు. కాని రామనామమును కొన్ని కోట్లు జపము చేసి పాప విముక్తుడై వాల్మీకి మహర్షి అయినాడు. వాల్మీకి రత్నాకరుడుగా వున్నప్పుడు ఎన్నో పాపములు చేసినాడు. తరువాత నారదమహర్షి వద్ద ఉపదేశము పొంది సదాచారుడై, రామనామ మంత్ర ప్రభావముచే పరమఋషి అయినాడు. కనుక భక్తమహాశయులారా మీరు తెలిసో, తెలియకో పాప కార్యములు చేసి వుండవచ్చు. మీరు ఏ కులము వారైననూ ఫరవాలేదు మీరు సదాచారులై భగవన్నామమును జపించి పవిత్రులు కండి.

కోపము రజోగుణ ప్రధానమైనది. శాంతము సత్వగుణ ప్రధానమైనది. కనుక శాంతము కలిగి వుండండి. ఓర్పుగలవానికే కోపమణిగిపోవును. కనుక ప్రయత్నబలముచేత ప్రతి మానవుడు ఓర్పు కలిగి కోపమును జయించవలెను. భర్తను లెక్కచేయని భార్యకు ఉత్తమ గతిలేనట్లు, గురువుని గౌరవింపక అవమానించు శిష్యునికి ముక్తి లభించదు. మన భారతీయ సనాతన సాంప్ర దాయములలో గురు శిష్య పరంపరయును అగ్రస్థాన ములో వున్నది. కనుక శిష్యుడు మంచి గురువుని ఎన్నుకొని, అతని దగ్గర దీక్ష తీసుకొని తరువాత తన జీవితములో అతనిని అగౌరవపరచకూడదు. నిత్యం గౌరవించి పూజించిన వానికి ముక్తి సులభ సాధ్యము. గురూపదేశము లేనివానికి ముక్తి బహు జన్మ లలో కూడా లభింపదు.

ఆధ్యాత్మ రంగములో అసాధ్యమైనది ఆత్మయందు మనస్సును నిలుపుటయే. ప్రతి సాధకునికి ముప్పతిప్పలు పెట్టునది. ముందుకు సాగనీయక వెనుకకు లాగునది. యీ చంచల మనస్సే చంచలత్వమునకు కోరికలే కారణము. కోరికలకు దృశ్య వ్యామోహమే కారణము. దృశ్య వ్యామోహము లేనివానికి దృశ్యాతీత బ్రహ్మమునందు మనసు నిలుపుట అతి సులభము. ఇట్టి స్థితి బహు జన్మల సాధనా, సంస్కారము వలన లభ్యమగును. లేక తీవ్ర అభ్యాస వైరాగ్య బలముచేత ఈ జన్మలోనే మనస్సును నిలుపవచ్చును. అట్లు నిలిపినవాడే బ్రహ్మీస్థితిని పొందగలడని మహాత్ముల సందేశము.

ఈ ప్రపంచములో ప్రతిజీవుడు కర్మఫలాధీనుడు మరియు కర్మాచరణుడు. తను చేసుకొన్న కర్మఫలముల ననుసరించి లాభనష్టములు, నిందాస్థుతులు జయాపజయ ములు కలుగును. సుఖదుఃఖములు కాలానుసారముగ సంభవించును. నిరంతరము సముద్రములో అలలు ఏవిధముగా వచ్చుచుండునో అదే విధముగా జీవించియున్నంతవరకు సుఖదుఃఖములు వచ్చుచునే యుండును.

భగవంతుని సృష్టిలో కొన్ని శాసనములున్నవి. ప్రతి జీవుడు కర్మచేయుచున్నాడు. కర్మచేయక అరనిమిషము కూడా వుండ లేడు. కాని కర్మలు రెండు రకములు. 1) సత్ కర్మలు (మంచి పనులు) 2) దుష్కర్మలు (చెడ్డ పనులు). సత్కర్మలు చేయుట వలన సుఖము, దుష్కర్మలు చేయుట వలన దుఃఖఫలము అనుభవించుట జీవుని విధి అయియున్నది. తాను చేసిన కర్మఫలము యేజన్మలోనైనా అనుభవించవలసినదే ఇది దైవ శాసనము.

ప్రతి మానవుడు పుట్టినది మొదలు మరణపర్యంతము



మంచి కర్మలు, చెడ్డకర్మలు చేయుచునే యుండును. చిన్నతనమున తెలియక కొన్ని చెడ్డ పనులు చేసి మరచిపోయినా మరణించిన తరువాత జీవుని వెన్నంటి ఆ కర్మఫలమును అనుభవింపజేయును. చెడ్డ కలిగిన దైవమును నిందింతురు. మంచి కలిగిన మెచ్చుకొందురు. కష్ట సుఖములు రాత్రిపగలు మాదిరి వచ్చుచునే యుండును. మంచి చెడ్డలకు వారు చేసుకొన్న కర్మయే కారణము గాని దైవము కారణము గాదు.

ఈ మానవజన్మ ఎత్తినందుకు పరమాత్మను తెలుసుకొన వలెను. అట్లు చేయక పాపబుద్ధితో చెడ్డ పనులు చేసిన అధోగతే కలుగును. ఎనుబది నాలుగు లక్షల జీవరాశులలో మానవజన్మ ఉత్కృష్టమైనది. ఒక్క మానవుడు తప్ప మిగతా జీవరాశులన్నియు విధి కృతజన్మలు. అనగా ఏవిధమైన గుణములతో పుట్టునో, అదే గుణములతో అవి మరణించును. కొద్దిగా కూడా మార్పురాదు. పులిక్రూరగుణములతో పుట్టును. అదే గుణములతోనే మరణించును. గోవు సాధుగుణములతో పుట్టును. అదే గుణములతో చనిపోవును. పులి క్రూర గుణములను మాని సాధు గుణముల నలవరచుకొనలేదు. గోవుసాధుగుణములను వదలి క్రూరగుణ ములను అలవరచుకోలేదు. అందుచేత వాటిని విధికృత జన్మలు అన్నారు.

మానవుడు అలా కాదు. క్రూరగుణములతో జన్మించిన మానవుడు మంచివారి స్నేహముతో సద్గుణములను అలవరచుకొని మహాత్ముడు కాగలడు. క్రూరుడైన రత్నాకరుడు వాల్మీకి మహర్షి అయ్యాడు. పుండరీకుడు, బిల్వమంగళుడు మొదలగు వారందరూ మారి మహాత్ములయ్యారు. కావున మానవజన్మ ఎత్తినందుకు పరమాత్మ తత్త్వమును తెలుసుకొన వలెను.

మానవుడు ప్రపంచములో దూరశ్రవణ యంత్రాలను

రేడియోలు, టి.వి.లు, రైళ్ళు, విమానములు, కంప్యూటర్లు ఎన్నో తెలుసుకొని కొంతవరకే ఆనందాన్ని కలిగించాడు. కాని పరమాత్మ తత్త్వమును తెలుసుకోలేక శాంతి ఆనందములు పొందలేక జనన మరణ చక్రమునందు పరిభ్రమించుచున్నాడు. కనుక ప్రతి మానవుడు పరమాత్మ తత్త్వమును తెలుసుకొని ఆ పరమాత్మను పొంది, జనన మరణ చక్రము నుండి విముక్తిని పొంది శాశ్వతమైన ఆనంద మోక్షమును పొందవలయునని మహాత్ముల ఉపదేశము.

మానవుడు దేహాభిమానము, కులాభిమానము, మతాభిమానము, భాషాభిమానము అను ఈ అభిమానమనే గొలుసులచేత బంధీకృతుడైవున్నాడు. వస్తు, వాహనము, గృహము, ధన, ధాన్యంబులు సంపాదించుటే ప్రధానము గాదు. యజ్ఞ, దాన తపస్సు, పరోపకారము, సత్కర్మలు చేయుచు ఆత్మ జ్ఞానము పొంది ముక్తులగువారు ధన్యులు, వారే మోక్షమున కర్హులు.

మానవుడు అధిక ఆశవల్లనే పాపములు చేయుదురు. ఆశకు లోబడరాదు. ఆశను విడుచువాడే పరిశుద్ధమైన ఆత్మకల వాడు. పాపకార్యములకు, మానవుని పతనమునకు, అశాంతికి ఎక్కువగా ఆశ మూలమననే కలుగుచున్నది. ఆశను వదలినవారు మోక్షమార్గమును చేరగలరు. ఆశ అంతములేనిది. అందుచే భగవంతుడు యిచ్చిన దానితో తృప్తిబొందుటయే సంతుష్టికి మార్గము.

ఈనాడు కొందరు గురుసేవ చేయక గురువు దగ్గర ఉపదేశము పొందక శాస్త్రములు చదివి లక్ష్యసిద్ధిని పొందలేక పోవుచున్నారు. గురువు దగ్గర శిక్షణ పొందక ఎన్ని శాస్త్రములు ఎంత కాలము చదివినా చర్చలు చేసినా బ్రహ్మమును చేరలేరని



మహాత్ముల ఉపదేశము. కావున ప్రతి ముముక్షువు గురువుని ఎన్నుకొని వారి దగ్గర శిక్షణ పొందిన అతడు జ్ఞానికాగలుగుతాడు.

అనాదికాలము నుండి సంసారమనే సముద్రములో పడి మునిగితేలుచూ దరిగానక, అజ్ఞానాంధకారములోబడి అనేక దుఃఖములు అనుభవించుచు చావు, పుట్టుకలు, వార్ధక్యబాధలు, రోగములు మున్నగునవి అనుభవిస్తూ సంసార భారంచే క్రుంగిపోతున్నాడు మానవుడు. ఈ బాధలన్నిటిని తప్పించు కోవడానికి ఒక్కటే మార్గముంది. అదియే సద్గురు సాన్నిధ్యము. అనుభవజ్ఞుడైన గురువువద్దకు వెళ్ళి వారిని హృదయ పూర్వకముగ సేవించి, వారి ద్వారా ఆత్మ బోధను పొందాలి. వారు బోధించిన ప్రకారము దైవసన్నిధికి చేరుకోవడానికి తగిన కృషి చేయాలి. సంసార బాధలన్నిటిని తప్పించుకోవడానికి ఇది ఒక్కటే మార్గం.

అనాది కాలము నుండి జీవుడు సంసారక్షేత్రమున తిరుగాడుచు ఎన్నెన్నియో జన్మలను అనుభవిస్తున్నాడు. 84 లక్షల జీవరాసులలో ఏదో ఒక జన్మను పొంది అది పూర్తి అయిన పిదప మరొక జన్మకు వెళ్ళి ఈ ప్రకారముగా కాలచక్రములో గిరగిరా తిరుగుచున్నాడు. ఎంతయో సుకృతవశము చేత అట్టి దుర్లభమగు మానవజన్మ జీవునకు లభించినది. కాబట్టి తెలివి గలవాడు అలస్యము చేయక గురుసాన్నిధ్యమున ఆత్మ జ్ఞానమును పొందడానికి ప్రయత్నించాలి. ఈ మహోన్నత నరజన్మను సార్థకం చేసుకోవడానికి ఆత్మజ్ఞానమునే సంపాదించాలి. ఈ ప్రపంచమున జీవుడు ఎన్నియో భోగములను అనుభవిస్తు న్నాడు. ఎన్నియో సంపదలను పొంది మురిసిపోతున్నాడు. కాని అవన్నీ ఎంత కాలము వరకు వుండునో అతడు ఆలోచించుట లేదు. ఆ భోగాలు, ఆ వైభవాలు, ఆ సంపదలు ఎంతకాల ముంటాయి.

ఒకవేళ ఎక్కువ కాలమున్నప్పటికిని వాటిని అనుభవించేవాడు త్వరలోనే అంతర్ధానమవుతాడు. పూర్వము ఎందరో మహారాజులు ఎన్నో విషయ సుఖాలను అనుభవించి అంతరించిపోయారు. ఒక చిల్లిగవ్వ కూడా వారి వెంట వెళ్ళలేదు. మన గతి కూడా అంతే.

ప్రపంచములో కొందరు తమ ధనాన్ని చూసి, తమ సంపదలను చూసి మురిసిపోతూ వుంటారు. కాని ఆ ధనం ద్వారా పుణ్యాన్ని సంపాదించినపుడు మాత్రమే ఆ ధనం సార్ధకమవుతుంది. కావున దాన ధర్మముల ద్వారా ఆ ధనాన్ని సద్వినియోగం చేసి తద్వారా పుణ్యం సంపాదించుకోవాలి. ప్రాపంచిక ధనం అంత్యకాలములో జీవుని వెంటరాదు. అది ఇక్కడే నిలిచిపోతుంది. జీవుని వెంట వెళ్ళేది పుణ్యమనే ధనం. జీవుడు ఏ లోకానికిపోయినా ఆ పుణ్యమను సంపద అతని వెంట వుండి అతన్ని కాపాడుతుంది. అతనికి సుఖాన్ని కలుగ జేస్తుంది. కనుక వివేకవంతుడు ధనమును సంపాదించినప్పటికి, పరోపకారం ద్వారా దానిని సార్ధకం చేసుకోవాలి (సద్వినియోగ పరచుకోవాలి). అప్పుడే నీ జన్మ సార్ధకమవుతుంది. అందరూ తల్లిదండ్రుల సేవ, గురుసేవ, దైవసేవ చేసుకొంటూ ఆత్మ జ్ఞానమును సంపాదించుకొని మోక్షాన్ని పొందండి.





# ధ్యాన సాధన

మనము ఏ పనిచేసినా లాభము, ఆనందము కోసమే చేస్తాము. ఎంత సంపాదించినా, ఎన్ని కోరికలు తీరినా మనలో ఎంతో కొంత అసంతృప్తి మిగులుతూనే వుంటుంది. మన సంపాదన గురించిగాని, వ్యాపార సమస్యలు గాని, పిల్లల భవిష్యత్తు గురించిగాని, నిత్యమూ ఏదో ఒక సమస్య మనలను వెంటాడుతూనే వుంటుంది. అవి ఒక్కరోజులోగాని, కొంత కాలమునకు గాని సమసిపోయేవిగావు. కాని ధ్యానంలో అన్నీ లయమయిపోతాయి. మనకు ఆనందం కలగాలంటే ఒక్క ధ్యానం ద్వారానే కలుగగలదు. ధ్యానంలాంటి సాధన ఈ ప్రపంచములో మరొకటి కనిపించదు.

ప్రతి వ్యక్తి ప్రకృతికి బానిస అవుతున్నాడు. కాని ప్రకృతిని జయించడము కష్టసాధ్యమే అయినను, గీతలో శ్రీకృష్ణ భగవానులు అభ్యాసము, వైరాగ్యము చేతను ప్రకృతిని దాటగలమని తెలిపియున్నారు. మనము స్వతంత్రముగా జీవించాలంటే ధ్యానము తప్పనిసరిగా అవసరమైయున్నది. ధ్యానము యొక్క శక్తి అనంతము. ముందుగా మనస్సును స్వాధీనములో ఉంచుకోవాలి. మనస్సులో అనేక సమస్యలు చుట్టిముట్టి వికలముగా వుంటుంది. చంచలమైన మనస్సు ఇంద్రియాలను ఆధారముగా తీసుకొని, అనేక విషయాలపై పరుగులు తీస్తూ వుంటుంది. అటువంటి మనస్సును ఏకాగ్రతపై నిలపడానికి ఏకైక మార్గము ధ్యానము మాత్రమే.

మనకు ఎన్ని సదుపాయములు వున్నా యింకా ఎక్కువ

కావాలని కోరుకుంటాము. ఉన్నదానితో తృప్తిపడడం జరగదు. ఇంకా వెలితిగానే వుంటుంది. ఎంత కలిగినా అసంతృప్తిగానే వుంటుంది. ఆనందం ఎక్కడో వుందని భ్రమపడుతూ వుంటాము. కాని ఆయానందము ధ్యానములోనే కలుగుతుందని మనమూ హించలేము. అది మన ఊహకు కూడా రాదు. నిజమైన ఆనందము పొందాలంటే ధ్యానం ద్వారానే పొందగలం.

ధ్యానం ద్వారా మానసిక బాధలు తొలగుతాయి. ఆనందం, తృప్తిలాంటివి కలుగుతాయి. బి.పి. గలవారికి ఆరోగ్యముగా వుండాలనుకొనేవారికి ధ్యానం చాలా అవసరమైయున్నది. ధ్యానం నిత్యము క్రమము తప్పకుండా చేసేవారిలో ఎక్కువకాలం జీవించడం, శరీరములోని మార్పులను గమనించగలం. ధ్యానము వలన సంకల్ప, వికల్పములు తగ్గి, మనస్సునకు ప్రశాంతత ఏర్పడి అందరిపట్ల సమభావం కలుగుతుంది. ధ్యానము వలన రక్తపోటు, గుండెకొట్టుకునే వేగం తగ్గడమేగాక శ్వాస ఉధృతము తగ్గుముఖము పట్టుతుంది. శరీరమునకు వ్యాయామము ఎంత అవసరమో మనస్సు ప్రశాంతముగా ఉండడానికి ధ్యానము అవసరమైయున్నది. శ్వాసపై ధ్యాస వుంచడము కూడా ధ్యానమే.

ఏ ధ్యాన పద్ధతి అయినా మనసులో ఆలోచనలు లేని ప్రశాంత వాతావరణములోనికి పయనింపజేయుటయే. ఏదైనా ఒక ఆసనములో ధ్యానపద్ధతిలో కళ్ళుమూసుకొని స్థిరముగా కూర్చున్న తరువాత మనం శ్వాస మీద దృష్టి నిలిపి వుంచాలి. అనగా ఉదరశ్వాసపైనే మన దృష్టి నిలపాలి. మన శ్వాస దానంతట అదే జరిగేలా చూడాలి. శ్వాస జరిగేటప్పుడు గమనిస్తూ వుండాలి. దానికి కొన్ని నిమిషములు పడుతుంది. ఆ విధముగా చేసేటప్పుడు పీల్చిన గాలి బయటకు వెళ్ళడం



గమనించగలం. గాలి నెమ్మదిగా దానంతట అదే సున్నితంగా ఛాతిలోనుండి బయటకు వెళ్ళడం గమనించగలం.

మన ఆలోచనలకు అడ్డుకట్టవేయడమే దానికి పరిష్కారము. విపరీతమైన ఆలోచనలు, ఎడతెగని ఆలోచనలు, శరీరానికి మనస్సుకి హాని కలుగజేస్తాయి. ధ్యానం ఆధ్యాత్మిక జీవితానికే గాక లౌకిక జీవితానికి కూడా ధ్యానం అవసరమైయున్నది. ఆందోళనకు లోనై మనశ్శాంతి లేక సతమతమవుతున్నప్పుడు, దీనికి కారణం మనసు అదుపు తప్పడమే. మనస్సుని అదుపులోనికి తీసుకురావడానికి మంచి సాధనం ధ్యానం.

ప్రాపంచిక విషయాల చింతన లేకుండా కేవలం పరమాత్మను గురించిన ఎడతెరపిలేని చింతన ధ్యానం. మనోలయానికి మార్గం ధ్యానం. మనస్సును యిష్టదైవం మీదనో, నాసికాగ్రమీదనో, హృదయ పద్మంపైననో, భ్రూమధ్యముననో శ్వాసమీదనో నిలిపి, అన్యచింతలను అరికట్టడం ధ్యానం.

జపములో మనసు నోరు, చేయి అను మూడు అంగాలు పనిచేస్తే, ధ్యానంలో మనస్సు మాత్రమే పనిచేస్తుంది. ధ్యానం రోజుకు నాలుగుసార్లు చేయుట మంచిది. కనీసము ఉదయము, సాయంత్రకాలం, రెండు సంధ్యల్లోనైనా ధ్యానం చేయుట మంచిది. ప్రతి ధ్యానకాలంలో కనీసం అరగంటకు తక్కువ లేకుండా ధ్యానం చేయాలి.

**ధ్యాన స్థలం :** నిశ్శబ్దంగా వుండే ఏకాంత స్థలములో కూర్చొని ధ్యానం చేయాలి. యింటిలో ఒక గదిని దీని కొరకు ప్రత్యేకించుకోవడం మంచిది. ఓంకారాన్ని ఉచ్ఛరించిన తరువాత మనశ్వాస సోహం అంటూ రోజుకు 21600 సార్లు మనలో ప్రవేశిస్తూ, బయటకు వస్తూ పోతూ వుంటుంది. దీనిని హంసయని కూడా

అంటారు. ఉచ్ఛ్వాస, నిశ్వాసాలను తదేకంగా గమనిస్తూ కూర్చో వాలి. దీనినే శ్వాస మీద ధ్యాస వుంచడం అంటారు. ఇలా శ్వాస మీద ధ్యాసవుంచి, గమనిస్తూ రాగా రాగా శ్వాస రాను, రాను, రాకపోకలు తగ్గుతవి.

నావతో సముద్రాన్ని దాటినట్లే ధైర్యంతో లోకాన్ని, ధ్యానంతో మాయను, యోగంతో మనస్సును, తత్త్వ విచారణతో సంసారాన్ని దాటాలి. అశాశ్వతమైన దేహము యొక్క రక్షణ కొరకై వినియోగింపబడే సమయములో ఒకప్పుడైనా దైవజపం, ధ్యానం మొదలైన సత్కర్మలలో ప్రవర్తించడమే మానవజన్మ యొక్క సాఫల్యానికి హేతువవుతుంది.

నీవు ఆత్మనిలయం కావాలనుకుంటే ఆహార నియమం పాటించు. నిశ్చల ధ్యానం కావాలనుకుంటే నిర్మలమైన భక్తిని చేపట్టు. మనస్సు నిర్మలం కావాలనుకొంటే నిష్కామకర్మ అనుష్టించు. భగవద్భక్తి కావాలంటే ఈశ్వర సేవ చేయి. జ్ఞానం కావాలంటే ధ్యానం చేయి.

వాక్కు, క్రియ, మనస్సు అను ఈ మూడు శుద్ధంగా లేకుంటే సాధకుడు పవిత్రాత్ముడు కాజాలడని భావించాలి. పరి శుద్ధమైన త్రికరణాల సంపుటియే యోగమంటారు. అట్టియోగ సిద్ధికై సదా ప్రయత్నించాలి.

ధ్యానం భగవంతుని అనుగ్రహమునకే కాదు. ఇటు ఆరోగ్య రిత్యా కూడా ఉపయోగపడుతుంది. ఏ వృత్తిలోవారైనా వారి వారి కార్యాలలో మునిగి విసిగి, అలసిపోయి యింటికి వచ్చిన పిదప, కాస్త స్నానం చేసి ఒక చోట కూర్చుని కండ్లు మూసుకొని ఏ సంకల్పము లేకుండా సమస్తము మరచుటకు ప్రయత్నించి నచో అప్పుడు కలుగు శాంతి, ఆనందము మరెక్కడ దొరకదు.



దానినే బ్రహ్మానందము అంటారు. బ్రహ్మానందము వాక్కుచే వర్ణించలేము. మనస్సుచే చింతించలేము. అది అనుభవించిన వారికే తెలుస్తుంది. కాని వర్ణించునెవరి తరము కాదని మహాత్ములు తెలియ జెప్పుచున్నారు. అట్టి బ్రహ్మానందమును పొందుటకు సాధన చాలా అవసరమైయున్నది. అందులకు ముఖ్య కారణము పరి పరి విధముల పరిగెత్తు మనస్సును నిలిపి వశపరచుకొనుటయే.

చంచలమైన మనస్సును సాధన ద్వారా తన ఆధీనములో నుంచుకొని ధ్యానమునకు సహకరించుటకు ఒప్పందము కుదుర్చుకొనవలసియుండును. లౌకిక పదార్థములు, విషయ ములపై తిరుగాడు మనస్సును భగవంతుని పాదపద్మములపై వుండునట్లు (నిలుచునట్లు) చూడవలెను. ఆ మనస్సు పర మాత్మలో లీనమగుటచే సాధకునకు పరమశాంతి కలుగును.

**శ్లో. మన ఏవ మనుష్యాణాం - కారణం బంధమోక్షయోః**

మానవుని యొక్క బంధమునకుగాని, మోక్షమునకు గాని అతని మనస్సే కారణం. కావున బహు విధములుగ వృత్తులలో చంచరించు మనస్సును నిగ్రహించి ఒకే లక్ష్యము నందు కేంద్రీకరించునట్లు చేయుట సంకల్ప, వికల్పాత్మకమైన ఆలోచనగల సంపుటియే మనస్సు.

గీతలో శ్రీకృష్ణభగవానులు బోధించినది అభ్యాసము, వైరాగ్యము వలన మనస్సును నిగ్రహింపవచ్చునని అర్జునునికి బోధించెను.

**భగవద్గీత :** శబ్దస్పర్శాది విషయాలను బహిష్కృతం చేసి వాటిని గురించి ఆలోచించకుండా దృష్టిని కనుబొమ్మల మధ్య నిలిపి ప్రాణాపానాలను కుంభకం చేత నిరోధించి, ఇంద్రియాలను మనస్సును బుద్ధిని నిగ్రహించి, కామక్రోధ భయాదుల్ని జయించి,

మోక్షమునందే ధ్యానముకలవాడై యుండవలెను. అట్టి ధ్యాన యోగిముక్తుడే అవుతాడు. మోక్షమునకు అనేక మార్గము లున్నను, అన్నిటికన్నా ధ్యానయోగ మార్గము ఉన్నతమైనదిగా నున్నది. ఈ సంగతిని భగవానుడే గీతలో చెప్పియుండిరి.

**గీత 8-28 :-** వేదములు చదివినవారి కన్నను, యజ్ఞములు చేసిన వారికన్నను, తపస్సు చేసిన వారికన్నను, పుణ్యార్జన చేసినవారికన్నను, యోగి అంతస్తు గొప్పది అని చెప్పడమే గాక, ఇంకను గీత 6-46 శ్లోలో అర్జునా తపస్వి కంటెను, జ్ఞానికంటెను, కర్మలను జేయువారికంటెను, ధ్యానయోగిస్థానము ఉన్నతమైనది. అందువలన నీవు యోగివి కమ్ము అని ప్రబోధించెను. కావున అనుభవజ్ఞుడైన గురువు దగ్గరకు వెళ్ళి అతని ఉపదేశములను పాటించాలి. దేహముపై వ్యామోహమును తగ్గించుకోవాలి. దేహ బుద్ధి వలన జీవ లక్షణములు వచ్చినవి. దేహబుద్ధి పోయినవారు, క్షణములో దేవుడైపోతాడు. దేహవాసన ఒక భయంకరమైన రోగము. తనకు యిష్టమైన దైవమును అందరిలో, అంతటా చూసి అద్వైతమును అనుభవము చేసుకొనుటయే మోక్షము.

**ధ్యానమెవరికి కుదురును :-**

1. శరీరముతో, వాక్కుతో, మనస్సుతోను ఏ ప్రాణికిని అపకారము, అన్యాయము, మోసము చేయనివారికి ధ్యానము కుదురును.
2. ధనముపై, భోజనముపై, భోగములపై, అలంకారములపై, కీర్తిపై ప్రీతిలేనివారికి ధ్యానము కుదురును.
3. వస్తువులపై, దేహముపై మమకారములేనివారికి ధ్యానము కుదురును.



4. కామము, క్రోధము, ద్వేషము, భయములేనివారికి ధ్యానము కుదురును.
5. పెత్తనముపై, అధిక సంపాదనపై ప్రీతినుంచక, లభించిన దానితో తృప్తిపడువారికి ధ్యానము కుదురును.
6. స్తుతి, నిందలకు చలించక పరోపకార బుద్ధితో ప్రవర్తించు వారికి ధ్యానము కుదురును.
7. గురువే నాకు మార్గదర్శకుడు. గురువు చెప్పిన ధర్మములను ఆచరించుట దైవధ్యానమే నాకు కావాలి అను నిశ్చయముతో నున్నవారికి ధ్యానము కుదురును.
8. గడచిన విషయములను ఇప్పుడు గడుచుచున్న విషయములను ఇక జరుగబోవు విషయములను మరచినవారికే పరమాత్మ ధ్యానము కుదురును.

భగవంతునకు అనంత కోటి నామములు కలవు. వేద సారమైనదియు, ఉచ్చారణ మాత్రముచే జీవుని పునీతునిగ జేయునదియగు ప్రణవము (ఓంకారము) చాలా గొప్పది. అకార, ఉకార, మకార అర్థమాత్రలతో గూడిన ఆ నామము సర్వశాస్త్ర సంగ్రహమని చెప్పవచ్చును. కనుకనే ఓంకారము లేని మంత్రము గాని, ప్రణవముతో ప్రారంభించని శాస్త్రముగాని, పూజగాని, మన హైందవ మతమున లేదు.

ఓంకారము తక్కిన శబ్దములన్నిటికిని చైతన్యమును ప్రసాదించును. గీతయందు భగవానుడు ప్రణవ సర్వవేదేషు సమస్తవేదములందును నేను ఓంకారమును గిరామస్మ్యే కమ క్షరం. వాక్కులలో ఏకాక్షరమగు ఓంకారమేనేనని, ప్రణవము యొక్క ప్రాధాన్యతను వెల్లడిచేసెను.

**తస్యవాచక ప్రణవః :-** పరమాత్మయొక్క నామధేయము ప్రణవము (ఓంకారము) అని పతంజలి మహర్షి చెప్పుచు ఆ ప్రణవమును జపించువారు దాని యర్థమును చక్కగా మననము చేయువారు, సాధకుడు ఎదుర్కొను విఘ్నములన్నిటిని దాటివైచి, అచిరకాలములోనే భగవంతుని సాక్షాత్కరించుకొనగలరని చెప్పియున్నారు.

**గీతలో శ్రీకృష్ణ భగవానులు :-** సయాతిపరమాంగతిమ్ అని చెప్పియున్నారు. ప్రణవమును ధ్యానించువాడు పరమగతియగు మోక్షమునొందగలడని గీతయందు తెలిపెను. కావున ముముక్షువులు, ఓంకారము యొక్క జప ధ్యానాదులచే అక్షరమగు పరబ్రహ్మమును ఈ జన్మయందే సాక్షాత్కరించుకొని సంసార బంధ విముక్తులై పరమశాంతిని పొందగలరు.

భగవద్గీత 8వ అధ్యాయమున భ్రూమధ్యమున దృష్టిని నిలిపి, భక్తి సమన్వితుడై ఇంద్రియములను బహిర్ముఖముగ పోనీయక అరికట్టి నిశ్చల మనస్సుతో ప్రణవోచ్చారణ పూర్వకముగ (ఓంకారమును) ధ్యానించ వలయును. ఓంకారమును ఉచ్చరించునపుడు దాని యర్థమును బాగుగా మననము చేయ వలయును.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ అను వాక్యమునందు అనుస్మరన్ అని భగవానుడు చెప్పుటవలన ఓంకారము యొక్క ఉచ్చారణ మాత్రము చాలదనియు, దాని భావమును గూడా లక్ష్యార్థమగు బ్రహ్మమును హృదయమున, మరల మరల చింతన జేయవలయుననియు స్పష్టమగుచున్నది. కావున అర్థ సహితముగ భావ సహితముగ ధ్యానింపవలయుననియు భగవానులు గీతయందు చెప్పియున్నారు. కావున



ఓంకారమును ముముక్షువులెల్లరు శ్రద్ధాభక్తులతో ధ్యానించి, పరమశాంతిని బడసి బంధవిముక్తులై తరించ వలసియున్నది.

ధ్యానస్థితిలో మనోనిగ్రహం పరిపూర్ణంగా లభ్యమవుతుంది. అంతేగాక ధ్యానంవలన ఆత్మ సాక్షాత్కారం కలిగి సమాధి స్థితికి దగ్గరయి, సాధకుడు మోక్షప్రాప్తిని పొందుతాడు. అప్పుడు మనస్సుచే తన స్థితిలోనికి వచ్చి అద్భుతమైనటువంటి ఆనందము, సంతోషము తప్ప మరి ఏ అనుభవం ఆ స్థితిలో వుండదు. ఆ స్థితియే పరిపూర్ణమైన ధ్యానం.

## ధ్యానం ఆచరించే నియమాలు :-

1. ధ్యానం చేయడానికి ముందుగా ఆసనాలు, ప్రాణాయామం అనే క్రియల ద్వారా శారీరక శక్తి, జీవశక్తి, మానసిక శక్తిని సంపాదించాలి.
2. నిర్మలమైన ప్రకృతి రమణీయనటువంటి ప్రదేశాన్ని ధ్యాన సాధనకు ఎన్నుకోవాలి.
3. ధ్యానసాధన : స్నానం, సంధ్యలనాచరించి, శుభ్రమైనటువంటి దుస్తులు ధరించి మనస్సును నిశ్చల స్థితిలో నిలిపి ధ్యానసాధన చేయాలి.
4. గురువుపైన, గురువు చెప్పే పద్ధతిపైన పరిపూర్ణమైనటువంటి నమ్మకం వుంచి ధ్యానసాధన చేయాలి.
5. ధ్యాన సాధన యిష్టం వచ్చినటువంటి స్థితిలో కూర్చొని చేయరాదు. అలా చేస్తే ఫలితం తగ్గుతుంది. కాబట్టి ఏదో ఒక ఆసనాన్ని ఎన్నుకొని ధ్యాన సాధన చేయాలి.
6. ధ్యానం చేయడానికి సులువైన, సుఖమైన ఆసనస్థితిని ఎన్నుకోవాలి. (సుఖాసనం, పద్మాసనం, సిద్ధాసనం, వజ్రాసనం).

ఏదైన ఒకటి ఎన్నుకోవాలి.

7. ధ్యానాన్ని తూర్పుముఖముగాగాని లేక ఉత్తర ముఖముగా గాని కూర్చొని ధ్యానం చేయడం ఉత్తమం.

8. ధ్యానం ఒట్టినేలపై కూర్చొని చేయరాదు. తివాచీ లేదా చాపపై కూర్చుని ధ్యానం చేయాలి. గురువు చెప్పే పద్ధతిని అను సరిస్తూ చేయాలి.

9. ధ్యానసాధన చేయడానికి వయసుతో పనిలేదు. దృఢ సంకల్పముతో ఎవరు సాధన చేసినా ఫలితం లభిస్తుంది.

10. ధ్యాన సాధన ప్రారంభములో ఒకే సమయాన్ని ఎన్నుకొని చేయడం వలన మంచి ఫలితం వుంటుంది.

11. ధ్యాన సమయములో శరీరములోని కండరాలను వదు లుగా వుంచాలి.

12. ధ్యానం చేయడానికి అనుకూలమైన ఆసన స్థితిలో కూర్చుని వెన్నెముక, తలను నిటారుగా వుంచి, చేతులను చిన్ముద్రలో నుంచాలి.

13. నిరాకార, నిర్గుణ పరబ్రహ్మ స్వరూపమైన ఆత్మను గూర్చి ధ్యానము చేయడమే సూక్ష్మ ధ్యానం. సూక్ష్మ ధ్యానంలో ఆత్మదర్శనము కలుగుతుంది. అనగా సమాధి సిద్ధిస్తుంది.

14. సూక్ష్మ ధ్యానమునందు మనస్సును సిద్ధపరచి, సర్వాంత ర్యామి అయిన పరమేశ్వరుని ప్రణవరూపముతో ధ్యానించాలి. అనగా అకార, ఉకార, మకారాత్మకము త్రిమూర్తి స్వరూపము, శక్తి స్వరూపం అయిన ఓంకారమును గురుముఖ ముగా నేర్చుకొని గురువు చెప్పిన పద్ధతి ప్రకారం, ఆసన స్థితిలో కూర్చొని, ఓంకార నాదమును చెప్పినట్లయితే క్రమేణ మనస్సు నిలకడ స్థితికి



వచ్చి అందులోనే లీనమగును. దీనినే సూక్ష్మధ్యానయోగ మంటారు.

నిత్య జీవితములో ధ్యానం ఒక భాగం కావాలి. మానసిక ముగా బాధపడువారికి యోగ, ధ్యాన మార్గములు ముఖ్యమైనవి. వీటివలననే మనిషి శాంతిని పొందగలుగుతాడు.

ఈ విశ్వమంతా వ్యాపించియున్న బ్రహ్మాన్ని తనలో కూడా వున్నాడని గ్రహించడమే పరమాత్మ సాక్షాత్కారమును తన శరీరమునందే చేసుకుంటాడు. బాహ్య ప్రదేశాన వెదకుట వ్యర్థప్రయత్నమవుతుంది. తనలో ఆత్మ స్వరూపములో వున్న పరమాత్మను దర్శించడం, ధ్యాన యోగంవలననే సాధ్యమవుతుంది.

**ముండకోపనిషత్తు :-** బ్రహ్మ సాక్షాత్కారము పొందడమువలన సాధకునికి వున్న అజ్ఞానము నశిస్తుంది. అహంకారము తొలగుతుంది. మనసులో వున్న సందేహములన్నియు తొలగును. హృదయం పవిత్రత చెందుతుంది.

**కఠోపనిషత్ :-** పంచేంద్రియములైన కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మం ఎప్పుడైతే బాహ్య ప్రపంచాన్ని వదలి మనస్సుతో చేరి నిలబడతాయో అప్పుడు బుద్ధి చలించదు. అప్పుడే పరమగతి లభిస్తుంది. ఈ విధముగా యింద్రియములను స్వాధీనము చేసుకోవడమే ధారణ. అట్టి ధారణయే యోగానికి మార్గమవు తుంది.

ఎల్లప్పుడూ చలించే మనస్సును అరికట్టాలని బోధించేదే యోగశాస్త్రం. చిత్తం నుండే మనస్సు ఏర్పడుతుంది.

కన్ను, ముక్కు, నాలుక, చెవి, చర్మమనే బహిరేంద్రి యాలకు భగవంతుని చూడగల్గు శక్తి తక్కువ. అవి బాహ్య ప్రపంచాన్నే చూడగలవు గాని అంతర ప్రపంచాన్ని చూడలేవు.

కాబట్టి అంతరేంద్రియమైన మనస్సుకు ఆత్మను దర్శింపగల అపరిమితమైన ప్రభావం కలదు. కాని మనస్సు చంచలత్వాన్ని పొందివుంది ఎందుకని? అది లౌకిక బంధాల్లో చిక్కుకొని వుంది. మనస్సు ఎల్లప్పుడూ ఒకే పరిధిలో నుండదు. కనీసము ఒక గంటసేపు కూడా ఒకే పరిధిలో వుండదు. క్షణ క్షణం మార్పు చెందుతూ వుంటుంది. లౌకిక జగత్తులో పరి పరి విధాల పరుగెత్తుతూ వుంటుంది. అట్లు పరుగెత్తే మనస్సును బంధించి నిలకడగా నిలిపి అఖండత్వాన్ని కలుగజేసే మార్గమే యోగం. యోగం మోక్షానికి సాధనమైవుంది. బాటలు వేరైనా గమ్యస్థాన మొక్కటే అవుతుంది. ఆచరించే విధానాలు పలువిధములుగా వున్నప్పటికిని లక్ష్యసాధనమొక్కటే.

ప్రధానంగా చిత్తవృత్తుల్ని అదుపులో పెట్టుకోవాలి. చిత్త వృత్తులుయనగా చిత్తమునందలి విభిన్నములైన ఆలోచనా తరంగాలు. చిత్తమునందు బాహ్య ప్రపంచ విషయాలకు సంయోగం జరుగుతుంది. అందువలన చిత్తంలో వృత్తులనెడి తరంగాలు పుడుతూవుంటాయి. మరల లీనమవుతూ వుంటాయి. ఆ తరంగాల ప్రభావం వలన చిత్తము చెడిపోయి భిన్నమైన మార్గములలో పయనిస్తుంది. అట్లు చేయడం వలన తాను చేరుకోబోయే గమ్యస్థానాన్ని చేరుకోలేక అగచాట్లు పాలవుతాడు. ఈ చిత్తమునందు సత్త్వ, రజో, స్తమోగుణములు గలవు. అందు సత్వగుణాన్ని పొందువాడు చిత్తవృత్తుల్ని నిరోధించి ప్రశాంత చిత్తుడై ఉన్నత స్థాయికి ఎదుగగలుగుతాడు. అభ్యాస, వైరాగ్యా భ్యాసం తన్నిరోధః" అభ్యాస, వైరాగ్యాల వలన చిత్తవృత్తులను నిరోధించవచ్చును.

యుక్తాహార విహారాలు కలవారై ఇంద్రియాదులను



వశపరచుకొన్నవారై, ఏకాంత ప్రదేశమున నిత్యము మనస్సును ఏకాగ్రం చేయడానికి యోగాన్ని అభ్యసించేవారు. ఆత్మయే పరమాత్మయని తెలిపెదరు. వారు తత్త్వజ్ఞానాన్ని పొంది నిత్య సుఖాన్ని పొందగలరు.

జ్ఞాని సమాధి సుఖాన్ని కోరుకుంటాడు. ఎందుకంటే అతనికి అంతకుమించిన సుఖం మరెచ్చట దొరకదు. అందు వలననే జ్ఞాని సమాధి కొరకు ప్రయత్నిస్తాడు. అయితే ఈ సమాధి స్థితి అష్టాంగాలు పాటించకుండా లభించదు. ఈ అష్టాంగాలు అనుష్టానం జరిగితే తరువాత నిర్వికల్ప సమాధి సులభ సాధ్యమవుతుంది. వీటిని ఆచరించకుండా ఒక్కొక్క దశను దాటకుండానే ఒకేసారి నిర్వికల్ప సమాధి లభింపదు. అందువలన వీటిని తప్పనిసరిగా అనుసరించాలి (పాటించాలి).

మనోమూలం ఇదం జగత్తు అన్నారు పెద్దలు. మనసు దానికిష్టమైన దానిలో చక్కగా ఏకాగ్రత పొందుతుంది. అందుకే దేనిని ధ్యానించదలచితే, దానినే ప్రేమించాలి. అప్పుడు ఏకాగ్రత కుదురుతుంది. యోగః చిత్తవృత్తి నిరోదః అన్నారు. చిత్ అంటే శుద్ధచైతన్యం. అందులో విషయ వస్తువుల స్ఫురణ కలిగినప్పుడు చిత్తం అవుతుంది. ఈ విషయాలవల్ల చిత్తం పరిమితమై అశాంతితో ఆలోచనలు చేస్తుంది. ఈ ఆలోచనలనే చిత్తవృత్తు లంటారు. అలలులాగా లేచిపడే ఈ చిత్తవృత్తుల కారణంగా శుద్ధమైన చిత్తం గోచరము కాదు. దానిని చూడాలంటే చిత్త వృత్తులను అణచాలి. చిత్తవృత్తులు పూర్తిగా నిరోధింపబడినప్పుడు చిత్‌తో కలయిక ఏర్పడుతుంది. కాబట్టి దానిని యోగమన్నారు.

దైవమంత్రాన్ని తీసుకున్నవారు ధ్యానాన్ని ప్రారంభించడానికి ముందు శ్రీగురుదేవుని స్మరించుకొని, నమస్కరించి తరువాత

దైవ మంత్రాన్ని చేస్తూ, దైవ రూపాన్ని ధ్యానిస్తూ నుండిన ఆ మంత్ర జపం, ధ్యానం త్వరగా ఫలిస్తాయి. అయితే వారి జపధ్యానాలు ఆ దైవం మీదనే వుండాలి. సాధన అంతా ముగిసిన తరువాత సిద్ధిపొందిన మహాత్ముడికి తన గురువు దైవము ఒక్కటేయని అర్థమవుతుంది. గురువు పరబ్రహ్మ స్వరూపమని తెలిసిన శిష్యునికి గురుదేహం కనిపించనంత మాత్రాన ఆవేదన వుండదు. ఈ స్థాయికి చేరుకోనంతవరకు ఆవేదన వుంటుంది. అందుకే ఆ స్థాయికి చేరుకునే వరకు గురుసేవ, దైవసేవ చేసుకొంటూ సాధన చేయాలి. అప్పుడు తన అంతరాత్మలో వున్న గురువు ద్వారా ఆవేదన నశిస్తుంది.

జీవితములో భగవద్గీత, విష్ణు సహస్రనామగానంగా చేసుకొంటూ హృదయములో నిరంతరము భగవధ్యానము చేయుట, సజ్జన సాంగత్యములో బుద్ధిని ప్రవేశపెట్టుట. దీనులు, భక్తజనసేవలో శరీరాన్ని వినియోగించుట అనునవి భగవంతుని చెరుటకు మార్గములు. మనస్సుని ఏకాగ్ర పరచి భగవంతుని వైపునకు మళ్ళించాలి. ఈ అభ్యాసాన్నే ధ్యానమంటారు. ఆ విధముగా ధానావస్థతమైన మనస్సు భగవంతునిలో చేరి లీనమైపోతుంది.

**తపస్సనగా :-** జపము, ధ్యానము, ఆధ్యాత్మిక సాధనకు మెట్లు. ఇంద్రియాలు మనస్సు బుద్ధి ఎప్పుడు బాహ్య ప్రపంచములోనికి పరుగులు పెట్టుతూ వుంటాయి. వాటిని అటువైపు వెళ్ళనీయ కుండా నిలపడమే తపస్సన్నారు పెద్దలు. ఇదే మొదట్లో కొంత సాధించవలసియున్నది. లేకపోతే ఆధ్యాత్మిక రంగముతో ప్రవేశమే దొరకదు. ఆహార నియమం, పెందలకడనే లేచి స్నానము చేయడము, జపధ్యానములు చేయడం మౌనం వహించడం,



ఇవియన్నియు తపస్సులోని భాగములే. శరీర ఆరోగ్యానికి భంగం కలుగని విధముగా చేయుట. జపమనగా మనస్సును పరమాత్మ వైపు త్రిప్పే శిక్షణ.

ఒక మంత్రాన్నో లేక దైవ నామాన్నో నిరంతరం జపిస్తూ ఆ దేవుని రూపాన్ని చూస్తూ మనస్సుని దైవ భావముతో నింపుతూ వుండాలి. క్రమముగా మనసు నిలకడ కలిగి, భగవంతుని పట్ల భక్తి పెరుగుతుంది. ఆ విధముగా భగవద్భక్తి కలిగినప్పుడు సాధకుని మనస్సు నిరంతరం భగవంతుని వైపునకే ప్రేమగా పరుగెడుతూ ఆయన లీలలను గుణాలను, రూపాలను స్మరించు కొంటూ భావిస్తూ వుంటుంది. జపానికి ధ్యానానికి ప్రారంభ దశలో, ఏకాంతమైన శుభ్రమైన ప్రదేశం, ప్రశాంతమైన సమయం కావాలి. పరిపక్వమైన సాధకుడికి ఎప్పుడూ అన్నిచోట్లా అన్ని సందర్భాలలో జపధ్యానాలు సాగుతూనే వుంటాయి. వాళ్ళు ప్రత్యేకించి ప్రయత్నము చేయనక్కర లేదు. మనస్సుని ఆత్మలో నిలప డము కష్టమే. అయితే సాధనచేయగా చేయగా పరిపక్వదశకు వచ్చిన సాధకులు తప్ప మనస్సుని ఆత్మలో లయపరచలేరు. అందుచే సాధకుడు ముందుగా నామజపం, సాకార ధ్యానం, శాస్త్రాధ్యయనం తదుపరి నిరాకార ధ్యానం చేస్తూ మనస్సుని నిలపడానికి ప్రయత్నించాలి.

సాధకుడిగా వున్నంతకాలం ఎప్పుడూ ధ్యానసమయములో ఒకే అనుభూతి రాదు. ఒకరోజు బాగా కుదురుతుంది. మరొకరోజు బొత్తిగా కుదరదు. నిరాశపడకుండా సాధన చేస్తూనే వుండాలి. పరిపక్వ స్థితికి వచ్చిన తరువాత నిరంతరం అనుభూతి వుంటుంది.

ధ్యానంలో సాధించేది ఏకాగ్ర స్థితి. భావాతీత స్థితిలో అంతరింద్రియాలు ఆగిపోతాయి. ఆత్మ తనను తాను తెలుసు

కుంటుంది. అప్పుడే ఆత్మానందం కలుగుతుంది. ప్రయత్నం విడవ కుండా ధ్యానము చేయుచూ, ధ్యానములో వచ్చిన ఆనందాన్ని గుర్తించుకుంటూ వుండిన నిత్య వ్యవహారాలకు దానికను గుణంగా నడుపుకుంటూ క్రమముగా ఆయానందం జాగ్రత్తలో కూడా సహజముగానే పొందే స్థితికి వస్తారు.

రాత్రి నిద్రపోయేటప్పుడు మనసు ఆలోచనలు చేయడం మానేస్తుంది. తిరిగి, తెల్లవారిన తరువాత మొదలుపెడుతుంది. సాధనవల్ల మనస్సు వెనకాల వుండే వాసనలన్నియు క్షయించి నపుడే మనస్సును కదిలించే ప్రేరణ లేక ఆలోచనలే రావు. అంటే మనస్సు నశించినట్లే ఈ స్థితిలో భగవద్దర్శన మవుతుంది (అదే ఆత్మానందం).

మనస్సుకి అధికారి అయి, దానికి భిన్నంగా, అతీతంగా వుండే ఆత్మ అసలు నేను. ఆ "నేను" ఎవరో తెలుసుకుంటే భగవం తుణ్ణి తెలుసుకున్నట్లే. నేను అని పలికేవాడు జీవుడు. శరీరం మనోబుద్ధులలో కూర్చుని, వాటితో తాదాత్మ్యం పొందే ఆత్మ జీవుడనబడుతుంది. మనస్సు కదలికవల్ల తాను బాధలు పడుతూ దానిని నిలపాలని ప్రయత్నిస్తాడు. మనస్సు ఒకే విషయాన్ని గురించి ఆలోచించేటట్లు చేయగలిగినపుడు మనస్సును నిలిపి నట్లే. ఇదే ఏకాగ్రస్థితి. మనస్సులో ఏ ఆలోచనా లేకుండా చేసిన పుడు ఉత్తమమైన నిర్గుణస్థితి ఇది. మనస్సుని పూర్తిగా నిలిపి నట్లవుతుంది.

**ధ్యానానికి ముఖ్యము :-** అభ్యాసము, వైరాగ్యము అవసరమై యున్నది. విషయ వస్తువుల పట్ల మమకారం, కోరిక, ఇతర ఆలోచనలను తీసుకొని వస్తాయి. అప్పుడు ఆ విషయాలలోని దోషాలను క్షణక్షణం స్మరించినపుడు నిజమైన వైరాగ్యం



కలుగుతుంది. ఇష్టదేవుని పట్ల ప్రేమను పెంచుకొని మనస్సుని ఆయనలో నిలిపే అభ్యాసం పదే పదే చేయాలి. అప్పుడు ఇతర ఆలోచనలు తగ్గుముఖము పడతాయి.

నిత్యము ఆచరించదగినవి 1) స్వాధ్యాయము ఒంటరిగా కూర్చొని తాము అధ్యయనం చేయడం. ఇది మొదటిదశ. పారాయణ, కేవలం చదవడం అన్నీ స్వాధ్యాయమే. రెండవ దశలో అధ్యాయనం అంటే బుద్ధితో అన్నింటిని లోతుగా చర్చించి తెలిసికొంటూ చదవడం, మూడవదశలో చదివిన వాటిని జీర్ణం చేసుకోవడం ద్వారా అనగా ఆత్మ విచారణ చేసుకొని తెలుసు కోవడం.

మంచి కార్యక్రమాలు చేయడం, ఆధ్యాత్మిక గ్రంథపఠన, సత్ భావనలు, సత్ సంగము; సదాచారము, సత్యం, ధర్మం అనే వాటిని పాటించాలి. అప్పుడే మనస్సు దైవ మార్గములో ప్రయాణము సాగించగలదు.

జీవితములో శరీరమునకు ఆహారము ఎంత అవసరమో ధ్యానము మనశ్శాంతికి, తృప్తికి ఆరోగ్యమునకు, దైవ దర్శన మునకు అవసరమైయున్నది. ఆత్మానందమునకు ప్రధానమైనది ధ్యాన మార్గము. ఈ ధ్యాన మార్గములో మనో నిశ్చలము, ధైర్యము మొదలగు సుగుణములు నిత్య జీవితములో కలుగుతాయి.

మానవులకు ధనము, కామము, పదవులు వీటికోసమై జీవితమంతయు వాటి కొరకై ప్రాకులాడుతూ వుంటారు. అవి అనిత్యములు. వీటినే ధ్యానిస్తూ వుంటారు. శాశ్వత ఆనందాన్ని యిచ్చేది ఆత్మ ధ్యానము. అది మొదట కష్టముగా తోచినను, తరువాత అనంత సుఖమునిస్తుంది. విషయధ్యానము మొదట సుఖముగా వుండి తరువాత దుఃఖమునే కలుగజేయును.

విషయములను ధ్యానించువాడు తత్సంబంధమైన రాగద్వేషములను పొందవలసినదే. అట్లుగాక దైవమార్గమున ప్రయాణము చేయునపుడు మనస్సును మరల్చి ఆత్మయందుంచి, ఆత్మ ధ్యానము చేసిన యెడల మనస్సు ఆత్మాకారము చెంది, ఆత్మ లక్షణములైన ఆనందమును అనుభవిస్తాడు. దానినే బ్రహ్మానందము ఆత్మానుభూతియని పెద్దలు చెప్పుదురు.

మనస్సునకును, ఆత్మకును కలిగిన ఐక్యమే సమాధి. జీవాత్మ పరమాత్మయనెడి రెండింటియొక్క ఐక్య సంబంధము వలన ఇతరములైన సమస్త సంకల్పములు నశించును. అట్టి నిర్వికార స్థితియే సమాధి. భగవద్గీత :- అర్జునా యోగి అనువాడు తపస్సులు చేయువారికంటెను, శాస్త్ర జ్ఞానముకలవారికంటెను, సత్ కర్మలు చేయువారి కంటెను కూడా శ్రేష్టుడు. కావున నీవు యోగివికమ్ము యని తెలిపియున్నారు.

ధ్యాన సమయములో మన చిత్తము ప్రశాంతముగా వుండాలంటే దానికి నిరంతరము భగవచ్ఛింతనము అలవాటు చేసుకోవాలి. అప్పుడే అంతర శుద్ధి కలుగుతుంది. ఈ విధముగా బాహ్య అంతర శుద్ధిని కలుగజేసుకోవాలి.

ఆత్మజ్ఞానము పొందదలచినవారు అందుకు అవసరమైన ధ్యానయోగములను సక్రమముగా అభ్యసించడానికి ముందుగా ఆహార నియమాలను పాటించాలి. ఆయాహారాన్ని ముందుగా కొంతభాగము భగవదర్పితముగ జీవులకు అర్పించి, శేషించి దాన్ని మాత్రమే తినాలి. భగవంతుని యొక్క గుణ గణాలను గురించి ఆలోచిస్తూ ధ్యానమార్గం అవలంభిస్తే మనస్సు యింద్రియములు త్వరగా సిద్ధిపొంది, మన స్వాధీనమవుతా యని



భగవానులు గీతలో చెప్పారు. కనుక ధ్యానసమయములో మన చిత్తము ప్రశాంతముగా వుండాలంటే దానికి నిరంతరము భగవత్ చింతనము అలవాటుచేసుకోవాలి. అప్పుడే అంతర శుద్ధి కలుగుతుంది. ఈ విధముగా దేహశుద్ధి, బాహ్యశుద్ధి, అంతఃశుద్ధి కలుగజేసుకోవాలి.

ధ్యానయోగి ఏకాంత ప్రదేశమున నివశిస్తూ మితాహారము తీసుకొంటూ వాక్కును శరీరమును, మనస్సును స్వాధీనములో వుంచుకొని ధ్యానతత్పరుడై, వైరాగ్యము కలిగి యుండువాడు ధ్యానికాగలుగుతాడు. ఎలాంటి చీకు చింతలు లేకుండా, ఏకాంత ప్రదేశములో వుంటూ కామ, క్రోధ, భయాదులు కలుగకుండా మితాహారము, అది సాత్వికాహారము తీసుకొంటూ, అతి నిద్ర బద్ధకాలు లేకుండా శ్రద్ధవహించాలి.

ధ్యానయోగి వాక్కును స్వాధీనములో వుంచుకోవాలి. ధ్యానానంతరము మాట్లాడవలసి వచ్చినపుడు మంచిమాటలు మాట్లాడాలి. సత్యమునే పలకాలి. మిగిలిన సమయము మౌనము వహించాలి. దైవ సంబంధమైన మాటలు మాట్లాడము అలవరచుకోవాలి. ఇతరులకు దుఃఖము, బాధ, ద్వేషము, క్రోధము, ఆవేశము కలిగించే విషయాలు ప్రస్తావించకుండా వాక్కును స్వాధీనములో వుంచుకొంటే అది పవిత్రమవుతుంది (వాక్శుద్ధి కలుగుతుంది).

ధ్యానము తీవ్రమైనపుడు అది యోగముగా మారుతుంది. యోగముచేత సంపూర్ణముగా నిగ్రహింపబడిన మనస్సు ఆత్మయందులయమై, మరే విధమైన వాంఛలు లేక పరమ శాంతిని పొందుతుంది. అలాంటి పరమశాంతితో, పరిశుద్ధమైన

మనస్సు తాను లీనమైన ఆత్మయందే, ఆత్మ పురుషుడైన భగవంతుని దర్శించి, ఆత్మానుభవమును పొందుతుంది. ఈ విధమైన ఆత్మానుభూతి కొరకే ధ్యాన సాధన చేయాలి.

ఈ జన్మలో ధ్యానసాధన ఈ జన్మది కాదు. ఇంతకు ముందు గడచిపోయిన అనేక జన్మలలో ఇట్టి సాధనచేసి యున్నాము. ఆయా జన్మలలో ఎంతోకొంత ధ్యాన సాధన చేసి వుండడము వలన పూర్వజన్మ వాసన ఫలితంగానే ఈ జన్మ యందు ధ్యానము చేయాలనెడి అభిలాష కలుగుతుంది. కనుక ధ్యానసాధకుడు ఈ ధ్యానాభ్యాసము తనకు అనేక జన్మలుగ అలవాటైనదేయని గ్రహించుకొని, ఈ జన్మలో తీవ్ర సాధన చేసి మనో నిగ్రహం సంపాదించి మోక్షమును పొందడమే ఏకైక మార్గము. అట్టి ధ్యాన సాధనచేత మాత్రమే సాధకుడు సర్వోత్తమ గతిని మోక్షమును పొందుచున్నాడు.

**శ్రీ కృష్ణ భగవానులు చెప్పిన వాక్యము గీతలో :-** ఏ యోగి నాయందు మనసు నిలిపి శ్రద్ధతో నన్నే ధ్యానిస్తూ వుంటాడో అతడు యోగులందరిలో సర్వోత్తముడని నాయభిప్రాయము. మనుజులందరికంటె ధ్యాన సిద్ధిని పొందినయోగి ఉత్తముడు. ఎందుచేతననగా ఏ మానవుడికి లభించని శాంతి, ఆనందము ధ్యానయోగికి మాత్రమే అనుభవమవుతుంది. అయితే యిట్టి యోగసిద్ధి పొందినవారిలో ఎవరు అనన్య భక్తి శ్రద్ధలతో భగవంతునియందే తనుః మనః ప్రాణములను నిలిపి ఆయన్నే ధ్యానిస్తారో, ఆయన్నే భావిస్తారో అతడు మాత్రమే ధ్యానయోగులలో సర్వోత్తముడని సర్వశ్రేష్టుడని భగవంతుడు గుర్తిస్తాడు. భగవంతుడొక్కడే శాశ్వతమని, అతనిలో ఐక్యమవడమే మానవ జీవిత పరమార్థమని గ్రహించి, ఆ పరమార్థాన్ని ఈ జన్మలోనే



పొందాలనెడి ఏకైక ధ్యాసతో ధ్యానము చేయాలి.

అనేకములైన ఇతర విషయములందు ఎట్టి ఆసక్తిలేక అణుక్షణమూ పరమాత్మ ధ్యానమందే మనసు నిలపడమే సమాధి. ఇట్టి సమాధి స్థితికి చేరినయోగికి, సర్వప్రపంచము భగవన్మయముగానే కనిపిస్తుంది. అతని దృష్టి సమస్తము నందునూ భగవంతుని ప్రతిరూపమును దర్శిస్తూ వుంటుంది.

మనస్సును ప్రాపంచిక విషయములనుంచి మళ్లించి తన దేహములో ఆత్మ స్వరూపములో భగవంతుని యందు మనస్సు స్థిరముగా నిలిపి, ఉన్నతమైన ధ్యాన సమాధి స్థితిని చేరినపుడు ప్రశాంత చిత్తుడై, కామక్రోదాది రజోగుణములు నశించినవాడై బ్రహ్మస్వరూపుడై సర్వదోషరహితుడైన ఈ ధ్యాన యోగి సర్వోత్తమమైన ఆత్మానంద సుఖమును పొందు చున్నాడు. ఎవడు స్థిర చిత్తము గలిగివుంటాడో అట్టి యోగి, సర్వదోషముల నుండి విముక్తినిపొంది తానే బ్రహ్మస్వరూపు డవుతాడు. అట్టి బ్రహ్మస్వరూపుడు ఆత్మయందే పరమాత్మను దర్శించి, పరమాత్మ వేరు, నేను వేరు కాదనే భావమంతరించి, యిద్దరూ ఏకాత్మ స్వరూపులేనన్న సత్యాన్ని గుర్తించి లోకములో సర్వోన్నత స్థానమైన ఆత్మానంద సుఖమును పొందుతాడు. ఈ ఆత్మానందమునకు మరి ఏ ఆనందము సాటిరాదు. ఇదే ధ్యాన సమాధి స్థితియందు అనుభవించు పరమానంద సుఖము.

ఎవరు దైవ సంబంధమైన కర్మలు ఆచరిస్తారో, ఎవరు దైవమును తన సర్వస్వముగా భావించి నమ్ముతారో, ప్రాపంచిక వ్యామోహములను వదలిపెట్టి, సమస్త జీవులను దైవ స్వరూపులుగా ఎవరు ప్రేమిస్తారో అట్టి దైవ భక్తుడు మోక్షమును పొంది

నా సాన్నిధ్యమును చేరతాడుయని శ్రీకృష్ణ భగవానులు గీతలో ఉపదేశించియున్నారు.

అశాశ్వతమైన దేహము యొక్క రక్షణ కొరకై విని యోగింపబడే సమయములో ఒకప్పుడైనా దైవజపం, ధ్యానం మొదలైన సత్కర్మలలో ప్రవర్తించడమే మానవ జన్మ యొక్క సాఫల్యానికి హేతువవుతుంది. దైవానుగ్రహం కలగాలంటే తల్లి దండ్రులను దైవంలాగా చూడాలి. వారిపట్ల భక్తిలేనివారు ఉన్నతిని పొందలేరు. నీవు ఆత్మ నిలయం కావాలనుకుంటే ఆహార నియమం పాటించు. నిశ్చల ధ్యానం కావాలనుకొంటే నిర్మలమైన భక్తిని చేపట్టు, మనస్సు నిర్మలం కావాలనుకొంటే నిష్కామ కర్మ అనుష్టించు, భగవద్భక్తి కావాలనుకుంటే ఈశ్వర సేవచేయి. చిత్తస్థైర్యం కావాలంటే జ్ఞానాన్ని అభ్యసించు.

ఆధ్యాత్మిక మార్గములో ఒకరికొకరు సహాయపడటం సాధ్యం కాదు. సాధకుడు తనకుతానే అనుష్టింపదగిన సాధన ద్వారా తరించాలి. గురువులు దారిమాత్రమే చూపుతారు. శ్రమపడి ఆ దారిలో నడవవలసినవారు శిష్యులే. కావున ప్రియాత్మ బంధువులారా చంచలమైన మనస్సును ఆత్మయందు లయ పరచి, ఆత్మధ్యానము చేయుటచేతనే ఆత్మానందమును పొంద గలం అందుచే ప్రతి ఒక్కరు ధ్యాన సాధకులై ఈ జన్మలోనే భగ వత్సాక్షాత్కారము పొంది తరించుదురు గాక. అందరూ బ్రహ్మని ష్ఠులై భగవద్భక్తులై జ్ఞాన సంపన్నులై బ్రహ్మానందముతో విరాజి ల్లుదురుగాక.





## మోక్ష సాధన

ప్రియాత్మ బంధువులారా ఎనుబది నాలుగు లక్షల రకముల జీవరాసులలో మానవజన్మ ఉత్కృష్టమైనది. మానవ జన్మ లభించడం ఎంతో కష్టం. కనుక జీవితములో ప్రతి క్షణము విలువైనదని భావించి, దానిని వృధా చేయక భక్తి, జ్ఞాన, వైరాగ్య ముల ద్వారా, ఆత్మజ్ఞానమును సంపాదించి, ఆ జ్ఞానముచే మోక్ష మును పొంది, కృతార్థుడవుకావలెను. ఈ వచ్చిన జన్మను సార్థకము చేసుకొనవలెను. ఆత్మ సాక్షాత్కారమే మానవజన్మ యొక్క సార్థకత.

ఆత్మజ్ఞానాన్ని సంపాదించుకునే హక్కు ఒక్క మానవ జన్మకు తప్ప మరే జీవికి లేదు. చివరకు దేవతాజన్మకు కూడా ముక్తి కావాలంటే మనుష్యజన్మకు రావలసిందే. ఈ మానవజన్మ ఉత్తమ జన్మమురా యని మహాత్ములు చెపుతున్నారు. ఓ మనవా ఎన్ని భోగభాగ్యాలున్నా, ఎన్ని లక్షలు, కోట్లు గడించినా, చివరకు అన్నీ విడచి పోవలసినదే. ఎవరైనా ఎంత ఖరీదు బట్టకట్టినా, అది కొంతకాలమునకు చిరిగిపోక తప్పదు. ఈ జీవుడు కూడా భగవద్గీతలో భగవానుడు చెప్పినట్లుగా, ముసలితనము, రోగము లతో శిథిలములైన శరీరములను వదలి, క్రొత్త క్రొత్త దేహములను ధరించుచున్నది. ఈ సత్యాన్ని తెలుసుకొని, భగవంతుని తెలుసు కొనడానికి ప్రయత్నించవలసియున్నది. అదియు ఈ జీవితము అంతముకాక మునుపే తెలుసుకోవలెను.

ఈ ప్రకృతి అంతా మాయ, ఆలుబిడ్డలు, బంధువులు, నీవు సంపాదించిన ధనము, వస్తువులు, వాహనములు మన

వెంటరావు. ఏవిధముగా నీవు తల్లి గర్భములో నుంచి పుట్టావో, ఆ విధముగానే పోగలవు. ఈ సత్యాన్ని దృష్టిలోపెట్టుకొని, ఆ దేవదేవుని పాద పద్మములు ఆశ్రయించి, ఈ మాయను తొలగించుకొని, నిత్యము ఆనందముతో, తృప్తితో, సుఖజీవితాన్ని గడుపుకో. నీ అంతిమ శ్వాసవరకు, భగవచ్ఛింతన చేస్తూ, ధ్యానిస్తూ, భగవత్ భావముతో వుండు. అదే నిత్యానందమునకు మార్గము.

కానీ నీ వెంట వచ్చునవి, నీవు చేసుకొన్న పాపపుణ్యములే. ఇవి నీ మనస్సుతో తెలుసుకో. నీకు తోడుగా వచ్చువాడు భగవంతుడొక్కడే. వేరెవరూ నిన్ను వెంబడించలేరు. నీ వెంటరాని వారి కొరకు, నీవు రాత్రింబవళ్ళు కష్టపడి, చివరకు నీవు తీసుకొనివెళ్ళునవి నీ పాపపుణ్యాలు మాత్రమేనని తెలుసుకో. జాగరూకడవై నడుచుకో. ఏదో ఒక సమయాన మృత్యువు నిన్ను కబళించివేయును. అందుచే ముందుగనే భగవంతుని చేరు మార్గము తెలుసుకో, భగవన్నామముతో, భగవత్ భావముతో, నీ మనస్సును భగవన్మయముగా చేసుకో. ఇదే ఈ జన్మకు చేయవలసినది.

ఈ మానవజన్మ ఎంతో విలువైన జన్మ. దీని విలువను తెలుసుకొని, కాలాన్ని వృధాగా గడపక, దైవసాధన చేస్తూ తరించు. నీటి బుడగలాంటి ఈ దేహము నేడో, రేపో ఏ క్షణమో ఎవరికి తెలుసు. కావున దైవచింతనకు వాయిదా వేయకు. జరిగి పోయిన కాలము తిరిగిరాదు. ఇక జరగవలసిన కాలాన్ని వృధా చేయకు. ఇది మంచి జన్మ నీకు. సాధన చేసి భగవత్ ప్రాప్తిని పొందు.

నీవు తల్లి గర్భమునుండి పుట్టినపుడు మాయలో పడి



వయసుతోబాటు మమకారముతో, నా తల్లి, నా తండ్రి, నా యిల్లు, నా భార్య, నా బిడ్డలు, బంధువులు, ధనము, వస్తు వాహనాలు అన్నీ నావియని మురిసిపోతావు. నీకు తెలియకుండగనే నిన్ను మృత్యువు కబళించివేయగలదు. కావున ఈ బొందిలో ప్రాణముండగనే ఈ సత్యాన్ని తెలుసుకొని, దైవ మార్గములో ప్రయాణము సాగించు. దేవుని స్మరించు, చింతించు, ధ్యానించు. మోక్షమును పొందుటకు చక్కటి అవకాశము నీకు లభించినది.

మనము కూర్చున్నా, నడుస్తున్నా, నిలబడియున్నా, తింటున్నా, పడుకొనియున్నా సర్వకాల సర్వావస్థలయందు దైవ భావముతో నుండిన, మన మనస్సు దైవాకారముగా మారుతుంది. ఈ నశించిపోయే శరీరములో కర్మతీరే వరకు ఈ దేహములో వుండి కర్మ తీరిపోగానే, ఈ దేహమును వదలి జీవుడు, క్రొత్త దేహమును ధరించుటకు వెళ్ళుచున్నాడు. నశించేది శరీరము గాని, ఆత్మకాదు, ఆత్మ నిత్యము, శాశ్వతమైనది. సనాతనమైనది.

పాప పుణ్య మిశ్రమ కర్మల ఫలితమే ఈ మానవజన్మ. కర్మవశమున, తల్లి గర్భమున జన్మించి, శరీర సంబంధముగల వారియెడల, మమకారము పెంచుకొని దేహ భావముతో, ఆత్మను చేరలేక దుఃఖముతో సతమతమవుతున్నావు. ఎప్పుడైతే నీవు దేహ భావము వీడి, ఆత్మభావముతో నుండగలవో, అప్పుడే నీవు ఆనందమును పొందగలవు, శాంతి కలుగుతుంది.

మనస్సు ఆకర్షణీయములైన వస్తువులను చూసి భ్రాంతి పడుచున్నది. కాని తన జీవిత గమ్యమును మరచి, చేయరాని పనులు చేసి, ఆత్మానాత్మ వివేకము లేక, ఈ మానవ జన్మ విశిష్టతను మరచి, కాలమును వృధాగా గడిపి, చివరకు

మృత్యువాత పడుచున్నది. ఆ విధముగా కాకుండగా, మహాత్ముల యొక్క సాంగత్యముచే, సద్గ్రంధపఠనముచే, సద్గురు బోధ శ్రవణముచే, మనస్సును పరిశుద్ధము చేసుకొని దైవభావ ముతో జ్ఞానసిద్ధిని పొంది మనస్సును ఆత్మయందు లయపరచి నిత్యా నందముతో నీ జీవితమును సార్థకము చేసుకో.

మానవ జీవితములో తృప్తి చాలా ముఖ్యమైనది. ఎందుచేతననగా క్రితజన్మలో మనము ఏది చేసినామో, అదే ఈ జన్మలో మనకు భగవంతుడు యిస్తాడు. దానికన్నా ఎక్కువగాని, తక్కువగాని యివ్వడు. అందుచే చేసుకొన్నవారికి చేసుకున్నంత మహదేవ అన్నారు. ఎంత పుణ్యము చేసినా, పాపము చేసినా దానికి తగినట్లుగానే భగవంతుడు యిస్తాడు. మనకు బట్ట, యిల్లు, మనము తినే ఆహారము, త్రాగడానికి నీరు సకల సౌకర్యములు భగవంతుని కృపవలననే మనకు లభించి నవి. మన జీవితానికి అన్ని రకముల సౌకర్యములు ఏర్పాటుచేసిన భగవంతుని మరువవచ్చునా, మన జీవితాన్ని ప్రశాంతముగా గడపడానికి ప్రయత్నించాలి. కావున మన మనస్సును దైవం వైపునకు మళ్లించాలి. అందుచే దైవ కార్యక్రమాలు, ధర్మకార్యక్ర మాలు, భగవన్నామస్మరణ, నిష్కామకర్మ, పరోపకారబుద్ధి, దానము చేయాలనే సద్భావము మొదలగు సద్గుణములను అలవర్చుకోవాలి.

ఆశ మానవుని పతన మార్గమును చూపుతుంది. ఈ ఆశ అనేది మానవుని మాయలో పడవేయగలదు. ఆశ అనేది భగవంతుని చేరుటకు అడ్డు తగులుతుంది. సత్యము, ధర్మము, శాంతి, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, సర్వభూతదయ, ఇవే భగవం తుని చేరుటకు మార్గములు. జ్ఞానమార్గములో (దైవ మార్గ



ములో) ఎన్ని ఆటంకములు వచ్చిన సాధన వదలరాదు. అనగా సత్య, ధర్మాలను వదలరాదు. అవే మనకు తోడుగా వచ్చునవి. మానవజీవితములో కష్ట సుఖములు కావడికుండలు లాంటివి. మనోధైర్యమే జయమును కలుగజేయును. దైవసాధనలో రేపు అని వాయిదా వేయరాదు. ఎందుచేతననగా రేపటి దాక వుందు మని మనకు గ్యారంటి లేదు. నీటి మీద బుడగలాంటి ఈ దేహము ఎప్పుడు రాలిపోవునో ఎవరికి తెలుసు. అందుచే యిప్పటినుంచే దైవసాధన ప్రారంభించు. నీ ధన, ధాన్యములు, నీ ఐశ్వర్యము, నీ యిండ్లు, నీ భార్య, నీ బిడ్డలను చూసి మురిసి పోతున్నావు. అందరిని వదలి నీవు ఒంటరిగా వెళ్లవలసినదే? నీకు తోడుగా ఒక్కరూ నీ వెంట రారు. నీకు తోడుగా వచ్చువాడు ఆ పరమాత్మ ఒక్కడే. నీవు తల్లి గర్భము నుంచి ఏవిధముగా వచ్చినావో, ఆ విధముగా పోవలసినదే. అందుచే ఈ ధనముతో బాటు, నీకు తోడుగా వచ్చు పరధనము గూడా సంపాదించు. ఈ ధనము నీ జీవనాధారమునకు ఉపయోగపడుతుంది. పరధనము (దైవ ధనము) పరమాత్మ దగ్గరకు చేర్చుతుంది.

జీవితాన్ని కాలయాపన చేయకూడదు. నీటి బుడగలాంటి ఈ దేహాన్ని ఎప్పుడో మృత్యువు మ్రింగివేయ కాచుకొనియున్నది. అందుచే ఈ మానవజన్మకు వచ్చిన పనిని పూర్తిచేసుకో. నేనెవరిని? ఈ జన్మ ఎందుకు వచ్చినది? నేను చేయవలసిన కర్తవ్యమేమిటి? అని విచారణ చేయవలసి యున్నది.

నాది, నా వారుయనే బ్రాంతిలో పడబోకు. నీదను కున్నది ఏదో ఒక రోజున నిన్ను వదలక తప్పదు. నీదన్న శరీరమే నిన్ను వదిలేసి మట్టి పాలగుచున్నది. నీ దేహమే నీది కానప్పుడు

ఈ ధనము, భార్య, బిడ్డలు బంధువులు నీవారు కాజాలరు. నాది, నా వారు అనుకొనుచున్నావు. నీ మరణం తరువాత నీవేమి తీసుకొనిపోతున్నావు. ఏమిలేదు కదా, నీవు చేసిన పాప, పుణ్యాలే నీ వెంట వచ్చేది. ఈ శరీరమునుంచి జీవుడు తొలగగానే, ఈ శరీరమే ఒక శవము. దేహకర్మలు తీరే వరకు, ఈ జీవుడు దేహములో వుండి, కర్మ తీరిపోగానే ఈ శరీరమును వదిలేసి, క్రొత్త శరీరమును ధరించుతాడు. జీవుడు దేహములో వున్నంత వరకు మాయచే, ఈ యిల్లు నాది, ఈ బిడ్డలు నావారు, ఈ వస్తువు నాది, ఈ ధనము నాది, ఈ భూమినాది, ఈ వాహనం నాది, చివరకు ఈ శరీరమే నాదంటున్నది. ఇదే మాయ. ఈ మాయ వదలాలంటే, భగవద్భక్తి, జ్ఞానము, వైరాగ్యము, సర్వ భూతదయ, ఆత్మ విచారణ, పరోపకారబుద్ధి, దానము, ధర్మ ప్రవర్తన, భగవన్నామస్మరణ అనే సత్కర్మలు వలన సదాచారము వలన భవబంధాలు తొలగి, ఆత్మశాంతిని పొందగలుగుతారు. ఈ మాయ తొలగే వరకు భగవంతుని పాదసేవయే శరణ్యం. వేరే దారిలేదు.

**మనస్సు :-** సంకల్ప వికల్పములు కలిగినది. కామము (కోరికలు), క్రోధము, ద్వేషము, నాది, నా వారు అనే మమకారములతో నుండినది కూడా మనస్సు మూలముననే ఉద్భవించుచున్నది. ఇంకను ఆశ, భయము, సుఖము, దుఃఖము, అహంకారము, అసూయ, కపటము మొదలగునవి మనస్సు మూలముగనే ఉద్భవించుచున్నవి. మనస్సులోనే అన్నీ యిమిడియున్నవి. మనస్సే మాయ. మనస్సే ప్రకృతి ఈ మనస్సే త్రిగుణములుగా మారు చున్నది. ఈ త్రిగుణములను దాటవలెనన్న పరమాత్మను ఆశ్రయిం చాలి. ఈ మనస్సును పరమాత్మపరంగా నడపాలి. అనగా



భగవంతుడు మెచ్చే సత్కర్మలు చేయాలి. సత్య, ధర్మములు, పరోప కారము, పూజ, జపము, ధ్యానము, తృప్తి, దానము, తల్లిదండ్రుల సేవ, గురుసేవ, పెద్దలయందు వినయ విధేయతలు కలిగియుం డుట, ధర్మ ప్రవర్తన, సుగుణములను సంపాదించుకొని, దుర్గుణ ములను వదలి, సజ్జనసాంగత్యము, సద్గ్రంథపఠనము సద్గురు బోధ శ్రవణము చేయుట, శ్రవణము చేసిన దానిని, మననము చేయుట, మననము చేసిన దానిని ఆచరణయందుంచుట యను సదాచారమువలన, మనస్సుకు సంకల్ప వికల్పములు తగ్గి, పరతత్వమును తెలుసుకొని పరిశుద్ధమైన దైవ సుఖమును పొందుచూ, దైవ సన్నిధికి చేరుకొనగలరు. ఆ దైవ సన్నిధిలో పొందు ఆనందము మరెక్కడను దొరకదు. ఇంద్రియముల ఆనందము క్షణికమైనది. ఆత్మానందమే శాశ్వతమైనది. దాని కొరకే పాటుపడవలసియున్నది.

ప్రతిదినము స్నానము చేయుట, భోజనము చేయుట, మంచినీరు త్రాగుట, మానని విధముగా, ప్రతి దినము తల్లిదండ్రు లకు, గురువులకు, సూర్యభగవానునికి, తులసిమాతకు నమస్కార ములు చేయుచుండుటను మానరాదు. అదే విధముగా భగవంతుని స్మరణను కూడా మానరాదు. ఇంకను సజ్జన సాంగ త్యము, భగవద్గీతాది సద్గ్రంథపఠనములు కూడా మానరాదు. దేవుని మరువకుండుట, దైవకార్యములనే చేయుట, దైవభక్తులతో స్నేహము చేయుట, దైవ ధర్మములనే తెలుసుకొను చుండ వలయును.

జాగ్రదావస్థ, స్వప్నావస్థ, సుషుప్తిలో ఏ పరమాత్మ చైతన్యము కలదో, ఆ పరమాత్మను తెలియనీయక చేస్తున్న శత్రువులగు కామ, క్రోధ, లోభములను, అహంకార మమకారము

లను, నశింపజేసుకొనుటకు సజ్జన సాంగత్యము, సద్గురువు ద్వారా పొందిన మంత్రోపదేశ జపము, ధ్యానము, ప్రార్థన, ఆత్మా నాత్మ విచారణ, పరమాత్మ యందు నిష్ఠ కలిగియుండవలెను. దీనివలన దుఃఖ నివృత్తి, పరమానంద ప్రాప్తి కలుగును.

సాకార దైవజప, ధ్యానములలో మనస్సును నిశ్చలము చేసుకొని, నిరాకార పరమాత్మ ధ్యానముతో మనస్సును నశింప జేసుకొనుటయే దైవమును చేరుటకు మార్గము. దేవుని సన్నిధికి చేరవలెనన్న సత్యముతో, జ్ఞానముతోనుండుటయే. సుఖదుఖము లను అనుభవించువాడు జీవుడు. వీటికి సాక్షిగా నుండువాడు దేవుడు (అదే ఆత్మ).

భగవంతుని నమ్మియుండుట, సర్వము దేవుని సృష్టియని, సర్వము దేవుని ఆజ్ఞ ప్రకారము జరుగుచున్నదని, ఇచ్చునదియు తీసుకొనునదియు, సర్వము దేవుని ఇచ్ఛప్రకారము జరుగుచున్నదనియు, పొగడువారు దూషించు వారును, దేవుని స్వరూపులేయని భావించవలసియున్నది. సంతోషముతో, ధైర్యముతో, శాంతముగా, మౌనముగా నుండునట్లు అభ్యాసము చేసుకొనవలయును.

మనస్సుతో, వాక్కుతో శరీరముతో చేసిన పాపములే దుఃఖములు కలుగుటకు కారణములగును. సదా పుణ్యకర్మలు చేయుచు, సదా తల్లిదండ్రులకు, గురువులకు సేవచేయుచు, సర్వము ఆత్మ స్వరూపముగా భావించుచు, సదా మనస్సును యింద్రియములను నిగ్రహించుచు, సత్యధర్మములను తప్పక నడుచువారికి పలువిధములైన కష్టములు ప్రాప్తించును. కనుక ముముక్షువు ప్రకృతి, ప్రపంచమునకు చలించకుండుట పరమధర్మమైయున్నది. ఇది దేవుని పరీక్షగా భావించవలయును.



దేహపోషణకు అన్నము, నీరు, వస్త్రము, గృహము అత్యవసరమగుచున్న విధముగా, ఆత్మ సుఖము చెడకుండుటకు, సత్యము, ధర్మము, శాంతము, సమత్వము ఇంద్రియ నిగ్రహము, ఓర్పు, వివేకము, జప ధ్యానములున్ను తప్పక వుండవలెను. లైటు లేకుండా చీకటిలో తిరుగుచున్నచో దెబ్బలు తగులునట్లుగా, పరమాత్మను మరచి, ప్రపంచములో తిరిగినచో కామక్రోధాదులచే బాధలు కలుగును. పరమాత్మ సాక్షాత్కార జ్ఞానముననొంద దలంచువారు హృదయశుద్ధికొరకు శరీరముతో, వాక్కుతో, మనోబుద్ధులతో, జ్ఞానేంద్రియములతోను సత్కర్మలను నిష్కామ ముగా చేయుచుండవలయును. హృదయము శుద్ధి కానివారికి, నిత్యా నిత్య వస్తు వివేకము, ఆత్మానాత్మ వివేక జ్ఞానము, ప్రకృతి ప్రపంచమునకు చలించని ధీరత్వమును కలుగవు. సత్ ప్రవర్తన, సత్కర్మలు వలన సద్గుణములు కలుగును. సద్గుణములు కల వారికి మానవాది ప్రాణులనుండి, సూర్యచంద్ర, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతల నుండియు శుభాశీర్వాదములు కలుగు చుండును. ఎవరికిని బాధ కలిగించక, జీవియాత్ర చేయుచు, అనన్య చింతనతో పరమాత్మను భజించుచుండెడి స్వభావమును మొదట అలవరచుకొనవలెను. దీనివలన హృదయములోగల దుష్ట సంస్కారములు క్రమముగా నశించుచుండును. దుష్ట సంస్కారములు నశించినపుడు, సత్ సంస్కారములతో పర మాత్మను పూజించెడి శక్తి సామర్థ్యములు కలుగును. పరమాత్మ పూజతో జీవబ్రహ్మైక్య స్థితి కలుగును. జీవబ్రహ్మైక్య స్థితివలన సర్వాత్మ భావన సుస్థిరమగును. ఇదే కైవల్యము.

పరమాత్మయే మన గమ్యస్థానమని గ్రహించి, పరమాత్మయందే దృష్టి నుంచి, మనస్సును నిగ్రహించుటయే

సమస్త శాస్త్రముల యొక్క సారమగును. మితభాషణ, దైవ చింతన యున్న మానవుని దగ్గరకు సమస్త సద్గుణములు స్వయముగా వచ్చిచేరును. చదివినది, వినినది, చూచినది, నేర్చుకొనినది మరచిపోయి ఆత్మస్థితుడై యుండుటయే సమాధి యనియు, మోక్షమునగును. మరణ సమయమందు పరమాత్మ యందు దృష్టినుంచుకొని భగవన్నామమును స్మరించుచు, దేహమును వదిలినవారు నిస్సందేహముగా పరమపదమును పొందెదరు.

పుణ్యకర్మల ద్వారా పాపకర్మలు నశించినపుడే బుద్ధి కామక్రోదాది గుణదోషములు లేనిదై పరిశుద్ధముగా నుండును. పరిశుద్ధ హృదయమునకే పరమాత్మ జ్ఞానానుభవము కలుగును. ఇదే మోక్షము. పుణ్యము పరమాత్మవైపునకును, పాపము ప్రపంచమువైపునకును లాగును.

వెలుగుచున్న లాంతరు దగ్గరగల వస్తువులన్నియు కనబడును. వెలగని లాంతరు దగ్గర వస్తువులున్నను కనిపించవు గదా. అట్లే పరమాత్మ భావముతో నిష్కాములైయున్న వారికి, కనబడుచున్న సృష్టి రహస్యములన్నియు తెలియును. దేహాభిమానులై, కామక్రోదాది గుణములతో వున్నవారికి సృష్టి రహస్యములన్నియు తెలియకపోవుటయే గాక, అనేక బాధలు కలుగుచుండును. ఎవరు మనసులో గల సకల విషయములను తొలగించుకొని, దుఃఖరహితులై, నిర్విచారముగా, ఆనందముగ నుందురో వారే ముక్తులు.

భగవంతునియందుగల భక్తిచే ప్రపంచ విషయ భోగములు నీకు విషముగా గోచరించును. వెలుతురు దగ్గరకు చీకటియు, చీకటిలో వెలుతురును లేనట్లు, దైవాత్మ రుచిలో



నీవు నిలకడ కలిగియున్నచో ఇంద్రియ విషయ సుఖములు నీకు గోచరించవు. ఇంద్రియ సుఖములలో నీవు మునిగి యున్నచో, దైవాత్మ సుఖము నీకు కనబడదు.

చంచలమైన మనస్సును పూర్తిగా స్వాధీనపరచుకొని, స్వస్వరూపానుభవము నొందుటకు యమ నియమాదులు, సాధన చతుష్టయ సంపత్తి, తత్త్వమస్యాది మహావాక్య విచారణలు సాధనములగును. చెడ్డ సంకల్పములు, దుఃఖములును వచ్చునపుడు పాపము అనుభవములోనికి వచ్చుచున్నదనియు, మంచి సంకల్పములు, సుఖములు వచ్చునపుడు, పుణ్యము అనుభవము లోనికి వచ్చుచున్నదనియు, పుణ్యపాపములు రెండును నశించి నపుడే నిర్వికల్ప పరబ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము కలుగుననియు గ్రహించి తీవ్రముగ అనుష్టానము జేయుట ముముక్షువుల పరమధర్మము.

సర్వాత్మభావనయు, సంకల్ప రహితావస్థ కలుగనిచో దుఃఖ నివృత్తియును, ఆనంద ప్రాప్తియును కలుగవు. కర్మయోగములో పుణ్యఫలప్రాప్తి, భక్తియోగములో గురుదైవానుగ్రహప్రాప్తి, ధ్యానయోగముతో చిత్త ఏకాగ్రత ప్రాప్తి, జ్ఞానయోగములో సర్వాత్మభావన, స్వరూపదర్శన ప్రాప్తియు కలుగును.

జన్మరాహిత్యపదవి లభించువరకు దానము, ధర్మము, తీర్థయాత్రలు, పెద్దలసేవ, సత్సాంగత్యము, భగవన్నామసంకీర్తన, సద్గ్రంధపఠనము, జపము వ్రతము, ధ్యానము, విచారణ, సమాధి నిష్ట మొదలైన సత్కర్మలను మనోవాక్కాయములతో చేయుచునే యుండవలయును. ఇంద్రియ విషయ భోగములను అనుభవించుట కొరకే పెండ్లిచేసుకొనక, కర్మదోషము నశించుటకొరకు, ఆత్మజ్ఞానమును సంపాదించుట కొరకే వివాహము చేసుకొన

వలెను. మిమ్ములను కనిపెంచి, విద్యాబుద్ధులు చెప్పించి, పెద్దవారినిగ జేసిన మీ తల్లిదండ్రులను విశ్వాసముతో పోషించు విషయములో ఎంతమాత్రము అశ్రద్ధ చేయవలదు. ధనము పైనను, భోగములపైనను దృష్టి (ప్రీతి) నుంచక, దేవునిపైన, ధర్మముపైన, ఆత్మపై నీ దృష్టినుంచుకొని, సుఖపడుటకు సర్వదా అభ్యాసము చేయుచుండవలయును. ఇతరులు చేయుచున్న సత్కర్మలకు, జప ధ్యాన నిష్ఠలకు ఆటం కము కలుగజేయక వర్తించవలెను. భార్యాభర్తలు సమదృష్టితో నుండి, మోక్షధర్మము లను ఆచరణయందుంచుకొనవలెను. దేవతలకు, గురువులకు, పెద్దలకు, వృద్ధులకు, రోగులకు, అంగహీనులకును సేవచేయు చుండవలయును. దేవతల కృప, పెద్దల దయ కలిగినవారి కుటుంబము సర్వసంపదలతో తుల తూగుచుండును. ఇతరు లకు విరోధులుకాక, ఇతరులకు ఋణస్తులు కాక, తన కష్టార్జిత మునే భుజించుచుండవలెను. బిడ్డలను వృద్ధులను, నమ్మిన సేవకులను, పశువులను, శ్రద్ధగా పోషించుచుండవలెను. భార్యాభర్తల హృదయము ఒకటిగా లేనిచో, నరకబాధగా యున్నను, భర్తగాని, భార్యగాని ధర్మము తప్పక సర్వదా భగవం తుని భజించుచున్నచో, తప్పక పరమ శాంతిని పరమేశ్వరుడు సమకూర్చును.

లోకమునకును, లోకులకును గురువే ఆధారము. ఈ అంశము గ్రహించక నరకకూపమున బడుచున్నారు. ముక్తిని పొందదలచినవారు గురువుని ఆశ్రయించాలి. ఈ లోకములో ఎన్ని కష్టాలు పడినా, అవి పర సాధనకు తోడ్పడవు. కనుక గురువుని సేవించి తరించు. గురుభక్తి ఎలాంటి పాపాలనైనా పోగొట్టి, జన్మదుఃఖాలను తొలగించి, పరతత్వాన్ని సాక్షాత్కరింప



జేస్తుంది. అంతేగాక తోడునీడయి ఎప్పుడూ హృదయాన వెలుగుతూ వుంటుంది. చెట్లు లేకుంటే నీడ ఎట్లు వుండదో, సద్గురువు లేకున్నచో జ్ఞానం కూడా అట్లే వుండదు. సాధకుడు కపటాన్ని వదలి గురుదేవుని సహాయము పొంది సేవద్వారా, తపస్సు ద్వారా తత్వమెరిగినచో ధన్యత చెందగలడు. గురూపదేశాన్ని బాగా పాటించాలి. అది రాజమార్గంలా నిన్ను తరింపజేస్తుంది.

వెనుకటి జన్మలలో పాపాలు పోవడానికై తిరిగి జనన మరణాలు పొందకుండా వుండడానికి సద్గురువుని ఆశ్రయించి, అతని బోధలు విన్నరీతిని నడుచుకుంటే దుఃఖం లేకుండా మోక్షం పొందవచ్చు. నిందలను భ్రమలను విడిచిపెట్టాలి. మనస్సును నిగ్రహించి, గురూపదేశాన్ని అనుసరించి ధ్యాన యోగము ద్వారా జ్ఞానివి కాగలవు. శరీరము, ఆత్మ వేరువేరని తెలియక అజ్ఞానులు, మాయా నిద్రలో మునిగి తేలుతూ, ఆ రెండూ ఒకటిగానే భావిస్తారు. గురువును భక్తితో సేవిస్తే, తత్వం బోధపడుతుంది.

సదాచార సంపన్నులైన గురువును పూర్ణభక్తితో విశ్వ సించి, సేవించగలవారికే గురుతత్త్వం అర్థమవుతుంది. ఇట్టి వారికే కష్టాలు తొలగి అభీష్టాలు నెరవేరుతాయి. సద్గురువు తన, పర భేదం లేకుండా అందరిపైన అపారమైన దయ చూపిస్తారు. అహంకారులకు ఆయన కృప లభించదు. గురువుకు సాటి యైనది ఈ ప్రపంచములో ఏదియును లేదు. పరిపూర్ణ విశ్వా సంతో సేవించేవారిని, వెంటవుండి కాపాడటమే గురుధర్మం కాబట్టి గురువుల పట్ల పూర్ణ భక్తి విశ్వాసాలు కలిగి గురువుని సేవించిన, గురుకృపకు పాత్రులు కాగలుగుతారు.

పాలతో కలిసిన నీటికిని పాలరంగు రుచియు

కలుగును. అట్లే గురుమూలమున విద్వాంసుడవు కావచ్చును. మంచివారితో చేరితే మంచి గుణములే అబ్బుతాయి. తాను శరీరము విడిచినప్పుడు ప్రాణం ఒక్కటే పోతుంది. భార్యగాని, సుతులు గాని, ఆప్తులు గాని, తదితరులు గాని, తనతో ఎవ్వరూ మరణించరు. తనకు తోడుగా వచ్చేది తన మంచితనం ఒక్కటే. నదీజలం సముద్రములో కలిస్తే పవిత్రమైనట్లు, తత్త్వబుద్ధి ముక్తికి సాధనమవుతుంది. అజ్ఞానాన్ని పోగొట్టే సద్గురువుని ఆశ్రయించి వారు చెప్పిన బోధ ప్రకారము నిర్గుణోపాసన చేసినట్లైనచో దుర్గుణాలు నశిస్తాయి. ఆ పిదప భగవత్ స్వరూపము పొంది ధన్యుడవు కాగలుగుతావు. దేవుని ఏ రూపముతో ధ్యానించిన, ఆ రూపముతోనే భగవంతుడు దర్శనమిస్తాడు. శరీరాన్ని శోధించి తనలోవున్న ఆత్మ స్వరూపాన్ని చూడకనే దేహాన్ని విడిచినవాడు యోగికాలేడు. శరీరమున్నప్పుడే ముక్తికై ప్రయత్నించాలి.

కోపం వల్ల నరకప్రాప్తి. బ్రతుకు క్షీణించును. సద్గుణములు నశించును. కనుక కోపము ఎంత మాత్రము తగదు. దీపం చీకటిని మాయం చేస్తుంది. అట్లే అజ్ఞానాన్ని జ్ఞానంతో పోగొట్టుకొని, మనస్సు అనే మిత్రుని సహాయముతో కామక్రోదాది శత్రువులను జయించాలి. జీవుడు తనలో వున్న ఆత్మశక్తిని తెలుసుకోలేక దేవుని కొరకై వెతుకుతూ వుంటాడు. జీవుడు - దేవుడు ఒక్కడేయని గ్రహించడమే ముక్తి. ఆత్మశుద్ధిలేనివాడు నోటితో ఉచ్చరించే మంత్రం వ్యర్థమవుతుంది. మాటలతో పరమాత్మలొంగడు. తత్త్వం తెలిసిన గురువుని సేవించి, పరిపూర్ణ భావంతో అతని ఉపదేశమందు లక్ష్యం వుంచి సాధన చేస్తే ముక్తి కలుగుతుంది.

సుఖము కలిగినప్పుడు అందరూ సంతోషంగా వుంటారు. కాని ఎవరు దుఃఖములో కూడా ప్రసన్నంగా వుంటారో,



ఆనందముగా వుంటారో అతడే ఆదర్శ వ్యక్తి. ఏ వ్యక్తి ఆపదలలో, కష్టాలలో చలించడో, మందహాసం చేస్తూ వుంటాడో, అతడు మానవులలో దైవబలము కలిగినవాడు. అతడే గొప్పవాడు. చిత్తశుద్ధి అన్నిటికన్నా ముఖ్యముగా ఉండాలి. ఎవరు దైవసంబంధమైన కర్మలను ఆచరిస్తారో, ఎవరు దైవమును తన సర్వస్వముగా భావించి నమ్ముతారో, ప్రాపంచిక వ్యామోహము లను త్యజించి, సమస్త జీవులను దైవ స్వరూపులుగా ఎవరు ప్రేమిస్తారో, అట్టి దైవ భక్తుడు మోక్షమును, నా సాన్నిధ్యమును చేరుతాడు అని శ్రీకృష్ణ భగవానులు గీతలో చెప్పియున్నారు. జీవితములో శరీరమునకు ఆహారమెంత అవసరమో,ధ్యానము మనశ్శాంతికి, తృప్తికి, ఆరోగ్యమునకు, దైవదర్శనమునకు అవసరమైయున్నది. ఆత్మానందమునకు ప్రధానమైనది ధ్యాన మార్గము. ఈ ధ్యాన మార్గములో మనో నిశ్చలము, ధైర్యము, శాంతి, సహనము మొదలగు గురుభక్తి, దైవభక్తి అనే సుగుణములు నిత్య జీవితములో కలుగుతాయి.

తల్లిదండ్రులను, గురువులను, పెద్దలను గౌరవించుట మన సాంప్రదాయం. పెద్దల అనుభవాలే మనకు గుణపాఠాలు. అనుభవాలకు మించిన విద్య మరొకటి లేదు. ఏ విద్యకైనా గురువు తప్పనిసరిగా వుండవలసినదే. కుమ్మరి పురుగు బురదలో తిరిగినప్పటికి దానికి బురద అంటదు. అదే విధముగా సంసారములో వున్నప్పటికి, సంసార వాసనలు మనసుకు అంటకుండా వుండేవాడే వివేకి కాగలడు. అందరూ సత్కర్మనిష్టులై, భగవద్భక్తులై సదాచార సంపన్నులై బ్రహ్మానందముతో విరాజిల్లుదురుగాక.



# -: మంగళ శ్లోకములు :-

శ్లో. ఓం మంగళం భగవాన్ విష్ణో - మంజ్గళం మధుసూదన
మంగళం పుండరీకాక్ష - మజ్గళం గరుడధ్వజ
శ్లో. ఓం మజ్గళం కోసలేంద్రాయ - మహనీయగుణాత్మనే
చక్రవర్తి తనూజాయ - సార్వభౌమాయ మజ్గళం
శ్లో. ఓం మజ్గళం భగవాన్ శంభో - మజ్గళం వృషభధ్వజ
మజ్గళం పార్వతీనాధ - మంజ్గళం భక్తవత్సల
శ్లో. ఓం మజ్గళం శ్రీ కురుక్షేత్ర - రణక్షోణి విహారిణే
పార్ధసారధిరూపాయ - గీతాచార్యాయ మజ్గళం
శ్లో. ఓం శ్రీ యఃకాంతాయ - కళ్యాణ నిధయే నిధయేర్ధినామ్
శ్రీ వేంకట నివాసాయ - శ్రీనివాసాయ మజ్గళం
శ్లో. ఓం నిత్యాయ నిరవధ్యాయ- నిత్యానంద చిదాత్మనే
సర్వలోక నివాసాయ - శ్రీనివాసాయ మజ్గళం
శ్లో. ఓం మజ్గళం గురుదేవాయ - మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ - సాధురూపాయ మజ్గళం
శ్లో. ఓం ఓంకార బిందు సంయుక్తం - నిత్యంధ్యాయంతోయోగినః
కామదం మోక్షదంచైవ - ఓంకారాయ నమో నమః

ఓం అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ
ఓం సహనావవతు - సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావ ధీతమస్తు - మా విద్విషావహైః
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః



# -: శాన్తి మంత్రములు :-

శ్లో. ఓం సర్వేత్ర సుఖిన స్సన్తు సర్వేసస్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మాకశ్చిద్దుఃఖ మాప్నుయాత్

శ్లో. ఓం సర్వస్తరతు దుర్గాణి సర్వోభద్రాణి పశ్యతు
సర్వస్సద్బుద్ధి మాప్నోతు సర్వ స్సర్వత్ర నన్దతు

శ్లో. ఓమ్ శంనోమిత్రః శం వరుణః శంనో భవత్వర్యమా!
శంన ఇన్ద్రోబృహస్పతిః ! శంనో విష్ణురురుక్రమః !
నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసీ
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి
ఋతం వదిష్యామి! సత్యం వదిష్యామి
తన్మామవతు తద్వక్తార మవతు
అవతు మాం అవతు వక్తారమ్
ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

ఓం పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమే వావశిష్యతే

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః
ఓం సర్వేషాం స్వస్తిర్భవతు
ఓం సర్వేషాం శాన్తిర్భవతు
ఓం సర్వేషాం పూర్ణంభవతు
ఓం లోకా సమస్తా సుఖినోభవంతు
ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

**ఓం సర్వం సచ్చిదానంద పరబ్రహ్మార్పణమస్తు**
**ఓం తత్సత్**

## పూజ్యశ్రీ కృష్ణానందగిరి స్వాముల వారి జీవిత సంగ్రహం

పరమాత్మస్వరూపులగు భక్త మహాశయులారా!

కృష్ణాజిల్లా, కలిదిండి మండలం, పరమానందునిపేట గ్రామములో శ్రీపడమటి శ్రీరాములు, శ్రీమతి మహాలక్ష్మిపుణ్యదంపతులకు 1950సం॥లో పూజ్యశ్రీ కృష్ణానంద స్వాముల వారు జన్మించారు. వీరు 9వ తరగతి వరకు విద్యనభ్యసించారు. 1968 సం.లో వీరికి వివాహము జరిగినది. వ్యవసాయం వీరి జీవనోపాధి.

1987 సం॥ నుండి 1989 సం॥ వరకు శ్రీకృష్ణానంద స్వాముల వారు ఇంటి వద్దనే ఏకాంతముగా రామాయణ, భారత, భాగవతములు గ్రంధపఠనములు చేస్తుండే వారు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రఖ్యాత పుణ్యక్షేత్రాలైన శ్రీ కాళహస్తి,తిరుపతి మధ్య ఏర్పేడు సమీపాన గల శ్రీవ్యాసాశ్రమంలో 1990 సం॥లో సద్గురు శ్రీశ్రీశ్రీ విద్యానందగిరి స్వాముల వారి వద్ద గురోపదేశం పొందారు. 1991 సం॥లో శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాముల వారి వద్ద శ్రీకాళహస్తిలో నున్న శ్రీ శుకబ్రహ్మాశ్రమమునందు గీతా పాఠశాలలో ఉపనిషత్తులు, భగవద్గీత అధ్యాయనం చేసి, 1992 సం॥లో కలిదిండి మండలం, పరమానందునిపేట గ్రామంలో శ్రీకృష్ణ చైతన్య ధ్యాన కుటీరాన్ని నిర్మించుకొని, దానిలోనే జప,ధ్యానములు చేసుకొంటూ, ఆశ్రమ ధర్మాన్ని పాటిస్తున్నారు. 2007 సం॥లో మహాశివరాత్రి పర్వదినమున శ్రీ వ్యాసాశ్రమ వ్యాసపీఠాధిపతులు పరమపూజ్యులు శ్రీ సద్గురుదేవులు శ్రీశ్రీశ్రీ విద్యానందగిరి స్వాముల వారి ఆధ్వర్యంలో శ్రీ వ్యాసాశ్రమ తృతీయపీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానందగిరి స్వాముల వారి పవిత్ర హస్తముల మీదుగా శ్రీకృష్ణానందగిరి స్వాముల వారు తురీయ ఆశ్రమము (సన్యాసము)ను స్వీకరించినారు.

పూజ్యశ్రీకృష్ణానంద స్వాముల వారు ఆధ్యాత్మిక చింతనాపథంలో ప్రవేశించిన అనతికాలంలోనే రాజయోగమునందు ఉత్తీర్ణులై, సద్గురు సేవజేయుచూ, పెద్దలను గౌరవించుచూ, సత్సాంగత్యము, సద్గోష్ఠియందాసక్తిగలవారై, అనేక తత్వశాస్త్రములను, ఉపనిషత్తులను, పురాణేతిహాసములను, వేదాంత గ్రంథములను సమీక్షించి, మహాఋషుల చేత చెప్పబడినటువంటి మహోత్కృష్ణ గ్రంథముల నుండి సారాంశములను సేకరించి, తాము తరించుటయే ప్రధానముగాక, ముముక్షువులకు ఉపయోగము కాగలదను సదుద్దేశ్యముతో విశ్వకళ్యాణముగోరి 1998 సం॥లో "ఆత్మానుభవ వచనామృతము", 2003 సం॥లో "ఆత్మ సందర్శమార్గదర్శినీ", 2004 సం॥లో "హిందూధర్మ మకరందము", "భక్తానంద భజన కీర్తనలు", 2005 సం॥లో "మోక్షసాధన వచనామృతము", 2008 సం॥లో "ఆధ్యాత్మిక సుబోధిని", 2009 సం॥లో "సనాతన హైందవ ధర్మ జ్ఞానవాహిని", 2012 సం.లో "సనాతన ధర్మ నవనీతము" మరియు 2012 సం.లో "మహాత్ముల సూక్తి రత్నములు" అను పవిత్రమైన, మహోత్కృష్ట గ్రంథ రాజములను ముద్రణ గావించిరి. వీరి అవిరళ కృషిని పెక్కు ఆధ్యాత్మిక చింతనగల పెద్దలు మరియు భక్తుజనులు కొనియాడుతూ అభినందనలు తెలియజేసారు.

మానవజాతి కొక వినూత్న చైతన్యం కలిగింది. వెలుగుబాటను చూపే మహా పురుషులు ఎక్కడోగాని, ఎప్పుడోగాని జన్మింపరు. అట్టి మహా పురుషులను స్మరించడం, వారు చూపిన బాటలో నడవడం మన కర్తవ్యం.

కావున మోక్షార్థులైన భక్తులు, సాధకులు, జిజ్ఞాసులు, పాఠకులందరును పూజ్యశ్రీ కృష్ణానందగిరి స్వాముల వారు రచించిన గ్రంథములను చదివి, సారమును గ్రహించి, ఆచరించాలని ప్రేమపూర్వకముగా విన్నవించుకొంటున్నాను.

ఇట్లు భక్తజనసేవలో

శ్రీ స్వామి వారి జీవిత సంగ్రహమును సంకలనము చేసినవారు :

**దాసరి శివన్నారాయణ, గీతాశ్రమ ప్రధాన కార్యదర్శి, కైకలూరు**

పిన్ : 521 333, కృష్ణాజిల్లా. సెల్ : 9949918155



ఓం తత్సత్ ఓమ్

## శ్రీ కృష్ణానందగిరి స్వాముల వారి జీవన ప్రస్థానంలో వివిధ దశలు

### కిశోర ప్రాయం నుండి సన్యాసం వరకు




భక్తజనసేవలో

## శ్రీ కృష్ణానందగిరి స్వామి

గీతాశ్రమం

ప్రొద్దువాక, ముదినేపల్లి మండలం, కృష్ణాజిల్లా.

సెల్ : 9959428332

ఓం తత్సత్ ఓమ్

ఓం శ్రీ సర్వఋషిభ్యో గురుభ్యో నమః



# మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాముల వారు

శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు